శ్రీ శుకశ్యామలా రామలింగేశ్వరగ్రంథమాలా ద్వితీయప్రసూనము.

శ్రీ శివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము.

(ద్వితీయసంపుటము)

బాలసరస్వతీ

[illegible]

ప్రణీతము.



3 వీరమహేంద్రకాండము.

4 యుద్ధకాండము.

5 దేవకాండము.



నిగమాగమవిశారద

ముదిగొండ వీరభద్రశ్వరారాధ్యులచే

ప్రకటితము.

నందిగామ - కృష్ణాజిల్లా.



PRINTED BY

K. KODANDA RAMAIAH GARU,

AT ANDHRA GRANDHALAYA PRESS, BEZWADA.

[రెటు] 1921

# ప్రార్థన.



ఈగ్రంథముయొక్క తాళపత్రప్రతులనిచ్చి సహాయమొనర్చిన బ్రహ్మశ్రీ శివపురపు వీరయ్య అయ్యవార్లంగారికిని వేమనారాధ్య ములుగు అయ్యవారులింగంగారికిని శరణు సమర్పింపుచు, తాళపత్రగ్రంథసంపాదనకు సహాయపడిన వారికిని ముద్రణద్రవ్యసమార్జనమును పలువురు బుద్ధిమంతులకు తెలియజేయుటకు సహాయపడినవారికిని, తెలియచేసినంతనే ముందుగా ద్రవ్యమొసంగిన మహానుభావులకును, ద్రవ్యమొసగినను శీఘ్రముగా త్వరతో సమాప్తించి యందజేసిన ఆంధ్రగ్రంథాలయప్రెస్ వారికిని, ముందుగా గ్రంథముల నందజేయగనే త్రిప్పకుండగ వెంటనే చందాల నొసంగునట్టి యుత్తములకును, సర్వప్రపంచమునకును యట్టి సద్గుణముల భోగభాగ్యముల నొసంగ నా దేవదేవుని ప్రార్థించుచున్నాను.

ఇంకెట్టి ప్రమాదములున్నను దయతో దెలిపినచో సవరించుకొనుటకు సంసిద్ధుల మని ముందుగనే విన్నవించుచున్నాము.

ప్రకాశకులు.





కేశవవిలాసము.　　　　పరమేశ్వరవిలాసము.

రాజీవమై వేద ♦ రాజిని దెచ్చితి
　కూర్మి మోచితి వద్రి ♦ గూర్మ మగుచు
భూదార మైతివి ♦ భూదారతను బొంది
　మానవహరిలీల ♦ మాన వెపుడు
వటువై రసాతల ♦ వటు వైరి జేసితి
　పరశుచే నణఁచితి ♦ పరశుభంబు
రాజనందనుఁడవై ♦ యాజి జయించితి
　హాలము బూనితి కుతూ ♦ హలము దనర

బుద్ధమూర్తివి కావె ప్ర ♦ బుధపటిమ
కల్కి వౌదువు రణరంగ ♦ కర్కశముగ
దశవిధాకృతులను మహా ♦ దశలఁ జెలంగ
మహిమ నిక్షిపితి గత్కృపా ♦ సహిమ మీర.
—సంభవకాం. ౧ ఆశ్వా.

సీ. ప్రణతార్తిశమనాయ ♦ భవపాశనాశాయ
　దుఃఖవిదారాయ నమశ్శివాయ
కాలకూటహరాయ ♦ కాలసంహారణాయ
　మదనప్రఘ్నాయ నమశ్శివాయ
త్రిపురసంహారాయ ♦ ధృతశూలహస్తాయ
　మహాతే శివాయ నమశ్శివాయ
కల్యాణఫలదాయ ♦ కరుణానిధానాయ
　మాధవాస్త్రాయ నమశ్శివాయ

మౌనిబృందార్చితాయ నమశ్శివాయ
మహితవిభవోజ్జ్వలాయ నమశ్శివాయ
మదనదర్పహరాయ నమశ్శివాయ
యనుచు సాష్టాంగ మెరగుచు ♦ వినయ మలర.
—సంభవకాం. ౪ ఆశ్వా.

దండంబు నీ కిదే ♦ తతదయారసపూర, భరితమనోంభోజ ♦ భవ్యతేజ
జోహారు నీ కిదే ♦ సుమనోమనోరథ, పరిపూర్ణమందార ♦ భవవిదార
వందనం బిదె నీకు ♦ వాణీనితంబినీ, పరిరంభసుఖలీల ♦ భవ్యశీల
సాష్టాంగ మిదె నీకుఁ ♦ జారుత్రియీనామ, సుందరీమణిభాస్య ♦ సుందరాస్య
ప్రణుతిఁ జేసెద మిదె నీకుఁ ♦ బ్రణుతిగర్భ, పరమపూరుష పరమాత్మ ♦ ప్రణవరూప
శరణు నీ కయ్య యిందిరా ♦ జలధిశయన, గర్భకలశాంబురాశిరా ♦ కాశశాంక.
—సంభవకాం. ౧ ఆశ్వా.

క॥ హరిహరవిధిరూపంబులఁ, బరగంగాఁ దాల్చి నీవ ♦ పలుమరు జగముల్
బరిపాలింతువు దుర్ంతువు, వరుస సృజింతువు నితాంత♦వైభవ మొప్పన్.
—సంభవకాం. ౧ ఆశ్వా.

ఉ॥ ఎవ్వనివల్ల బుట్టు జగ♦మెల్లను సంతతమున్ బ్రవర్ధనం
బెవ్వనివల్ల లీన మగు ♦ నెవ్వనియందు ధృవం బరుగ్రహం
బెవ్వనివల్ల సర్వ మిది ♦ యెవ్వనివల్లఁ దిరోహితంబు నా
నవ్విభు దేవదేవు నిను ♦ నాత్మ భజించెద మేము భక్తితోన్.
—సంభవకాం. ౨ ఆశ్వా.

క॥ అందక మదికిన్ వాక్కుల, కందక స్థానేంద్రియముల ♦ కందకఁ బరమా
నందం తగు నెప్పుడు, వందన మగు నట్టి నీకు ♦ వాంఛిత మొదవన్.
—సంభవకాం. ౭ ఆశ్వా.

క॥ తత్త్వం పదార్థ మీవే, తత్త్వాతీతంబు నీవె ♦ తత్త్వము నీవే
తత్త్వోపదేష్ట వీవే, తత్త్వజ్ఞుల మదిని దగులు ♦ తత్త్వం బీవే.
—సంభవకాం. ౧ ఆశ్వా.

భగవంతుఁ డొకఁడే యని బోధించు గ్రంథములలో నిది యొక గ్రంథరత్నము. ఈ మహాకవి యీ సద్గ్రంథమున శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక భీభత్స అద్భుత శాంతము లను నవరసముల నపారముగ మృదుమధుర శైలిని వచించియున్నారు.

## శివమహాత్మ్యఖండము.

సంభవ అసుర వీరము మందర యుద్ధ దేవ దక్ష ఉపదేశ అను సప్త కాండములచే నలరారు గద్యపద్యాత్మక ప్రబంధరాజము. బాలసరస్వతీ కోటమర్తి వేంకటాచల కవిచే నాంధ్రీకృతము.

ప్రకాశకులు:—
నిగమాగమశిఖాంద ముదిగొండ వీరభద్రేశ్వరారాధ్యులు అయ్యవారు,
నందిగామ, కృష్ణా.

స్త్రములనొసంగి శూరపద్మాదిరక్కసుల నక్కశ్యపు నాజ్ఞనొసంగిన బయలుదేరి యొకచో రత్నసింహాసనమున విశ్రమించియుండె.

## 2. అసురకాండము.

బృహస్పతి దేవప్రార్థితుఁడై కుమారస్వామి దరిఁజేరి—

"రాక్షసులు దేవతలచే నశించుచుండుటఁ గాంచి, రాక్షసగురువగు శుక్రుఁడు **మాయయను** రాక్షసస్త్రీని బిలిచి, రాక్షసుల క్షేమముకొఱకు కశ్యపునివలన సంతానము గనవలసినదిగ **నాజ్ఞనొసంగ** నామె.

సీ॥ కటిసీమ నవరించు ♦ కనకాంశుకచ్ఛాయ, లరుణాంఘ్రిరుచికి జో♦హారుసేయఁ
దపనీయమయవజ్ర♦తాటంకదీధితుల్, తళుకుఁ జెక్కులకుఁ గై♦దండ నొసఁగ
రమణీయకుచకుంభ♦రత్నహారద్యుతుల్, మేఖలాప్రభలతో ♦ మేలమాడ
ముక్కునఁ జేర్చిన ♦ ముత్యంపు ముంగర, దరహాసదీప్తికు ♦ త్కళికఁ బెనుప
మేన నలదిన ఘనసార♦మిళితలలిత, గంధసారంబు మైతావి♦బాంధవంబు
నెరప త్రిభువనమోహన♦నిరుపమాన, భవ్యశృంగారవిభవంబు ♦ భాసిలంగ.

—ప్రథమాశ్వాసము.

ఆకశ్యపుని యాశ్రమము సేరిన యామవిరాగి సరాగియై యామోహనాంగి దరిఁజేరి **యతిమోహంబున** ననేకవిధంబులఁ బరితపించుచు దాని తళ్కుబెళ్కులకు బేలయై,

చ॥ అలికులవేణి, చారువిక♦చాబ్జవిలోచన, కీరవాణి, కో
మలి, వెలలేనిమానికము, ♦ మారుని పట్టపుదంతి, కామినీ
తిలకమ! ఏల దాచెదవు? ♦ తియ్యని వాతెఱతేనె లీయవే
కులుకుమొలంగుబ్బలను ♦ గ్రుచ్చి కౌఁగిటఁ [illegible]

—ద్వితీయాశ్వాసము.

[illegible] సింహవక్త్రుఁడు, తారకుఁడు, **అజవక్త్రాది** ద్విలక్షవాహినీసంఖ్యాకంబైన రాక్షససమూహంబులు జన్మించినఁ **జూచి కశ్యపుఁడు** పశ్చాత్తాపతప్తుఁడై తపమున కేగినంత శూరాదిరాక్షసులు ఘోరమైన తపమాచరించి పరమేశ్వరుని కృపకుఁ బాత్రులై లోకములహింసించుచు **దేవతాస్త్రీల** చెఱలఁబెట్టుచు నయంతాది దేవతల బందీగృహములయందుంచుచు బాధలిడిరి." అని యిట్లు రాక్షసులవృత్తాంతము చెప్పెను.

ద్వితీయసంపుటమునందలి కథాసంగ్రహము యీదిగువవిషయసూచికయే తెలియఁజేయఁగలదు.

———

# విషయసూచిక.

వీరమహేంద్రకాండము—ఏకాదశాశ్వాసము.

| విషయము. | పుట. |
|---|---|


యుద్ధకాండము—ప్రథమాశ్వాసము.

| | |
|---|---|


యుద్ధకాండము—ద్వితీయాశ్వాసము.

| | |
|---|---|

యుద్ధకాండము – తృతీయాశ్వాసము.



యుద్ధకాండము—చతుర్థాశ్వాసము.

---

## తృతీయ సంపుటమునందలి వృత్తాంతము.

ఈ శివరహస్యఖండము నాంధ్రీకరించిన బాలసరస్వతీ నామాంకిత కోదూరి వేంకటాచల మహాకవివరేణ్యులను గురించిన జీవితచరిత్రయు, నిందలి ఛందో రహస్యములును, ఇందలి చరిత్రలఁబఠించుటవలన లోకమున కేమి యుపయోగమో యదియు విపులముగా వ్రాసియుండు పీఠిక యుండును. తరువాత దక్షకాండము -

### ఇందలి కథాసంగ్రహము.

దక్షుఁడు శంకరునిగురించి తప మాచరించి అష్టైశ్వర్యములఁబొంది తన కుమార్తె నిచ్చి వివాహముచేయుటయు, శంకరునితో కలహించి యజ్ఞము ప్రారంభించుటయు, నంత వీరభద్రుఁడు జన్మించి యజ్ఞమును ధ్వంసముసేయుటయు, అటుపై సాంయన ప్ర భిషేకము జరుగుటయు నున్నను.

### చతుర్థ సంపుటము.

### ఉపదేశ కాండము.

ఇందు భస్మ రుద్రాక్ష దేవతార్చనాది సకలధర్మముల గురించి పూర్వము భక్తు లెట్లాచరించి యే యే ఫలములఁబొందిరో వారి వారిపుణ్యకథలు, ననేకవ్రతముల నిర్ణయములు కలిగియుండును.



ఈ శివరహస్యఖండమునందలి సంభవ, అసుర, వీరమహేంద్ర, యుద్ధ, దేవ, దక్ష, ఉపదేశ యను సప్తకాండములు బాలసరస్వతీ కోదూరి వేంకటాచల కవివరేణ్యులచేఁ జక్కని మృదుమధురశైలిని వ్రాయఁబడి తాళపత్రములయం దొకకొంత శీర్ణింపుచుండ నారాచి మొత్తమొకేపర్యాయమచ్చు వేయించుటకు శక్తి చాలక నాలుగు సంపుటములుగా విభాగించి చేతనైనంతవరకచ్చొత్తించి పెద్దల సేవింపుచున్నాము. ఇట్టి గ్రంథమును పూర్తిచేయించగల భార మాంధ్రమహాశయుల యందే యుండి యున్నది. సంస్కృతము (మూలము)కూడా అచ్చువేయయత్నింపు చుంటిమి. సోదర సోదరీమణు లెల్లరు నీగ్రంథమునం దభిమాన ముంచి సహాయము చేయ ప్రార్థింపుచున్నాఁడ.

—ప్రకాశకులు.

శ్రీ శివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము

## వీరమహేంద్ర కాండము.

ప్రథమాశ్వాసము.



మునివాగలుపార్వ
కామితసంధాననిపుణ ♦ కరుణాపాంగా!
కామమదభంగ! మస్తక
సీమాధృతగాంగభంగ ♦ శ్రీ శివలింగా! 1

వ॥ అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

క॥ ఆ సురగురుండు వల్కిన, యాసురవృత్తాంతమెల్ల ♦ నాలించి భవా
నీసూనుఁ డతనిఁ గని యనె, నాసీనుఁ డ వగు మటంచు ♦ నాదరమొప్పన్. 3

వ॥ అంత బృందారకులం జూచి, 4

గీ॥ వినుఁడుహరిపురందరముఖ్య ♦ విబుధులార!, భ్రాతృసహితంబుగా శూర ♦ పద్మునతని
బంధుజనముల నందఱ ♦ భండనమునఁ, గూల్చి మీమనోరథముఁ జే ♦ కూర్తు నెలమి.

క॥ వానిబలాబలములు మఱి, వాసిసమున్నతియు లోతు ♦ వైభవ మరయన్
మానితబలాఢ్యుఁ డెవఁడో, మానుగ నిపు డనుపుఁ డతని ♦ మర్మజ్ఞు వెసన్. 6

వ॥ అనిన సేనాపతివచనంబులు విని సకలదివిజులు జితారాతిసమూహుం డగు
వీరబాహుం డని నిశ్చయించి తారకారియనుజ్ఞ వడసి యతనిం జేరి యిట్లనిరి. 7

గీ॥ అతులవిక్రమ! దేవకా ♦ ర్యార్థ మిపుడు, శూరపద్మునినగరంబుఁ ♦ జేరఁబోయి
యరసి యచ్చట వానివృ ♦ త్తాంతమెల్ల, వేగ రానగు నీశౌర్య ♦ విభవమెసఁగ. 8

—* కుమారస్వామి వీరబాహుని శూరపద్మువృత్తి నరయుట కంపుట *—

వ॥ ఇట్లు సురగణంబులచేఁ బ్రార్థితుండై దేవసేనానిమ్రోల నిలిచిన, నతండు కూర్మి
సోదరుం డగు నవ్వీరబాహుం జూచి, నీవు శూరపద్మునిపురంబునకు సత్వరంబు

గాఁ జని వానితోడ మద్వచనంబులుగా నిట్లనుము. 9

శా॥ ఓరీ! శూర! భవన్మదంబుడిగి నీ ♦ పుత్రీ స్వయంభాదులన్
ధీరస్వాంతుల నప్పగించి పిదప ♦ నీన్ని పట్టణాంతోలు దుం
పార నీన్ని కిది గాసిచే మహదుబా♦హావిక్రిమప్రగుణో
దారప్రౌఢిమ నిన్ను నీతనుజసో♦దర్యాదులం ద్రుంచెదన్. 10

వ॥ ఇది మదీయప్రతిజ్ఞ యని మహామూర్ఖుం డగు న ద్దానవున కెఱింగింపు పొ మ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని నిజస్వామి యగు పార్వతేయునిపదంబుల కెరగి నిఖిలరిపుదుర్నిరీక్ష్యమాణశౌర్యానివార్యబాహుం డగు న వ్వీరబాహుండు,

క॥ చనియెన్ శూరపురంబున, కనుపమగతి నట్లు జనుచు ♦ నధ్వంబందున్
గని గంధమాదనంబును, ఘనతరధృతి నెక్కె శౌర్య♦కలన దలిర్పన్. 12

వ॥ అవ్వీరబాహుండు భీకరాకారంబు గనంబడ బ్రహ్మాండకటాహపర్యంతంబు దేహంబుఁ బెంచి నిఖిలపూర్వగీర్వాణసమాకీర్ణంబును, ననంతరత్నగోపురవిరాజమానంబును, ననేకమంటపప్రాకారమండితంబును, లంకాద్యష్టపురపరివేష్టితంబును నై మనోహరం బగు శూరపురంబుఁ జూచి, సముద్రంబు వీక్షించి, పర్వతంబులుఁ గనుంగొని, నానాదేశంబులు గాంచి, యే నిప్పురం బసురసహితంబుగఁ దిలలను దిలయంత్రంబునం బోలెఁ గరతలంబున నులిపెద; నట్లగు నేని సర్వగీర్వాణులు నిందు నానందింతు రని డెందంబునం దలంచి యట్టహాసంబులు సేసి చరణఘట్టనంబుల సప్తపర్వతంబు గ్రుంగఁ దద్గుహాంతర్వాసులయిన తారకభటులుగొందఱు విగతప్రాణులుగా మ్రగ్గ నగ్గిరివరంబునుండి యప్పుడు, 13

సీ॥ పర్వతసంఘము ♦ ల్బహుతూలములలీల, గగనభాగంబున ♦ కెగయఁ బాఱఁ,
బవనఘాతంబున ♦ బాడబేయానల, జ్వాలిక లత్యంత♦శాంతి నొందఁ,
గమలాప్తముఖనవ♦గ్రహములు మేఘము, ల్చీకాకు నగుచును ♦ జెదరి పాఱ,
సలిలసంచరమహా♦జంతుసంతతికిని, దోస్త్రో భయంబు ప్రా♦దుర్భవింప,

గీ॥ స్వామిపాదారవిందముల్ ♦ సంస్మరించి, వీరబాహుఁడు నిజగరో♦ద్వృత్తిమెఱయ
నలర కుప్పించి లంఘింప ♦ నంబురాశి, క్రుంగినది లేచె మునుపలె♦ గుధర మపుడు.

వ॥ ఇట్లు రత్నాకరంబు లంఘించి రత్నాంగనాసూనుండు లంకాపురసమీపంబున కరుదేర నాసమయంబున వ్యాళీవక్త్రుని సేనాపతి యగు వీరసింహుండు వాహినీపంచశతంబుల సైన్యంబులు కొలువ సత్వరంబుగాఁ బురంబు వెడలి యంబరగతుం డగు వీరబాహుం గని నీ వెవ్వఁడ వెందుఁ బోయెద వని పల్కిన నతం డిట్లనియె. 15

గీ॥ వీరబాహుఁడు నాపేరు ♦ శూరుకడకు, నేను జనియెద నడుగంగ ♦ నేల నీకు?
ననుచుఁ బోఁబూన దానవు ♦ లంపగములఁ, గురిసి రవ్వీరుపై నతి♦ఘోరముగను.

వ॥ అంత వీరబాహుండును గృపాణపాణియగుచు శతవాహినీసంఖ్యాకు లగు నయ్య
సురభటుల నసమం బగు సమరంబునం బడవైచెఁ; దక్కిన బలంబులు పలాయి
తంబులయ్యె; నప్పుడు వీరసింహుండు కులిశశూలంబులు వీరబాహుపైఁ బ్రయో
గించిన, నతండు ఖడ్గంబున నా రెంటినిం దునిమి యసురమస్తకహస్తంబులు
ఖండితంబులు గావించి, యంత నభంబున కెగసి, యనేకదానవులం గెడపి, లంకా
పురంబుపై దుమికినఁ, దత్పతనవేగంబున నప్పురం బధఃపాతంబు నొందిన సకల
దితిసుతులు విదళితహస్తులు, విఖండితచరణులై ద్రెళ్ళిరి. కొందఱు సముద్రం
బునం బడిన వారలఁ దిమితిమింగిలములు మ్రింగె. తదనంతరంబ, 17

క॥ అతివీరుఁడు వ్యాళీముఖ, సుతుఁ డది యేమొకొ యటంచు ♦ శూరత నగరం
బతిశీఘ్రము వెడలి భట, ప్రతతిని గవియించె వీర♦బాహుని మీఁదన్. 18

వ॥ అప్పు డాదైత్యభటులు మేఘపటలంబుఁబోలె శరవర్షంబులఁ గురిసిన వీరబా
హుండు తచ్ఛిలీముఖంబు లన్నియుం దునుమాడి వారలనందఱఁ దూలించెనంత,

క॥ అతిభయదం బగు శక్తియు, నతివీరుఁడు బూని యేయ ♦ నాహవమందున్
ధృతిశాలి వీరబాహుఁడు, బ్రతిహతముం జేసె దాని ♦ బటుఖడ్గమునన్. 20

వ॥ మఱియు నద్దనుజవీరుండు బ్రచండకోపంబున నుద్దండం బగు గదాదండంబు
వీరబాహుపైఁ బరపిన, నదియుఁ దద్వక్షస్స్థలంబుఁ దాకి భగ్నంబయ్యె; నంత
నద్దానవుం డాభీలంబగు శూలంబుఁ గేలంగొని యతిరయంబున నేసిన, 21

ఆ॥ వీరబాహుఁ డదియు ♦ వేగఁ గేలనుగొని, దోర్బలంబుమెఱయ ♦ దుమురుఁ జేసె
నంత బ్రహ్మదత్త ♦ మగు మహాకరవాల, మసుర కేలఁ బూని ♦ యనుపమముగ.

వ॥ తత్ప్రభావంబుఁ జేకొని నలుదెసలఁ జరింపుచు మండలాకారగతుల విహ
రింపుచుండె; వీరబాహుండు నవ్విధంబునఁ దారసిల్లె; నప్పు డయ్యిరువురు యుద్ధ
మల్లు లగుచు బహువిధంబులఁ బోరిరి. 23

గీ॥ అంత నవ్వీరబాహుఁ డ♦త్యంతశౌర్య, కలన శోభిల్లు నతివీరు♦కరముఁ దునిమె
నిశితకౌక్షేయధారను ♦ విశిఖముననను, దైత్యశిరమును దెగటార్చె♦దక్షిణంబ.

వ॥ మఱియు నెల్ల లంకాపురవాసు లగు దానవుల ననేకుల ఖడ్గంబునం బరిమార్చి
వీరబాహుం డట్టహాసం బొనర్చుచు సహస్రయోజనాయామం బగు పరిఘ
నతిక్రమించి, యప్పురికోట యుత్తరద్వారంబుఁ జేరి యం దతిభయంకరులైన
ఘోరాఘోరు లనెడు ద్వారపాలకులను, సహస్రవాహినీసంఘంబు లగు ద్విర
దంబులను, నన్ని యరదంబులను, ద్విసహస్రవాహినీపరిమితంబు లగుహయం
బులను, తావత్సంఖ్యాకంబు లగు సైన్యచయంబులం గని యమ్మార్గంబునం

బోయినఁ గార్యహాని యగు నని తలంచి, ప్రాగ్ద్వారంబునకుం జని మహాపాత్ము వీర భాను లనియెడు దౌవారికులను, నుత్తరద్వారంబున నున్న కరణి జత్తురంగబలంబును వీక్షించి, దక్షిణద్వారంబున కరిగి యచట సహస్రవదనంబులును, ద్విసహస్రకరంబులును, శుండాదండసహస్రంబులుం గలిగి సేనాసమేతుండై యున్న పురపాలకుం డగు గజవక్త్రునింగనియె నప్పుడు, 25

గీ॥ గజముఖుండును గనుఁగొని ♦ కదనవీరు, వీరబాహుని కట్లనె ♦ యోరి! నిన్ను నెవ్వఁడంపించె నిచటికిఁ♦గ్రొవ్వుమీఱ,రాఁగతం బేమియనుచు దు♦రాగ్రహమున.

వ॥ అభ్యున్నతం బగు నొక్కపర్వతంబుఁ బెకలించి యేమఱియున్న యతనిపైఁ బ్రయోగించిన దాని నవ్వీరబాహుండు గరంబునఁ బట్టి పట్టినమాత్రంబున నమ్మహీధరంబు చూర్ణంబగుటయు, నద్దానవుండు మఱియుఁ గోపోద్దీపితుండై శుండాజాలంబున గిరిసహస్రంబును గొని పయిం బరపిన నవియు దదీయాంగసంఘట్టనంబునం బూర్వంబట్ల బొడిపొడియయ్యె నయ్యెడ. 27

క॥ కరిముఖుఁడు మఱియు గదఁగొని, యురుతరకోపమున నైవ ♦ నుజ్జ్వలలీలన్ వరబలుఁడు వీరబాహుఁడు, సురుచిరఖడ్గమున దానిఁ♦జూర్ణముఁ జేసెన్. 28

వ॥ మఱియు నద్దనుజుండు భూరుహంబులు శుండాదండసహస్రంబునం గొని త్రిప్పి వైచిన వాని నన్నింటిని వీరబాహుండు ఖడ్గంబున భగ్నంబు గావించె; నంత గజవక్త్రుఁడు వీడంబోక ముష్టియుద్ధంబు సేయ సన్నద్ధుండై జవంబున గరంబులెత్తి యెదిరించిన, 29

గీ॥ బాహుబలమొప్పనవ్వీర♦బాహుఁ డతని,తుండములు వేయిచెండిదో♦ర్దండములను రెండువేలును ద్రుంచె నుద్♦దండపటిమ,మూలమంటఁగ నద్భుత♦లీల మెఱయ. 30

మ॥ మఱియున్ ఖండితబాహుతుండుఁడు నిలిం♦పద్వేషి యుద్వృత్తి నే
డ్తెఱ నేతెంచినఁ గాంచి బాహుబల ము♦ద్దీపింప యుద్ధోర్విఁ గ్రి
మ్మఱ వీరాగ్రణి వీరబాహుఁ డురుశుం♦భత్ప్రౌఢి పాదాహతిన్
దొఱఁగన్ దన్నిన వాఁడుఁ గూలె ధరయం♦దు న్నిర్గతప్రాణుఁడై. 31

—* వీరబాహుండు సూక్ష్మరూపంబున శూరుపద్మపురంబుఁ జొచ్చుట *—

వ॥ ఇవ్విధంబున గజవక్త్రు నిహతుం గావించి వీరబాహుండు కార్యవిలంబనం బయ్యెనని మనంబునం దలంచి సూక్ష్మరూపంబున నత్యున్నతం బగు పశ్చిమద్వారగోపురంబునకు సత్వరంబునలంఘించి యందు నివసింపుచు నత్యంతకాంతిని స్తంద్రచంద్రోపలఫలకనిబద్ధసమిద్ధరాజవీథీవిరాజమానంబును, నజాండభిత్తిపరిస్పర్ధిబంధురవైజయంతికావిభ్రాజమానసౌధజాలంబును, పరిసరపరిశోభితవిమలజలకాసారభాసురంబును, ననవరతలసత్కిసలయకుసుమఫలభరితకలిత

లలితోద్యానవనోద్యానంబును, విచిత్రమణిగణవిరచితనానామంటపప్రాకారగోపుర రమణీయంబును, బ్రతిసదనసకలాభీష్టదకామధేనుకల్పభూరుహమనోహరంబును నై రంభాస్తంభసంభాసమానగృహద్వారావళులును, నలికులముఖరితమత్తవేదండగండస్థలనిష్యందమానదానధారాప్రవాహంబులును, దానధారాప్రవాహంబుల నభ్యాగతభూసురబృందంబుల నానందింపఁజేయు మహావితరణశూరులును, మహావితరణశూరబృందంబు లగు రథవాజిసందోహంబులును, వాజిసందోహంబుల కలకలంబుల నభిరామంబు లగు నారామంబుల నెసఁగ మెసఁగ కుసుమలతాలవాలంబుల నిజకరాంబుజంబుల ప్రభృతశాతకుంభకుంభితాంభోధారలు నించు బందీకృతబృందారకసుందరీజనంబులును, సుందరీజన సురతంబులవలని నిజశ్రమంబు లపనయింప నింపలర సుధానిధిం గొని నారికేళ ఫలవిధంబున విదళించి తత్సుధారసంబులఁ గ్రోలుచు గ్రీడించు మహోన్నత ప్రాసాదభాగభోగశీలభోగినీభోగులును, భోగుల నెనయు జడ లదర రాయంచ నడ లడంచు సుకుమారపల్లవజనంబులయుల్లంబులు రంజిల్ల మెలంగు వారపల్లవాధరులును, మఱియు దివిజసుందరబృందారకమునిబృందంబురతికేళిని ధర్షించు కుటిలదైత్యాంగనాజనంబులును గలిగి, యరవిందబాంధవు రథం బందుకొని క్రీడార్థంబుగా నధిరోహింపుచు నాడు బాలకజనంబులం జూపట్టి, సమీరణుండు రేణుజాలసమ్మార్జనంబుఁ గావింప, సోమసూర్యాగ్నులు స్వకర్మనిరతులై యను వర్తింప నమేయమహిమోజ్జ్వలంబై వెలయు న వ్వీరమహేంద్రపట్టణంబుఁ గాంచి యుదంచితకుతూహలంబున, 32

క॥ అరు దగు నిష్పురిభాగ్యం, బరయఁగఁజాలవు దృశానసహస్రంబు లొగిఁ
హరివిధిపురందరాదుల, పురములు విభవమున దీనిఁ బోలంగలవే ? 33

వ॥ అని యిట్లుఁ గొనియాడుచు గోపురంబు డిగ్గి నగరంబుఁ బ్రవేశించి ప్రతివీధిని నానావిధవిచిత్రంబులు లోచనగోచరంబులుగాఁ జేయుచు క్రమంబునం జని యొక్కయెడ, 34

గీ॥ దర్పమెసఁగ హిరణ్యాదిదనుజవరులు, దివిజగణములఁ గనుఁగొని దేవనాథుఁ
డెచట కరిగెఁ బులోమజ యెచటఁ డాగెఁ, జెప్పు డిప్పుడు నిజముగఁ జెప్పరేని.

వ॥ మిమ్మునందఱ వధించెద మని శ్రవణపుటకఠోరంబుగా భర్జించుటయు నది విని దివిజులు శోకాక్రాంతులై, 36

గీ॥ హా, మహాదేవ, శంకర, యభ్రకేశ, శివ యుమానాథ మిము నుపేక్షింపఁదగునె
త్రిపురసంహారమొనరించి తీవ్రమైన, గరళము హరించి మును మమ్ముఁ గావలేదె.

వ॥ మఱియు గజాంధకాసురులను వధం బొనరించి మమ్ము రక్షింపలేదె; పూర్వంబు నెండియు మత్స్యకూర్మవరాహనృసింహవామనత్రివిక్రములం బరిమార్చి మీ

నంబు నేత్రంబు, కమఠంబు కర్పరాస్థియు, వరాహంబు దంష్ట్రియు, నృసింహ
చర్మంబును, త్రివిక్రముని వెన్నుముకయుం గొని మమ్ము బ్రోచితివిగదా? మఱియు
జలంధర పంచమేఢ్రుల సంహరించి సురలనెల్లర గరుణించుటయు మఱచితే?
దుర్మార్గాసక్తచేతస్కులకు సన్మార్గప్రదర్శకుండవు; భ్రాంతులకు నజ్ఞాననివర్త
కుండవు; భవదాజ్ఞాధిష్ఠితంబును నస్మత్కృతంబునైన కర్మంబున నిబ్బాధ ననుభవిం
చెద; మిప్పు డిద్దానవోపద్రవంబులు పరిహరింప నీకు భారంబొకో! నీవు జాగరూ
కుండవై సుప్తంబైన జగంబు రక్షింతువుగాదె! భయగ్రస్తులమైన మమ్ముం గటా
క్షించుట కాలస్యం బేటికి యని బహువిధంబుల మొఱలిడుచు నాత్మగతంబున,

సీ॥ విభవంబులెంతెయు ♦ వీడ్వాని విబుధేంద్రుఁ, డువిదతో నెచ్చోట ♦ నుండునొక్కొ
యిప్పుడు సురపురి ♦ యేరీతి నుండునో, యభ్రగజేంద్రి మె♦ట్లయ్యెనొక్కొ
సర్వర్తువులను బు♦ష్పసమృద్ధిఁ బొలుపొందు, నందన మేగతి ♦ నొందెనొక్కొ
వైజయంతము కాంతి♦వాసి యెట్లయ్యెనో, యెంచ మాతలివిధ ♦ మెట్టులొక్కొ
గీ॥ ఆరయసుధర్మ మెబ్బంగి♦యయ్యెనొక్కొ, యెఱుఁగునొకొ వజ్రమనగాసి♦యెఱిగనేని
యరిగెనొకొ హరిబ్రహ్మాది♦సురలతోడ, బృథుతరంబగు కైలాస♦కుధరమునకు.

చ॥ అరిగి మహేశువాకిట స♦ముంచితలీల వసించు నందితోఁ
గరము వచించెనో యచటఁ ♦ గష్ట మొగి న్వని యాతఁ డిందుశే
ఖరునకుఁ దెల్పెనో మఱియుఁ ♦ గన్నడఁ జేసెనొ లేక యెవ్విధిన్
బరఁగెనొ యమ్మహాద్రిని సు♦పర్వవరేణ్యుఁ డెఱుంగ మక్కటా! 40

వ॥ ఇప్పాపాత్ముండైన శూరపద్ముం డెప్పు డేమిసెప్పె నప్పు డప్పనియు దప్ప కేము
సేయుచుండినను మానభంగం బొనర్పం దలంచుచుండు; మాచేయు దుష్కర్మం
బేమి? పిపీలికాదిజంతువులకు సంరక్షకుండైన యీశ్వరుండు మమ్మేల రక్షిం
పండని శోకపరవశులై నిద్రఁజెందిన,

సీ॥ మార్తాండసంకాశ♦మణికిరీటము లొప్ప, భాసురషణ్ముఖా♦బ్జములు దనర,
ద్వాదశఘనబాహు♦దండముల్ జెలువొంద, పసిడి జన్నిదములు ♦ బ్రస్ఫురిలఁగఁ
గనకమయంబైన ♦ కటిసూత్రముఁ జెలంగ, నురమున ముత్యంపు♦సరము లలర
సుకుమారరూపంబు ♦ చూపట్టువేడుక, బర్హివాహనముపైఁ ♦ బరగ నెక్కి
గీ॥ భవతనయుఁడు జయంతాది♦దివిజగణము, స్వప్నములయందు మనపుడు సా♦క్షాత్కరించి
చెవులఁ గడురసాయనములు ♦ చిలికినట్లు, నాదరోక్తుల నిట్లని ♦ యానతిచ్చె. 42

క॥ తొలఁగుఁడు ఖేదము మనములఁ, గలుగును కుశలంబు మీకుఁ ♦ గ్రక్కున నింకన్
జెలువొందు నిపుడు సురగిరి, బలరిపుఁడు సుఖాప్తి యాత్మ♦భామినితోడన్. 43

క॥ సానుజుని శూరపద్ముని, సేనాసహితంబుగాఁగఁ ♦ శీఘ్రిం బాఱన్
నే సంక మదమణఁగించెద, మానుఁడు మదిలోనఁ జింత ♦ మామకకరుణన్. 44

వ॥ పూర్వప్రకారంబుల మిమ్ము మీపదంబుల నునిచెద; మదీయదూత మీకడ
కిప్పుడ రాగలం డని శరజన్ముం డెల్లసురలస్వప్నంబులఁ జెప్పి యూరడించి యంత
ర్హితుం డగుటయు నంత జయంతాదిసురగణంబులు మేలుకని విస్మయం బొంది
సంతోషభరితు లగుచు నిజస్వప్నంబు లన్యోన్యంబు నుడువుచుండ నచ్చోటికి
వీరబాహుం డరుదెంచి సురలచేత కృతవందనుండగుచు, 45

——* వీరబాహుఁడు బందితు లగు జయంతాదులకు ధైర్యముఁ జెప్పుట. *——

గీ॥ వివిధబాధల నొందెడు ♦ విబుధతతినిఁ, గరుణఁ గన్గొని వారల ♦ గాసిమాన్ప
దండకావలియున్నట్టి♦దనుజభటుల, మోహితులఁజేసి యిట్లను♦ముదముదవర
క॥ జయమగు జయంతనీకును, భయము మది న్మానుమింక ♦ బ్రహ్మములతో
రయమున నీతండ్రి శచీ,ప్రియుఁ డారజతాద్రి కరిగెఁ ♦ బృథుతరభక్తిన్. 47
వ॥ అగు మహేశ్వరునకుఁ బ్రణమిల్లి సంస్తుతు లొనర్చి శూరపద్మునివలని యుప
ద్రవంబులు విన్నవించిన, 48
క॥ ఆజగదీశుఁడు విని నగ,రాజసుతారమణియందు ♦ గఙ్గోవరదో
స్తేజం బణఁచు కుమారుని, రాజిల్లం గాంచి సంగ♦రంబున కనుపన్. 49
గీ॥ అక్కుమారుఁడు భుజశౌర్య ♦ మతిశయిల్ల, సకలనిర్జరసందోహ♦సహితుఁడగుచు
శాంతినగరంబునకు వచ్చి♦చక్కనన్ను, నిటకుఁబుత్తెంచె శూరుని♦వృత్తమరయ.
క॥ మీతండ్రి శునాశీరుఁడు, నాతో నిట్లని వచించె ♦ నాతి శచి మదిన్
భీతి నొలంగ సురాద్రిని, కేతనమై యున్న దనుచు ♦ గిరిధన్వి కృపన్. 51
వ॥ ఇంద్రుండు నిప్పుడు సుఖంబున నున్నవాఁడు వినుండు. 52
గీ॥ క్రౌంచతారకదుర్వార♦గర్వహరుఁడు, గుహుఁడుమత్స్వామిశీఘ్రంబ♦క్రొవ్వణంచు
శూరపద్మాదిదనుజుల♦సొంపుమీఱ, పాలనముసేయు మిమ్ము కృ♦పానిరూఢి. 53
వ॥ మనంబున శోకింపవల దనిన నప్పలుకులు విని జయంతుండునునిఖిలదేవతలును
సంతోషించి నిజస్వప్నంబు లతనికిం దెల్పిన విని యానందంబున, 54
క॥ అట కదలి వీరబాహుఁడు, పటుతరగతిమీఱి యసుర♦పట్టణవీధిం
బటలిఁ గనుగొనుచుఁ జనె న, చ్చటమేల్కనె నంత దితిజ♦సందోహంబుల్. 55
వ॥ అట్లు చని క్రమంబున నతిమనోహరంబైన శూరపద్మభవనంబు సూక్ష్మరూపం
బునం జేరి యుగ్రమయూరాఖ్యు లగు ద్వారపాలకులకు, అనేకదైత్యభటు
లకు నగోచరుండై యరిగి లోపల నాస్థానమంటపంబు డాయంబోయి, 56
సీ॥ కర్ణకుండలరుచుల్ ♦ గండస్థలులు నిండ, మణిమయకోటీరఘృణులు వెలయ
స్మితచంద్రికావళు ♦ లెలువొంద మోమున, దివ్యాంబరము మేన ♦ దేజరిల్ల

వలికభాగమునందు ♦ నలరఁ దిరి పుంగ్రాళి, సకలదానవభటోచ్చ్రయముఁ గొలువ
ముందఱ నచ్చర ♦ ల్మురువుగా నటియింప, భాషావిశేషముల్ ♦ బ్రాఁధిమీఱ

గీ॥ సమరకాంతలు నీరాజ♦నము లొసంగ, ననుపమసహస్రయోజనా♦యామమంట
పమున మణిభద్రపీఠిని ♦ రమణమీఱ, శూరపద్మునిగనియె న♦వ్వీరవరుఁడు. 57

క॥ పరికించి వీని కెదురుగ, సరిగద్దియపై వసింపఁ ♦ జను, లేకున్నన్
సరకుంగొనునే న న్నని, హరసూనుని దలఁచె నాత్మ ♦ ననుపమభక్తిన్. 58

వ॥ శరజన్ముండు దదభీష్టంబు సమకూర్ప నానారత్నవిచిత్రితంబును, నభ్యున్నతంబు
ను, ననేకార్కప్రతీకాశంబును, నభూతోపమంబును, నిజప్రభాపటలనిరసితశూర
సింహాసనంబు నగు సింహాసనంబుఁ బ్రసాదించినఁ దత్పీఠంబున నిజస్వరూపంబు
తోడ వీరబాహుండు శూరపద్మునెదుట నధిరోహించి మహాప్రభావంబునఁ
జూపట్టిన నతనిం గనుంగొని దనుజు లందఱును విభ్రాంతులై తమలోన, 59

ఉ॥ ఎవ్వఁడొకో యితండు భయ ♦ మించుక లేక మనంబులోనఁ బల్
గొప్పున ద్వారరక్షకులఁ ♦ గొబ్బున మోసముఁజేసి వచ్చె లే
కవ్వనజాతసంభవుఁడొ ♦ యాహరియో త్రిపురాంతకుండొ వీఁ
డివ్వగ నెంచ కెవ్వరిని ♦ నింతమదోన్నతి నుండ నొప్పునే? 60

వ॥ అనియాలోచించుచుండ శూరపద్ముం డవ్వీరబాహున కిట్లనియె. 61

ఉ॥ ఎవ్వఁడ వోరి నీవు? మఱి ♦ యిచ్చట రాఁగత మేమి యిప్పు డీ
వెవ్వరిదూత వెందు వసి♦యింతువు బాపురె యొందు నేర్చితోఁ
యివ్విధి నింద్రజాలమును ♦ హేమమణీమయభద్రపీఠ మి
ట్లివ్వనిచేతనైన సృ♦జియింపఁగ వచ్చునె నాదుముందటన్. 62

వ॥ నీవిప్పుడు సాహసంబున ముక్తభయుండవై నామ్రోల నలంకారంబుఁ జూపట్ట
సింహాసనం బధిరోహించితివిగావున, 63

క॥ బాగయ్యె నీదువిద్యా, ప్రాగల్భ్యం బిప్పు డీవు ♦ బహుమతి, ప్రాణ
త్యాగముఁ గోరెదవో భవ, దాగమనం బేమి చెప్పు ♦ మనుడు నతండున్. 64

వ॥ అద్దానవేంద్రుని వచనంబులువిని విస్మయమానముఖాంబుజుం డగుచు నిట్లనియె.

క॥ వినుశూరపద్మ! చెప్పెద, మనమున మద ముడుగు మింక ♦ మనియెదవేనిన్
వనరుహసంభవలక్ష్మీ, వనితావల్లభులు దేవ♦వర్గముతోడన్. 66

వ॥ నీవలని యుపద్రవంబులు సహింప నోపక సకలాభయప్రదుండును, సర్వలో
కోపకారుండును, శాంతుండును, సకలపురుషార్థప్రదుఁడును, సాయుజ్యకైవల్య
దాయకుండు నగు కైలాసవాసునిం జేరి కృతప్రణాములై స్తుతించి వినయాన్వి
తులై యిట్లనిరి. 67

గీ॥ శివ! మహాదేవ! నిర్జర♦శ్రేణి నెల్ల, శూరపద్ముండు బాధించు ♦ ఘోరముగను
తద్వధార్థంబు పర్వతతనయయందుఁ, గాంచుము కుమారుసుకుమారుఁ♦గరుణఁ దనర.

వ॥ అనినఁ బరమేశ్వరుం డంగీకరించి దనుజకులవిదారకుండగు కుమారు నవ్విధంబు నంగాంచి యతనితో నిట్లనియె. 69

గీ॥ పుత్త్ర! దేవసేనాని వై♦బోవు మిపుడు, గాందిశీకత గను మరు♦ద్గణము నెల్ల
శూరపద్మాదిదానవ♦శూరతతుల, నాజిఁ బరిమార్చు నాయాజ్ఞ ♦ నవధరించి.

—* వీరబాహుండు కుమారస్వామియాజ్ఞ శూరునకుఁ దెల్పుట *—

వ॥ అని యిట్లు జగత్పతి యగు నీశ్వరుం డానతిచ్చినఁ గుమారుండు వైత్రయాత్రోత్సుకుండై కదలి మార్గమధ్యంబున మహాదురితాత్ముం డగు క్రౌంచాసురుం జగ టార్చి భవతోదరుం డగు తారకుని వధించి విజయంబు జేకొని శాంతినగరంబున కరుదెంచి సకలసుపర్వులు గొల్వ నందు నివసించి యద్దేవవల్లభుండు దయాళుం డగుచు నీకడకు నన్నుఁ బుత్తెంచిన కజ్జంబు వినుము జయంతప్రముఖులగు దివి జుల విడిచి నీదుపురంబున సుఖంబుననుండు మట్లుకాక గర్వంబున క్రుధ్ధైదవేని సంగరాంగణంబున సకలబంధుసహితంబుగ నిన్నుఁ బరిమార్తు; నీయర్థంబు నందు సంశయంబు వలదని యిట్లు నీకు బుద్ధిసెప్పుమనియె. 71

గీ॥ ఇవ్విధంబున నున్నది♦యీశ్వరాజ్ఞ, విబుధతతి నెల్ల నోశూర ♦ విడువు మిపుడు
సుఖముగ వసింపు మనుచువి♦స్ఫుటముగాఁగ, వీరబాహుండు వచియించి♦యూరకుండె.

ఆ॥ శూరపద్ముఁ డంత ♦ వీరబాహుని గాంచి, కోపవీక్షణములు ♦ ఘూర్ణిలంగ
నుర్వి నాదుశౌర్య♦ మొక్కింతయెఱుఁగఁ డా, బాలకుండు♦విడు నె బాల్యచేష్ట. 73

క॥ వినినప్పుడ తారకవధ, మును బహుకోపమున బాలు♦పొగరు నణంపన్
మనమునఁ దలంచి పట్టణ,మును వెడలితి నంతలోన ♦ బాదమినలజ్జన్. 74

వ॥ అజ్ఞుం డగు నర్భకుం బరిమార్ప నుచితంబుగాదని యుపేక్షించిన దోషంబువలన నింతకార్యంబు పుట్టె; నట్లనియు నెల్లి మదీయం బగు నెల్లసేనలం బనిచి తదీయ దర్పం బణంగించెద నని గర్వోద్రేకంబున దానవేంద్రుండు నలికిన విని వీర బాహుండు క్రోధోజ్జ్వలితహృదయుం డగుచు నిట్లనియె. 75

క॥ అరివిపినదావపావకు, హరనందను మహిమ నాత్మ ♦ నరయక కుమతీ!
ధర నతని నర్భకుం డని, యురుతరదర్పమున బలుక ♦ నుచితమె నీకున్? 76

వ॥ వినుము పరమేశ్వరునకు స్కందాఖ్యయగు మూర్తి యతం డతనివలన బ్రహ్మాం డంబు లుత్పన్నంబు లగు; నతనియందె లయంబు నొందు నతని మహామహిమం బొరి యాడ బ్రహ్మాదులకు నగోచరం బగు నిప్పుడే నతనిచే దౌత్యంబున నియు క్తుండనై చనుదెంచితిం గావున దురాత్ముండవగు నీ కవమానంబుఁ జేయక యూరకున్నవాఁడ నని పరుషవచనంబుల నవ్వీరబాహుండు భర్జించిన, 77

శా॥ శూరుం డంత నమర్ష మొప్ప దనుజ♦స్తోమంబుఁ బ్రేరేపినన్
వా రంతే ద్విసహస్రబాహువులు భా♦స్వద్వక్త్రసాహస్రికుల్
భూరిస్ఫూర్తిని రాజలంగ విజయ♦ప్రోత్సాహసన్నద్ధులై
ఘోరాకారతఁ జుట్టి రాతని గడుం♦గోపంబు దీపింపఁగన్. 78

వ॥ అంత వీరబాహుండు దానవేంద్రుండుఁ గనుఁగొనుచుండ వారి నందఱ వజ్రనిష్ఠురం బగు కరంబునం బట్టి యిట్టట్టు చననీక బిట్టుగ నేలంగొట్టి నిమిషమాత్రంబున విగతప్రాణులం జేసి యయ్యాస్థానమంటపంబు విడిచి వెడలెఁ దత్సింహాసనంబు తిరోహితంబయ్యె నంత. 79

క॥ శూరుండు మఱియు శతముఖు, నారూఢిగ నతనిమీఁద ♦ ననిచిన వాఁడున్
ఘోరములగు సేనలతోఁ, బోరికి రాఁ జూచి వీర♦పుంగవుఁ డలుకన్. 80

వ॥ సారవంతంబు లగు సైన్యంబులపై వింశతిసహస్రకలశమండితంబగు గోపురంబు పెకలించి యతివేగంబున వైచిన నతనిసైన్యంబంతయు హతంబయ్యె; నంతశతముఖుండు నితాంతజనితామర్షుం డగుచు ననేకశరవర్షంబులు గురిసిన. 81

గీ॥ ఉరుబలుని వీరబాహుని♦యొడలు దాఁకి ♦ తచ్ఛరంబులుఁ జూర్ణమై♦ధరణి వ్రాలె
పిండియును వీరబాహుండు ♦ వేఱొకండు, గోపురంబును పెకలించి♦కోపమునను.

క॥ శతముఖుని మీఁద వైచిన, శతధా భిన్నం బొనర్చె ♦ జయ్యన దానిన్
శతసాయకబృందంబుల, శతముఖుఁ డఖిలాస్త్రశస్త్ర ♦ చతురుం డగుచున్. 83

వ॥ మఱియు శతముఖుండు కోపాటోపంబున వీరబాహునిపైఁ బ్రాసతోమరశక్తినారాచాదిసకలాయుధంబులు బఱపిన నవియన్నియు వీరబాహుండు భగ్నంబు గావించి మఱియు నతని ధనువుం ద్రుంచె; నద్దోషాచరుండును మగుడి రోషభీషణుండై చలంబు రెట్టింప ద్విశతంబు లగు కరంబుల నతనిం బట్టుకొనం దలంచినం గనుంగొని వీరబాహుండు లీలామాత్రంబున వానిం బడఁద్రోచి యొక్కపాదంబునఁ దద్వక్షస్స్థలంబు ద్రొక్కి రెండవపాదంబున శిరంబులన్నియు మత్తదంతావళంబు నారికేళంబులు ద్రుల్చువిధంబునం బోలె సదమదంబుఁగావించె. 84

ఉ॥ శతముఖు నిట్లుఁ జంపి పటు♦సాహస మొప్పఁగ వీరబాహుఁ డు
ద్భుతముగ నున్నతాకృతియుఁ ♦ బూని పదంబున ధాత్రి వేగ ను
ద్ధతగతిఁ దన్నినం బగిలె ♦ ధారుణి యప్డు మహాజలౌఘ ము
ద్గతమయి ముంచె నశ్వముల ♦ దైత్యబలంబుల నాశ మొందఁగన్. 85

వ॥ మఱియుఁ బంచాశద్వాహినీసంఖ్య గల దనుజవరు లెదిర్చి నిశితశరపరంపరలు వీరబాహునిపై గురిసిన నతని శరీరంబు రుధిరంబునం దోఁగె నంత వీరబాహుండు కౌశలంబు మెఱయఁ గరచరణంబుల విసరి కరకుటసురులఁ బాఱసమరి పరిసరంబున నెసఁగు నగరసంరక్షకు లగు రక్షోవిసరంబులం దూలించి పంచోత్తరశత

యోజనవిశాలంబును, సహస్రయోజనోన్నతంబును, నియుతశాతకుంభకుంభసంభృతంబును, మనోహరంబు నైన యొక్క గోపురంబు పాణితలంబున నంగీలించి శూరపద్మునాస్థానమంటపంబుపై వైచినఁ దత్పతనంబున మంటపంబు శిథిలంబై నేలంగూలె నిట్లు తక్కినమంటపంబులును బ్రాకారవలభిగోపురాట్టాలకసౌధంబులును గండశైలస్తంభభూరుహంబులును బెరికి దనుజబలంబులం గూల్ప నలుగడలం బడవైచియు నట్టహాసం బొనర్చుచు నటించె; నప్పు డింతయుఁ జూచిన గోపురంబులపయిఁ బడియు, ప్రాకారంబులమీఁద నొరిగియు, సౌధంబుల గెడపియు నాట్టాలకంబుల దొరఁగియుఁ, గొందఱు ముక్తకేశాంబరులగుచు పలాయనంబు నొందిరంత. 86

గీ॥ మహిఁ దొరంగిన యాస్థాన♦మంటపమునుఁ, బట్టణక్షోభమును శూర♦పద్ముఁ డరసి
పంచశతవక్త్రులు సహస్ర♦బాహులునగు, నసురవీరుల రావించి ♦ యనియె నిట్లు.

క॥ భటులార! పొందు వేగను, పటుగతి నావీరబాహు ♦ బంధింపుఁ డనన్
జగముల మహాభుజబలులు, ద్భటవృత్తిన్ శూరుతోడఁ ♦ బలికిరి వరుసన్. 88

గీ॥ మీరు చెప్పకపూర్వంబ ♦ మేము వేల, సంఖ్యతో వాని బంధింప ♦ శక్తి లేదె
యుష్మదాజ్ఞ నపేక్షించి ♦ యుంట గాక, యనిన శూరుండు భటులకు ♦ నాజ్ఞ యొసఁగె.

వ॥ ఇట్లు శూరపద్ముచే ననుజ్ఞాతులై కదలి కదనంబునకు విదళితారాతిసమూహుం డగు వీరబాహుం జుట్టిముట్టి నిశితంబు లగు నిఖిలాయుధంబులు వఱపిన నవ్వీరాగ్రేసరుండు సరకుసేయక సవిధంబున నొక సమున్నతంబగు సాలవృక్షంబు బెరికి దాన నయ్యస్త్రంబులన్నియుఁ జూర్ణంబుఁ గావించి వారలనందఱ విగతజీవులం జేసె నంతఁ దూతముఖంబున దద్వృత్తాంతంబు విని కోపంబు దీపింప శూరపద్ముండు నిజాత్మజుం డగు వజ్రబాహుం బంచిన నతండు సకలదివ్యాభరణభూషితగాత్రుండును, కవచధనుస్తూణీరాద్యలంకృతుండును నగుచు దశసహస్రతురంగంబులు గట్టిన రథం బధిరోహించిన, 90

—* వీరబాహుండు వజ్రబాహ్వాదిదైత్యసుతుల నుక్కడంచుట *—

సీ॥ మహిమతో మంత్రికు♦మారులు సేనాధి, పకుమారులును వెంటఁ♦బలసి కొలువ
తగ వాహినీపంచ♦దశకముల్ మదసింధు,రంబులు నల్లన ♦ రథము లలర
నెలమి సాహస్రవా♦హిను లొప్ప మారుత, జవయుతహయములు♦సందడింప
ద్విసహస్రవాహిను♦లెసఁగు సైన్యంబులఁ, బటహకాహళమహా♦ర్భటులు మొరయ

గీ॥ చామరంబులు ధ్వజములు♦ఛత్రములుచు, దాల్చి పరిజనములు దండఁ♦ దనరుచుండ
శపథమున వజ్రబాహుండు ♦ సారె వెడలె, వీరబాహునిమీఁద దో♦ర్వీర్య మడర.

గీ॥ అప్పు డాకస్మికంబుగా♦నవనియందు, బడిమె నుల్కానలంబులు♦భయదములుగఁ
గాకములుఁ గూసె శుష్కవృ♦క్షములనిలిచి, వినఁబడియె శివారవములు♦వివిధముగను॥

వ॥ మఱియు రక్తమాల్యాంబరధారిణియు, రజస్వలయు, విశ్వస్తయును, తైలాప్తశిరస్కయును, విచ్ఛిన్ననాసాబాహుపాదులును నదురైన దుశ్శకునంబులు గనుంగొనియు మనంబున శంకింపక యద్దానవాగ్రణి రణాంగణంబున వీరబాహుని గదిసె నంత, 93

గీ॥ వీరబాహుండు తత్సైన్య♦వితతిఁ గాంచి, సైన్య మిది ద్రుంచి పోవుదు♦శరజుకడకు,
ద్రుంప కరిగిన షణ్ముఖు♦దూత నేను, గా నటంచును శపథంబుఁ♦బూని వేఁగ. 94

వ॥ అయ్యమేయబలుండు నభంబున కెగసి మేఘగర్జనంబు లొనర్చిన, 95

క॥ విని తద్గర్జారవములు, ననయం బావజ్రబాహుఁ♦డాశ్చర్యమునన్
దనసారథి యగు విజయుం, గనుఁగొని యిది యేమియనుడు♦గడుసూతుండున్. 96

వ॥ తద్విధంబంతయుఁ దెలియఁ జెప్పిన నంత నద్దనుజుండు యుద్ధసన్నద్ధుం డయ్యె, నట మున్న సకలసైన్యంబులు శౌర్యంబులు మెరసి యనేకశరవర్షంబులు వీరబాహుపయిం గురిసిన నిజకాయంబు రక్తసిక్తంబగుటకుఁ గోపోద్దీపితుండై వీరబాహుం డసదృశబలుం డగుచు, ననేకు లగు రక్కసుల నొక్కపెట్టునం గేలం గొని బ్రహ్మాండపర్యంతం బెగయవైచియుఁ, గొందఱఁ జరణంబులఁ గేలం గీలించి బిఱబిఱం ద్రిప్పి నేలం బడిపియు, గొందఱం బట్టి దిక్కులం బాఱవైచియు, గొందఱ కపోలతాడనంబుల హతులం జేసియుఁ, గొందఱ కేశపాశంబులఁ బట్టి త్రిప్పి సముద్రంబుల నంతర్ద్వీపంబుల లోకాలోకంబులం బడఁజిమ్మియుఁ, గొందఱ పాదహతులఁ గూల్చియుఁ, గొందఱ ముష్టియుద్ధంబున బడలువడ నడచియుఁ, గొందఱఁ గరంబుల నొడిసిపట్టి కాళ్ళు వ్రేళ్లు చీల్చి లీలామాత్రంబున నింగికిఁ బాఱవైచియుఁ, గొందఱ ముష్టిఘాతంబుల నుదరంబులు శిరంబులు బదంబులు వ్రక్కలుఁ జేసియుఁ, గొందఱ నురస్థలంబుల నొక్కపాదంబునం దన్నిపట్టి యొండు పాదంబున నుత్తమాంగంబులు నలినలిఁ జేసియుఁ, గొందఱఁ గరంబులు నులిమియుఁ, గొందఱఁ బదంబులం బట్టి యూర్ధ్వంబున కెగురవైచియు, వారలు మగుడి ధరణిం బడునంతలోన నద్దనుజుల వేఱె గొందఱఁబట్టి వారిని లక్ష్యముగాఁ జూచి వైచియు నివ్విధంబున సకలదానవులఁ బరిమార్చి తనివి చనక నొక్కవటంబుఁ బెరికి సేనాపతికుమారులం జదియఁగొట్టి విగతప్రాణులం జేసె నంత.

గీ॥ వజ్రబాహుఁ డమర్షంబు♦ వర్ధిలంగ, నారిఁ గూరిచి ధనువున♦ నారసములు
బహుసహస్రంబు లుద్ధతిఁ♦బరపనవియు, వీరబాహుండు ద్రుంచె♦ దోర్వీర్య మెసఁగ.

వ॥ మఱియు నయ్యసుర ఘోరనారాచంబు లెన్నియుం బరపిన నవియన్నియు వీరబాహుండు ముసలంబున విదళితంబులు గావించె; వెండియు నద్దానవుండు బాణసహస్రంబులు వర్షించిన నవ్వీరుం డయ్యంబకంబులు కరంబునం గొని తునియలు జేసె. 99

గీ॥ వజ్రబాహుండు మఱియును♦వాడిశరము, లతనిశిరమున నురమున ♦ నంఘ్రులందు
నుదుట బాహుల జానుల♦నుదరమునను, వేలసంఖ్యలునాటించె♦విజయమెసఁగ.
వ॥ ఇట్లు నాటించిన వీరబాహుండు నించుకతడవు మూర్ఛితుండై యంతటఁ దెలివి
నొంది రోషం బగ్గలంబుగా నత్యంతసుందరం బగు తదీయస్యందనంబు నిజపదా
ఘాతంబున నూరువ్రయ్యలు జేసి; నిట్లు రథంబు విదళితంబగుటయు, వజ్ర
బాహుండు వేఱొక్క తేరెక్కి యుక్కు మిగుల బాణసహస్రంబులు లలాటంబునం
బ్రయోగించిన వీరబాహుం డవియున్నియుఁ గరంబునఁ దట్టియు, దనుజులతోడ
గూడఁ దద్రథంబు లక్షయోజనపర్యంతంబు నూర్ధ్వంబున కెగయఁజిమ్మిన శతాం
గంబు విశీర్ణాంగంబై ధరాతలంబునం బడియె; నట్లు వజ్రబాహుండు నరదంబు
తోడఁగూలియు బాలిసోని ధైర్యంబున లేచి రోషభీషణుండగుచు, మహోన్నతం
బగు చాపంబుఁ గీలించి యుద్ధసన్నద్ధుండైన,　　101
ఆ॥ వానిధనువుఁ దుంపఁ ♦ వడి వీరబాహుండు, ఖడ్గ మసురుఁ డంత ♦ కరముఁబూని
కోపమడర నెగయ ♦ గొబ్బున వీరుండు, ఖడ్గముష్టితోడఁ ♦ గరము దునిమె.　102
వ॥ ఇట్లువిదళితకరుండై వజ్రబాహుండు గదాదండంబు వేఱొక కేలంగొని వీరబాహు
వయిం ద్రిప్పి వైచిన,　　103
క॥ కరవాలంబునఁ దగ్గద, పరిభూతమొనర్చి వీర♦బాహుఁడు కడిమిన్
బరిమార్చె వజ్రబాహుని, శిరములు నిశితాసిధార ♦ శీఘ్రంబాజిన్.　104
వ॥ ఇవ్విధంబున నిఖిలదానవసైన్యంబుల సంగరాంగణంబునం బొరిగొని మహా
విజయలక్ష్మీవిరాజమానభుజుం డగుచు నిరతిశయకుతూహలంబున నిజస్వామి
సన్నిధి కరుదేర దలంచె; నంత నాదిత్యుం డస్తమించె.　　105
క॥ స్కందుని మహిమలు పలుమఱు, నిందించుటకున్ ఫలంబుఁ ♦ నేఁడు నిజముగాఁ
బొందెను శూరుం డని ముద, మందుచు మది వీరబాహుఁ ♦ డరిగె జయమునన్.
వ॥ ఇట్లరిగి నిరర్గళపరాక్రమధుర్యుం డగు నవ్వీరబాహుండు మార్గంబున నద్భుతం
బులఁ గనుంగొనుచుఁ, బరిఘోల్లంఘనంబుఁజేసి నిమిషమాత్రంబున లంకా
పురంబుసేరిన,　　107
గీ॥ అచట వ్యాళీముఖుండు త♦దాగమంబు, శీఘ్రముగ నెఱిఁగి సహస్ర♦శిరములలర
భాసురంబుగ ద్విసహస్ర♦బాహులొప్పఁ, దత్కృతంబైనపుత్త్రవ♦ధంబుఁదలచి.
క॥ ఉరురోషంబున సేనా, పరివృతుఁడై యెదిరి వీర♦బాహునితోడన్
వరశౌర్యుఁడు వ్యాళీకం, ధరుఁ డిట్లనియె న్నితాంత♦దర్పం బెసఁగన్.　109
చ॥ నిలునిలు మోరి యెచ్చటికి ♦ నీ విఁకఁ బోయెదు మున్ను మత్సుతుం
గలన వధించి తీ వటులఁ ♦ గాన మదం బుడుగన్ భవద్భుజా

బ్బల మణఁగింతు నే నిపుడు ♦ ఖండనమందున మత్ప్రతాక్రిమో
జ్జ్వలతనుఁ జూడు మంచు నని♦వారణనిష్ఠురభాష లాడినన్. 110

వ॥ వీరబాహుండు జెఱునగవు నగుచు నద్దానవున కిట్లనియె; సహస్రముఖంబులు ద్విసహస్రకరంబులునుం గల మహాభయంకరుండ వీవు; నే నేకశిరస్కుండను; సంగరాంగణంబున నీవలసినది చేయు; మనునంతలోన వ్యాళీముఖుసైన్యంబు లురవణించి, యిరుదెసలఁ గప్పి యబ్బలుమగనిమీఁద నిశితశరపరంపరలు గురిసిన,

సీ॥ వీరబాహుండు ఖడ్గంబు ♦ వేగఁ బూని, యవియు నన్నియు విదళించె♦నాక్షణంబ
యంత వ్యాళీముఖుండుస♦హస్రబాహు, వులనడఁచె దద్భుజాంతర♦మలఘుపటిమ.

సీ॥ ఆమహాసురుబాహుస♦హస్ర మపుడు, వీరబాహుండు నిశితాసి♦ధారఁ దునిమె
మఱియు నితరకరంబుల♦మనుజభోజి, క్రుద్ధుఁడై పర్వతంబులు ♦ గొనిరయమున.

సీ॥ వీరబాహునిమీఁదను♦ వేగవైవ, నవియుఁ జూర్ణంబులై రాలె ♦ నతనిదాఁకి
యంత నాదైత్యునితరబా♦హాసహస్ర,మద్భుతంబుగఁదునుమాడె♦నలఘుపటిమ.

వ॥ ఇట్లు కరంబులన్నియు విదళితంబులైన నయ్యసురుండు కోపవిహ్వలుం డగుచు తుండాసహస్రంబున మగుడి బంధింపం దొడరిన, వీరబాహుం డనివార్యశౌర్యంబునఁ దత్తుండాసహస్రంబును గరవాలంబునం దునుమాడి సంగరాంగణంబు నల్లెడ నెరపె. 115

క॥ దానవసంఘము నీగతి, మానితశౌర్యుండు సమర♦మండలి విగత
ప్రాణులఁ జేసి పయోనిధి, మానుగ లంఘించి గంధ♦మాదన నగమున్. 116

—*వీరబాహుండు శూరునివృత్తాంతము కుమారస్వామికిఁ జెప్పుట *—

సీ॥ చేర యవ్వీరబాహుండు♦శీఘ్రమంత, పూర్వరూపంబునను శాంతి♦పురమునకును
వచ్చిరవ్వీరుఁగనుగొన ♦ వనజభవుఁడు, హరియు వజ్రియు నాదిగా♦నఖలసురలు.

వ॥ మఱియు నష్టాధికలక్షగణవర్యులును ప్రహృష్టాంతరంగులగుచుఁ బ్రణామస్తోత్రంబుల నతనికిఁ బ్రియంబొనర్చుచుఁ గృతాంజలులై రయ్యవసరంబున వీరబాహుండు వారల నాలింగనసంభాషణంబుల నాదరింపుచు వారలకుఁ దద్వృత్తాంతంబంతయు విశేషించి యింద్రునకుఁ దెలిపి సకలబృందారకసమేతుం డగుచు నిందుకళాధరునందను మందిరంబునకుం జని, 118

క॥ సురసేనాపతిఁ డాగుహు, చరణాంబుజయుగళమునకు ♦ సాష్టాంగనతు
ల్విరచించి నుతిశతంబుల, గరము న్గొనియాడె స్వస్తి♦కారుం డగుచున్. 119

వ॥ నిజస్వామిచేఁ గృతాజ్ఞుండై.

సీ॥ వీరబాహుండుగుహునకు ♦వినయ మొప్ప, దనుజవృత్తాంతమంతయుఁ♦దగవచించె
దేవ! మీరానతిచ్చిన ♦ తెఱఁగు శూర,పద్మునితోడను జెప్పితి♦ బహువిధముల.

క॥ వినఁడయ్యె నించుకేనియు, దనుజుఁడు నీయాజ్ఞ మీఱెఁ ♦ దద్దయు నది గా
కను సేనలఁ బురికొల్పెను, దనపై నిశితాస్త్రశస్త్ర♦తతులు గురియఁగన్. 122

క॥ నీకరుణవలన దనుజా,నీకంబును దునిమి యాజి ♦ నిస్తులమహిమన్
నీకడకుఁ జేరఁగంటిని, బ్రాకటగుణరత్నహార! ♦ భర్గకుమారా! 123

వ॥ అని పల్కి వినయనమ్రుండై దండ నిలిచిన వీరబాహుం గనుంగొని షణ్ముఖుం
డిట్లనియె. 124

క॥ మాకొఱకు గాసిఁబొందితి, నీకంటెను స్వామికార్య♦నిపుణుఁడు గలఁడే
లోకంబున నని యంతట, లోకేశ రమేశ దివిజ♦లోకేశ్వరులన్. 125

వ॥ మఱియు నెల్లదివిజులం గనుంగొని దేవసేనావిభుం డిట్లనియె. 126

క॥ అంగీకరింపఁడయ్యె న, భంగమదోన్నతిని శూర♦పద్ముఁడు మత్ప్రా
ర్థిం గరుణింప నిఁకేటికి, సంగరమున నేన బాహు♦శౌర్య మెసంగన్. 127

వ॥ మీ రందఱుఁ గన్గొనుచుండ భ్రాతృ పుత్త్ర మిత్త్ర బాంధవసమేతంబుగా
శూరపద్ముని నేనె పరిమార్చెద నని శపథంబు పలికిన సుబ్రహ్మణ్యుని వచనం
బులు విని హరిబ్రహ్మాదిసకలదివిజులు సంతోషభరితాంతరంగు లైరి. 128

గీ॥ నిఖిలదానవవిధ్వంస♦నిపుణుఁడైన, వీరబాహునిచరితంబు ♦ ఏను లలర
విని మహీసురపుంగవుల్ ♦ విస్మయంబు, నొంది రాత్మను నిర్భరా♦నందులగుచు.

వ॥ మఱియు సూతుండు శౌనకాదిమహామునులం జూచి కర్ణరసాయనంబుగ నింక
చెప్పెద సావధానంబుగ వినుం డని యిట్లనియె. 130

క॥ అంతట శూరుఁడు పుత్త్రుని, యంతిమదశ నాలకించి ♦ యసురావళిచే
సంతాప మొందె నలినిభ, కుంతల యగునట్టి పద్మ♦కోమలతోడన్. 131

వ॥ ఇవ్విధంబున పుత్త్రవియోగసంజాయమానవేదనాదోదూయమానమానసుం
డగు శూరపద్మునకు మంత్రివర్యుం డగు ధర్మకోపుం డత్యంతసాంత్వవచనంబుల
నూరడింపుచు నిట్లనియె. 132

క॥ అతులైశ్వర్యయశోధృత, మతిశాలివి శౌర్యనిధివి ♦ మహనీయజయా
న్వితుఁడ వురుతంత్రవిదుఁడవు, క్షితి నజ్ఞుడువోలె నేల ♦ ఖేదం బొందన్? 133

క॥ నీ విట్లు శోకమొందిన, నీవేల్పులు నిన్నుఁ జూచి ♦ యిప్పుడు నగరే?
కావున శోకము విడువుము, భావంబున దూతసేయు ♦ పని కింతేలా? 134

క॥ వరశౌర్య! నీకుమారున, కరయఁగ నాయుష్య మల్ప♦మగుఁ గాకున్నన్
దురమునను దూలచేన,య్యరివీరమదాపహారి ♦ హతుఁ డట్టు లగున్. 135

వ॥ అని యిట్లు మంత్రిచేత బోధితుండై దానవేంద్రుండు పార్శ్వవర్తులగు దనుజులం
గని యద్దూత యిప్పు డున్నవాఁడో చనియెనో తెలియుం డనిన వారందఱు

నసురులకుఁ బరాభవంబుఁ గావించి దూత వోయిన తెఱంగ తనికి విన్నవించిన,

గీ॥ అంత నబ్జజుఁ డోడితే ♦ నసురవరుఁడు, దూత ననిపిన నతఁడు దో♦డ్తోడ నరిగి
పద్మజుఁడు సన్నిధి నుండెడు ♦ కమలభవుని, విబుధులను గాంచి వెసవచ్చి ♦ విన్నవించె.

క॥ శూరుఁడు విని తద్వార్తయు, వారిజగర్భాదిదివిజ ♦ వర్గము నెల్లన్
సారెకు మదిఁ గోపించి య,వారణ నన్యాండవిభుని ♦ వనరుహగర్భున్. 138

గీ॥ దూతముఖమున రావించి ♦ ప్రీతిఁ జేసి, పట్టణంబును బూర్వంబు ♦ పగిది మెఱయ
శీఘ్రమ రచింపు మనవుడు ♦ జెలువెసంగ, నతఁడు నిర్మించి మును పటి ♦ యట్లు పురిని.

గీ॥ ఆత్మసన్నిధి కరుదేర ♦ నతిని బనిచె, బహుమతి యొనర్చి శూరుఁడు ♦ భటులతోడ
దండమున కంతవారల ♦ జాండమునకు, నవల నలువ వీడ్కొని వచ్చి ♦ రాక్షణంబ. 140

వ॥ అంత మున్ను బనిచిన దూత లరుదెంచి రత్నసింహాసనారూఢుండైన శూరపద్మునిం
గని కరంబులు మొగిడ్చి వినయాన్వితు లగుచు నిట్లనిరి. 141

గీ॥ దేవ! మీయాజ్ఞనటఁ బోయి ♦ తెలిసి సకల,మిపుడు వచ్చితి మెంతయు ♦ నీశసుతుఁడు
శాంతినగరంబున వసించి ♦ సకలభూత, వితతిద్విసహస్రవాహినుల్ ♦ వేడ్కఁ గొలువ.

వ॥ మఱియు మహాబలు లగు సేనాపతు లష్టోత్తరశతంబును, నమేయపరాక్రము
లగు నవసంఖ్యాధికలక్షవీరవరులును బరిచర్యాపరులై హరిబ్రహ్మాదిసురలు
పరివేష్టించియుండు రమ్మహామహు సన్నిధానంబున, 143

గీ॥ సాహసమెసంగ సంగర ♦ స్థలమునందు, తారకుని ద్రుంచి నీదువ ♦ ర్తనము నరయ
వీరబాహుని నమ్మహా ♦ విభుఁడు బనుప, నతఁడు సనుదెంచి యిచ్చట ♦ కతులవహిమ.

వ॥ నిశ్శంకుం డగుచు బహుపరాక్రమంబున మెరసి లంకాపురాధిపతి యగు వ్యాళీ
ముఖుని కృతాంతపురాభిముఖునిం గావించి యక్షయబలు లగు రాక్షసుల ననే
కులం బొరిఁగొని సుందరంబైన యప్పురంబంతయు నిర్మూలంబు సేసి మేటివీరుం
డగు వజ్రబాహునిం గీటణంగించి భవదీయబలాబలంబు లరసి చయ్యన మరలి
యతని సన్నిధిం జేరి యిచటివృత్తాంతం బంతయు విన్నవించిన, 145

క॥ హరసూనుఁ డిమర్గంబున, హరిముఖ్యసుపర్వగణము ♦ నారసి శూరుం
బరిమార్తు జేపె యనవుడు, నురుతరకౌతూహలంబు ♦ నొందిరి దివిజుల్. 146

—* శూరుఁ డాప్తులతోఁ గుమారస్వామిని జయించువిధ మాలోచించుట *—

వ॥ అని యివ్విధంబున దూతలు పలుకుటయుఁ జెవులకు ములుకు లగుచు,నులికిపడి
శూరపద్ముండు నిజకుమారవర్గంబును సోదరుం డగు సింహవక్త్రుని, సకలసేనాధి
పులను, మంత్రకోవిదులైన మంత్రివరులను, మర్మజ్ఞులను రావించి విచారపరుం
డగుచు వారల కిట్లనియె.

గీ॥ వింటిరే యిప్పు డీవార్త ♦ విధిహరిముఖ,దివిజసందోహములు మహా♦దేవుఁ జేరి
శూరపద్ముండు వేధించు♦సారెమమ్ముఁ, బ్రోవుమనుచును బహుభయం♦బునను వేఁడ.

వ॥ అప్పరమేశ్వరుండు ప్రసన్నుండై నిలింపులవచనంబు లాలించి కుమారుం గాంచి సేనాసమేతంబుగా నబ్బాలునిం బంచిన నతండు చనుదెంచి శాంతినగరంబునకు హరిబ్రహ్మాదిదేవగణసహితుండై మనతోడ జేపి యుద్ధంబు సేయ నిశ్చయించి సన్నద్ధుండై యున్నవాఁ డని పల్కి వెండియు నిట్లనియె. 149

క॥ తారకుని దునిమినప్పుడ, వారింపనె వానిమదము ♦ వసుధ శిశువుతో
శూరుఁడు సరిపోరెను నా,సారె నపయశంబుఁ బొందఁ♦జాలక యుంటిన్. 150

వ॥ ఇతఃపరం బెద్ది కార్యంబు చెప్పుం డనిన శూరపద్మునకు మయూరుం డిట్లనియె.

క॥ తారకనిహంత నాతని, నీరీతిన్ బాలుఁ డంచు ♦ నెంచఁగ నగునే?
ఘోరాజి వజ్రబాహువి,దారుని మది దూఁత యనుచు ♦ దలఁపఁగ నగునే. 152

క॥ బలమంతయు హతమయ్యెను, దలఁపవు తన్మహిమ యిదియుఁ♦దగునే నీకుం
బలుమాట లేల నిఁక నీ, తలపెట్లను నట్ల నడుపు ♦ దానవనాథా! 153

వ॥ అని పలికి యతం డూరకుండె; నంత దుర్గుణుం డిట్లనియె. 154

క॥ బాలుని భూతగణంబుల, దూలింపఁగ నీకుఁ దగదు ♦ దోర్బలమొసఁగన్
బాలుని గర్వ మణంపఁగ, నాలమునకు సైన్యపతుల ♦ నంపు మహీశా! 155

వ॥ అనిన యతనివాక్యంబులు విని యనంతరంబ ధర్మకోపుం డిట్లనియె. 156

క॥ దానవనాథ! భవత్సుతు, లైన హిరణ్యాగ్నివక్త్ర ♦ లయ్యిరువురిలో
మానుగ నొక్కఁడ చాలఁడె, వానిం గూల్చుటకు నాహ♦వంబునఁ గడిమిన్.

క॥ బాలుఁడు గావునఁ దారకుఁ, డాలంబున నతనిచేత ♦ నపహతుఁ డయ్యెం
జాలక పరిత్యక్తవిధా,నాలోచనకలన దాన♦వాన్వయతిలకా! 158

వ॥ మఱియుం గ్రౌంచుం డగస్త్యశాపంబువలన విదళితుం డయ్యె; వజ్రబాహుం డును సంగరంబున సాధనంబులైన రథశరాసనాదు లేమరి దూఁతచేత వృథా నిహతుం డయ్యె; దీన నేమి కొఱంత యగు; సత్వరంబుగ హరిబ్రహ్మాదినిఖిలదేవ సైన్యంబులతోడ నబ్బాలు జయించుటకు మనదెసలం గల సేనాధిపతులఁ బను పనగునని పల్కి యూరకుండె; నయ్యవసరంబునఁ గాలజిత్తుఁ డిట్లనియె. 159

క॥ హరివిధిపురందరాదుల, సురలను బూర్వంబు గెలిచి ♦ శుంభత్ప్రీతిం
బరగిన నీ కిపు డేటికి, కరము విచారంబు వైరి♦గంధేభహరీ! 160

వ॥ అక్కుమారునిమీఁద సైన్యంబుల బనుపు మొండె, కాదేని నన్నుఁ బనుపు; మిప్పు డేను గదలి నీమనంబునకు సంతసంబుగ నఖర్వగర్వధూర్వహుం డగు నయ్యర్భకుని దర్పం బణంచెద; నని పలుకు నెడ శౌర్యప్రచండుం డనువాఁ డసురులం గూర్చి యిట్లనియె. 161

క॥ డింభకునొక్కని సంగర, కుంభిని భూతములతోడఁ ♦ గూల్చుటకై చిం
తాంభోధి మునుఁగ నగునే, గంభీరత మాని దనుజ♦గణవరులారా! 162

వ॥ అంత నతండు శూరుం గని యిట్లనియె. 163

గీ॥ అతనికి సహాయమైవచ్చు ♦ నఖిలభూత, గణముల జయించి ♦ యర్భకుఁ గడిమి మెఱయ
నేను దోతెంతు నీదు స♦న్నిధికి నిపుడు, ననుమతి నొసంగు దనుజేంద్ర ♦ యనుచు బలికె.

వ॥ అంత నలుండు చండుండు చెప్పిన విధంబున నిట్లనియె. 165

ఆ॥వె॥ చింతసేయఁ జను నె ♦ యెంతయు నీమది, నర్భకునకు నిట్లు ♦ నసురవర్య!
యిమ్ము నా కనుజ్ఞ ♦ నిల భూతతతిఁ గూల్చి, బాలుఁ బట్టి తెత్తు ♦ ప్రౌఢిమెఱయ.

వ॥ అంత సింహుం డనువాఁ డిట్లనియె. 167

క॥ సురపతికి సహాయుండై, యరుదెంచిన బాలు నతని ♦ యాహవకేళిన్
సురుచిరభుజపరితాప, స్ఫురణం గెల్చుటకు చింతఁ ♦ బొందఁగ నేలా? 168

ఆ॥ కమలజాండములను ♦ గల యోధులందఱు, నతని కొఁగి సహాయు♦లైన నేమి
వానిగర్వమెల్ల ♦ వారించి వెస బాలు, గెలిచివత్తు నాకు ♦ సెలవొసంగు. 169

వ॥ అని యివ్విధంబున మంత్రులు, సేనాధిపతులును, బలికిన విని యనంతరంబ
భానుకోపుం డిట్లనియె. 170

తే॥గీ॥ తారకక్రౌంచు లనుమహో♦దారబలుల, నాజిఁ గూల్చిన యపుడు ♦ నన్నుపవైరి
బాలు దూతను దొడ్డఁగఁ ♦ బ్రస్తుతించె, దేల భవదీయబలముల ♦ నెఱుఁగ కకట.

వ॥ బహూక్తు లింకేటికి కతని జయించుటకు నా కనుజ్ఞ నొసంగు మనిన నంత హిర
ణ్యుం డిట్లనియె. 172

క॥ బాలునిదర్ప మణంపఁగఁ, జాలవిచారమును బొందఁ ♦ జనునే యోహో
యీలాగైనను నగరే, వాలాయము జనులు దైత్య♦వంశాధీశా! 173

తే॥గీ॥ భానుకోపుని బనుపుము ♦ బాలుమీఁద, నతని బంపిన జయమగు ♦ నట్లుగాక
నన్ను బొమ్మన్నఁ బోయి సై♦న్యములతోడ, నర్భకుని నాజి నిర్జించి ♦ యరుగుదెంతు.

వ॥ అంత నగ్నిముఖుండు జనకుం గనుంగొని యిట్లనియె. 175

ఆ॥వె॥ తండ్రి వినుము నీదు ♦ తమ్ముని దారకు, నర్భకుండు దునిమె ♦ నాజిలోన,
వానిదూత వచ్చి ♦ వడి నస్మదనుజుని, వజ్రబాహుఁ దునిమి♦వైచెఁ గడిమి. 176

వ॥ తద్గర్వం బే నెట్లు సహింపఁజాలువాఁడ నా కనుజ్ఞనొసంగుము; త్రికరణంబుగా
సైన్యంబులతోడ వానిం బరిమార్చికాని నీసముఖంబున కెట్లు రానేర్తు? మున్ను
మహాపరాక్రమసంపన్నుండనై బలిసద్మనివాసుల జయించుట నీ వెఱుంగవే!
బ్రహ్మదత్తంబులగు కవచకార్ముకనానాదివ్యాయుధంబులు నాకుం గలవుగావున
నన్ను రణంబునకు నియోగింపనగునని పలికె; నిత్తెఱంగున నందఱుఁ బలుకు నవ

సరంబున సర్వార్థవిదుండగు సింహవక్త్రుండు వారలనందఱనివారించి శూరపద్ము నింజూచి తథ్యంబులైన వాక్యంబుల నిట్లనియె. 177

—* సింహవక్త్రుఁ డన్న యగు శూరపద్మునకు నీతిగరపుట *—

క॥ బాలేందుమౌళితనయుఁ, లీలామహిమాఢ్యు బాహు♦లేయుఁ ద్రిలోకీ
పాలకు దానవనాయక!, బాలుం డని మదినిఁ దలపఁ ♦ బాడియె నీకున్. 178

క॥ వర మొసఁగె నీకు నెవ్వఁడు, పరికింప నతండ కాదె ♦ బాలుం డితఁడున్
బరగు దదాజ్ఞను జగముల, కరయఁగ నుత్పత్తిలయము ♦ లనవరతంబున్. 179

క॥ విశ్వేశుఁ డతఁ డొసంగిన, యైశ్వర్యం బనుభవించి ♦ యతిగర్వమునన్
విశ్వమున నూరకుండక, శశ్వద్బాధలను బెట్టఁ ♦ జనునే సురలన్. 180

వ॥ నీవు బ్రహ్మేంద్రాదుల బాధించుటయు నింద్రతనయు జెఱనిడి విడువకుండుటయు నివిమొదలైన వృత్తాంతంబులు విని భగవంతుండగు శంభుసంభవుండు దేవతల యందు దయాళుండగుచు మనల జయించుటకు శాంతిపురంబునుజేరి యిచటికి నందికేశ్వరగణంబులలోన వరిష్ఠుండైన యమ్మహాబలునిఁ బనిచిన నతనియందు దూతబుద్ధింజేసి తన్మహామహిమం బెఱుఁగవైతి. మఱియు నీ కీశ్వరుం డష్టోత్తరశత మహాయుగంబు లాయు వొసంగె నదియు సన్నిహితంబయ్యె; శక్త్యాయుధం బున మరణం బొసంగె నదిగావున శక్తిధరుండైన సుకుమారుం డగు కుమారుండు సనుదెంచె నిట్టి ఘటనాఘటనసమర్థుండైన మహాదేవుమాయ నీ వెఱుంగవైతి, వేతాదృశబుద్ధి నీ కేల ప్రబలంబయ్యె; వివేక విశారదుండవై. 181

క॥ బందీగృహసంస్థితు లగు, బృందారకవరుల విడిచి ♦ ప్రియమొప్పఁగ న
య్యిందుకళాధరసుతునకు, వందన మొనరించి యతని♦వచనమువలనన్. 182

ఆ॥ వె॥ నిర్భయుండవగుచు ♦ నిఖిలభోగంబులు, బొందియుండు మాత్మ♦పురమునందు
పుత్రమిత్రబంధు♦పోషణపరుఁడవై, దానవేంద్ర! మేరు♦ధైర్యసాంద్ర! 183

వ॥ అని యథార్థంబుగా సింహవక్త్రుం డాడిన వచనంబులు విని దోషాచరేంద్రుండు రోషఘూర్ణితరక్తలోచనుండును, విస్ఫురద్దశనవసనభాసమానుండును, స్రవ త్స్వేదకణసంవృతగాత్రుండును నగుచు నిట్లనియె. 184

క॥ భ్రాంతుఁడ! యేమి వచించెదొ, కింతయు మది లజ్జఁదొలఁగి ♦ యెదుటను నీ వ
త్యంతము భీతముల శిశు, స్వాంతగఁ బొగడెదవు వంది♦విధమున నాతోన్. 185

క॥ బాలునకు మ్రొక్కుమనియెదు, నీలక్షణమెల్లఁ దెలిసె ♦ నిలువుము కుమతీ!
నాలావుబలము దొలఁగెనె, నీలగఘుం డొసఁగు వరము ♦ నీ వెఱుఁగవొకో. 186

క॥ చను మెందైనను నాయెు, ద్దను నీ వుండంగవలదు ♦ తద్దయు ననుఁడున్
విని శూరుని కఠినోక్తుల, ననుజుఁడు సింహాస్యుఁ డప్పు ♦ డతిఖిన్నుండై. 187

క॥ ఏ నెంత హితము సెప్పిన, వీనులఁ జేర్పం డితండు ♦ విపరీతముగా
మానసమునఁ దలపోయును, మానుగఁ దదభీష్టసరణి ♦ మఱి బలుకఁదగున్. 188

వ॥ అని నిశ్చయించి యతం డిట్లనియె. 189

క॥ నానాదివ్యాయుధములు, దానవవర! నాకు గలవు ♦ తథ్యంబుగ నీ
వానతి యిచ్చిన నీక్షణ, మేనుం భూతములతోడ ♦ నీశుకుమారున్. 190

వ॥ ఆహవంబున నిహతుం జేసి భవత్సన్నిధి కరుదెంచెద నని పలికి సింహముఖుండు సమరసంభ్రమవిజృంభితభయంకరాకారుం డయ్యె నంత. 191

క॥ శూరుఁడు విని సింహాస్యస, మీరితముఁ బ్రసన్నబుద్ధి ♦ నెంతయు ముద మిం
పారఁగ ననుజునితోడను, సారతరోక్తులను బలికె ♦ సభలో నెలమిన్. 192

క॥ నాధైర్యము నాబలమును, శోధింపఁ దలంచి యనిన ♦ సూక్తు లివి వృథా
క్రోధముఁ జేసితి నీపై, సాధుతరం బగును నీదు ♦ చరితము జగతిన్. 193

క॥ బాలకునికొఱకు నిస్తరి, నాలంబున కరుగ నీకు ♦ నర్హంబగునే?
బాలుం డిట వచ్చినచో, నాలాగున నె నిన్నుఁ బిలుతు ♦ నతని జయింపన్. 194

వ॥ కావున నిప్పుడు గృహంబున కరుగు మని తమ్ముని వీడ్కొలిపి యచ్చటనుండు నందఱినిఁ బనిచి శూరపద్ముం డంతఃపురంబునకుం జనియె; నంత నారాత్రి చనిన మఱునాఁడు. 195

—* కుమారస్వామి శూరునిజయింప జైత్రయాత్రకు వెడలుట *—

మ॥ చెలువుల్ మీఱ నుమాకుమారుఁడు మణీ♦సింహాసనాసీనుఁడై
జలజాతోద్భవమాధవాదిదివిష♦త్సంఘంబు సేవింపఁగా
నలర న్వీరగణంబుమ్రోల నపసం♦ఖ్యాధిక్యలక్ష్మోన్నతిం
గొలువై వేడుక వీరబాహుసమరో♦గ్రుం గాంచి భవ్యంబుగన్. 196

ఆ॥ వె॥ రథముఁ దెమ్ము వేగ♦రణమున కరుగఁగ, వలయు ననుఁడు స్వామి♦వచనమపుడు
వేడ్కనాలకించి♦వీరబాహుఁడు సెప్పెఁ, బవనుతోడ నతఁడు♦పటిమ మెఱయ. 197

వ॥ సత్వరంబుగఁ జని నానారత్నవిచిత్రితం బగు రథం బాయత్తంబుఁ జేసి తెచ్చిన సన్నిధికిఁ జని వీరబాహుండు విజ్ఞాపనం బొనర్పఁ గుమారుండు సింహాసనంబు డిగ్గి రథంబు నధిరోహించె నంత. 198

క॥ కమలాసనకమలేశ, ప్రముఖామరసంఘమెల్ల ♦ భాసుర లీలం
దమతమవాహనములపైఁ, గ్రమమొప్పఁగ నెక్కి రంబి♦కాసుతునాజ్ఞన్. 199

క॥ గరుడారూఢుం డయ్యెను, హరి పద్మజుఁ డంచ నెక్కె ♦ నమరేంద్రుండున్
గరమలర విమానంబును, నరదంబులపైఁ జెలంగి ♦ రల సైన్యపతుల్. 200

వ॥ ఇట్లు సమరసన్నాహసముత్సాహభరితులై వాహినీద్విసహస్రంబు లగు భూతగణం

బులతోడ, ప్రళయార్ణవకల్లోలమాలికాఘోషంబుల ననుకరింపుచు, బృందారక దుందుభులును, కర్కశకాహళికాపటహడిండిమాదిఘోషంబులు మొరయ, సురలు విరులవర్షంబులు గురియఁ బిట్టగ నట్టహాసంబులు సెలంగ నభంగవిక్రమంబులఁ బారావారతీరంబుఁ జేరిరి. 201

ఆ॥వె॥ అపుడు బహుళశతాంగ♦హయసింధురపదాతి, చరణధుతపరాగ♦చయముచేత
పంకిలత్వమొంది ♦ పాథోధి దాటంగ, నలవియయ్యె నిఖిల♦బలములకును.

వ॥ ఇట్లు షణ్ముఖుండు సేనలతోడ నంభోనిధి దాటి పురియుత్తరద్వారపరిసరంబున విడిసె; నప్పుడు, 203

క॥ హరివిధులు శంభునందను, చరణంబుల కెరగి యనిరి ♦ జగదీశ! మహా
కరుణామతి! విను దానవు, పురము నిపుడు నీవు చేరఁబోల దనీశా! 204

గీ॥ ఇచట మీరున్నచో నిది♦యెంగి వాఁడు, పోరికరుదెంచునప్పుడు ♦ శూరపద్మ
గర్వ మణగింపు మనవుడు♦క్రౌంచభేది, హరివిధులుసేయు ప్రార్థన ♦ మాలకించి.

వ॥ ఈక్షణంబ విశ్వకర్మను రావించి యొకపురంబు నిర్మింపు మనవుడు నతఁడు నానారత్నగోపురప్రాకారమంటపపరిశోభితంబును వివిధ, విచిత్రగృహాలంకృత రాజవీథీ మనోహరంబును, సకలవిభవాభిరామంబును, హేమనిర్మితం బగుట హేమాఖ్యంబును నగు నగరంబు నిర్మించి విజ్ఞాపనంబు గావించిన కుమారుఁడు దానిం గనుంగొని సంతోషించి రథంబు డిగ్గి యందొక్కదివ్యభవనంబునఁ బ్రవేశించె; నంత హరిబ్రహ్మాదులును నఖిలసేనాపతులును బ్రత్యేకంబ యథార్హస్థానంబుల నివసించిరి. 206

ఆ॥వె॥ శివకుమారుఁ గొలుచు ♦ సేనాపతులపేరు, లేర్పరింతుఁ జెవుల ♦ కింపుగాను
వినుఁడు శౌనకాది♦విబుధపుంగవులార!, సావధానచిత్తు ♦ లగుచు నిపుడు. 207

వ॥ అని సూతుం డిట్లనియె; నమ్మహావీరులు శుభ్రుండును, మేఘమాలియు, శ్వేతశీర్షకరుండును, కపాలియు, అప్రసిద్ధుండును, చిత్రాంగుండును, జ్వలత్తాలువు, వజ్రభీముండును, ఉగ్రుండును, పిప్పలుండును, ఉగ్రోభుండును, నందిసేనుండును, బ్రహ్మాజుండును, బ్రహ్మసేనుండును, పద్మకుండును, కరాళుండును, దండుండును, పత్త్రకుండును, పవిపనేమియు, హుతవహుండును, పుష్పదంతుండును, రుద్రాకారుండును, హరుండును, మతిజిత్తును, కేతుమాలియు, వక్రుండును, బ్రహ్మకేశుండును, నదీపతియు, కళింగుండును, ఘోరుండును, అచ్యుతుండును అచలుండును, శాతుండును, చిత్రసేనుండును, భూరియు, శీలకుండును, మాజయుండును, మానవుండును, సింహుండును, ఉత్తరసింహుండును, ఉపతిష్ఠుండును జయుండును, శౌచుండును, మత్తకుండును, మతంగుండును, చండియు, మహాబలుండును, శ్వేతుండును, నీలవక్త్రుండును, సుబాహుండును, అందాభరణసఖుం

ఘుడును, కాళపాదుండును, పింగళుండును, సమాయుండును, మాధుండును, నికుం భుండును, కుంభశకుండును, పాలకుండును, విశిఖుండును, శతతాలువును, హాయగ్రీవుండును, అయుతాక్షుండును, సహస్రబాహుండును, అనంతుండును, వాముండును, మంగళకేశుండును, సోముండును, వజ్రమాలియు, చండుండును, అజముఖుండును, శరభుండును, క్రిందుండును, ఆఢకుండును, కబంధుండును, మేఘుండును, విజయుండును, విద్రుముండును, శాలికుండును, దండుండును, వ్యాఘ్రుండును, కాలపాశుండును, నిష్ఠురుండును, దశముఖుండును, కుముదుం డును, భానుండును, ధనంజయుండును, వృషభరూపకుండును, శుచిముఖుండును అనలకేశుండును, సువక్త్రుండును, మత్తుండును, ఉన్మత్తుండును, నందియు, మనోభ వుండును, వాయువేగుండును, సహస్రభాక్షుండును, భానుకంపుండును, పతం గుండును, శుద్ధుండును, అనీకుండును, అసితుండును, సునాదుండును, సుమాలియు, మాలియు, అత్రియు, అసురకాలుండును, హరికేశుండును, జ్వాలాకేశుండును, వీరంద అష్టోత్తరశతసంఖ్యం బరఁగుదురు. 208

ఉ॥ అంత మురారిముఖ్యదివి♦జాళి నవాధికలక్షవీరు ల
త్యంతము షణ్మహాస్సలును ♦ దండ భజింప నుతుల్ ఘటింపుచున్
వింతఁ జెలంగు భాసురన♦వీనమణీమయ భద్రపీఠిపై
సంతసమొప్పనుండె గిరి♦జాప్రియసూనుఁడు వైభవోన్నతిన్. 209

ఉ॥ నారదమౌని యంత కద♦నప్రియుఁ డాటను వేగ వచ్చి యా
శూరునిఁ గాంచి నీగురువు ♦ శుక్రుఁడు మత్సఖుఁ డెన్నఁ గాన నీ
కారయ సేమముం గలుగ ♦ నా హితమం బగు నొంమమాట నీ
తో రహిఁ దెల్పవచ్చితిని ♦ దోయధిదాటి పరాక్రమోన్నతిన్. 210

తే॥గీ॥ శంభుసూనుఁడు నీతోడ♦సమరమునకు, వచ్చె నతనికి భయపడ♦వలదుమదిని
సంగరమొనర్పనీకును♦జయముఁగలుఁగఁ, దపమొనర్చెదనని వేల్పు♦తపసిచనియె.

క॥ శూరుఁడు తదీయవచనము, సారెకు విని యలిగి నాకు ♦ సమరమొనర్పన్
భారంబౌ యని చెంతను, ఘోరాఘోరులనుజూచి ♦ గొబ్బున మీరల్. 212

చ॥ జలనిధిఁ దోడితెం డనినఁ ♦ జయ్యన వారలుఁ బోయి వాని ను
జ్జ్వలగతిఁ దోడితేర నట ♦ వారిధిఁ గన్గొని శూరుఁ డిట్లనుం
దలఁపక యస్మదాజ్ఞ సు♦పథంబున నర్భకుభూతసైన్య మి
వ్వల విడువంగ వచ్చునె ల♦వంబు వివేకము లేక నీమదిన్. 213

వ॥ అనిన సముద్రుండు శూరపద్మున కిట్లనియె. 214

క॥ ఏలా నాపైఁగోపము, బాలుని వారించునట్టి ♦ పటిమయు నాకుం
జాలునె? యతఁడు సురేశుఁడు, తూలితి తద్భూతసైన్య♦ధుతధూళితతిన్. 215

గీ॥ అనుడు వనరాశివచనంబు ♦ లాలకించి, యరిగె షణ్ముఖుమీఁదన♦య్యసురమాలి
యింతలో దూత లక్షలవృ♦త్తాంత మరసి, వేగఁజనుదెంచి పలికిరి♦వివరముగను.

మ॥ దనుజాధీశ్వర! బాహుశౌర్య మిగవొం♦దన్ ఖ్యాతిఁ జూపట్టె యం
బునిధిం దాటి సమస్తభూతతతితోఁ ♦ బొల్పొంద నక్కాఁ్రించభే
దనుఁ డేతెంచి పురాంతికంబున విచి♦త్రిం బొప్ప భాస్వత్పురం
బును నిర్మించి హరీంద్రముఖ్యదివిష♦త్పుంజంబు సేవింపఁగన్. 217

—* శూరుఁడు భానుకోపు సని దనుపుట *—

వ॥ సకలవిభవంబులం జెలంగుచు నీతోడ యుద్ధంబునకు సన్నద్ధుండై యున్నవాఁ డని విన్నవించిన వారలవచనంబులువిని వీరబాహునివలన దగ్ధంబైనలంకాపురంబును గనుంగొనుచు, శూరపద్ముండు రోషభీషణాకారుండై కనుగవ కెంపుసొంపార నాక్షణంబ నిజాత్మజుండగు భానుకోపుఁదోడితెమ్మని దూతలం బనిచిన వారలరిగి తద్వృత్తాంతంబు నతని కెఱింగించిన, 218

క॥ బలము లసంఖ్యంబులు తను,గొలువఁగ రథమెక్కి భాను ♦ కోపుఁడు శౌర్యో
జ్జ్వలతన్ శీఘ్రమ శూరుని,నిలయద్వారంబునందు ♦ నిలిపి రథంబున్. 219

వ॥ ఆస్థానంబున రత్నసింహాసనాసీనుండైన శూరపద్మునిసన్నిధికిం జని నమస్కారంబుఁ జేసి చెంత నిలిచిన, 220

క॥ శూరుండు సుతునిఁ గనుఁగొని, వారక వృత్తాంతమెల్ల ♦ వచియింప మహో
దారుఁ డలభానుకోపుఁడు, సారెకునాలించి దనుజ♦చంద్రున కనియెన్. 221

క॥ జనక! చని యాక్షణంబున, ఘనసాహసమొప్ప భూత ♦ గణముల నెల్లం
దునుమాడి కలనఁ బాలునిఁ,గొనితెత్తు న్నీదుకడకుఁ ♦ గుతుకం బెసఁగన్. 222

వ॥ అనిన తనూజునివచనంబులు విని సంతుష్టహృదయుండై రణంబున కతనిం బనిపె నని సూతుండుసెప్పిన విని శౌనకాదులు కుతూహలభరితులై తరువాతివృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయు, 223

ఉ॥ రాజితశైలధామ! సుర♦రాజముఖామరపూజ్య! యామినీ
రాజకళావతంస! నగ♦రాజసుతాపరిరంభలోల! గో
రాజవరాధిరూఢ! ఫణి♦రాజసముజ్జ్వలభూష! వాహినీ
రాజలసన్నిషంగ! రతి♦రాజవిభంజన! భక్తరంజనా! 224

క॥ సవనాశనహృత్తామర, సవనాంచచ్చంచరీక ♦ సర్వేశ హరా
సవనాశనకృతినాట్యా, త్సవనానాదురితదూర♦సకలాధారా! 225

పంచ॥ ధరాధరాత్మజామనోజ్ఞ ♦ ధామ! ధామసన్నిభా!
సురాసురార్చితాంఘ్రిపద్మ♦సోమ! సోమశేఖరా!

చరాచరాదివిశ్వపోషణసార ! సారసారస్త్రసం
హారా! హారా త్రియీశిఖావిహార హారనిర్మలా! 226

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్త్ర సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపగోత్ర కోడూరి
యెల్లనామార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మాంబికాతనయ
వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచల
కవిప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత
శంకరసంహితయందలి శివరహస్య
ఖండంబున నీరమహేంద్ర
కాండంబునందు సర్వంబు
నేకాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీశివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము

## యుద్ధకాండము.

### ప్రథమాశ్వాసము.



గౌరీప్రియ! భక్తా
ళీ గోద్రుమ ! భైరకూరి ♦ లింగాత్మజము
శ్వాగలునృపవాంఛాప్రద,
శ్రీగళ! కరుణాంతరంగ! ♦ శ్రీశివలింగా! 1

వ॥ అవధరింపుము రోమహర్షణతనయుం డగు సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

—* భానుకోపుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట *—

సీ॥ భానుకోపుఁడు తండ్రి♦పనుపున శీఘ్రంబ, యాత్మగృహంబున ♦ కరుగుదెంచి
వజ్రనిష్ఠురమైన ♦ వర్మంబు మైఁ దాల్చి, మణికిరీటముఁ బెట్టి ♦ మస్తకమున
వివిధభూషణములు ♦ వేడుక ధరియించి, వీరపట్టంబును ♦ వెలయఁ గట్టి
మండలాగ్రము భుజా♦మండలిఁ గీలించి, చాపతూణీరముల్ ♦ సంగ్రహించి
యంగుళీత్రాణ మలర గో♦ధాజినంబు, చెలువుమీరంగ మణిబంధ ♦ సీమఁ గట్టి
మోహనాస్త్రంబులద్భుతం♦బులుగ మెరయ, భీకరాకారుఁ డగుచును♦ పెంపుమీర.

వ॥ మఱియుఁ దప్తజాంబూనదభాసమాన పీతాంబరధరుండును, ద్రోణప్రసూన మాలికాప్రభావిభాసురకంఠుండును, కటితటీఘటితకరవాలుండును, ననేకశస్త్రాస్త్రభరితరథకోటిసమన్వితుండును నగుచు దానవేంద్రసూనుండు త్రింశత్సహస్రతురంగసంయుతంబును, మహోన్నతంబును నగు రథం బధిరోహించి యిరుగెలంకుల జామరధృతపాణులును, తాంబూలపేటికాధారులును, కరవాలఖేటకధరులును స్వాదూదకపరిపూరితభృంగారుధరకింకరులును, కశాసూచికాన్యస్తహస్తులును పరివేష్టించి కొలువ నిట్లు సూరాత్మజుండు పురంబు వెడలె; నలని

వెంట విజయుండును, దుర్జయుండును, నలుండును, సెమ్యుండును, మాయుం
డును, ముసలియు, గంటకుండును, ఖరమూర్ధులును, దశముఖుండును, ముసలా
భుండును, మహాబలియుఁ, బిచండుండును, జాడుండును, భీమముఖుండును,
మహిషుండును, సుగ్రిబాహుండును, విష్ణుసేనుండును, విజయసేనుండును, నసుర
సేనుండును, సోమకుండును, మధూచ్ఛిష్టుండును, శశిభిత్తుండును, శితియును,
శూన్యకేతుండును, సూచీవస్త్రుండును, విమోహుండును నను పేరులంగల
సేనాధిపతులును, నియుతసంఖ్యాకవాహినులును నన్నియ రథగజాశ్వంబు
లును, శీఘ్రింబ నిర్గమించునపుడు. 4

సీ॥ పటహాడిండిమభేరి ♦ చటులనిర్ఘోషముల్, తురగహేషారవ ♦ స్ఫురణములును
గంధేభసందోహ ♦ ఘనబృంహితంబులు, రథచక్రనిష్ఠురా♦రావములును
గజహయకంధరా ♦ ఘంటానినాదముల్, ఘనతరసైనికా ♦ క్రందనములు
సంవర్తసమయాబ్ధి ♦ జనితఘోషములట్లు, భూనభోంతరముల ♦ భోరుకొనియె
సైన్యపదధూతబహురజ♦స్సంఘమెల్ల, నబ్జబాంధవమండల ♦ మూపరించె
వందిమాగధసంస్తుతి♦ధ్వనులు మించె, వాహినీభారమునను సు♦ర్వర చలించె. 5

వ॥ ఆసమయంబున. 6

క॥ ఊర్జితబాహుపరాక్రమ, నిర్జితభానుఁడగు దైత్యు♦నిర్గమనంబుఁ
నిర్జరమౌని యెఱింగి గు,ణార్జవనిధి గుహునికడకు ♦ నరుదెంచె వెసన్. 7

క॥ చనుదెంచి శైలకన్యా,తనుసంభవుచరణములకుఁ ♦ దద్దయు నతుఁడై
వినుతి నొనర్చుచు నిట్లను, ఘనతర సంగ్రామకౌతు ♦ కంబు దలిర్పన్. 8

గీ॥ స్వామి! నావిన్నపమువిన♦నలయునిపుడు, కరుణతోడనుయుష్మదా♦గమనమెఱిగి
శూరపద్ముండుదనసుతుఁ♦బోరికనిచె, బాల్యజితభాస్కరాటోపు♦భానుకోపు.

గీ॥ సైన్యములతోడఁ జనుదెంచె♦సత్వరముగ, కదనభూస్థలి సమ్మోహ♦కారకుండు
పటుపరాక్రమధుర్యుండు భానుకోపు, డతఁడుసామాన్యుడనియెంచ♦నగు నెమదిని.

వ॥ పూర్వకాలంబున హరి, బ్రహ్మ, యమ, వరుణుల గదనంబున మదం బణంచి
బ్రహ్మవిష్ణుల బ్రహ్మాస్త్రచక్రంబులు దక్కఁ బ్రచేతసుపాశంబును, దండ
ధరు దండంబును, బలాత్కారంబునఁ గొనియె. అస్సురాత్ము వధించుటకు నీ
వసమర్థుండ వగుదు వనిన నారదువచనంబులు విని మహామహుండైనగుహుండు
మందస్మితవదనారవిందుండై యిట్లనియె. 11

క॥ శరభములోడ మృగేంద్రము, కరికేసరితోడ, జంబు♦కము బెబ్బులితోఁ
గర మెదిరించిన చాడ్పున, సురమున నాతోడ వీఁడు ♦ దొడరుట యెల్లన్. 12

క॥ అని పలికి చెంగట మహా,ఘనబలుఁడగు వీరబాహుఁ ♦ గని యిట్లనియెన్
జని వేగ నీవు దుర్మదు, మనుజాశను పోరిలోన ♦ మద ముడుపనగున్. 13

వ॥ మఱియు విను మష్టాధికలక్షవీరులును, సహస్రవాహినులగు బలంబులతోడ నద్దురాత్మని పురంబు నిరోధించి, సాలంబు నిర్మూలంబుసేసి, తత్సైన్యంబుల నుక్కణంగించి మహోజిత్వరుండవై సత్వరంబున మత్సముఖంబున కరుదేరవలయు; ననవుడు విని వీరబాహుండు మహాప్రసాదంబని యతని యనుజ్ఞఁ బడసి, 14

—* వీరబాహుండు యుద్ధమునకు వెడలుట *—

సీ॥ వీరలక్షణము లు ♦ ద్వేలమై కనుపట్ట, రత్నకోటీరంబు ♦ రాజిలంగ
కంఠంబునందు ము♦క్తాహారము లెసంగ, శ్రవణకుండలదీప్తి ♦ రహిఁ దలిర్ప
కాంచనసూత్రంబు ♦ కటితటి మెరయంగఁ,గంకణాంగదములు ♦ గరిమదనర
పద్మరాగప్రభా ♦ భాసమానోర్మిక, లంగుళీదళముల ♦ రంగుమీఱ
దండధరుఁ డోగి దండంబుఁ♦దాల్చినటుల,ఘనభుజామండలంబున♦ గదవెలుఁగఁ
బురహరుండు పినాకంబు ♦ బూనినట్లు, చండకోదండ మలర నుద్దండ పటిమ.

వ॥ మఱియు శరపూరితతూణీరబద్ధపార్శ్వుండును, కరవాలతోమరాద్యాయుధ భాసమానుండును, మేరుమందరకైలాసమహోన్నతరథారూఢుండును, శంఖ కాహళ నిస్సాణపటహరవాన్వితుండును, వీద్యమానలసచ్చామరపరిశోభితుం డును, నభ్రంకషవైజయంతీపతాకాభిరాముండును, పూర్ణిమాసుధాకర విమల ముక్తాతపత్రుండును, వీణావేణుమృదంగధరపరివృతపార్శ్వుండును, వందిమాగధ జేగీయమాన నిజశౌర్యౌదార్యాదిగుణవిచక్షణుండును నగుచు యుద్ధసన్న ద్ధుండై వెడలె, నయ్యవసరంబున మహావీరులగు సేనాధిపతులు రథారూఢులై తమతమ సేనలతోడ నతనివెంబడి చనిరి. మఱియు భూతసంఘంబులు సహస్ర వాహినులతోడఁ జనియె నిట్లు చనునెడ దత్సైన్యపదఘట్టనోద్ధూతపరాగనిచ యంబులు సేనానిసమరాగమనంబు నుడువుటకుఁ బరతెంచుటంబలె బలంబు లావరింపకయమున్న దనుజపురంబుగప్పె నంత. 16

చ॥ అలఘుతరాట్టహాసము లు♦దగ్రతరార్భటు లుగ్రహుంకృతుల్
వెలయఁగ ధావనంబు లతి ♦ వేగముగా నితరేతరంబు వీ
రులు గడుమండలాకృతుల ♦ రూఢిఁజెలంగుచుఁ బోయి కొంద ఱు
జ్జ్వలగతి దైత్యరాట్పురము♦వాకిలిఁ గమ్మిరి దొమ్మి మీఱఁగన్. 17

ఆ॥ వారికన్న మున్ను ♦ వడి భానుకోపుండు, శంభుసుతుని శూరు♦సముఖమునకుఁ
బట్టి తెత్తుననుచు ♦ బ్రతినఁ బన్ని పురంబు వెడలి చనియె సైన్య♦వితతితోడ.

వ॥ అంత నయ్యసురసైన్యంబులు భూతసైన్యంబులంగనియు, పరకుఁగొనక కిలకి లార్భటుల నొనర్చిన విని భూతగణంబులును సింహనాదంబులు సెలంగ దైత్య సంఘంబులపైఁ గదిసిన. 19

—* అసురసైన్య భూత సైన్యముల యుద్ధము *—

గీ॥ దనుజవీరు లపుడు ♦ దారుణాకారులై, యధికరోషవశత ♦ నంపగములు
నిష్ఠురంబులైన ♦ నిఖిలాయుధంబులు, బరపి రపుడు భూత♦బలముమీఁద. 20

వ॥ ఇట్లు పరపిన వార లనూనాయుధఘాతంబుల భూతంబులకరంబులు ఖండితంబు
లయ్యెఁ బదంబులుఁ దెగియెఁ గాయంబులు విచ్ఛిన్నంబులయ్యె నట్లు బహు
విధంబుల బడలువడి మూర్ఛఁజెంది రంత, 21

క॥ శర మలిగి మగుడి భూతము, లురువడి నార్చుచును దైత్యు ♦ నొగి దైత్యునిచే,
హరిచే హరి, ద్విరదముచే, ద్విరదము, రథమున రథంబు ♦ వెసఁ దునుమాడెన్.

వ॥ ఇవ్విధంబున భూతగణంబులచే నసురసైన్యంబులు హతంబగుటఁ గనుంగొని
భానుకోపుని సేనావిభుండు నలుం డనువాఁడు సత్వరంబుగా భూతసైన్యంబుల
మీఁద రథంబుఁ బరపి కోదండంబునఁ గొనయం బెక్కిడి నిశితశరపరంపరలఁ గురిసె.

గీ॥ తచ్ఛరాహతి భూతజా♦తంబులోనఁ, గొంద ఱుర్విని మూర్ఛను ♦ జెంది పడిరి
కొంద ఱరిగిరి వేగ ది♦క్కోణములకు, నదియుఁ గన్గొని పటురోష♦ మొదవ మదిని.

శా॥ సింహాస్యుం డను భూతనాథుఁడు సము♦జ్జృంభత్ప్రతాపంబునన్
సింహంబట్లు చెలంగుచున్ బటుగదన్ ♦ జేకొని రథ్యంబులన్
సంహారం బొనరించె దండధరు నో♦జన్ బోరి యద్దైత్యుఁడున్
సంహారోగ్రుఁడువోలె గన్గవ శిఖి♦జ్వాలావళుల్ గ్రక్కుచున్. 25

క॥ హీనిరణంబున నెదిరి య, నూనపరాక్రమము మీర ♦ నురుమాడి జయం
బేనుం గొనియెద నట్టుల, గానియెడలఁ గేలఁ గార్ముకముఁ బట్టుదునే? 26

వ॥ అని ప్రతినఁ బన్ని శరములు వర్షించిన, 27

క॥ అంతట సింహముఖుండు దు, రంతితదీయాస్త్రసమితి ♦ కభిముఖుఁడై య
త్యంత మతనియరదము దు, ర్దాంతపటిమ నెక్కి దునిమెఁ ♦ దచ్చాపంబున్. 28

గీ॥ దనుజుఁ డార్చుచు మగుడి ను♦ద్దండలీల, వజ్రనిష్ఠురమగు సింహ♦వదను మేను
దండతాడిత మొనరించె ♦ ఖండనమునఁ, బ్రకటతరసాహసోద్దండ♦పటిమ దనర.

వ॥ అంత సింహముఖుం డలిగి యన్నలునివక్షస్స్థలం బతినిష్ఠురంబులగు ముష్టిప్రహా
రంబుల నొప్పించి పదంబుల నవలీలఁ గేలంగొని జిఱజిఱఁద్రిప్పి నేలంజదిపి
నూరువ్రయ్యలఁ జేసె నయ్యవసరంబున. 30

—* సింహాస్య చండుల యుద్ధము *—

క॥ చండుఁ డరుదెంచి కురిసెను, కాండసహస్రములు సింహు♦కాయమునను సిం
హుండును మృతుఁడై యన్నలు, దండముఁగొని చండునడచె ♦ దర్పమునంగన్.

వ॥ అంతఁ జండుండును దండధరుండునుంబోలె నిజభుజాదండంబున దండంబుఁ ద్రిప్పి సింహాస్యు నడచె; నిట్లన్యోన్యదండతాడితు లగుచు నిర్వురు మూర్ఛాక్రాంతులై ధరాస్థలిం బడుటంగనుంగొని రోషభీషణులగుచు రౌద్రంబున నీలమాయు లిర్వురు దలపడి రయ్యవసరంబున. 32

క॥ నీలుం డుద్ధతి దండముఁ, గేలంగొని మాయుమీఁదఁ ♦ గినుకను వైవన్
దూలుచు బలంబు మాయుఁడు, నేలంబడె మూర్ఛనొంది ♦ నిమిషార్థమునన్. 33

వ॥ అంత మూర్ఛఁ దెలిసి కోపోద్దీపితుండై మాయుండు మహాబలుండగు నీలు మీఁద శూలంబు వైచిన నతండు గొంతతడవు మూర్ఛాక్రాంతుఁడై యంతలోన దెప్పిఱిల్లి కోపోద్దీపితుండై యారాక్షసువక్షస్స్థలంబు కరతలంబులం బెట్టడచి కట్టలుక వానింబట్టి పెడకేలు గట్టి నిష్ఠురదంతంబుల నననిగళంబుఁగఱచి తద్రుధిరంబులఁ గ్రోలి విగతజీవుని జేసె నంత. 34

క॥ పూర్వము మూర్ఛాగతులై, యుర్విఁబడిన చండ సింహు ♦ లురుతరసంజ్ఞన్
బర్వ ధృతదండు లగుచున్, గర్వోన్నతి మెరయ మగుడఁ ♦ గదనోత్సుకులై. 35

వ॥ ఇట్లొండొరు లుద్దండత దండంబులుఁ ద్రిప్పుచుఁ బాదంబుఁ జూపిశిరంబును, శిరంబుఁజూపిపాదంబును, నొప్పించుచు, దప్పింపుచుఁ, జవంబు, బలంబు, నేర్పు, నోర్పు, ధైర్యంబు, శౌర్యంబు మెఱయఁ బోరుచు, 36

గీ॥ భూతగణపతిసింహుండు ♦ భూరిపటిమ, దండ మొగిఁద్రిప్పి వేసె ను ♦ ద్దండలీల,
తోడనెతదీయదండంబుఁ ♦ దునిమివైచె, దనుజుఁడునిరాయుధుండయ్యె ♦ ధైర్యమహిమ.

వ॥ మఱియు ధృతదండుండగుచు నతనితోడ నిజభుజాబలంబుఁ జూపుచు. 38

క॥ కరమునను సారెసారెకు, నురువడి మర్దించెఁ జండుఁ ♦ డొగి సింహాస్యున్
గరమలుక నతఁడు చండుని, కరము విఖండితముఁ జేసె ♦ ఘనదండమునన్. 39

వ॥ ఇట్లు ఖండితంబైన తత్కరంబు భూరుహమునుండి శాఖయుంబోలె భూతలంబునం బడియె; నవ్విధంబునఁ బడిన నిజకరంబుం గొని వేఱొక్కకరంబునఁ జండుండు ప్రచండంబుగసింహనాదం బొనర్చుచు, సింహాస్యువక్షస్స్థలంబునం బ్రయోగించిన నమ్మహామహుండు భయంకరంబున వానిపాదంబునం దన్నె;నది గనుఁగొని వియచ్చరులు హర్షోత్కర్షంబునఁ బొదలుచు నిట్లనిరి. 40

గీ॥ సింహ! దానవకుంజర ♦ శ్రేణిలోన, బహుబలాధికుఁ డితఁడు దో ♦ ర్బల మెసంగ
నిద్దురాత్ముని బరిమార్పు ♦ మీక్షణంబ, యనెడు దివిజులవాక్యంబు ♦ లాలకించి.

వ॥ అతులభుజారంభుండగు సింహుండు మాతంగంబుపై కురుకు సింగంబు తెఱంగునఁ, బన్నగంబు నొడయు వైనతేయువిధంబున, వృషభంబుపై లంఘించు శార్దూ

లంబు చాద్పున, నద్దనుజుపైఁ గవిసి వానికపోలంబుఁ బగుల నడచి విగతప్రాణుం జేసి నయ్యెడ. 42

తే॥ విగతచైతన్యుఁడైనట్టి ♦ విమతుప్రాణ, పవనములుఁగొనిపోవఁగా♦భయము చెంది
యమభటులు సింహునడిగి త♦దాజ్ఞవడసి, యంతఁజేర్చిరి నిజనగ♦రాంతికంబు. 43

వ॥ ఇట్లు చండుండు దండధరాలయంబునకుం జనుటనెఱింగి యజముఖుం డను దానవుండు వికృతముఖుం డగుచు నెదిర్చి సింహాస్యుని నిలు నిలు మని గర్జింపుచుఁ దారసిల్లిన వానిం గని మహాబలుండగు మధుండను భూతసేనాపతి, యెదిరించె, నాసమయంబున, 44

—* మధ్వజముఖులయుద్ధము *—

క॥ అజముఖుఁడు వానిమీఁదను, నిజభుజశౌర్యంబు మెరయ ♦ నిష్ఠురబాణ
వ్రజముం గురియ మధుఁడు మద,గజమట్టుల దచ్ఛరాళి ♦ గణియింప కొగిఁ. 45

వ॥ నికటస్థితం బగు నొక్కవటంబుఁ బెకలించుకొని ధరాతలం బదరువ సింహనాదం బొనర్చుచు గిరికి నెగురు సింహకిశోరంబు చందంబున నజముఖునిరథంబుపైకి లంఘించిన, 46

గీ॥ అమ్మహాధ్వని విని గుండె♦లవిసి భీతి, దైత్యుఁడయ్యెడఁ దనచేతి♦ ధనువు విడిచి
వేపమానాంగుఁడగుచును♦వికలుఁడయ్యె, వానిఁగన్గొనిమధుఁడొక్క♦వాక్యమనియె.

క॥ నీవొకశూరుఁడవే యో హో, వెరచెద వాజిలోన ♦ నుండకుమింకఁ.
వేవే చను మని పలికి మ,హాటవమటువైచి విడిచె ♦ నతనిరథంబుఁ. 48

వ॥ ఇట్లుల్లసంబులాడి మధుం డజముఖునిరథంబు వోవిడచిన నతఁడు శిబిరంబునకుం జనక శోకాకులుండై, 49

క॥ దురమున గవిసిన పగతుం, బరిమార్పఁగఁజాలనైతి ♦ మద్బాహుబల
స్ఫురణం బేటికి? నీగతి, ధరఁ బ్రదుకుటకంటె మేల్గ♦దా నిధనంబుఁ. 50

వ॥ అని మనంబునం దలపోసి యద్దనుజుండు చలంబు నూలుకొల్పుచు యుద్ధసన్నద్ధుండై సింహనాదంబు సెలంగ ననర్గళంబుగా మార్గణంబులు వర్షింపుచు సత్వరంబుగా నమ్మధుని వెనుఁదగిలిన. 51

క॥ అతఁ డజముఖుఁగని నవ్వుచు, ధృతిమీరఁగఁ దిరిగి భూరితేజుండై యు
ద్ధతి వారించెను దచ్ఛర,వితతి నిరాయుధుఁడునయ్యు ♦ విస్మయలీలఁ. 52

వ॥ మఱియు నవ్విధంబున నయ్యజముఖుం డనేకశరపరంపరలు పుంఖానుపుంఖంబులుగాఁ బరపినఁ గనలి మధుండు మునుపలెఁ దచ్ఛరంబులు వారించి, తద్రథంబు కేలంగొని దనుజసహితంబుగాఁ ద్రిప్పి సముద్రంబునం బడవైచిన, నయ్యె

సుర నడుము నమ్మహీతలంబునంబడియు ధృతిసెడక లేచి రోషంబున మధుని
వక్షస్స్థలంబున ముష్టిఘాతంబుఁ గావించె; నంత, 53

క॥ పరిఘోజ్జ్వల మగు భుజమున, నురుతేజుఁడు మధుఁడు దనుజు నురువడి నడచెన్
సురనాథుఁడు వజ్రిహతి, ధరణీధరముం బోలె భూరితరకోపమునన్. 54

వ॥ మఱియు నయ్యిరువురు భుజశౌర్యంబు లవార్యంబులై మెఱయఁ గేశాకేశియు, బాహాబాహియు, మొదలైనసమరంబులం బోరుచు, మల్లులంబోలె భూతలంబునం బడుచు, లేచుచు, బహుప్రకారంబులఁ దమతమవిక్రమంబులఁ జూపి; రంత. 55

క॥ ఘనబలుఁడు మధుఁడు కపటం, బున ధారుణిఁ బడి నిజాంక మున నిడి దైత్యున్
ఘనమండలపర్యంతము, దనపదమునఁ జిమ్మె నద్భుతంబుఁ దలిర్పన్. 56

వ॥ అజముఖుండు ధరాతలంబునం బడి దిగ్గన లేచి యమ్మహావీరున కభిముఖుండై సత్వరంబుగా రౌద్రోద్రేకంబడరం జనుదెంచి యమ్మహావీరుండగు మధుండు లేచునంతలోన నతనియురంబుఁ గరతలంబున జరచి మాయచేత నదృశ్యుఁ డగుచు వైష్ణవచక్రంబుఁ బ్రయోగించిన. 57

క॥ అదియు నిరాయుధు మధునిం, గదసంబునఁ జెనక నీతి కాదని వేగన్
గదియుచు నేసిన వానిన్, విదళించెన్ దత్కరంబు విస్మయ మొదవన్. 58

వ॥ ఇవ్విధంబున నిజాయుధంబుచేతఁ గరంబుఁ దెగి యమ్మహాబలుండగు నజముఖుండు హతుండయ్యె; నంత, 59

గీ॥ అసురసేనాధినాయకు లంద ఱలుకఁ, బొడమఁ బెల్లార్చి మధునిపై భూతగణము
పైని శరవృష్టిగురిసి రెం తే నిదాఘ,జలదములఁబోలికను మహాశౌర్యమెసఁగ.

వ॥ అయ్యవసరంబున భూతసంఘంబులు భయాకులంబులగుట గనుంగొని మహాయుధుండును, నియుతవీరాగ్రగణ్యుండును, శాత్రవదండకుండును నగుదండకుండనువాఁడు నిశితశరజాలంబు లాభీలంబులుగా నిగుడింపుచు, గోపాలుండు గోవ్రజంబులపోలిక నసురబలంబులఁ బారదోలె; నప్పుడు, 61

ఉ॥ వానినిశాతబాణములు వాడిగ నాట దురంబులోపలన్
దానవవీరులందఱు విదారితపాణులు భిన్నపాదు లెం
తేని విశీర్ణవర్ములును నిర్దళితాంగులు నై మహార్తిచేఁ
బ్రాణములం దొలంగిరి, విపద్దశ గూడునె యెంతవారికిన్? 62

వ॥ మఱియు విగతప్రాణులంబోలె నున్మీలితనయనులై నేలంబడియుండువారును, మహాంభోనిధిస్వనంబులకైవడి నార్తరవం బొనర్చువారును, కర్ణనాశికాచ్ఛేదంబులవలన దుఃఖించువారును, దరిమిఁగొనివచ్చు నరిబలంబులం గని భయాకులచిత్తులగుచుఁ బరుగులెత్తువారును, నొక్కొకయెడ రిపుయోధులు గవిసిన భీతిఁ గుదుచుచుఁ జేయునది లేక యూరకనిశ్చేష్టితులై తెరబొమ్మలతెఱంగున నుండు

వారును నై యెల్లెడల దనుజబలంబులు పరాజయంబు నొందిన, 63

క॥ కనియదియు భానుకోపుఁడు, ఘనకోపముతోడ నవ్వుచు ♦ గఱచి బలురయం
బునఁ గోదండము సజ్యం, బొనరించి దిశల్ జలింప ♦ నుగ్రుం డగుచున్. 64

వ॥ ఆత్మగతంబున మదుపేతుం జేసి యిట్లనుచుఁ దద్వినతంబున, 65

—* భానుకోపుని ప్రథమ యుద్ధము *—

సీ॥ ద్విసహస్రవాహినుల్ ♦ వెగటారి రసురులు, ఛిన్నభిన్నాంగులై ♦ చెలువుదక్కి
పాఱిరి కొందఱు ♦ పరికింప దానవుల్, సాహస్రవాహినీ ♦ సంఖ్య లిపుడు,
నిలిచిరి గావున ♦ నే నిబ్బలముతోడ, సంగరం బొనరించి ♦ జయముఁ గాంతు
జయముఁగాంచకయున్న ♦ జగతి శూరున కేను, తనయుఁడగానని♦తగఁ బ్రతిజ్ఞఁ
జేసి రణభైరవప్రౌఢి ♦ భాసిలంగ, జవనసైంధవ బంధుర ♦ స్యందనంబు
సారథినిదోలుమనుచును♦జటులతరప,టిమనియోగించెఘనపరా♦క్రమముమెరయ.

క॥ ధృతలస్తకముష్టికుఁడై, యతులితగుణరావ మెసఁగ ♦ నస్త్రవితతు లు
న్నతి వర్షించెను భూత,ప్రతతిపయిన్ ఘర్మజలద♦పటలియుఁబోలెన్.

వ॥ అంత భూతసైన్యంబులు జన్యంబున మహాప్రతాపుని భానుకోపునిపైఁ గవిసి,
భూధరంబులును, భూరుహంబులును, మహాశిలలును, అతిఘోరంబులగు నాయు
ధంబులును నొక్క పెట్టునఁ బెట్టిదంబుగ వైచి సింహనాదం బొనర్చిన, నమ్మహా
మహుం డతిసిశితంబులగు నంబకకోటుల నవియన్నియు దూర్ణంబ జూర్ణంబు గా
వించి. 68

తే॥ కుండలీకృతకోదండ♦ కాండుఁ డగుచు, భానుకోపుఁడు మఱియును♦బహుశరంబు
లాజిగురిసెనుశౌర్యవి♦రాజియగుచు, భూతతతిమీఁదఁ బుంఖాను♦పుంఖములుగ.

వ॥ అతిరయంబున నబ్బాణజాలంబు నీహారంబువిధంబున బాణిపాదాద్యవయవం
బుల విదళితంబులుచేసె. 70

తే॥ భుజబలప్రౌఢి భానుకో♦పుండు మఱియు, నట్టహాసం బొనర్చుచు ♦ నంబకముల
సారె వర్షించె నబ్భూత ♦ సమితిమీఁద, నంబువృష్టి నిదాఘమే♦ఘంబుకరణి.71

వ॥ అయ్యవసరంబున భిన్నభిన్నాంగంబై రుధిరంబులు దొఱఁగ భూతసైన్యంబు
దైన్యంబు నొంది పలాయితంబయ్యె నయ్యెడ. 72

ఉ॥ భూతచమూపరాజయము ♦ పొరఁ గనుంగొని భూరికోపసం
జాతవిలోచనారుణిమ ♦ సర్వదిశావళిఁ గప్పునింప వి
ఖ్యాతబలోగ్రుఁ డుగ్రుఁడు భ♦యంకరదండముఁ గేలఁ ద్రిప్పుచున్
భీతిల శాత్రవుల్ నినద♦భీషణుఁడై చనుదెంచె నేర్తుఱన్ 73

వ॥ అనమయంబునఁ దదీయప్రతాపాటోపంబును గనుంగొని దనుజవర్యుం

డవార్యపరాక్రమధుర్యుండై సింహనాదం బొనర్చుచుఁ గోటికోటిసాయకంబు
లతనిశరీరంబునం బఱపె; నంత, 74

క॥ దండంబున నుగ్రుఁడు దత్కాండావళి విదళితంబుఁ ♦ గావించె సము
ద్దండత, వెంటనె దనుజుఁడు, దండముఁగొని యుగ్రుమీఁదఁ ♦ దద్దయు వైచెన్. 75

వ॥ ఉగ్రుండును శౌర్యసముగ్రుండును మహోగ్రుండును నై తదీయదండంబు నిజ
దండంబున విదారితంబుఁ గావించి వెండియుఁ దత్సారథిని తురంగంబుల రథం
బును నేలంగూల్చె; నిట్లు దానవధ్వాంతమార్తాండుండును, శౌర్యసముగ్రుండును
నగు నుగ్రుచేత రథంబు భగ్నంబగుటయు నీడంబోక దానవేంద్రుండు మహో
జ్జ్వలం బగు వేఱొక్కరథం బెక్కి రణోత్సుకుండై, 76

గీ॥ నిశితబాణపరంపర ♦ నించి యతని, చేతిదండంబు దళితంబుఁ ♦ జేసి మఱియు
తీక్ష్ణనారాచచయముఁ ద ♦ ద్దేహమందు, మిగుల నాటించె విక్రమో ♦ న్మేష మలర.

గీ॥ ఉగ్రుఁ డయ్యంబకముల మ ♦ హాగ్రపటిమఁ, గేలవిదళించియటమీఁద ♦ లీల నెదిరి
భానుకోపునిరథముతో ♦ భానుబింబ, మంట వడిఁ జిమ్మె నమ్మయి ♦ నాహవమున. 78

వ॥ అయ్యవసరంబున రథంబుతో నెగసివచ్చు భానుకోపుం గని భానుండు భయ
విహ్వలుం డగుచు, నిజాపరాధం బేమొకో యని చింతాకులస్వాంతుండయినంత
లోన నద్దనుజుండు రథంబు భగ్నంబుగా నేలంబడి లేచి యతిరయంబున, 79

ఆ॥ ఉగ్రునురముఁ బొడిచి ♦ యుగ్రత మెఱయంగ, నంఘ్రియుగముఁ బట్టి ♦ యంబరమున
జవ మెసంగఁ జిమ్మె ♦ సత్యలోకము దాఁక, భానుకోపుఁ డతుల ♦ బాహుపటిమ. 80

వ॥ అంత నయ్యుగ్రుం డూర్ధ్వలోకంబునుండి సుకృతక్షయంబువలన సుకృతియుం
బోలె ధరాతలంబునం బర్వతంబు కరణిఁ బడునంత నబ్భానుకోపుండు బ్రహ్మ
దత్తం బగుశక్తిం బ్రయోగించిన దానిచేత నుగ్రుండు బాధితుండై మూర్ఛిల్లి
పడియె. 81

క॥ ఉగ్రుఁడు భువి పడుటం గని, యుగ్రబలుండైన దండి ♦ యుర్వీధర మ
త్యాగ్రహమునఁ గొని దానవు, పగ్రహమున వేసి యార్చె ♦ విక్రమలీలన్. 82

వ॥ అంత భానుకోపుండు కోపోద్దీపితుండై యఖర్వం బగు నప్పర్వతంబు సహస్ర
సాయకంబుల నూరువ్రయ్యలుగా ఖండించిన, 83

సీ॥ వెండియు దండి ప్ర ♦ చండరోషంబునఁ, జయ్యనఁ జాతవృ ♦ క్షంబు వెఱికి
స్యందనస్థితుఁడైన ♦ సారథి మర్దింపఁ, జనియె వాఁడు కృతాంత ♦ సదనమునకు
భానుకోపుం డంతఁ ♦ బటురోషమునఁ దీవ్ర, శరములు పదివేలు ♦ గురిసె మేఘ
గర్జన లలరంగఁ ♦ గడు దండినుదుటను, దచ్ఛరాహతి వ్రాలె ♦ ధరణి నతఁడు
దత్పతనఁ మాఱిపీక్షించి ♦ తగఁ బినాకి, నెట్టన నెదిర్చి తొడఁదొడల్ ♦ దట్టుకొనుచు
గరములనుబట్టి గమకించి ♦ గదియువేళ, భానుకోపుండు కోపించి ♦ బాహుపటిమ.

వ॥ నిశితవిశిఖసహస్రంబులు పినాకి యురంబునయిం బరపిన నవియు నతని వక్ష
స్థలంబు గాడి సనియె; నంత, 85

గీ॥ వసుధపై వ్రాలె నాతఁడు ♦ వజ్రిచేతఁ, గూలునగమట్లు సయ్యెడ ♦ గుంపుఁ గూడి
భూతగణములు విక్రమ♦స్ఫూర్తిమెఱయ, భూధరంబులు భూజముల్ ♦ బూని వడిని.

చ॥ కురిసిరి భానుకోపుపయి ♦ ఘోరతరంబుగ సింహనాదముల్
శరనిధిఘోషము ల్లడర ♦ సంగరధారుణి నంత దైత్యుఁడు
ద్ధురగతి వానినన్నిటినిఁ ♦ దోడనె భూరిశరాళిఁ ద్రుంచె భీ
కరపటుసాహసస్ఫురణఁ ♦ గన్గొని వేల్పులు బిచ్చలింపఁగన్. 87

వ॥ మఱియు నమ్మహాబలుండు నిశితమార్గణంబుల ననర్గళంబుగాఁ బరపినఁ దచ్ఛరాహ
తులకు నిలువంజాలక భూతగణంబులు పలాయితంబులయ్యె; నదియుం గనుంగొని
సుకుమారాంగులును, సర్వాభరణభూషితులును, సర్వలక్షణసంపన్నులును,
ధనుర్విద్యావిశారదులును నగు నఖండరుద్రదండార్కసిరంజనకపాలకాండలో
చనులాదిగాఁ గల లక్షవీరులు పంక్తిగా రథంబులపై నాలీఢచరణు లగుచు
విజృంభించి కార్ముకంబు లెక్కువెట్టి గుణధ్వనులఁ గావింపుచు నట్టహాసంబు
చెలంగ నొక్కపెట్టున దానవేంద్రుమీఁద శరవర్షంబులు వర్షించి; రప్పు డబ్బా
ణంబుల నతండుఁ గొన్నింటిని నిజశరంబులం దునుమాడెఁ; గొన్ని వాడిములుకు
లయ్యసురగాత్రంబు గాడి సనియె. 88

గీ॥ మఱియునసురుండురోషంబు♦మదిఁజనింప,శరసహస్రకోటులుమహా♦శౌర్యమొప్ప
వారినందఱఁ గుఱిఁ జేసి ♦ వైచె వీర,వరులు నేడుమారులు భుజా♦వైభవమున. 89

వ॥ మఱియు వారికంటె నధికంబులైన శరంబులఁ దొడిగి ప్రయోగించి వానినన్నిఁ
టిని గ్రమ్మఱ నంతికంబుఁ జేర్చి; రంత నవార్యశౌర్యుం డగు నద్దైత్యవర్యుం
డనేకకోటిసంఖ్యాకంబులైన సాయకంబులఁ బఱపి యవ్వీరుల శరాసనంబులఁ
దునియలుఁ గావించె; నంత, 90

క॥ వీరులు చాపాంతరముల, దారుణవిశిఖములఁ గూర్చి ♦ దైత్యునిమీఁదన్
వారకఁ గురిసిరి తచ్ఛర,వారము నారించుకొనుచు ♦ వరశౌర్యమునన్. 91

వ॥ ఇట్లు కురిసి సహస్రశరంబులఁ దద్రథంబును, నన్నిబాణంబుల సారథిని, నూఱు
వాడితూపులఁ దురంగంబుల, ననేకశిలీముఖంబుల ధ్వజంబుల నేలం గలిపిన,

గీ॥ భానుకోపుండు కోపంబు ♦ భాసిలంగ, వేగ వేఱొక్క రథమెక్కి ♦ వివిధమార్గ
ణము లనేకసహస్రముల్ ♦ నాటనేసె, వీరబృందంబుమీఁదను ♦ విజయమెసఁగ.

వ॥ అప్పు డయ్యఖలవీరులును గంటకితాంగులుంబోలె బాణావృతసర్వాంగులునై
విగతోత్సాహులును, విగళద్రుధిరప్రవాహులును నగుచు బఱచి; రంత, 94

గీ॥ వీరసింహుండు వారల ♦ విధ మెఱింగి, సమరకోలాహలస్ఫూర్తి ♦ సంఘటిల్ల
నస్త్రవితతులఁ గురియుచు ♦ నరుగుదెంచె, నతులసంగ్రామభీమసా ♦ హస మెసంగ.
క॥ అతని శిలీముఖవితతుల, నతిరయమునఁ ద్రుంచివైచె ♦ నాహవమందుర్
ధృతిశాలి భానుకోపుఁడు, శతకోటిసహస్రవిశిఖసంఘముల వెసన్. 96
వ॥ మఱియుఁ గోపంబు గదుర నద్దనుజుండు దంభోళిసదృశంబు లగు శరంబులఁ
బఱపిన, 97
గీ॥ వీరసింహుండు విక్రమో ♦ ద్వేలుఁ డగుచు, నవియు నన్నియుఁ దునిమి స ♦ హస్రవిశిఖ
ములను మఱిపూని పటుశౌర్య ♦ కలన మెఱయ, దనుజు నురమున నిగుడించె ♦ దారుణముగ.
వ॥ ఇట్లు భానుకోపుండు తదీయసాయకంబుల జర్జరితాంగుండై రుధిరంబు దొఱుఁగ
నించుకసేపు సొల్లంబోయి చమనంబునఁ గోపంబు దీపింప సకలశత్రుసంహార
కం బగు నారాయణాస్త్రంబు నారిం బోసి సమంత్రకంబుగాఁ బ్రయోగించిన
నదియు ననేకరూపంబుల సకలభువనభయంకరంబై, సముజ్జ్వలప్రభాభాసితదశది
శాంతరాళంబై సముద్రఘోషఘూర్ణితరోదసీకుహరంబై చనుదెంచున వసరంబున,
క॥ దానికిఁ బ్రత్యస్త్రము సం,ధానము గావింప నతఁడు ♦ దలఁపఁగ నది యా
లోనన వక్షస్స్థలి నెం,తేని వడిం దాఁకి యతని ♦ నేలం గూల్చెన్. 100
వ॥ ఇట్లు వీరసింహుండుఁ గూలుటం గని వీరమార్తాండుండు క్రోధవిహ్వలుం డగుచు
గుణధ్వనిం జేసి యెదుర్కొనిన నతనిం గని దనుజేంద్రుండు ప్రచండకాండంబుల
నిగుడించి తత్కోదండంబు ఖండించి నిటలతటంబున శరపటలంబు నించిన
నతండు వేఱొండు చాపంబుఁ గొని సజ్యంబుసేయునంతలో నసురుం డనే
కాస్త్రంబులఁ దత్కార్ముకరథరథ్యంబుల ఖండించి నేలం గూల్చి మఱియుం బెడి
దంపుటంపము లేకనూర్లు గాడనేసి యార్చి పేర్చిన, 101
మ॥ అతిరోషంబున భీషణధ్వనులతో ♦ నవ్వీరమార్తాండుఁ డు
ద్ధతిచే నాత్మరథంబునుండి వెస న ♦ ద్దైత్యేంద్రువక్షంబుపై
ధృతి లంఘించి తదీయకార్ముకము నెం ♦ తేఁ ద్రుంచి వైచెన్ రణ
క్షితి దూరంబుగ ఘోరనిస్తులసము ♦ జ్జృంభత్ప్రతాపోన్నతిన్. 102
వ॥ అప్పు డప్పులలాశివర్యుండు ధైర్యంబు సెడక యమ్మోత్కర్షంబునఁ గటికిలితం
బగు కరవాలంబుఁ బెఱికి వీరమార్తాండు నురంబు రుధిరంబు దొఱుఁగఁ బొడిచిన
వానికవచంబు విదళితం బయ్యె. 103
గీ॥ అపుడు వీరమార్తాండుఁ డు ♦ దగ్రవృత్తిఁ, గేలదండంబుఁ గీలించి ♦ కినుక మెఱయ
రక్కసునురంబు నేయుదు ♦ ర్వారలీల దానఁ, దుమురయ్యెఁ గవచంబు ♦ దైత్యునకును.
వ॥ అంత నద్దానవుం డాగసి మఱియుఁ గోపంబు గదుర గరవాలంబునఁ దత్కాలంబు
నేసిన నవ్వీరమార్తాండుండు నేలం గూలె; నదియుం గన్గొని గోమయూ[illegible]ఁడు

దగుచు వీరరాక్షసుం డతిరయంబున జనుదెంచి యద్దనుజుపై సునిశితాస్త్రంబు లనేకంబులు నిగుడించిన, 105

క॥ దానవుఁ డయ్యస్త్రంబు ల,నూనపౌ్రఢిమను దున్మి • నూఱుశరంబుల్
బూని దునిమెఁ దత్పూతుని, భూనభముల సింహనాద•ములు బిక్కటిలన్. 106

ఆ॥ వీరరాక్షసుండు • వేఱొక్కసూతుని, రథమునందు నిల్పి • రభసమెసఁగ
భానుసదృశమైన • భానుకోపుకిరీట, మవని గడపె శరస•హస్రములను. 107

వ॥ దాన లజ్జాన్వితుండై భానుకోపుండు, 108

క॥ అపరిమితబలుఁడు దనుజుఁడు, నిపతిత మగు దివ్యరత్న•నిర్మితమకుటం
బపుడు శిరంబున నిడుకొని, విపులక్రోధానలంబు • వెలయఁగఁ గడిమిన్. 109

వ॥ వీరరాక్షసుబాణాసనంబు నిశితశరసహస్రంబుల ఖండించె; నంత నవ్వీరరాక్షసుండు నొండొకవిల్లు నందుకొనునంతలోన భానుకోపుఁడు కోపాటోపంబున బ్రహ్మాండకటాహంబుఁ బగుల క్ష్వేడారవం బొనర్చుచు నిష్ఠురంబు లగు శిలీముఖంబులఁ దద్రథంబు భగ్నంబుఁ గావించిన, 110

ఆ॥ వీరరాక్షసుండు • వేఱొక్క రథ మెక్కి, ధనువుఁ గేలఁగొనుచుఁ • దారసిలఁగ
నపుడు భానుకోపుఁ • డతనిశరాసన, మధికతీవ్రకోప • మడరఁ దునిమె. 111

మ॥ అసదృక్ప్రౌఢిమ నంత విస్ఫురితకో•పాటోపుఁడై వీరరా
క్షసుఁ డుద్యద్గతి శక్తి వైచి గరిమన్ • గర్జాధ్వనిన్ జేయ రా
క్షసనాథుం డగు భానుకోపుఁ డదియున్ • ఖండించె వేగంబునన్
దెస లల్లాడఁగ నార్చుచున్ సునిశితో•ద్దీప్యచ్ఛరౌఘంబులన్. 112

ఆ॥ అంత రథముఁ డిగ్గి • యావీరరాక్షసుఁ, డసురు రథముతోడ • నభ్రమునకు
నెగయఁజిమ్మ నతఁడు • గగనతలంబున, నిలిచి యట్టహాస•నినద మొప్ప. 113

వ॥ అవ్వీరరాక్షసువక్షంబున మహాఘోరం బగు శక్తిఁ బరపె; నత్తఱిఁ దదీయఘట్టనంబున మూర్ఛాగతుండై నేల నొరగంబడె; నిట్లు పడుటఁ గనుంగొని వీరాంతక, వీరమాహేశ్వర, వీరపురందర, వీరమహేంద్ర, వీరధీరులు ఘనాఘనంబులట్లు నిబ్బరంబుగాఁ బెడబొబ్బలిడుచు శరాసనంబులఁ గొనయంబు లెక్కించి ఘోర నారాచంబులు భానుకోపునిపైఁ గురిసిన, 114

మ॥ అలఘుప్రౌఢిమ భానుకోపుఁడు మహా•ద్యద్దివ్యరత్నప్రభా
విలసత్స్యందన మొందు నెక్కి పటుదో•ర్వీర్యంబు శోభిల్ల ని
స్తులనారాచపరంపరల్ గురిసె దో•ర్త్రో వీరబృందంబుపై
బలమొప్పారఁగ భూరిసంగరకళా•పాండిత్య మేపారఁగన్. 115

వ॥ ఇట్లు భానుకోపుం డవ్వీరులు నేడ్వురుం గడవ నద్భుతంబుగాఁ బోరునెడ న

య్యసురవర్యుతీవ్రనారాచంబుల నిర్వురు భగ్నమనోరథులును, మఱి యిద్దరు
నిర్దళితరథాశ్వులును, నొకండు మూర్ఛాగతుండు నైరి; పిమ్మట, 116

క॥ గతతేజం బగు భూతప్రతతిం గని దనుజసేన ♦ పటుఘోషములన్
వితతాట్టహాస మొలయఁగఁ, గుతుకమున నటించె నోగి న♦కుంఠితగతులన్. 117

వ॥ మఱియుం గొందఱు శరాసనపాణులును, ఖడ్గఖేటకధరులును నై నల్లెడలం
బేరెంబులు వారుచు సంతసంబునఁ జెలంగిరి. 118

—* భానుకోపుని వీరబాహుఁ డెదిరించి పోరుట *—

క॥ ఈకరణి దైత్యయోధా,నీకము సెలఁగుటయుఁ గాంచి ♦ నిస్తులశౌర్యో
ద్రేకుఁ డగు వీరబాహుఁడు, శ్రీకరుని శివకుమారు ♦ శ్రితముం దారున్. 119

వ॥ నిజహృదయకమలంబున నిడుకొని వేదాంతవచనంబుల వినుతింపుచుఁ బినాకంబు
శంకరుండువోలె సముద్దండకోదండంబుఁ గేలంబూని నిస్స్వపద్భుజగభయంకరం
బగు సింజినింగూర్చి యాస్ఫాలనంబుఁ గావించిన, 120

మ॥ ప్రళయాంభోధిమహోర్మికాజనితశుం♦భద్ఘోషమో కాక ని
ర్దళదంభోజభవాండభాండచటుల♦ధ్వానంబొ నా దిక్కులన్
జెలఁగెన్ దద్ఘనఘోషముల్ గిరిగుహా♦శ్రేణిన్ బ్రతిధ్వానముల్
వెలయన్ సర్వజగద్భయంకరములై ♦ వేమారు దుర్దాంతతన్. 121

వ॥ అప్పు డమ్మహాధ్వని విని శరభనిర్ఘోషంబు లని సింహంబులును, సింహనాదంబు
లని గజవ్యాఘ్రంబులును, గజవ్యాఘ్రఘూర్భటి యని మృగంబులును, భయాకు
లంబులై గుహాంతరంబుల విడిచి దిగంతంబులకుం బాఱె. 122

చ॥ అది విని భానుకోపుఁడు మ♦హాగ్రహ మొప్ప గుణధ్వనిన్ భయ
ప్రదముగ నిట్లు చేసి కటు♦భాషల నిట్లను వీరబాహుతోఁ
గదన మొనర్ప వచ్చి తిటు ♦ కంజభవుండవొ? మాధవుండవో?
త్రిదశవరుండవో? నను నె♦దిర్ప గుహుండవొ? యేమి చెప్పుమా? 123

మ॥ ఒకనిం గొల్చిన దూత వీ వకట గ♦ర్వోద్వృత్తి నీ కేల? వా
రక మాయాబల మొప్పఁ బూర్వ మసుర♦వ్రాతంబు మర్దింపఁ జూ
చి కటాక్షించితి నిన్ను దూత వనుచున్ ♦ శిక్షింప నేఁ డాజిలోఁ
బ్రకటింతున్ నిజవిక్రమస్ఫురణశుం♦భత్ప్రౌఢిమం జూడుమా. 124

వ॥ నిమేషమాత్రంబునం దొలంగక చక్క నిటుల నిలుతువేని భవన్మదం బణఁచి
దివిజులనందఱఁ బట్టి శృంఖలాబద్ధులఁ జేయుదు నని భానుకోపుండు గర్వోక్తు
లాడిన విని వీరబాహుం డిట్లనియె. 125

క॥ ఏ మని పలికెదు దానవ, తామసమున నిపుడు పండి♦తంమన్యుఁడవై
వేమరు నీతోడను సం,గ్రామార్థిని నన్ను దూత♦గా నెన్నకుమీ. 126

క॥ బలశౌర్యంబులు దూతకుఁ, గలుగవొకో నీ కి దేల ♦ కడు నభిమానం
బలఘుపౌరుషము నాతో, బలుమఱు సమరం బొనర్చు ♦ భాసురలీలన్. 127

వ॥ అని వీరాగ్రగణ్యుండును మహాబలుండును నగు వీరబాహుండు వలికిన భాను
కోపుండు రౌద్రోద్రేకంబునఁ బదిశరంబు లేసిన నతం డన్నిశరంబుల వానిని ఖం
డించె; నయ్యెడ, 128

క॥ శతసాయకములు దివిష,త్ప్రతిరోధి నిగుడ్చె, వీర♦బాహుఁడు తావ
త్ప్రతశరములనవియన్నియుఁ, బ్రతిహతములొనర్చె బాహు♦బలము దలిర్పన్.

వ॥ మఱియు దనుజుండు శరసహస్రంబులఁ బఱపిన వీరబాహుండన్నియుఁదన బాణం
బులఁ దుంచి దైత్యునిమీఁదసహస్రమార్గణంబులుఁబ్రయోగించె; నయ్యసుర
వర్యుండును దశసహస్రమార్గణంబులఁ బ్రయోగించిన వియన్నియుఁ దుత్తుమురుఁ
జేసి వీరబాహుపై లక్షనారాచంబులు నిగుడించె; సుపర్వోత్తముండును తావ
ద్విశిఖంబుల ఖండించి యసురమీఁద దశలక్షశిలీముఖులఁ గురిసె; నసురవైరియు
దశలక్షబాణంబుల వాని వారించి వీరునిపై శతలక్షలబాణంబులు వర్షించె;
నవ్వీరపుంగవుండు నంబకశతలక్షల నవియన్నియు భగ్నంబు గావించి దానవుని
మీఁద శతసహస్రకోటిబాణంబులఁ బఱపె; శూరసుతుం డన్నియుపశిఖంబుల
వాని దునుమాడి ప్రళయమేఘంబు కైవడి దేవవల్లభుమీఁద ననేకశరపగం
పరలు గురిసె; గుహానుజుండు నట్టహాసం బొనర్చి రోషభీషణుండై సంవర్తఘనా
ఘనంబుపగిది శూరాత్మజుమీఁద శతవర్షంబులు వర్షించె; నిట్లయ్యిరువురు
సమరంబు సలుపు నెడ నతివిచిత్రంబుగా ధనుర్గుణారవస్తనితభయదంబును, గర
వాలప్రభాపటలసౌదామినీపరివృతంబును, శరాసారపిహితాశేషదిగంతాకాశమం
డలంబును, నకాండధవళాతపత్రఫేనలాలక్ష్యమాణశరవాహినీమధ్యపరిభ్రమ
ద్రథమహీధరజాలంబును, తిర్యక్ప్రసారితబాణవిభావిలోకితపరస్పరముఖంబును
నై దుర్దినంబు సూపట్టె. 130

క॥ అనిమిషులయ్యును దివిజులు, సనిమేషతఁ జూచి రపుడు ♦ సమరక్రీడన్
ఘనబలుఁడు భానుకోపుఁడు, గని యాశరదుర్దినంబుఁ ♦ గడురోషమునన్. 131

వ॥ విజృంభించి వీరబాహునివివిధాస్త్రంబులును, శరాసనంబును ఖండించి నిదాఘ
మేఘంబు కైవడి గర్జారవం బొనర్చిన, 132

ఆ॥ వీరబాహుఁ డంత ♦ వేఱొక్కవిల్గొని, యస్త్రతతులఁ దునిమె ♦ నసురువిల్లు
దానవుండు నొండు♦ధనువుఁ గైకొని వేగ, మార్వ్వరవము దెసలఁ♦బర్వఁజేసి. 133

వ॥ అనేకబాణసహస్రంబుల నతనివక్షంబు గాడఁ జేసిన, 134

క॥ కోపమున వీరబాహుఁడు, దీపించుచు గడిమి సప్త♦తీవ్రశరములన్
బాపాత్ము దనుజుమకుటము, భూపతిత మొనర్చి యార్చె ♦ భుజబల మెసఁగన్.

ఉ॥ దానవమౌళి వేఱొక యు♦దంచితరత్నకిరీటమున్ దలన్
బూనఁగ నంతలోఁ గవచ♦మున్ దునిమె న్నిశితాస్త్రపంక్తి నెం
తేనియు వీరబాహుఁ డతి♦తీవ్రపరాక్రమ మొప్ప నప్పు డా
భానుఁడు భానుకోపునివి♦పద్దశఁ జూచి చెలంగెఁ బ్రీతుఁడై. 136

వ॥ అంత భానుకోపుం డలుక వొడమ శరాసనంబు సజ్యంబు గావించి గుణధ్వనిం
జేయుచు నిష్ఠురనారాచసహస్రంబులు వీరబాహులలాటంబున నాటించిన. 137

క॥ నాటినఁ దద్బాణంబులఁ, బాటవమునఁ బెరికి వీర♦బాహుఁడు మఱియున్
మేటిగ మహోర్వీరవములు, బాటిలఁ గను నట్టహాస♦భాసురుఁ డగుచున్. 138

క॥ దనుజుని శిరమున వక్షం,బున బాహాసంధులందు ♦ భుజములయందున్
సునిశితశరసంఘంబులు, ఘనవహ్నిజ్వాలలట్లఁ ♦ గడువడి బరపెన్. 139

వ॥ ఇట్లు పరపిన దనుజుండు నుల్లంబు తల్లడిల్ల శరాసనకోటి విన్యస్తహస్తుండై మూ
ర్ఛాగతుం డయ్యె. 140

గీ॥ పాపపుంజస్వరూపుఁడౌ♦భానుకోపు,తనువుఁ గడురక్తధారాప్లు♦తంబు నగుచు,
పుష్పితంబైన కింశుక♦భూజమట్లు, చూడఁ దనరారె సంగర♦క్షోణి నపుడు. 141

వ॥ మఱియు నిమేషమాత్రంబున రాక్షసబలంబుపైఁ గవిసి వీరబాహుఁడు త్రిపురం
బులఁ బురాంతకుండునుంబోలె రౌద్రోద్రేకంబున విజృంభించుచు సహస్రకోటి
సంఖ్యాకంబు లగు నస్త్రంబులఁ బుంఖానుపుంఖంబులుగాఁ బ్రయోగించి సకల
దనుజబలంబులఁ బొరిగొనియె; నయ్యవసరంబున. 142

సీ॥ సంగ్రామధారుణి ♦ శరదళితంబులై, దానవవీరుల♦తలలు వరుసఁ
గనుపట్టె బాణభ♦గ్నంబులై కొన్నియుఁ, బాథోధిలోపలఁ ♦ బడియెఁ గొన్ని,
పర్వతశిఖలను ♦ భాసిల్లె మఱికొన్ని, బహునదీనదములఁ ♦ బడియెఁ గొన్ని,
యంతరిక్షమునందు ♦ నలరారెఁ గొన్నియు, బ్రహ్మాండగతములై ♦ పరగెఁ గొన్ని
తనరె మఱికొన్ని యాత్మకాం♦తాజనముల,మ్రోలనత్యంతసంతాప♦మూలమగుచు
భయదముగ నాడెమింటఁ గ♦బంధసమితి, యెల్లెడలఁ బ్రేతసంఘంబు ♦ లుల్లసిల్ల.

వ॥ మఱియు నయ్యవసరంబున మేదోమాంసకర్దమభూయిష్ఠయుఁ, గేశశైవాలా
భీలయు, నిర్దండధవళఛత్త్రఫేనమండలమండితయు, లుఠద్విపులశీర్షోపలదుర్ధర్షయు,
ననేకకీకసవిసరశుక్తిపేశిసంయుక్తయు నగుచు రక్తనది ప్రవహించె; నవ్వేళ
నుపరిభాగంబునఁ బరిభ్రమించు కాకకంకంబులును, బిశితంబును మెసవనుంకించు
ఫేరవంబులును, గోలాహలంబులఁ జెలంగు పిశాచనిచయంబులును గలిగి సంకు
లంబుగ సమరాంగణము చూపట్టె. 144

క॥ ఆరీతి వీరబాహుని, నారాచమహా♦నలంబునన్ దితిసుతుల్
పోరిన్ మృతులై కూలఁగ, వారలఁ గని శూరసైన్య♦వరు లవ్వేళన్. 145

ఆ॥ విగతమూర్ఛలగుచు ♦ వేగంబ లేచిన, భూతవితతితోడఁ ♦ బోలుపెసంగ
నృత్తగీతవాద్య♦నిపుణత నన్యోన్య, మలరి రపుడు లసిత♦హసితు లగుచు. 146

వ॥ అంత నబ్భానుకోపుఁడు విగతమోహుండై బహుప్రకారంబుల హతంబులైన నిజసైన్యంబులం గనియు, నృత్తగానవినోదంబులం జెలంగు నశేషదివిజసైన్యంబుల నవలోకించియు నత్యంతచింతాకులస్వాంతుండై, 147

క॥ నాతోఁ బోరినవారలు, భూతలమున నపజయంబుఁ ♦ బొందుదు రోహో
యీతఁడు మహాబలాఢ్యుం, డీతనితో సాటియగు న ♦ యితరజనుఁ డిలన్. 148

క॥ అని నిముసంబున నితనిన్, దునుమఁగ లేకున్న ధను♦వుతో జ్వలదనలం
బునఁ జొత్తునని ప్రతిజ్ఞన్, దనరంగావించి కినుక ♦ దైత్యేంద్రుఁ డొగిన్. 149

వ॥ మహోన్నతంబైన సింహంబుఁబోలె గర్జింపుచుఁ ద్విశిరస్కశరసహస్రంబులు వీరబాహుపయిం గురిసిన, 150

గీ॥ వీరబాహుండు తాదృశ♦విశిఖవితతి, ఖండితంబు నొనర్చెఁ ద♦త్కాండసమితి,
మఱియు నిగుడించె నిష్ఠురాం♦బకసహస్ర,ములు త్రిదశవైరిపై శౌర్య♦మున మెఱయఁగ.

క॥ బలశాలి భానుకోపుఁడు, చలమొప్పఁగ నయ్యశేష♦సాయకతతులన్
బలుతునియలు గావించెను, విలసద్విశిఖములఁ గోప♦విహ్వలుఁ డగుచున్. 152

వ॥ మఱియు నిష్ఠురంబు లగు దశసహస్రాస్త్రంబులు నిగుడించి యతని రథాశ్వంబులను, సూతుని బరిమార్చిన నంత భూతసేనాధ్యక్షుండు కోపాటోపంబున వేఱొండు రథం బధిరోహించి యిన్నూరుబాణంబుల రథాశ్వంబులను, నన్నిశరంబుల సారథిని శరాసనంబును ఖండించి వైచిన, 153

గీ॥ రాక్షసేంద్రుండు వేఱొండు ♦ రథము నెక్కి, భాసురముగ శరాసన♦పాణి యగుచు
సప్తశరములు కులిశాభ♦సాయకములు, పఱపె నవ్వీరబాహుపైఁ ♦ బ్రౌఢిదనర.

వ॥ వీరబాహుండు దద్బాణఘట్టనల నించుకవిషాదంబు నొందియుఁ జలంబు నూలుకొల్పుకొని రౌద్రోద్రేకంబునఁ బదునాల్గుశరంబుల శరాసనంబు విదళితంబుఁ జేసి యద్దనుజకుంజరుండు గంపంబునొంద సింహనాదంబొనర్చుచుఁ గ్రమ్మర సహస్రవిశిఖంబులం దద్రథంబును దురంగంబుల సారథిం దెగటార్చి భూగతంబులం గావించి యంత నిలువక నిశితశతశిలీముఖంబుల నతనివక్షస్స్థలంబు భేదించిన,

గీ॥ దాన నెంతయుఁ గోపించి♦దానవుండు, వేఱొకమహోన్నతరథంబు ♦ వేగ నెక్కి
నంతలోనన దునుమాడె ♦ నతని వెనుక, నలరుఁదూణీరముల సహ♦స్రాంబకములు.

వ॥ అంత నద్దానవేంద్రుం డతనితోడఁ బవరంబుసేయ శక్తుండుగాక విభ్రాంతుం

డగుచు నతని శరకౌశలంబునకు నాశ్చర్యంబు నొంది వీనిశరంబులకు మాఱు ప్రయోగింప నెద్ది యని చింతించి, సర్వవ్యామోహకారకంబును. నఖిలభువన భయప్రదంబును, నంగీకృతసకలలోకలోచనంబును, మహామాయాకరంబును, మోహకమోహకంబును, భీషణభీషణంబును,నగుసమ్మోహనాస్త్రంబు సమంత్రకంబుగాఁ బ్రయోగించె నంత. 157

గీ॥ అఖిలభూత సేనాధిపుల్ ♦ స్వాయుధములు, దారుణంబుగఁ గురిసిరి♦దానిమీఁద
నదియునొక్కింత లెక్కింప ♦ కస్త్రసమితి, వేగజను దెంచెనాభూత♦వితతియద్రువ.

వ॥ అంత నవ్వీరబాహుండు నమ్మహాస్త్రంబుఁ గనుంగొని, సకలశస్త్రాస్త్రంబులాక్రమించి మహాభయంకరంబై యెవ్వరికిం దేఱిచూడ నలవి గాక యనివార్యంబగుచు నద్భుతంబుగా వచ్చుచున్నయది యిది యేమొకో యని వ్యాకులచిత్తుండగుచు నుండె; నంతలోన నరుదెంచి యమ్మహాస్త్రం బమ్మహామహునితోడంగూడ సకలభూతసైన్యంబుల నత్యంతమూర్ఛాగతులం జేసిన, 159

గీ॥ స్తంభములవోలెఁ గొందఱు♦సైన్యనాథు, లరదములమీఁద నిశ్చేష్టు♦లగుచునిలిచి
రవనిఁగొందఱుతమతమ♦యాయుధములు, చేతనిడుకొనిమూర్ఛనుఁ♦జెందిరొగిని.

వ॥ అప్పు డవ్వీరులు బాలురకేనియుం జయింపనలవిగాని యుండిరి. 161

గీ॥ భానుకోపుండు సంతోష♦భరితుఁడగుచు, భూతసేనాధిపతులపై ♦ భూరివిశిఖ
తతులు వర్షించె సంగర♦ధరణియందు, రక్తసిక్తాంగులుగఁజేసి♦రహిఁజెలంగ. 162

వ॥ అదియఖిలం బెఱింగి సకలభూతహృదయనివాసుండును, దయాపయోనిధియు, సచ్చిదానందవిగ్రహుండును సుకుమారాంగుండునునగు కుమారుండు హేమకూటపురంబున సకలసురగణంబులు పరివేష్టించి కొలువ దివ్యసింహాసనాసీనుండై యుండి, యమ్మోహనాస్త్రంబు నివారింపఁదలఁచి మోహనాశంబును మహాఘోరంబును నగు నమోహనాస్త్రంబుఁ బ్రయోగించిన, 163

సీ॥ ప్రళయకాలాంభోద♦పటలధ్వనులవోలెఁ, బటుతరచిటచిటా♦ర్భటులు నిగుడ
సంవర్తమార్తాండ♦చండప్రభలపోల్కి, నుజ్జ్వలధగధగ♦ద్యుతులు వెలుఁగ
కల్పాంతసమయాగ్ని♦ఘనకీలలట్లను, మంటలు బురఁబుర ♦ మింటికెగయ
విలయానిలంబుల♦వీఁక గరుద్వాత, విసరంబుఁ బిసఁబిసఁ ♦ దెసల విసర
పటుజవోద్వృత్తి బ్రహ్మాండ♦భాండ మవియ, సకలభువనంబులెల్లను♦ సంచలింప
ననదృశోద్ధతినరుదెంచి♦యలయమోహ, నాస్త్రమమ్మోహనాస్త్రంబు♦నవనిననఁచె.

వ॥ అప్పుడు వీరబాహుప్రముఖనిఖిలభూతసేనాధిపతులు నిదుర మేల్కొనినవిధంబున విగతమోహులై లేచి రిట్లు సమ్మోహనాస్త్రంబు నివారించి యయ్యమోహనాస్త్రంబు మఱల గుహుంటికరంబుఁ జేరె నయ్యెడ; 165

క॥ వీరవరులెల్ల లజ్జా, పూరితహృదయులగుచు మన♦భుజబల మేలా
ఘోరశత్రుప్రక్రియ, నేరకపోయితిమి గుహుఁడు ♦ నేఁడు కరుణతోఁ. 166

వ॥ మనలనందఱ రక్షించె నని సంతోషంబున వేదాంతగుంభితంబులైన స్తోత్రంబుల నప్పార్వతేయుని వినుతించి, భూతాధిపతులు మగుడ నద్దానవేంద్రునితోడ యుద్ధంబున కుపక్రమించిరి. 167

క॥ దురమునను భానుకోపుని, బరిమార్పంగం దలంచి చటుల భాసురశౌర్య
స్ఫురణం బాశుపతాస్త్రముఁ, బరగం గైకొనియె వీరబాహుం డలుకన్. 168

—* భానుకోపుని పలాయనము *—

క॥ అది చూచి భానుకోపుఁడు, మదిలో భయమంది దీని మార్కొనంగన్
గదనములోఁ బ్రత్యస్త్రం, బది నేఁ దేనైతి నెటులఁ నాజి నోర్తున్. 169

వ॥ అని సత్వరంబుగా నగరంబున కరిగి, పాశుపతాస్త్రంబుఁ గొని యితనితోడఁ బవరంబు సేయ మగుడి వచ్చెద నని నిశ్చయించి, సూక్ష్మరూపంబున రథంబు విడిచి నానాదైత్యసమాకులం బగు పురంబుఁ బ్రవేశించి, రాజవీధుల నందందు నలరు నిందుకాంతోపల వేదులందు నెరవొందుచు శ్రుతిమరందంబులుగా నభినవగానంబులు విను దానవసందోహంబులను, ద్యూతక్రీడావినోదంబుల మోదంబునొందు రథిక వీరులను వీక్షింపుచు దివ్యరత్నవిచిత్రితంబగు నిజమందిరంబు సొచ్చి, మనోహరగాత్రిలగు సుందరీజనంబులచేతఁ గృతోపచారుం డయ్యు నయ్యసురవర వల్లభుండు రణపరాభవంబువలన విన్ననై విన్నాణంబు దక్కియుండె. 170

క॥ అల భూతపతులు గోలాహలరవము లొనర్చి రమరు లంబరవీధిన్
జెలువుగ విరులం గురిసిరి, పలుమారుఁ జెలంగె దివిజ పటహధ్వనులున్. 171

వ॥ ఆసమయంబున భూతగణంబులు వీరబాహునిం గని మన మిప్పుడు నని పురంబుఁ జొచ్చి వధూసమేతంబుగా దైత్యవరుం బట్టి తేవలయు నిదియ సమయం బని విన్నవించిన వీరబాహుం డిట్లనియె.

క॥ విదితముగ నెవ్వఁడేనియుఁ, గదనమునఁ బరాజయంబుఁ గాంచినచో వా
నిదెసన్ మగుడఁ జని భయ, ప్రదుఁ డగుట యధర్మ మండ్రు పండితు లుర్విన్.

వ॥ ఆతండు మగుడ యుద్ధమునకుం జనుదెంచె నేని నేన సంహరించెద నిదినిశ్చయంబని వీరబాహుండు పల్కిన విని భూతసేనాధిపతులు ప్రహృష్టాంతరంగు లగుచు నిజపురంబునకుం జనిరి. 174

గీ॥ భానుకోపున కగు పరాభవముఁ గాంచి, భానుఁ డపరాద్రి భీతిచే బలెను వ్రాలె
భూతసైన్యంబు జితదైత్య పుంజమగుచు, స్కందసన్నిధిఁ జేరె నానంద మొంది.

వ॥ ఇట్లు చేరి వీరబాహుప్రముఖనిఖిలసేనాధిపులు కార్తికేయుచరణారవిందంబుల కెఱఁగి సంస్తుతించి సకలవృత్తాంతంబును విన్నవించిన, 176

క॥ పరిపూర్ణకృపాదృష్టిన్, శరవణభవుఁ డఖిలభూత సైన్యాధిపులం
బరికించి నిజగృహంబుల, కరుగని యోగించె నిరుప మాదర మొదవన్. 177

వ॥ వారు కుతుకంబు దనర బాహులేయుని యనుమతి వడసి నిజగృహంబులకుం జని రక్కడ, 178

చ॥ సుతుని పరాభవంబు విని • శూరుఁడు దూతముఖంబున న్మహో
గ్రత దనరార నేన రణ•రంగములోన సమస్తభూతసం
తతులను దద్విభుల్ విశిఖ•ధారల గీటణఁగింతు నంచు న
న్నతధృతిఁ బల్కి యాత్మసద•నంబులు సేరగఁ బంచి దూతలన్. 179

వ॥ అద్దానవేంద్రుండు చింతాకులస్వాంతుం డగుచు నాత్రేయిఁ గడపి తదనంతరంబ యుషఃకాలం బగుడు లేచి కాలోచితకృత్యంబులు నిర్వర్తించి, 180

తే॥ అనుపమం బగు రత్నసిం•హాసనమున, దానవేంద్రుండు నివసించి • తనబలంబు
నెల్లఁ దోతేర వేగ న•నేకకోటి, దూతలనుఁ బంచె నిఖిల•దిగ్వ్రాతములకు. 181

వ॥ అంత నద్దూతలు సని తత్తద్ద్వీపంబులఁ బర్వతప్రదేశంబుల నుండు సకలసైన్యనికాయంబుల వేగంబఁ దోడ్కొని వచ్చిన, 182

గీ॥ శూరపద్ముండు వైభవ•స్ఫురణ మెఱయఁ, గనకనిర్మితగోపురా•గ్రంబు నెక్కి
సరస వీక్షించె నుత్కంఠ•శతసహస్ర, సంఖ్యవాహిను లగు నాత్మ•సైన్యములను.

వ॥ ఇట్లు చూచి సంతోషభరితుండై గాంగేయమయం బగు నయ్యుత్తుంగగోపురాగ్రంబు డిగ్గి యంత, 184

సీ॥ ఇంద్రచాపప్రభ•నెనయు మేఘమువోలె, రత్నచిత్రితధను•ర్ధారి యగుచు,
విద్యుత్ప్రభాస్ఫూర్తి•వెలయు నభ్రము లీల, సౌవర్ణదీప్తిని•షంగుఁ డగుచు
శుభ్రఖగావళి • సొంపొందుఘనమట్లు, ద్రోణమాల్యాలంకృ•తుండు నగుచుఁ,
గైలాస మందర • కనకాద్రుల జయింపఁ, దగునింద్రలోకర•థంబు నెక్కి,
ప్రాసతోమరకరవాల•పరశుదండ, భిండివాలాదిసాధన•బృంద మలర,
ధ్వజములభ్రగంగోర్మికా•వళుల నొరయ, దానవేంద్రుండుగదలె సో•దరులతోడ.

వ॥ ఇట్లు జైత్రయాత్రాసముత్సుకుండై నిఖిలమంత్రులును మహాబలపరాక్రమవంతులగు సేనాపతులును రథారూఢులగుచు వెన్వెంటఁ జనుదేర రాజమార్గంబుఁ దాటి, గోపురద్వారంబు జేరి సింహవక్త్రతారకసుతు లగు నసురేశానాది శూరకులను, సేనాధిపతులనుం గాంచి ముందఱ నరుగ నియోగించి భేరీ, పటహ, కాహళ, డిండిమ, జర్ఝరాది ఘోషంబులును, వీణా, వేణు, శంఖ వినాదంబులును, తురంగసంఘహేషారవంబులును, మత్తమాతంగబృందబృంహితంబులును, రథచక్రనేమిధ్వనులును, సేనాభటసింహనాదంబులును, వందిమాగధకోలాహలంబులును, ప్రళయకాలార్ణవకల్లోలనిస్వనభయదంబు లగుచు మెరయ, ననేకసేనాసమేతుండై నానారత్నవిచిత్రితంబు లగు ఛత్రకంక్షులనీడ శూరపద్ముండు సంగరాంగణంబున కరుగు నంత, 186

క॥ సేనాపాదోదితమై, మానుగ ధూళీచయంబు ♦ మహి నెగసి దిశా
భానుని గప్పిన తమ మొం, తేనియుఁ గనఁబడె నకాండ ♦ దీపితముగుచున్. 187

వ॥ అప్పు డింద్రుండు తదాగమనంబు సేనానికి విజ్ఞాపనంబుఁ జేసి నమస్కరించి యిట్లని ప్రార్థించె. 188

క॥ కరుణార్ద్రా! భక్తవత్సల!, శరవణసంభూత! సకల♦జగదారాధ్యా!
దురితాత్ముం డగు శూరుని, బరిమార్పుము వచ్చెనిపుడ♦భండనమనుచున్. 189

వ॥ అనియిట్లు పురందరప్రార్థితుండై స్కందుండు శూరసంహారంబున కుద్యోగించి సింహాసనంబు డిగ్గి సారథ్యమైనసమీరణుం జేరి సత్వరంబు గారథమ్ముఁ దెమ్మనవుడు,

క॥ పవనుఁడు పర్వతసదృశము, వివిధమణిప్రోజ్జ్వలంబు ♦ విభవాఢ్యంబున్
జవనాశ్వసంఘకలితం, బగురథము దెచ్చి నిలిపె ♦ నాక్షణ మెదుటన్. 191

తరల॥ హరివిరించిపురందరామరు ♦ లంఘ్రిసేవకులై మహా
పరమభక్తిని వెంటఁ గొలువ వి♦పంచికాయుతపాణులై
సురమునీంద్రులు సారె బాడగ ♦ సొంపుమీర మహర్షులున్
వరుసఁ జేరి భజింప భాసుర♦వైభవోన్నతి రంజిలన్. 192

స్రగ్ధర॥ స్ఫూర్జన్నిస్సాణభేరీ♦స్ఫురదురుమురజా♦స్తోకతూర్యస్వనంబుల్
భర్జింప న్స్వర్గవీథీ♦ప్రకటపరవ♦ప్రోద్ధిమ న్నిండి దిక్కుల్
నిర్జాడ్యప్రజ్ఞవంద్య ♦ ద్విజగుణకథలున్ ♦ నిర్భరాంభోదశశ్వ
ద్గర్జానాదంబు లొప్ప ♦ గరిమఁ బొగడఁగా ♦ గాయకు లొప్పిలఁ బాడన్. 193

వ॥ మఱియు ధవళాతపత్రచామరధ్వజపాణులై గీర్వాణులు సకలోపచారంబు లొనర్ప సుబ్రహ్మణ్యుఁడు స్యందనారూఢుండై వెడలె, నపుడు, సకలసేనాధిపతులును, సర్వాభరణభూషితు లగుచు వివిధాయుధభరితంబులగు తేరు లెక్కి చనిరి; భూతగణంబులును సింహనాదంబు లొనర్చుచుఁ గోడనఁ జనిరి. 194

గీ॥ సకలసైన్యాంఘ్రిధృతధూళి♦సముదయంబు, లబ్జబాంధవమండల ♦ మావహించె
వేగ సన్నద్ధు లగుచును ♦ నీరలెల్ల, భండనస్థలిఁ జేరి రు♦ద్దండపటిమ. 195

వ॥ అంత నంభోధిచేత బాడబానలంబుఁబోలె భూతసైన్యంబు లసురసైన్యంబులచేత నావృతంబు లయ్యె. 196

క॥ భూతంబు లపుడు భూజ,వ్రాతంబులు భూధరము ల♦ వారిగ శిలలున్
వైతేయగణంబులపై, నాతతభుజశక్తి వైచి ♦ రద్భుత మొదవన్. 197

క॥ అల దైత్యవరులు కోపోజ్జ్వలులై యార్చుచు మహోగ్ర♦శస్త్రప్రతతుల్
బలిమిమెఱయఁగఁ గురిసిరి, చలముం బాటిల్ల భూత♦సంఘములపయిన్. 198

వ॥ మఱియు భూతాగ్రగణ్యులపై నానావిధాయుధంబులఁ బ్రయోగించినఁ బ్రళయకాలంబట్ల గణంబులు రౌద్రోద్రేకంబున నసురబలంబులపై కురికి యనివార్య

శౌర్య ధైర్యంబు లడరఁ గాల్బలంబులచేతఁ గాల్బలంబులను, సైంధవంబులచేత సైంధవంబులను, గజంబులచేత గజంబులను, నరదంబులచేత నరదంబులను, బదియు నూర్వ్రయుసంఖ్యల నొక్కపెట్టఁ జక్కడంచి, నక్కడు చలంబున నుక్కు మిగుల మఱియు నేనుంగులఁ దురంగంబుల నసురుల పాదంబులఁ గీలించి దిరి రం దిప్పి దెప్పరంబడరఁ బుడమిం జదిపి రంత, 199

క॥ భూతగణంబులు బఱపు మ, హాతతవృక్షాద్రిశిలలు ♦ నసురవరేణ్యుల్ స్ఫీతనిశాతనిజాయుధ,ఘాతంబులఁ దునియలుగను ♦ గావించె నొగిన్. 200

వ॥ మఱియు నసురులు మహాసంహారభీషణులై భూతగణంబులపై నానావిధాయుధంబులఁ బ్రయోగించిన భూతగణంబులు పరిభూతంబు లగుచు భీతిం జెంది పఱచియు మగుడ ధైర్యం బవలంబించి తాదృశంబులగు దండఖడ్గాద్యాయుధంబులఁగొని యారక్కసుల ముక్కులుం జెక్కులుం గాళ్లను వ్రేళ్లను శిరంబులును గరంబులును నురంబులును నురుమాడి, రప్పు డద్దనుజకబంధసంబాధ ప్రవాహినీభూత శోణితకబంధంబులతోడ స గరాంగణంబు సూపట్టె; నంత, 201

గీ॥ అది గనుంగొని యతిశూరుఁ♦డలిగి వెంట, రాగద్విసహస్రరథములు♦రథమునొకటి దశసహస్రాశ్వయుతమును ♦ దనర నెక్కి, దశదిశలు నిండ సింహనా♦దంబొనర్చి.

—* ఉగ్రుఁడు నేర్పున నతిశూరు హతమొనర్చుట *—

వ॥ భూతగణంబులపై ఘోరనారాచనిచయంబులఁ గురిసె నప్పు డుగ్రుం డను భూతాగ్రగణ్యుండు ప్రళయకాలోగ్రుం డగుచు మహాఘోరంబుగా నార్చి దండంబుఁ గొని ప్రచండకోపంబున నతిశూరునివక్షంబు బిట్టడచి కవచంబు విదళించె; నంత, 203

క॥ అతిశూరుఁడు హృదయంబున, నతిశయకోపంబు గదుర ♦ నంబకతతులన్ శతసాహస్రము లేసెను, ధృతి నతనిశరీరమున రు♦ధిరము దొరఁగన్. 204

వ॥ అంత నయ్యుగ్రుండాగ్రహంబున నఖర్వం బగుపర్వతంబుఁ గొని దనుజునరదంబుపై నేసినఁ దత్పతనంబున నది శతధా భగ్నంబయ్యె; నంత దైత్యుండు సమున్నతం బగు నొండొకరథం బధిరోహించునంతలోన నద్దేవవర్యుండు పాదఘాతంబుల నప్పవనజవంబు లగు తదశ్వంబుల నేలఁగూల్చె. 205

గీ॥ అంత దైత్యుండు పటునిశి♦తాస్త్రశతము, లుగ్రుపై నిగుడించె న♦త్యుగ్రుఁడగుచు వానిశరముల నతఁడు దు♦ర్వారమహిమ,దండమునఁ జెండివైచె ను♦ద్దండలీల. 206

వ॥ వెండియుఁ దదరథంబు భగ్నంబుఁ జేసిన దాన నద్దానవుండు పూర్వప్రకారంబున మహోన్నతంబైన వేఱొండు రథంబు నెక్కి ప్రళయాగ్నిసమప్రభంబును మహాఘోరంబు నగు నాగ్నేయాస్త్రంబుఁ బఱపిన, 207

మ॥ అది కల్పాంతఘనాఘనోత్కరసము ♦ ద్యద్ఘోషము న్జేయుచున్
జదలున్ దిక్తటులు న్విభాసిలఁగ భా ♦ స్వద్దీప్తిఁ జూపట్టుచున్
జెదరన్ గ్రక్కుచు విస్ఫులింగతతులన్ ♦ శీఘ్రంబ యాయుగ్రునిన్
గదియం గన్గొని దాని వాఁడు నిజహృ ♦ త్కంజాతపీఠంబునన్. 208

గీ॥ గుహునిభజియించి తత్కృపా ♦ మహిమవలన
మ్రింగె నయ్యస్త్ర మదియట్లు ♦ మ్రింగఁజూచి
యలిగి దనుజేంద్రుఁ డాగి వారు ♦ ణాస్త్ర మపుడు
జలమయాంబుఁ బ్రయోగించె ♦ శౌర్య మెసఁగ. 209

క॥ భయదంబగుచుఁ దదస్త్రము, రయమునఁ జనుదెంచె బహుళత ♦ రంగౌఘయుతం
బయివచ్చు జలధిక్రైవడి, జయ మలరఁగ నుగ్రుఁడదియుఁ ♦ జయ్యన మ్రింగెన్.

మ॥ బలురోషంబున దానవుండు మఱియున్ ♦ బ్రహ్మాస్త్రముం బూని యు
జ్జ్వలలీలన్ బఱపన్ దదస్త్రము చతు ♦ ర్వక్త్రంబు లింపొంద ది
క్కులు వెల్గొందు నిజప్రభావళులచే ♦ ఘోషంబులున్ మీఱ ని
స్తులవేగంబున నాస్యమున్ దెఱచుచున్ ♦ శుంభద్గతిన్ వచ్చినన్. 211

క॥ దానిం గైకొని యుగ్రుఁడు, సేనానిన్ సంస్మరించి ♦ శీఘ్రమ మ్రింగెన్
మానుగ పూర్వం బట్లన, నానాస్త్రము లెట్లు మ్రింగిన ♦ ట్లని యలుకన్. 212

వ॥ దానవుండు సర్వసంహారకారకంబును, సమరపరాజితశత్రునికరంబును, సము
గ్రనినదపూరితదిగంతరాళంబును, నెందు నప్రతిహతంబును నగు నారాయణా
స్త్రంబు నుగ్రుపైఁ బ్రయోగించిన, 213

గీ॥ అదియు బహురూపములతోడ ♦ నఖిలదిశలఁ, దేజరిల్లఁగఁ జేయుచు ♦ దీప్తిమెసగఁ
బ్రళయపటుఘోరసంరావ ♦ భయదమగుచు, మీఁదనరుదేర వెఱవక ♦ మేటికసిమి.

వ॥ భూతసేనాగ్రణి యగు నుగ్రుండు గుహుని సంస్మరించుచు సింహనాదంబువోలె
గర్జించుచు నవ్వైష్ణవాస్త్రంబును గబళించె; నంత, 215

క॥ దానవనాథుఁడు గనుఁగొని, వానిపరాక్రమము వీఁడు ♦ వనరుహగర్భుం
డో నారాయణుఁడో?, నగజానాథుఁడో? యీతఁ డస్త్ర ♦ సమితికి నిలువన్. 216

వ॥ ఇమ్మహావీరుం డొక్కఁడ దివ్యాస్త్రంబులన్నియు నవలీలం గబళించె; నిట్టివీర్య
ధైర్యంబు లెందైనను గంటినే? యని యాశ్చర్యంబు నొందుచు నద్దనుజవర్యుండు
భయకంపితవిగ్రహుం డయ్యె; నిఖలదనుజులును భీతిం జెందిరి. 217

గీ॥ గగనముననుండి నిర్జర ♦ గణములెల్లఁ, దత్పరాక్రమమహిమఁ జి ♦ త్రముగఁ జూచి
మదిని హర్షించి పద్మసం ♦ భవునితోడ, నితని కీ వీర్యధైర్యంబు ♦ లెట్లుగలిగె? 218

వ॥ అని యడిగినఁ గమలగర్భుండు దివిజుల కిట్లనియె. 219

గీ॥ భర్గునాశ్రితగణములోఁ ♦ బ్రథముఁ డితఁడు, ప్రియుఁడు సతతంబుఁ బార్వతీ ♦ ప్రియున కెప్డు
కలుగు నతని పైఁగుహుఁ కటా ♦ క్షుం బితం డ, జాండముల నన్ని క్షణములో ♦ నణపఁ జాలు.

వ॥ మఱియు నాహవంబున విష్ణుచక్రంబుఁ గైకొన్న గణవర్యునకంటె నితం డధికుం డగు; నితని పరాక్రమంబు గణింప నలవి కాదు; వినుండు సురాసురపూజ్యులును, పవిత్రీకృతసకలభువనులును, మహాదేవకుమారాసక్త హృదయులును నగు మహా మహుల కెయ్యది యశక్యం బని పద్మగర్భుండు వలికిన సర్వసుపర్వులు శ్రోత్ర పర్వంబులుగా విని నిజహృదయాంబుజంబుల గుహుని సంస్మరించుచు, నేత్రం బుల సంతోషబాష్పంబు లొలుకఁ బులకాంకితదేహులై యితని కతోధిక బలం బౌగాత మని యాశీర్వదించిరి. 221

గీ॥ అంత దానవవల్లభుఁ ♦ డాత్మయందు, నే యుపాయంబుచే నాజి ♦ నితని గెల్తు
నకట సంధింతు నితనిపై ♦ నస్త్ర మెద్ది, యనుచుఁ జింతాభరాన్వితుఁ ♦ డగుచు నపుడు.

వ॥ అత్యంతభీషణంబును, మహాసంహారకారకంబును నగు పాశుపతాస్త్రంబు నారిం బోసి మనంబున నర్చించి, సమంత్రకంబుగాఁ బ్రయోగించిన 223

సీ॥ ప్రళయకాలోదగ్ర ♦ భర్గాట్టహాసభీ, షణమహానిర్ఘోష ♦ సహిత మగుచు?
జవసముద్భూతోరు ♦ ఝంఝానిలధ్వన, త్కులధరాధరగుహా ♦ కుహర మగుచు,
నుద్ధ్వాంతయమభట ♦ ప్రోద్యద్విషానల, వివిధఘోరాయుధా ♦ న్విత మగుచు,
కంపితానేకలో ♦ కవ్రాతసంస్థిత, సకలచరాచర ♦ జాల మగుచు,
భూతసైన్యాధిపశ్రేణి ♦ భీతిఁ జెంద, గరిమ నేతెంచు నయ్యస్త్ర ♦ వరముఁ గాంచి,
నేలదండంబుబడ వైచి ♦ కేలు మోడ్చి, యుగ్రుఁ డత్యంతభక్తిన ♦ య్యుగ్రుఁ దలఁచి.

క॥ మనమునఁ బంచాక్షరిని౯, ఘనమతి జపియించుకొనుచుఁ ♦ గావుము కరుణాం
బునిధీ! శివ! శంకర! హర!, యనుచు౯ శరణంబు నొందె ♦ నతిభీతిమెయి౯.

వ॥ ఇట్లు శరణంబు నొందిన, 226

గీ॥ హరుననుజ్ఞను బాశుప ♦ తాస్త్రమంత, నుగ్రునంటక మఱలె న ♦ య్యుగ్రుకడకు
ననుఁడు సూతునివచనంబు ♦ లాలకించి, యఖిలమును లద్భుతంబంది ♦ యతని కనిరి.

గీ॥ సూత! యెందును దైవత ♦ వ్రాతమునకు, వంద్యమగుచును సర్వాస్త్ర ♦ వరము నగుచు
నలరు పాశుపతం బేల ♦ నతని నంట, కవలఁ జనియెను? వినిపింపుఁ ♦ డయ్య మాకు.

వ॥ అని యిట్లడిగిన సర్వజ్ఞవినుం డగు సూతుం డమ్మునీంద్రుల కిట్లనియె. 229

క॥ పురహరుఁడు పాశుపతముం, గరమొసఁగుచు నతని కనియెఁ ♦ గదనస్థలిలోఁ
బరఁగ నిరాయుధుమీఁదను, బరపిన నది మగుడ నాదు ♦ కడ౯ జేరు౯. 280

వ॥ అని యీశ్వరుం డాజ్ఞాపించుటం జేసి యమ్మహాస్త్రంబు శంభునికటంబుఁ జెందె.

గీ॥ వ్యర్థమైనట్టి పాశుప ♦ తాస్త్రమహిమఁ, గాంచి యతిశూరుఁ డాదిగా ♦ గల సురారు
లధికభయకంపితాంగులై ♦ హతమనోర, థులునగుచునుండి రత్యంత ♦ దుఃఖములను.

క॥ కోలాహలములు సెలఁగెను, చాలఁగ భూతముల, దేవ♦సంఘము విరులన్
లీలం గురిసెను మొఱసెను, నెలింపమృదంగపటహ♦నాదములు దివిన్. 233

వ॥ ఆసమయంబున నతిశూరుఁ డితస్తతోధావనంబులఁ జెలంగు నఖిలభూతంబుల నవలోకించి విశీర్ణంబులై విఫలీకృతంబులైన నిజాయుధంబుల నేవగించి రథారోహణంబు మాని పాదచారియై దండంబు కేలం గీలుకొల్పి మహాభయంకరగర్జారావంబుల భర్జింపుచు నుగ్రుపైఁ గవిసి వక్షస్స్థలతాడనంబుఁ గావించిన, 234

క॥ కుపితుఁడయి భూతనాథుం, డపుడు మహోద్దండలీల ♦ నాహవకేళీ
నిపుణుఁ డగుచు దండంబున, గపటాత్మున్ దనుజు గెడపె ♦ ఖచరులు పొగడన్.

వ॥ ఇట్లతిశూరుండు హతుండైనఁ గనుంగొని భూతసేనలు సముద్రంబు ఘూర్ణిల్లు కరణిఁ గోలాహలధ్వని యొనర్చిన, 236

—* అసురేంద్రుఁడు కనకాఖ్యుల రదనంబునఁ గెడతేర్చుట *—

క॥ అసురేంద్రుఁ డపుడు రోషం, బెసఁగ శరాసనముఁ బూని ♦ యేపడరఁ బయో
దసమధ్వనులం జేయుచు, నెప వచ్చుటఁ జూచి భూత♦వితతి చలించెన్. 237

వ॥ అప్పుడు, 238

గీ॥ కనకుఁ డనుభూతగణపతి♦కడిమి మెఱయ, నసుర నెదిరింపఁ దెలియక♦నతని బలము
దనుజుఁ డుద్ధతిమీఱఁ ద♦త్తనువునందు, బాణముక్కిటిబఱపెను♦ద్భటనిరూఢి. 239

మ॥ కనకుం డంతఁ గరంబునం బెలుచఁ ద♦త్కాండంబు ఖండించి చ
య్యనఁ దత్స్యందన మెక్కి సూతుని సము♦ద్యత్ప్రౌఢిమ న్గూల్చి సిం
జిని దంతంబుల నానఁ బట్టి శతధా ♦ భిన్నంబుఁ గావించి గ్రి
క్కున నుద్యత్పటుసాహసం బడర బ♦ల్కోపంబు దీపింపఁగన్ 240

క॥ అనుపమబలుఁ డుద్ధతిచే, ఘనపర్వతమొండు వెఱికి ♦ కదనావని న
మ్మనుజాశనుపై వైచిన, దనుజుఁడు వేఱొండు ధనువు ♦ ధరియించి వెసన్. 241

క॥ ఎనిమిది శిలీముఖంబుల, దునుమాడి ధరాధరంబు ♦ దురమున మఱియున్
సునిశితసహస్రశరములఁ, గనకుని ధరఁగూల్చె శౌర్య♦గరిమ దలిర్పన్. 242

వ॥ ఇట్లు కనకుండు పడిన దానవేంద్రుండు వేఱొక్కసూతు నమర్చుకొని శతాంగంబు భూతంబులమీఁదఁ దోలిన, 243

ఉ॥ మత్తగజంబుమీఁది వడి ♦ మార్కొను సింహముపోలె సాహసో
ద్వృత్తి సెలంగ గర్జిలుచు ♦ వేగము పర్వతముం బెగల్చి యు
న్మత్తుఁ డొకండు భూతగణ♦నాథుఁడు తద్రథసైంధవంబులన్
దుత్తుమురై పడం బఱపె ♦ నోర్బలమొప్ప రణాంగణంబునన్. 244

వ॥ అంత నసురేంద్రుండు గట్టలుక రెట్టింపఁ బిడుగులంబోని వాడినారసంబు లతనిపైఁ బరపిన నతఁడు తద్బాణఘట్టనల నిలువంజాలక రుధిరంబుఁ గ్రక్కుచు

నిమేషమాత్రంబున మూర్ఛాపరవశుండగుటయు, 245

క॥ అంతన్మత్తావ్వాయుఁ డొకఁ, డెంతయు ఘనరోషభీష♦ణేక్షణుఁ డగుచున్
జెంతనొకపృథునగంబు ని, తాంతబలస్ఫూర్తిఁ గొనుచు ♦ దానవు నెదిరెన్. 246

వ॥ ఆసమయంబున దానవుండు డుక్కుమిగిలి పదిశరంబులతనియురంబు నుచ్చిపోనేసిన రక్తసిక్తాంగుఁ డగుచు, బాలివానిబీరంబున భూతవీరుండు రోషభీషణుండై బొబ్బలిడుచుఁ బర్వతంబు సుపర్వారాతిపయిం బరపిన, 247

క॥ వానియురంబును దాఁకి మ,హానగము విశీర్ణమగుచు ♦ నవనిన్ దొరఁగెన్
దానవుఁ డంత మహాక్రో,ధానల మడరంగ సంగ♦రాంగణమందున్. 248

వ॥ భూతోత్తముఁ డగు మత్తునిపై నిశాతంబు లగు సహస్రాంబకములఁ బ్రయోగించిన నతండు జర్జరితాంగుండై సొమ్మసిలుటఁ గనుంగొని మహాపరాక్రమసింహుం డగు సింహుండు సింహనాదం బొనర్చుచు నేతెంచి యొక్క మహోన్నతంబగు మహీధరంబు నతిజవంబునం గొని దైత్యుపై నేసిన, 249

క॥ దనుజుం డాపర్వతమును, సునిశితబాణమున. దుంచె ♦ సుస్థిరశౌర్యం
బునతోడ సింహుం డత, డనుపమదండంబుఁ బూన్పె ♦ నసురునిమీఁదన్. 250

మ॥ అసురేంద్రుండు దదీయదండము నిశా♦తాస్త్రంబులం ద్రుంచి యే
పెసఁగన్ సింహుని మూర్ఛిలం గడపి తా♦నంతేని భూతావళిన్
దెసలం బారఁగఁ ద్రోలె గోపకుఁడు ప్ర♦స్ఫూర్తిన్ గోవులం ద్రోలు న
ట్లసదృక్ప్రౌఢిమ సంగరోర్వి నిజశౌ♦ర్యాటోపముల్ మీఱఁగన్. 251

వ॥ అంత నియుతసంఖ్యాకు లగు స్వేదోద్భవులలోన దావకుం డను నొక్కబలుమగండు గండుమిగిలి మహారవభయంకరుండై కోపము దీపింప శతసహస్రశరంబులు దైత్యవర్యునిపైఁ గురిసిన, 252

క॥ అసురుం డురుకోపంబున, నసదృశబల మలర నిష్ఠు♦రాంబకతతులన్
వెస నొసలఁజొనిపి యాతని, వసుమతి మూర్ఛిలఁగఁ జేసె ♦ వరశౌర్యమునన్. 253

వ॥ అంత సోమకుం డనువాఁడుఁ బవరంబున కరుదెంచిన, 254

క॥ దానవుఁడు బహుశరంబుల, వానిపయిన్ గురియ దివిజ♦వర్యుం డపు డం
తేనియు బాణసహస్రము, దానవుపైఁ గురిసె దైవ♦తతులు నుతింపన్. 255

వ॥ మఱియు సోమకుండు మహాసాహసంబునఁ గరవాలంబుఁ గొని రథంబుఁ దునియలుగావించి సూతుం బరిమార్చి యేర్చి పేర్చిన, 256

ఉ॥ దానవుఁ డంత వేఱొకర♦థంబు రయంబున నెక్కి క్రోధవై
శ్వానరకీలలు న్నిగుడ ♦ శక్తిని వైచినఁ దాన నొచ్చి యొ
తేనియు సోమకుండు జగ♦తీస్థలి మూర్ఛిలి వ్రాలె నంతలో
భానుసమానతేజుఁ డరి♦భంజనుఁడా విజయాఖ్యుఁ డుద్ధతిన్. 257

క॥ చనుదెంచి శరసహస్రము, లనుపమగతిఁ బఱపి దానవాధిపు నుద్య
ద్ధనువున్ సారథిఁ బోరిగొ నె, ఘనశౌర్యస్ఫూర్తిమెఱయ • గదనంబందుల్. 258

మ॥ దనుజుం డంత నుదగ్రరోష మడరన్ ♦ దండంబు పైఁ ద్రిప్పివై
చిన దానన్ విఫలాస్త్రజాలుఁ డగుచున్ ♦ శీఘ్రంబ వాఁ గుఱ్ఱ మూ
ర్ఛను జెందంగని వీరులందరు మహాసంరంభముల్మీఱఁగన్
ఘనకోలాహలరావము ల్సెలఁగ సంగ్రామైకపారీణులై. 259

వ॥ అతనిపైఁగవిసి వివిధాయుధంబు లొకుమ్మడిం గురిసిన నద్దానవేంద్రుండు సరకుఁ
గొనక రౌద్రోద్రేకంబున గొదమసింగంబు మదగజంబులఁ గదుముతెఱంగున
వారల నందఱఁ బోరిలోనఁ బారందోలుటయు, 260

—* వీరబాహుండు వసురేంద్రు సంహరించుట *—

మ॥ కని యాదైత్యుని బాహువిక్రమము వేగ న్వీరబాహుండు సిం
జిని కోదండముతోడఁ గూర్చి గరిమన్ ♦ సింహధ్వను ల్మీరఁగా
సునిశాతాస్త్రపరంపర ల్బఱపె విస్ఫూర్జద్గతిన్ దోడనే
దనుజుండుం గురిసెన్ శరావళులు తద్గాత్రంబు నిండారగన్. 261

వ॥ మఱియు నసురేంద్రాభ్యుగ్రసృష్టశరంబుల నమ్మహామహుశరాసనంబు దుత్తుని
యలుసేసిన, 262

ఉ॥ ఒండొకవిల్లుఁ బూని సమరోద్ధతి మీఱఁగ వీరబాహుఁ డు
ద్దాండసహస్రిముల్ గురిసెఁ ♦ గ్రక్కున వాని మహారథంబుఁ గో
దండము సైంధవంబులును ♦ ధారుణిపైఁ బడఁగూల్చె సాహసో
ద్దండత సింహనాదములు ♦ దద్దయు దిక్తటులెల్ల నిండఁగన్. 263

ఉ॥ అంత ససంభ్రమస్ఫురణ ♦ నయ్యసురుండు రథాంతరంబుపై
నెంతయు నెక్కి విల్లుఁగొని ♦ యేయ శరవ్రజముల్ రణోర్వి న
త్యంతము వీరబాహుని రథంబు విఖండితమయ్యె నంబర
ప్రాంతముఁ జేరి వీరవరుఁ ♦ డాగ్మ నుమాత్మజునిన్ భజింపుచున్. 264

వ॥ కోలాహలరవంబుల నసురసైన్యంబులుజూచి భయంపడఁ బాణిం గృపాణంబుఁ
గీలించి వేగంబున దానవురథంబుపై కురికి తత్కరంబు దళితంబొనర్చినంత రక్క
సుండుక్కు సెడక ధైర్యంబు వాటించి వామహస్తంబున దండంబుఁగొని వీర
బాహు నురం బఱచిన నమ్మహావీరుండుఁ గినుకవొడమినమనంబున నద్దనుజు
శిరంబుఁ జరణంబునన్ దన్ని మహాఘోషణభీషణుండై ఖడ్గంబు ఝుళిపించుచు,
నరుగుచుండ నవ్వీరబాహు వెనుఁదవిలి కరవాలంబుఁగొని ఘోరాకారుండై
యసురేంద్రుం డరుగుదెంచిన, 265

క॥ కరవాలముఁ గొని వీరుఁడు, సురవైరిశిరంబుఁ దుంచి ♦ సూర్యజుకడకుఁ
గర మనిపె వీరబాహుని, వరసాహస మెన్నఁదరమె ♦ వాక్పతికైనన్. 266

క॥ అసురేంద్రుఁ డట్లు నీల్గుట, ననదృశకోలాహలంబు ♦ లడరఁగ దివిష
ద్వసరము మోదించెను రా,క్షసగణము పలాయనంబు ♦ గాంచెను వేగన్. 267

వ॥ అనిచెప్పి మఱియు, 268

శా॥ దీప్యచ్చంద్రకళావిభూషణ! జటా♦దీవ్యత్స్రవంతీ! మహా
శాప్యగ్రావశరాస! గోపరివృఢ! ♦ గ్రైవేయభోగీంద్ర! సా
రూప్యాపాదక నైజనిర్మలతను♦ప్రోద్యత్ప్రభాలోక సం
తృప్యత్స్వాశ్రితభక్తలోక విలస♦న్నిశ్రేయసశ్రీకరా. 269

క॥ భూ,కాండ,కృశాను, సమీ,రాకాశ, రవీందు, సోమ♦పాంగ! యపాంగా
లోకనపూరితభక్తా, నీకామితకామితార్థ! ♦ నిఖిలాధారా! 270

ఇంద్రవజ్ర॥ కోదండకాండీకృత♦గోత్రగోత్రా!
వేదండదైత్యారిప♦విత్రవిత్రా!
పాదాంబుజాప్యామర♦పాద్యపాద్యా!
వేదాంతవేద్యేతర♦వేద్యవేద్యా! 271

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్ర సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపగోత్ర కోడూరి
మొల్లనామార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మాంబికాతనయ
వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచల
కవిప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత
శంకరసంహితయందలి శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము

## యుద్ధకాండము.

ద్వితీయాశ్వాసము.



లావణ్యోజ్జ్వల! ప్రతి
కూలాసురశమన! స్ఫురత్సుగిరి లింగిత్రా
పాలతనూభవపాలన
శీలా! నిర్మలశుభాంగ! ♦ శ్రీ శివలింగా! 1

వ॥ అవధరింపుము శౌనకాది మహామునులకు సూతుం డిట్లనియె. 2

—* శూరపద్మాసురుఁడు భూతసేనలఁ బాఱఁదోలుట *—

సీ॥ శూరవర్యుండైన ♦ శూరపద్మాసురుండంత, భండనస్థలి గత♦ప్రాణులైన
యతిశూరుఁ డసురేంద్రు♦డను భ్రాతృసుతులను, రణకురాజితులగు♦ రాక్షసులను
గనుగొని శీఘ్రంబు♦గా రథంబునుదోలి, కోదండమున మౌర్వి♦గూర్చి కడిమి
కృతలస్తకంజగు ♦ కేల తాడనఁ జేయ, నిజతాడనంబేల ♦ నీవు సేసె
దిట్లు నీకును ఘటియించు♦నిది యథార్థ, మనుచు నుమపు తెలుంగున♦నల్ల మ్రోసె
జగతి నమ్మహాధ్వనివిని ♦ సకలసురలు, భయముఁ జెందిరి హరికంజ♦భవులతోడ.

వ॥ మఱియు, భూతంబులన్నియు భీతంబులగుచు పరిభూతంబగు విభ్రాంతిం జెంది
నంత నమ్మహారవంబు జగజ్జనంబులకు ద్వాదశాబ్దంబులు వినంబడుచుండె. 4

క॥ విని యాధ్వని సేనాపతు, లనుపమశౌర్యంబు లొప్ప ♦ నద్రులు తరువుల్
సునిశిత నానాయుధములు, గొని పరపిరి శూరుమీఁదఁ ♦ గోపం బడరన్. 5

క॥ అవియన్నియు దశశరముల, భువిఁ జూర్ణముఁ జేసి దనుజ♦పుంగవుఁ డంతన్
వివిధాస్త్రశస్త్రకోటులు, జవమున వర్షించె దివిజ♦సైన్యముమీఁదన్. 6

వ॥ అయ్యవసరంబునఁ దద్బాణఘాతంబులకు నిలువనోపక దివిజసైన్యంబు దైన్యంబు
నొందుచు, నేలంబడి పొరలువారును, నిట్టూర్పు నిగుడించువారును, మూర్ఛా

గతు లగువారును, నై నానావిధంబుల బరాభవంబు నొందిరి. 7

క॥ స్వేదభవు లంత సంగర, మేదిని గేణించి కినుక ♦ మీఱఁగ నపుడం
తేదారుణ బాణౌఘము, లాదానవుమీఁద గురిసి ♦ రతులప్రౌఢిన్. 8

మ॥ అసురేంద్రుండు తదంబకావళు లసం♦ఖ్యాతాస్త్రజాలంబులన్
వెస ఖండించి రథంబులన్ దునిమి దో♦ర్వీర్యంబు శోభిల్ల స్వే
దసముద్భూతకులవక్షముల్ వొడిచి శ♦స్త్రశ్రేణిచేతన్ సమి
ద్వసుధన్ మూర్ఛలఁ జేసె సారె దివిజ ♦ వ్రాతంబు గంపింపఁగన్. 9

వ॥ ఇవ్విధంబున స్వేదోద్భవులు పడుటంగని నవవీరులలో శ్రేష్ఠుండగు వీరమార్తాం
డుండు మధ్యాహ్నసమయమార్తాండుండువోలెఁ బ్రచండ తేజుం డగుచు ననర్గ
ళంబుగా మార్గణాసారంబుల నద్దనుజాగ్రణిపైఁ గురిసిన, 10

మ॥ దనుజేంద్రుండు మహారవం బెసఁగఁ ద♦ద్బాణౌఘ మస్త్రాళిచే
దునియల్ జేసి తదీయఫాలమునఁ దో♦ర్గో బాణసాహస్రముల్
ఘనలీలం బరపన్ సురాధిపుఁడు ద♦త్కాండాళి ఖండించి భం
డనభూమండలిఁ జూపెఁ జండభుజదం♦డప్రౌఢి యొంతేనియున్. 11

వ॥ అంతమహాశూరుండు తీవ్రనారాచసహస్రంబుల నవ్వీరమార్తాండకోదండకాండ
తూణీరంబుల ఖండించి వెండియుఁ బ్రచండకాండసహస్రంబుల నతని భూమండలిం
గడపిన, 12

ఉ॥ అంతట వీరరాక్షసుఁ డు♦దగ్రపరాక్రమకేళిదక్షుఁడై
యొంతయు రాక్షసాగ్రణిప♦యిం బఱపెన్ నిశితాస్త్రపంక్తి దు
ర్దాంతత దానవుం డపుడు ♦ దద్విశిఖంబుల ద్రుంచెఁ జాప మ
త్యంతపటిష్ఠతన్ దునిమె ♦ నాహవశౌర్యనిరూఢి మీఱఁగన్. 13

వ॥ అంత వీరరాక్షసుండు కోపంబు గదుర మహాసాహసంబున వానిరథంబుపై కెగసి
కరవాలంబున నతనిశరాసనంబు దునిమి తద్ఘాతంబున భగ్నఖడ్గుండగుచు, 14

ఆ॥ వీరరాక్షసుండు ♦ వేగంబ శూరుని, ముష్టిఁ బొడువ గడిమి ♦ మొనయ నతని
పదముఁ బట్టి యూర్ధ్వ♦పథమున కెగఁజిమ్మె, నండభిత్తి దాక ♦ నసురవరుఁడు. 15

వ॥ ఇట్లు వీరరాక్షసుం డాకసంబునుండి ధరం దొఱఁగి, మూర్ఛాగతుండగుట గనుం
గొని వీరమహేంద్రుండు మహాబలపరాక్రమసాంద్రుం డగుచు, రౌద్రంబు నిర్ని
ద్రంబుగాఁ గోలాహలరవంబు లులియ ననేకసాయకంబుల దనుజనాయకుం
గప్పిన, 16

క॥ దానవపతి దద్విశిఖవి, తానము ఖండించి శస్త్ర♦తతుల నిరువురు
న్మానక యన్యోన్యరథా, నూనభ్రమణమునఁ బోరి ♦ రుద్దండగతిన్. 17

వ॥ అంత శూరపద్ముండు కోపారుణవీక్షణుండగుచు నంగారకణంబులం బోలె వేఁడిమి

గలవాఁడిములుకులు వేరువేరఁ గరచరణంబుల ముప్పదిముప్పదియు, నురంబున నలుబదియును, నాటించి మేటివీరుండగు వీరమహేంద్రుని మూర్ఛాగతుం జేసె నయ్యెడ, 18

గీ॥ వీరధీరుండు రోషంబు ♦ విస్తరిల్లఁ, బరపె విశిఖసంఘంబులు ♦ పటిమ మెఱయ
దానవుఁడు వాని బాణకో♦దండములను, శరసహస్రంబుచే ద్రుంచె♦శౌర్యమెసఁగ.

వ॥ మఱియు, నేడువాఁడి నారాచంబుల నతనియరదము వ్రయ్యలుచేసె నంత. 20

క॥ అలిగి మది వీరధీరుఁడు, చలమున దండంబుఁబరపెఁ ♦ జయ్యన శూరుం
డలమిఁజతుర్విశిఖంబుల, దళితంబుగఁ జేసె దాని ♦ దారుణలీలన్. 21

వ॥ మఱియు నగ్గలంబగు బలం బినుమడింప నన్నిలింపవైరి పిడుగులుం బోని బెడిదంపుటమ్ముల బదునాల్గింట నతనిభుజాదండంబులు ఛేదించి భూధరంబును వజ్రపాణియుం బోలె వీరవరుని సంగరాంగణంబునఁ బడగూల్చె నాసమయంబున. 22

ఉ॥ వీరమహేశ్వరుం డెదిరి ♦ వేగమ వీని శరాసనంబునన్
బోర జయింప రాదనుచు ♦ భూరితరంబగు శక్తి వైచినన్
శూరుఁడు దానిపైఁ బఱపె ♦ శుంభదనేకశిలీముఖంబులన్
వారక వాని నన్నిటి న ♦ వారణఁ ద్రుంచె మహాజవంబునన్. 23

వ॥ అమ్మహాశక్తి కులిశసదృశంబగు రక్షోవిభునివక్షంబునఁ బడి పాషాణగత లోష్టంబునుం బోలెఁ జూర్ణంబయ్యె. మఱియు దండంబుఁబూని యతం డరుదేర శూరుం డేడువాఁడికోలలం బరపి యవ్వీరమహేశ్వరుని విగతసంజ్ఞునిం జేసె నంత.

గీ॥ వీరకేసరి కేసరి♦విధము దోప, విక్రమించుచు బహుశర ♦ వృష్టి గురిసె
దైత్యుపై దానవుండు దో♦ర్దర్పమెసఁగ, సప్తశరములఁ దచ్ఛరా♦సనము దునిమె.

వ॥ తద్రథంబు భగ్నంబుగావించి తదీయనిటలంబున శరసహస్రంబులు నాఁటిన.

మ॥ చలము న్మీఱఁగ వీరకేసరి మహా ♦ శైలంబు నాశూరుపై
నలఘుస్ఫూర్తిని వైవ వాఁడొక నిశా ♦ తాస్త్రంబునం దాని ద్రుం
చె లసచ్ఛౌర్యుఁడు నీరుఁ దంత సమర ♦ స్థేమైకదోర్వైభవో
జ్జ్వలతన్ ప్రత్యురథంబుపై కుఱికి రో♦షస్ఫాంతుఁడై శీఘ్రముగ్. 27

వ॥ వజ్రనిష్ఠురంబగు నతనియురంబు గరంబునం జఱచి తదాస్ఫాలనంబున భిన్నపాణియై యరదంబుముంగలఁ బడిన శూరుం డతనిం గైకొని సుధాంబుధిఁ బడవైచి, నంత నతండు కొండొకసేపునకు విముక్తమోహుండై నిజసేనం జేరి మఱియు యుద్ధసన్నద్ధుండై రెండవయింద్రుండునుంబోలెఁ జనుదెంచి మహాభీలంబగు కాలాస్త్రంబుఁ బ్రయోగించిన నది రక్షోవీరువక్షంబునఁ బడి శిథిలంబయ్యె, నంత. 28

క॥ వీరాగ్రణి బ్రహ్మాస్త్రము, వారక బరఁగఁ దొడఁగ • వడి నాలోనన్
శూరుఁడు దద్విక్షంబున, నారాచసహస్రశతము • నాటించె వెసన్. 29

వ॥ ఇట్లు నాటించిన వీరకేసరి మూర్ఛాపరవశుండయ్యె నయ్యెడ వీరాంతకుండు మహాకోలాహాలం బాభీలంబుగా నొనర్చుచు, వీనిచేత నస్మచ్ఛేనలకుఁ బరాజయం బె ట్లొదవనేర్చు, నని కోపం బొదువ నసురబలంబుల సింహనాదంబుచే భయంబు నొందింపుచు నుగ్రతరంబులగు శరంబులు [illegible]త్యుపయిఁ గప్పినంత.

గీ॥ అవియు, ఖండించి దానవుఁ•డాహవమున, నంబకసహస్రములు నించె•నతనిమేన
నతఁడును సహస్రశరముల•నవియుఁగునిమె, మేఘగర్జన లలర న•మోఘలీల. 30

వ॥ అంత శూరుండు పరాక్రమోదారుం డగుచు వజ్రనిష్ఠురంబులగు, శతసహస్రంబులఁ దద్రథశరశరాసనంబులం దునుమాడి మఱియు వక్షంబు భేదించి యవ్వీరాంతకు మూర్ఛితుం జేసె. 32

—* వీరబాహుండు శూరపద్మాసురు నెదిరించుట *—

తే॥ అట్లు మూర్ఛాగతుండగు • నతనిగాంచి, వీరబాహుఁ డుదగ్రత•వెసలె నంత,
నమ్మహాబలుఁ గనుగొని • యసురవర్యుఁ డేపెసంగఁగఁ బరుషోక్తి•నిట్టులనియె.

క॥ దూతవయి వచ్చి పూర్వము, దైతేయుల నాజిఁ గూల్చి • దర్ప మెసంగన్
నాతనయునిఁ జక్కాడి మ,హాతీవ్రత మాయఁబన్ని • యరిగితివిగదా. 34

ఆ॥ ధనువు కేల విడిచి•దాత్య మిప్పు డొనర్చ, నాయనుజ్ఞ నట్లు • సేయవేని
నిమిషమాత్రమునను • నిన్ను నంగరభూమి, సంహరింతునువ్వె •సత్య మరయ.

వ॥ అనియిట్లు పలుకుదానవువచనంబులు విని వీరబాహుం డిట్లనియె, 36

క॥ గుహునకు భటుఁడను దూతను, రహిమీరఁగ నగుడు నేన • రాక్షస! నీకీ
బహుభాష లేల? సంగర,మహి వీఁడవేని నిలుము • మార్కొన నాతోన్. 37

వ॥ అని యివ్విధంబున నమ్మహావీరుండు శూరునితోడ భాషింపుచుండు సమయంబున వీరబాహునిపై సహస్రకోటిశరంబు లయ్యసురవర్యుండు వర్షించె నపుడు.

క॥ వీరుం డన్నియు శరముల, వారించెఁ దదస్త్రములను, • వారక మఱియున్
శూరుఁడు సాయకకోటుల, ధీరతవర్షించెఁ గోప•దీపితుఁ డగుచున్ 39

వ॥ వీరబాహుండు కోటివిశిఖంబుల నయ్యంబకములఁ దునిమి, వెండియు రాక్షసేంద్రుని నిటలస్థలంబున శరశతంబులు నిగుడించిన నవియు బాషాణంబునంబడిన సూదులంబోలెఁ బుటమొగసి పుడమిం బడియె నంత, 40

ఆ॥ గుహునిశక్తిదక్క • గువలయంబున వీని, సంహరింప నాకు • శక్య మగునె?
ఐన నిమ్మహాశ•తాస్త్రజాలమ్ముల, సంహరింతు బాహు•శౌర్య మెసఁగ. 41

సీ॥ అని నిశ్చయింపుచు ♦ నవ్వీరబాహుండు, నారాచములఁ నించె ♦ శూరుఁడైన
దానవుఁ డవియెల్లఁ ♦ దద్దయు దునుమాడి, వారక తన్ముష్టి ♦ వక్షమునను
బాహువులందును ♦ బహుశరంబులు గ్రుచ్చె, వీరుఁ డంతటఁ గోటి ♦ విశిఖములును
దనుజేంద్రసూతుని ♦ ధరఁ గూల్చె నంతట, నసురుండు నేబది ♦ యంబకముల
వీరపుంగవునరదంబు ♦ వేగ దునిమె, నంత వీరవర్యుండు దు♦ర్దాంతపటిమ
నొండొక రథంబుపై నెక్కి ♦ యొగి సమీర, శిఖశరంబులఁ బఱపె దో♦స్తేజములర.

వ॥ అవి శూరుండు సరకుసేయక చూచుచుండ నయ్యస్త్రంబు లచలంబుకంటెఁ గఠినంబగు తద్వక్షోమధ్యంబునం బడి చూర్ణంబులయ్యె; మఱియు వీరబాహుం డాభీలంబులగు కాలసూర్యాస్త్రంబులు దానవుపయిం బఱపిన, నవి యతనిఁ దాఁకి కుంఠితాగ్రంబు లయ్యె. 43

ఆ॥ మఱియు వీరవరుఁడు ♦ మదిఁ గోప మడరంగ, బరపె వాయునైంద్ర ♦ బాణములను
దానవేంద్రు నవియుఁ ♦ దారసిల్లఁగ లేక, వ్యర్థతరములగుచు ♦ నవనిఁ బడియె.

వ॥ అంత నవ్వీరవర్యుండు మహాసురాస్త్రంబులఁ బ్రయోగించిన నవియు నతనిఁ జేరి లజ్జచేబలెం ధరణీగతంబులయ్యె. మఱియుఁ దోడన మహాసంహారకారకంబులగు నారాయణాస్త్ర బ్రహ్మాస్త్రంబుల బఱపిన, నవియు విస్ఫులింగంబు లుమియుచు జని దనుజవరునురంబు దాకి ప్రతిహతంబు లయ్యె. 45

శా॥ ఆవేళం దనుజేంద్రు భూరిబల మ♦త్యాశ్చర్యముగాఁగ నెం
తే వీక్షించి రశేషు లంతట మహా♦ధీరుండు శూరుండు గ
ర్వావేశంబునఁ బల్కె వీర! భవదీ♦యాస్త్రాళి నాముందఱన్
భావింపం బడబాముఖాగ్నిగత శం♦భన్మక్షికాళుల్ గదా. 46

క॥ నిను మును దునుమఁగఁజాలనె?, ఘనమగు నీ యస్త్రశస్త్ర ♦ కౌశల మెల్లన్
గనవలసి యూరకుంటిని, దునుముదు నిఁక నిశ్చయముగ ♦ దురమునఁ గడిమిన్. 47

వ॥ అని కర్ణకఠోరంబుగాఁ బల్కిన, వీరబాహుండు కోపోద్దీపితుండై పాశుపతాస్త్రంబు నారింబోసి సమంత్రకంబుగా నతనిపైఁ బ్రయోగించిన నది మహాభయంకరంబుగా విషపన్నగంబులఁ గ్రక్కుచుఁ జనుదెంచినఁ గని శూరపద్ముండు దానిపయి నయ్యస్త్రంబుఁ బ్రయోగించె. 48

క॥ దివి భువి నిండెను భయదా, రవముల నవి రెండు సంగ♦రముసర్చి మహా
జవమున నంత బ్రహర్తల, సవిధంబున్ జేరె మగుడి ♦ సమరక్షోణిన్. 49

క॥ నీబలము దెలిసెఁ జూడుము, నా బాహుబలం బటంచు ♦ నైపుణి దగ నెం
తే బాణంబులు బఱపె మ,హాబలుఁడగు శూరపద్ముఁ ♦ డావీరుపయిన్. 50

క॥ వీరుం డాతనిపై శిత, నారాచౌఘములు రయము♦నం బఱపె గడున్
శూరుఁడు తోడన దునిమె న,దారతఁ దద్ధనువుఁ బంచ ♦ దశవిశిఖములన్. 51

క॥ అసమమగు శక్తి వీరుం, డసురపయిం బఱపె నదియు ♦ నతనియురంబుఁ
  వెసఁ దాకి తునియ లయ్యెను, విసరి పఱపె నంద మసుర♦విభునురముపయిన్.

వ॥ మఱియు వీరబాహుండు దండంబుఁ బ్రయోగించిన దానిం జేరికిం గొనక
నసురదండంబు మహావీరువక్షోమధ్యంబుఁ దాకి యతని మూర్ఛాపరవశుం జేసిన
సారథి మూర్ఛాపనయనార్థంబు నరదంబు మరలించుకొని చనియె; నప్పుడు, 53

క॥ కౌతుకమొప్పంగ భూత,వ్రాతముపై దనుజవిభుఁడు♦ వర్షించె మహా
  శాతశరావళి నప్పుడు, భూతంబులు వ్రాలె భీతిఁ♦బొందుచు దెసలన్. 54

— *షడాననశూరపద్మాసురుల యుద్ధము *—

వ॥ ఇవ్విధంబున నలుగడలకు నురుకు భూతగణంబులను, మూర్ఛాగతులైన సేనాధి
పులను గనుంగొని మహాపరాక్రమధుర్యుండును, దేవసేనావర్యుండును, శాత్రవ
జయుండు నగు నప్పార్వతేయుండు కాంగ్రేదేశంబునఁ గోటిమార్తాండతేజంబై
రథారూఢుండగుచుఁజనుదెంచిన నాసర్వేశ్వరుంజూచి శూరపద్ముండిట్లనియె. 55

క॥ నీసేనాపతు లతులమ,హాసాహసశాలు రంద ♦ ఱంగిరి వరుసన్
  నీ సామర్థ్యముఁజూతు న,హహా! సాగున బాలచేష్ట♦లుడుగుము బామ్మా. 56

గీ॥ అపనియుండును దుర్బలు♦లైనయట్టి, తారకక్రౌంచు లట్లుగాఁ♦దలఁచి నన్ను
  నిప్పు డెదిరింపవచ్చితే ♦ యింతయైన, నెఱుఁగవో మత్పరాక్రమం♦బీవు మదిని. 59

క॥ వైకుంఠాదిసుపర్వా,నీకంబు భయంబునొంద ♦ నిన్నుజయింతున్
  భీకరశస్త్రాహతులను, బ్రాకటభుజశౌర్య మెసఁగ ♦ భండనమందున్. 58

చ॥ అనవుఁడు షణ్ముఖుండు దర♦హాసవిభాసితవక్త్రపద్ముఁడై
  యనియె దురాత్మ! నీదు బల♦మంతయుఁ బోర నడంతు జూడుమా
  ననుగని బాలుఁడంచు వచ♦నంబులు తుచ్ఛము లాడఁజెల్లునే
  దనుజ! వివేకహీనుఁడవు ♦ తద్గయు బుద్ధి నెఱుంగ వేమొకో! 59

క॥ భవదీయపాలనంబున, నవిరళ మలరారు పద్మ♦జాండసమూహం
  బవలీలఁ గాల్పఁజాలదె, భవన్నీలానలకణంబు ♦ పరికింపంగన్. 60

వ॥ అని కార్తికేయుండు నుడివిన విని శూరపద్ముం డలుకప్రౌఢమిన మనంబున
మధుసూదన త్రివిక్రమమూర్తియుం బోలె సభ్యున్నతంబగు చాపంబుఁ గైకొని
గొనయం బెక్కించి గుణధ్వని గావించిన నదియు సప్తసాగర సంచలోత్తుంగ
తరంగసంఘాతఘుమఘుమారవంబులం బోలి మ్రోసె నంత, 61

మ॥ బహుళోద్గాఢతరోర్ధ్వతాండవ ♦ భవభ్రాజత్పదాబ్జస్థితిన్
  మహనీయోన్నతి మించు కార్ముకము శుం♦భత్ప్రౌఢిఁ గైకొనియా
  గుహుఁడుం జేసె గుణారవం బపుడు ది♦క్కుల్పిచ్చలించెన్ గడుం
  ద్రుహిణాండంబులు భేదిలంబ టపట♦ధ్వానంబు నిండారఁగన్. 62

వ॥ అంత. 63

క॥ శూరుఁడు శరజాలంబు, లు,దారత వర్షించె గుహుఁర♦థంబును దనువున్
భోరన నఖిలజగంబుల, వారణ నిండార శౌర్య ♦ వైభవ మెసఁగన్. 64

క॥ సేనాని శస్త్రవర్షము, దానవుపైఁ గురిసె ♦ గ్రీష్మధారాధరసం
తానము వోలెఁ దదస్త్రవి,తానము ఖండించి మిగుల ♦ దారుణభంగిన్. 65

క॥ శూరుం డతని శరావళి, నారూఢిగ దునిమి దశస♦హస్రాంబకముల్
ఘోరముగ మఱియు శంభుసు,మారునిపైఁ బఱపె విక్ర♦మంబు దలిర్పన్. 66

మ॥ శరజన్ముండు తదంబకంబులు ని♦జాస్త్రశ్రేణి ఖండించి వే
మరుఁ దద్బాహువులం జతుర్దశకలం♦బంబుల్ బ్రయోగింపఁ ద
త్పరిఘర్షంబున కుంఠితంబు లగుచున్ ♦ బాటిల్లె నయ్యస్త్రముల్
హరసూనుం డది గాంచి భూరితరకో♦పాటోపముల్ మీఱఁగన్. 67

ఆ॥ దనుజధనువుఁ ద్రుంచె ♦ ధరణీధరంబును
హరియుఁ బోలె శరస♦హస్రములను
బ్రహ్మ విష్ణువులకు ♦ భయదమా నాశశక్తి
వైచె శూరుఁ డపుడ♦వార్యపటిమ. 68

క॥ గుహుఁడు చతుర్దశశరముల, మహితక్రోధమున దాని ♦ మర్దించెఁ గడున్
రహిమీఱఁగ వేరొకధను, వహితభయంకరుఁడు శూరుఁ♦డంది రయమునన్. 69

వ॥ అనేక శరపరంపర లమ్మహామహునిపైఁ జొనిపె నిట్లిరువురకుఁ బోరు ఘోరంబయ్యె నయ్యెడ. 70

క॥ దానవు భుజముల నిర్జర,సేనానియుఁ జొనిపె సప్త♦శిత బాణము లెం
తేనియు రణకోవిదుఁడై, భూనభముల సింహనాద♦ములు నిండారన్. 71

వ॥ ఇట్లు పరపిన సబ్బాణంబులు తద్బాహుఘట్టనంబున దుమురులై సమరాంగణంబున దొఱంగుటయుఁ గనుంగొని కోపంబు గదుర షణ్ముఖుండు దానవుని కోదండంబు బదునాల్గుబాణంబుల ద్రుంచి రథంబు శరసహస్రంబులం దునుమాడి మఱియు గుప్తరథంబుల బదునాల్గులక్షల విశిఖంబుల విదళితంబులఁ గావించె నంత. 72

క॥ శూరుఁడు భీకరతరగ,ర్జారావమ్ములు సెలంగఁ ♦ జయ్యన వైచెన్
దారుణతర మగుశూలము, వారణ గుహుమీఁద శౌర్య ♦ వైభవ మెసఁగన్. 73

మ॥ హరసూనుండను గోపవిస్ఫురణచే ♦ నాశూలమున్ నాల్గుని
క్షురబాణంబులఁ ద్రుంచి సప్తశరముల్ ♦ జోడించి తచ్ఛత్రమున్
ధరపైఁ గూలఁగనేసి యొక్క నిశితా♦స్త్రంబు వేసి ఖండించి త
ద్వరకోటీరము శస్త్రపంక్తి దునిమెఁ ♦ దద్భూషణవ్రాతముల్. 74

వ॥ అంత శూరుండు విదళితకోటీరుండై లజ్జావనతముఖుం డగుచు, దరిఁగ్రిందుపోలె గతహస్తబలుండై నిలిచె; నిట్లగుట నతనింగని సకలదనుజవీరులును సింహనాదంబు లొనర్చుచు నద్దానవేంద్రునకు బాసటయై వివిధాయుధంబు లొక్కపెట్టఁ బ్రయోగించి కార్తికేయునితోడ దురం బొనర్ప దొరకొని రంత. 75

కం॥ గిరితనయాసూనుఁడు భాస్కరకోటిసమానమైన ♦ చక్రంబు వెసన్
గరమునఁ ద్రిప్పి సముద్ధతిఁ, బరపెన్ దిశ లదుర దనుజ♦బలములమీఁదన్. 76

వ॥ అయ్యవసరంబునఁ జక్రధారాహతిఁ గాళ్లు వ్రేళ్లునుం దునిసిపడువారును, ముక్కులుం జెక్కులుం దెగి యొఱలువారును, వీనులు, జానులును విలూనంబులై పొరలువారును, కరంబులు శిరంబులు ఖండితంబులై దొరఁగు వారును, నై రక్షోబలంబులు మృతిం గాంచె; నాసమయంబున బ్రధ్వస్తంబులైన రథంబులును, ప్రనిహతంబులైన గజాశ్వంబులును, ప్రసృతంబులైన కేతన చామరంబులుం గలిగి దానవబలంబులు మెసవ దండధరునకు నునిచిన రాష్యభాజనంబునుంబోలె విదళితధవళాతపత్రసమాకీర్ణంబై నృత్యత్కబంధనిచయంబును, నానాపిశాచగణసంకులంబును, బరిభ్రమత్కాకగృధ్రనికరసమాకులంబునునగుచు సంగరాంగణంబు సూపట్టె, 77

తే॥ ఇట్లు దైత్యబలంబుల ♦ నేపణంచి, భానుకోటిసమప్రభా♦భాసి యగుచు
పరిఢవిల్లెడు తచ్చక్ర♦పటిమఁ గాంచి, విష్ణుచక్రంబు కంపించి ♦ వినుతిఁ జేసె. 78

వ॥ అంత నా రథాంగంబు పార్వతేయుపాణిపద్మంబున మగుడ చనుదెంచి నిలిచె, నంత శూరపద్ముండు, 79

మ॥ సమరంబందు సమస్తసైన్యములు నా♦శం బొందుటం జూచి చి
త్తమునం దద్భుత మంది పాశుపతమో? ♦ తర్కింప శాపంబొకో
విమతధ్వంసిని శక్తియొక్కొ? యిది భా♦వింపంగఁ గాకున్నచో
సముదంచ ద్రవికోటిదీప్తి నిటులన్ ♦ సంహారమున్ జేయునే? 80

వ॥ అని యిట్లాశ్చర్యంబు నొందుచు శూరపద్ముండు తానొకండ కేవలంబ నిలిచి కోపంబు గదుర మహారవంబును ఘోరతరంబునైన బ్రహ్మాస్త్రంబు బ్రయోగించిన నదియుఁ బ్రహ్మరూపంబునఁ జెలంగుచు నబ్బాహులేయుసన్నిధానంబున కరుదెంచెనంత, దత్కరస్థంబగు శక్తి యయ్యస్త్రంబుఁ గబళించె.

కం॥ శూరుఁడంతట వైష్ణవనారాచము గుహునిపై ని♦నాద మెసంగన్
ధీరతఁ బఱపిన నదియున్, వారక హరిరూప మొప్ప ♦ వడిజనుదేరన్. 82

వ॥ కనుంగొని శక్తియు నిమేషమాత్రంబున దాని భక్షించె; శూరుండు మనంబునం గనలి నిదాఘమేఘంబుపోలె గర్జింపుచుఁ బాశుపతాస్త్రంబు బ్రయోగించిన నదియు బహుమాయారూపంబులతో ధగద్ధగప్రభాజాలంబులు దశదిశలం

గప్ప ననేకమృత్యుభటపిశాచభూతరక్షోభుజంగంబులం గ్రక్కుచు నక్కుమిగిలి భయంకరంబుగా వచ్చిన గుహుండు లీలామాత్రంబున నయ్యస్త్రంబును గేలం గొనియె; నయ్యెడ, 83

మ॥ వివిధాస్త్రావళి యాజి వ్యర్థమగుటన్ ♦ వీక్షించి శూరుండు శాం
భవబాహాపటువిక్రమంబు మది సం♦భావించి యత్యద్భుతా
ర్ణవమగ్నుండయి నిల్చె నంత గుహుండున్ ♦ రక్షోవిభుం జూచి వై
భవ మింపొందఁగ బల్కె నిట్లు నగుచున్ ♦ భాస్వద్వచోవైఖరిన్. 84

ఆ॥ సురల విడువు మనుచు ♦ సొంపొంద నే మున్న, చెప్ప లేదె చెవుల ♦ జేర్పవైతి
నీదు లక్షవాహి♦నీబలంబులు దెగ్లె, నీకిరీట మిపుడు ♦ నేలఁ బడియె. 85

తే॥ శూర! యిఁక నైన విడువుమీ♦సురల నెల్ల, విడువ వేనియు నిజభుజా♦విజయ మెసఁగ
నిన్నుఁ బరిమార్తుఁబూర్వంబు♦నీయనుజుని, దారకునిఁ గూల్చినట్లు లఁ♦దథ్యముగను.

—* కుమారస్వామి విడిచిన శూరుఁడు పలాయితుఁ డగుట *—

వ॥ ఇపుడు దయచేసి నిన్ను విడిచెద ననిన గుహునివచనంబులు విని శూరపద్మండు తనబలంబు నెదిరిబలంబు నెఱుంగక బాలుండిట్టి ధంబునఁ బలుకనగునే యని మనంబున విచారంబు వొడమఁ బురంబునకుం జని నిజబలంబులతోడ మఱల నరుదెంచి యితనితోడఁ గయ్యంబు సేయనగునని తలంచి మాయారూపంబున నగరంబునకుం జనియె. గుహుండును శక్తిచేత నప్పుడు సంహరించుటకు సమర్థుండయ్యు నతనిబుద్ధి నెఱుంగఁ దలంచినవాఁడు గాన నూరకుండె; నంత, 86

క॥ హరిముఖ్యసకలదివిజులు, శరజన్ముని గాంచి మ్రొక్కి ♦ సద్వినయమునన్
గరయుగళము మొకుళించుచు, సరభసమునఁ జేసి రెలమి ♦ సంస్తుతుల గడున్. 88

వ॥ దేవా! నీవు సాక్షాత్పరబ్రహ్మంబవు గావున నీలీల లతిమానుషంబులై యుండు, నిద్దురాత్ముని సంహరింప నీ కశక్యంబుగా దైనను వినోదార్థంబు వీని విడిచితివని యనేకవిధంబులఁ బొగడిన వేల్పులం గని మహాసేనుం డిట్లనియె. 89

ఆ॥ దివిజులార! వినుఁడు ♦ తిరిగి యీదనుజుఁడు, సమరమునకు వచ్చుఁ ♦ జలముతోడ
నప్పు డద్దురాత్ము ♦ నణఁగింతు నాజి, నీయర్థమందు సంశ♦యంబు వలదు. 90

వ॥ అనిన విని సర్వసుపర్వులును, భూతగణంబులును, సేనాధిపతులును, గోలాహలంబులం జెలంగి రయ్యవసరంబున నవసంఖ్యాధికలక్షవీరులగు భూతసైనికులును, విగతసమ్మోహులై కార్తికేయునిసన్నిధానంబునం బ్రమోదంబునం బొదలుచుండి రంత, 91

క॥ సేనానాయకు లందఱు, సేనానియనుజ్ఞ వడసి ♦ శీఘ్రంబున న
ద్దానవపురలుంఠనమునఁ, గానిరి మొగసాలఁ జాల ♦ నార్భటు లులియన్. 92

వ॥ అమ్మహాధ్వని విని ద్వారపాలకుం డతిఘోరుండనువాఁడు చతురంగబలసమన్వి

తుండై భూతగణంబుల నెదుర్కొని కయ్యం బొనర్చు నెడ దద్బలంబుల కోర్తలకు
నిలువంజాలక నయ్యసురసైన్యంబులు పరాభవంబుం గాంచె. 93

క॥ అతిఘోరుఁడు రోషంబున, నతిఘోర మయోమయంబు♦నగు ముసలం బు
ద్ధతిఁ గొని వైచెను భూత, ప్రతతులు పరువిడ దిగంత♦పటలంబునకున్. 94

క॥ కని యదియు మేఘనాముఁడు, ఘనశైలం బొకటి బూని ♦ కడుఁగోపమునన్
దనుజునిపై నేసిన నా,దనుజుఁడు ముసలంబుచేత ♦ దానిన్ దునిమెన్. 95

వ॥ మఱియు మేఘుం డమోఘంబగు శరంబు నసురనురంబునం జొన్పిన నతండు
మహారౌద్రంబున దష్టాధరుం డగుచు ముసలంబున వాని యురంబు మోదె నంత
మేఘుం డతిజవంబున నెగసి కనుంగవ విస్ఫులింగములు సెదరఁ గరతలంబునం
గపోలంబులం బగులంజఱచిన నతండు గిరగిరందిరిగి ధరాతలంబునందొఱఁగె,
నంత భూతసైనికులు కోలాహలంబు లొనర్చుచు యోజనోచ్ఛ్రాయంబును,
పురాలంకారంబును నగు గోపురంబును బెకలించి సముద్రమధ్యంబున బృందార
కులు మందరంబువోలె బడవైచిన నందున్న దైత్యులనేకులు హతులైరి. తత్ప
తనవేగంబున మహాకల్లోలజాలంబులు బురంబుల నావరించె. 96

సీ॥ మఱియు భూతాగ్రిముల్ ♦ మహితవిక్రమలీల, నుత్తరదిక్కున ♦ నున్నతమగు
సాలంబుఁ బడఁద్రోసి ♦ చయ్యనఁ బురిఁ జొచ్చి, భూరినిరర్గళ ♦ స్ఫురణ మెరయ
బహుదైత్యబలముల♦బరిమార్చి గృహముల, రత్నకాంచన వస్తు♦రాసులెల్లఁ
గోరిక లింపొందఁ ♦ గొల్లలఁగొని పీక, మరలి వేగంబ కు♦మారుఁ జేరి
రంత భగవంతుఁడగు శంక♦రాత్మజుండు, హేమకూటపురంబున ♦ కెలమిఁ జనియె
జటులకోలాహలంబులు ♦ సందడిల్ల, సకలనిజసైన్యములతోడ ♦ సత్వరముగ. 97

ఆ॥ సురగణంబు లపుడు ♦ సుమవృష్టిఁ గురిసెను, దేవదుందుభులును ♦ దివిని మొరసె
గరిమ వందిజనము ♦ కైవారమొనరించె, నాత్మగుణగణంబు ♦ లాదరమున. 98

వ॥ ఇట్లు గుహుండు హేమకూటపురంబు సేరి నిజభవనంబున నవరత్నసింహాసనా
సీనుండై సైనికుల నిజనివాసంబులకుం జన నియోగించి హరి బ్రహ్మాది నిఖిల
దివిజగణసేవితపదాంబుజుం డగుచు సుఖం బుండె. 99

ఉ॥ అంతట నింగినుండి గిరి♦జాత్మజు దోర్విజయంబుఁ గాంచి య
త్యంతము నిర్భయుం డగుచుఁ ♦ దామరసాప్తుఁడు రాగయుక్తుఁడై
సంతసమొప్ప వారుణది♦శాతరుణీమణిఁ గూడెనో యన
న్నంతయుఁ బశ్చిమాబ్ధిఁ బడి♦యెన్ గళితాంశుకుఁడై రయంబునన్. 100

వ॥ అట శూరపద్ముం డా కేయి పద్మకోమలాసనుతుండై మగుడ కదనం బొనర్చు
టకుఁ జింతింపుచు నిద్రారహితుం డయ్యె; నంత, 101

చ॥ జనకు పరాభవంబుఁ గని ♦ శౌర్యధురీణుఁడు భానుకోపుఁడు
న్మనమున మాయనుం దలఁచి ♦ మంత్రిపురశ్చరణం బొనర్చి య
త్యనుపమయుద్ధపాటవ ము♦దారతఁ గాంచి విచారఖిన్నతన్
దనరెడు శూరపద్మసద♦నంబున కేగి స్వవృత్త మంతయున్. 102

వ॥ ఇట్లని విన్నవించె. 103

క॥ సేనాయుక్తుఁడ నగుచున్, నానాయుధపాటవైన రణంబున వైరిన్
నేన జయింపఁగ నుంటిని, దానవవర! చెప్పనేల ♦ తరలితి నాతోన్? 104

క॥ బాలునితోడను బోరిన, యాలమున జయంబయేని ♦ యపజయమేనిన్
వాలాయం బపయశ మగు, నా లోకంబందు కీర్తి ♦ యబ్బదు సూవే. 105

క॥ అనుమతి యొసఁగు ప్రభాతం,బునఁ జని వాని జయింతు ♦ భుజబల మొప్పన్
వినియెదవు దూతముఖమునఁ,గనియెదవు ప్రమోద మాత్మఁ ♦ గాంభీర్యనిధీ! 106

క॥ ఉరుతరశౌర్యస్ఫూర్తి, న్సురిపతిఁ గెలువ నేని ♦ భండనమందున్
బరగ మగుడి నీకడకే, నరుదేరను తథ్య మిది మ♦హాశౌర్యనిధీ! 107

వ॥ అని పలికిన సుతుని వచనంబులు విని మనంబున సంతసిల్లి శూరపద్మం డతని కిట్లనియెఁ; బుత్రా! నీవు బాలుండవు సంగరకళాకౌశలపాటవంబులు సాలమిం జేసి మహాపరాక్రమాభీలుండగు నబ్బాలుతోడం గయ్యంబుసేయ నశక్యంబై యుండుఁ గావున మనపురంబునకుఁ బూర్వంబు దూతభావంబున జనుదెంచిన వీరబాహుని దర్పలంబులను గదనంబున మదం బడంచి సత్వరంబుగా నరుదెమ్మని తనయున కనుజ్ఞ యొసంగి శూరపద్ముండు నిజగృహంబున సుఖంబుండె, నంత భానుకోపుండు సమరప్రయాణాభిముఖుండై యుండుసమయంబున భూత సైనికులు పురలుంఠనమును, గోపురక్షేపణంబును, సకలవస్తుసంగ్రహణంబును, ప్రాకారపతనంబును, నతిఘోరుని సంహారంబును గావించిరని చారులు విన్నవించిన, 108

మ॥ విని కోపంబున భానుకోపుఁడు మయు♦స్వేగంబ రావించి చ
య్యనఁ దొల్లింటిచేలాగు పట్టణము దీ♦వ్యత్ప్రౌఢి నిర్మించఁ బం
చి నియోగించె సహస్రవాహిను లొగిన్ ♦ సేన ల్మహాకాయుతో
డను భగ్నంబగు కోటఁ బ్రోవ నిశిఁ జం♦డప్రౌఢి దీపింపఁగన్. 109

వ॥ ఇట్లు నియోగించి భానుకోపుఁడు గృహంబున కరిగె నంత మయుండు పూర్వంబట్ల పురంబు నిర్మించి నిజమందిరంబున కరిగె నంత మహాకాయుండును సేనాసహితుండై యారాత్రి మహాదీపప్రభాజాలనిరస్త తమఃపటలుండై తత్ప్రాకారంబు జాగరూకుండై సావధానంబునం గాచుచుండె. 110

—* భానుకోపుఁడు వీరబాహుల నెదిరింప మాయను వేఁడుట *—

తే॥ అంత సూర్యోదయంబైన • యసురసుతుఁడు, కాలకృత్యంబు లెల్లను • గరిమఁదీర్చి
యలపితామహిమాయఁదా • నాత్మఁదలఁచె, నదియు శీఘ్రంబ యచటికి • నరుగుదెంచె.

వ॥ ఇట్లరుగుదెంచిన దాని పదంబుల కెఱఁగి భక్తిపూర్వకంబుగా వినుతించి వీరబాహుకృతంబైన భంగంబు నెఱింగించి కార్యం బెద్ది సేయ ననువగునని విన్నవించిన. 112

ఆ॥ అసురి యనియె నప్పు • డప్పౌత్రుతోడను, బ్రహ్మవిష్ణుముఖసు • పర్వులెల్ల
మిగుల నార్తులైరి • మీచేతఁ గావున, నిపుడు మీకు విజయ • మెట్లులగును? 113

వ॥ అని యిట్లు పలుమాఱుం బల్కిన మాయకు శూరసుతుం డిట్లనియె. 114

తే॥ పౌత్రుపై నీకు మదిలోనఁ • బరమకరుణ, గలిగెనేనియు నిప్పుడు • గదనభూమి
వీరబాహుని గెలువంగ • విపులపటిమ, నాయుధమొసంగవలయునో • యంబ! నాకు.

వ॥ అని వేఁడిన భానుకోపునకుఁ బితామహియగు మాయ సమరంబున విమతమోహకరంబగు నస్త్రం బొసంగి నీకిద్దినంబున రణంబున దీనివలన విజయంబగు పొమ్మని పల్కి యమ్మందిరక్కసి యదృశ్యయయ్యె; నంత శూరాత్మజుండు సంతోషంబు దనర ననుపమానంబగు మాయాస్త్రంబును ధనుస్తూణీరంబులును వజ్రసన్నిభంబగు కవచంబును, పవన శమనాగ్ని చంద్రార్క బ్రహ్మవిష్ణు శరంబులును, నస్త్రరాజేశ్వరంబగు పాశుపతాస్త్రంబుఁ గొని వేర్వేర దశసహస్ర వాహినులగు రథ గజ తురంగంబులును, వింశతిసహస్రవాహినులగు కాల్బలంబులును నడతేర మహారవంబులెసంగ సంగరోత్సుకుండగుచు వెడలె నపుడు. 116

సీ॥ పటుతర కాహళ • పటహ భేరీధ్వనుల్, బ్రహ్మాండభాండంబుఁ బ్రిబ్బికొనియె
సైన్యసముద్ధూత • జగతీపరాగముల్, జలజాతమిత్రమం • డలముఁ గప్పె
ఘనవారిధారలఁ • గడు తుండములఁ గ్రోలి, వమథువుల్ సింధుర • వ్రజము గురిసె
నభ్రార్కపథముల • నవలీల లంఘించి, జవమొప్ప సైంధవ • చయము జనియెఁ
జటులరథచక్రనినదముల్ • సందడిల్లె, నగ్నినేత్రులు కృష్ణాంగు • లైన దనుజ
భటులు పటుతరవిక్రమా • ర్భటులు నగుచు, వితతకోలాహలంబుల • వెడలిరెలమి.

చ॥ గజములు తేరులుర్ హరులు • గాల్వురు గిక్కిరియంగఁ జామర
ధ్వజములు ఛత్రము ల్బహువి • ధంబుల నీడ లిడంగ నయ్యెడన్
బ్రజనితమా తమం బతుల • భాసితరత్నవిభూషణాయుధ
వ్రజఘనదీధితిచ్ఛటల • వారిత మయ్యె దిగంతరంబులన్. 118

వ॥ ఇవ్విధంబున భానుకోపుండు సకలసైన్యంబులతోడఁ జని నిమునమాత్రంబున నిజపురద్వారంబున నిలిచి సహస్రాశ్వముఖుండను దూతం గని యిట్లనియె. 119

క॥ చని వేగ వీరబాహుం, డనిమొడి నద్దూతతోడ • నస్మద్వచనం
బును దెల్పుము నే నిప్పుడు, నిను మార్కొనవత్తు నాజి • నిలువు మటంచున్. 120

వ॥ అని పనిచిన నద్దూత సత్వరంబునం జని వీరబాహున కవ్విధం బెఱింగించిన, 121

క॥ విని వీరబాహుఁ డపు డ,ట్లన కానిమ్మని కుతూహ ♦ లమ్మున దలిర్పన్
బనిచి వెస వాని నంతట, ఘనమతి వీరుండు గుహుని ♦ కడ కరిగి తగన్. 122

ఆ॥ పరమభక్తితోడ ♦ భ్రాతృసమేతుఁడై, ప్రణుతిఁ జేసి చరణ ♦ పంకజముల
కధికవినయ మొప్ప ♦ నంజలి గావించి, పజ్జనిలిచె నపుడు ♦ భావ మలర. 123

వ॥ అంత సర్వభూతాంతర్యామియగు నక్కార్తికేయుఁ డతని కిట్లనియె. అద్దురాత్ముండు నీతోడఁ గయ్యంబునకుఁ జనుదెంచినవాఁడు గావున నీవు సహస్రవాహినులగు భూతగణంబులఁ గూర్చుకొని సేనాధిపతులగు నష్టాధికలక్షవీరులతోడఁ జని వానితోడ సమరంబునకు సమకట్టు మతండు మాయాస్త్రంబు మీపైఁ బ్రయోగించు నయ్యస్త్రంబును మహోజ్జ్వలంబగు మదీయ శక్తి యప్రతిహతంబుఁ గావించునని చెప్పి నియోగించిన వీరబాహుండు స్కందునకు నమస్కరించి రథారూఢుండై భూతగణసింహనాదంబులును, పటహాది వాద్యఘోషంబులును రోదసీకుహరంబు నతయు నిండ సంగరాంగణంబుఁ జేరె నంత.

క॥ దానవులు ప్రళయమేఘము,హానాదంబులు సెలంగ ♦ నాయుధతతు లెం
తేనియు భూతగణంబుల,పై నిర్జరసేనపైనఁ ♦ బఱపిరి కడిమిన్. 125

వ॥ ఆసమయంబున విదారితచరణంబులును, విదళితకరంబులును, విలూననాసాపుటకర్ణంబులును, విఖండితశీర్షంబులును, విచ్ఛిన్నకవచంబులును నై భూతసైన్యంబులు దైన్యంబు నొందుచు నేలం గూలుటం గని మహావీరులగు సేనాధిపతులుం దమతమ బలంబులం బురికొల్పికొని దనుజబలంబులపై నురవణించి పోరు ఘోరంబుగా సల్పు నెడ నద్దనుజవీరులు తదీయాయుధాఘాతంబుల శిరంబులు కరంబులు దెగి రుధిరంబులు దొఱఁగ నేలం గూలువారును, శరంబు లురంబులు గాడిచనిన బరవశులై కళవళంబొందువారును, సదమదంబుగా గదలమోదినఁ బిండీకృతగాత్రులై మడియువారును, ఖేదంబులఁ బొదలు పాదంబులఁ బట్టి మేదినిం జదిపి డిగ్గరం ద్రిప్పి తెప్పరంబుగా నుప్పరంబున కెగయవైచినఁ దెప్పున నప్పయోనిధిం బడువారును నై యిప్పగిది బహుబలంబులు హతంబు లయ్యె; నంత,

సీ॥ త్రిపురదానవులనుఁ ♦ దెగటార్చు హరులీల, విజయంబు రాజిల్ల ♦ వెలయునవియు
బంచాయుధంబులై ♦ బహుళనీల తనువుల, హరియట్ల దనుజుల ♦ నణచునవియు
నాదికాలము దంష్ట్రి ♦ హరుసూనుఁడును బోలి, దితిజదంతములు ఛే ♦ దించునవియు
గిరివరాకారముల్ ♦ కరివక్త్రములు మీరఁ, గ్రౌంచతారకులట్ల ♦ మించునవియు
నగుచు జెలరేగి ఘాతంబు ♦ లద్భుతముగ, నమితవిక్రమధుర్యులై ♦ నసురవరుల
జక్కడంచెను నిస్తుల ♦ సాహసమున, కదనమున నిట్లు నానాప్ర ♦ కారములను. 127

—✱ వీరబాహు భానుకోపుల ద్వితీయయుద్ధము ✱—

వ॥ మఱియు నజుని శూలంబునం గ్రుచ్చివైచిన మహాభైరవుండునుం బోలె గొన్ని

భూతంబులు సెలంగె. మఱియుం గొన్ని భూతంబులు పరాక్రమసమేతంబులై
దనుజబలంబులం గలంచునెడఁ గొంద ఱసురు లురవణించి పూర్వకాలంబున
హరిబ్రహ్మల జయించి విక్రమావక్రంబగు చక్రంబునం గూలిన జలంధరు
చందంబున భూతసైనికులచేత హతులైరంత, వీరబాహుండు నిష్ఠురశరాసారం
బులు గురియుచు రక్కసివీరుల నుక్కణంచుటం గని భానుకోపుండు కోపంబు
గదురఁ జాపంబు గుణారావంబు గావించి మహారవాటోపం బెసఁగ సంగరం
బొనర్పఁ దొడంగిన వీరబాహుండును విదారితాసురసమూహుం డగుచు నతని
తోడం దలపడియె; నప్పుడు, 128

చ॥ ఇరువు రొగిం బరస్పరజ ♦ యేచ్ఛఁ జెలంగ నభంగశౌర్యవి
స్ఫురణల గబ్బిబెబ్బులుల ♦ పోల్కి నిశాతశిలీముఖావళుల్
గురిసిరి తచ్ఛరంబులును ♦ గ్రూరభుజంగములట్లు పోరి భీ
కరతఁ బరస్పరాహతులఁ ♦ గ్రుక్కున భంగమునొందె నన్నియున్. 129

వ॥ మఱియు నయ్యిరువురు రథారూఢులై కోలాహలంబు లొనర్చుచు నిమిషమా
త్రంబున ననిమిషలోకంబును, బ్రహ్మవిష్ణులోకంబులును, సాగరంబులును, దిక్కు
లును, జక్రవాళాచలంబును దాయుచు నత్యద్భుతంబుగ నాలం బొనర్చి రంత,

శా॥ కోపస్ఫూర్తిని భానుకోపుఁడు మహా ♦ క్రూరంబుతో విస్ఫుర
ద్రోపంబుల్ గడు వీరబాహునిపయిన్ ♦ దుర్దాంతతన్నాటె నా
టోపం బొప్పఁగ వీరపుంగవుఁడు దో ♦ ర్దర్ప రోష మెంతేనియున్
దీపింపన్ సమరాంగణంబున లస ♦ త్తీవ్రప్రతాపంబునన్. 130

మ॥ సునిశాతాస్త్రసహస్రముల్ గురిసి త ♦ త్సూతుం బడంగూల్చి కాం
చనరత్నస్ఫురితోన్నతంబు రథమున్ ♦ జక్కాడి, యత్యంతవే
గ నిరస్తానిలసైంధవప్రకరమున్ ♦ ఖండించి యాభీల సిం
హనినాదంబులు జేసి భూనభము ల ♦ ల్లాడన్ జయాభ్యున్నతిన్. 131

వ॥ అంత దైత్యుండు వేఱొక్కరథం బెక్కి శరాసనంబున శరంబులు సంధించునంత
లోన నవ్వీరబాహుండు దద్భుజాంతరంబున శరసహస్రంబులు గీలు కొల్పె నది
గనుంగొని భూతంబులు కోలాహలంబు లొనర్చి మించె; 132

ఉ॥ అత్తఱి భానుకోపుఁడు మ ♦ హాగ్రహ మొప్పఁగ వారుణాస్త్రము
ద్వృత్తిని బూని వైవ నది ♦ దిక్తటమున్ నభమున్ జగంబు లు
ద్వృత్తరలీలఁ గప్పి కడు ♦ నంబుధు లేడును ఘూర్ణిలంగ, భా
స్వత్తమఘోష మొప్ప వెస ♦ వచ్చె భయంపడ భూతసంతతుల్. 133

వ॥ ఇట్లుఁ వచ్చిన గనుంగొని వీరబాహుండు, 134

ఉ॥ ఒక్కెడ విస్ఫులింగములు ♦ నొక్కెడ మంటలు, ధూమ మొక్కచో
నొక్కెడ దీప్తి ఘోషములు ♦ నొక్కెడ నిండ, నదీసముద్రముల్

గ్రక్కున ఘోషిలంగ భువి గంపమునొందఁ జలింపఁ దారకల్
మిక్కిలి పావకాస్త్రము సమిద్ధరణిన్ బఱపెన్ సముద్ధతిన్. 135

వ. ఇట్లు పరపిన నది యవ్వారుణాస్త్రంబు వారించి భానుకోపునిం డాసిన నద్దనుజుండు గనుంగొని వాయవ్యాస్త్రంబు సిగుడ్చె నంత నదియును లోకంబులు భయోద్రేకంబు నొంద నేరికిని దుర్నిరీక్ష్యంబై మహాసంరావభీషణంబు నగుచు నాగ్నేయంబు నాక్రమించి యవ్వీరాగ్రణిపైఁ బరతెంచు నెడ, 136

మ. కడుకోపంబున వీరబాహుఁడు మహోగ్రంబైన నాగాస్త్రమున్
విడిచెన్ భీషణరావ మొప్ప నదియున్ విశ్వంబు నిండారఁగా
పడగల్ విప్పి మహాగ్నికీల లడరన్ బల్మారు నిశ్వాసముల్
గడలన్ గ్రమ్మగ నేగుదెంచి యవలీలన్ మ్రింగె వాయవ్యమున్. 137

వ. అంత భానుకోపుండు దానిం గని గారుడాస్త్రంబుఁ బ్రయోగించిన నదియు ననేకతార్క్ష్యరూపంబులతోడఁ జని గరుద్వాతఘాతంబులై నాగవ్రాతంబులు తూలంబులకరణి గగనంబునం దూల సరిత్సాగరంబులు కలంకంబొంద నిజతుండంబున నప్పన్నగాస్త్రంబు విదళించె నప్పుడు. 138

మ. అతులక్షేముఁడు వీరబాహుఁడు నితాంతామర్షదుర్దాంతతన్
బ్రతికోధించుచు వెండియున్ నిజభుజాపాండిత్య మేపారగా
నతిభీమం బతిశౌర్యధామ మనివార్యత్రాససంధాయకం
బతిదీప్తంబు వృషాస్త్రమున్ బఱపె నత్యంతంబు ఘోరంబుగన్. 139

సీ. గళనిరర్గళరణద్ఘంటాగణత్కార, ఘనకింకిణీధ్వనుల్ గడలఁ బ్రోయఁ
గులధారుణీధరకూటపాటనమహా, పటుతుంగశృంగముల్ భాసిలంగ
సప్తపారావార సంక్షోభకరచల, ద్వాలజాతానిల వ్రాత మడరఁ
గటుకంఠ మదదంతి కర్ణతాళవిదార, నిష్ఠురధ్వానముల్ నివ్వటిలఁగ
జటులఖురపుటఘాతసంజాయమాన, బహురజోవ్రజ మర్కబింబంబుఁ గప్ప
దనుజసైన్యంబులెల్లను దల్లడిల్ల, నావృషాస్త్రంబు చనుదెంచె నతులమహిమ. 140

వ. ఇట్లు చనుదెంచి పతంగాస్త్రంబును గబళించి వితథంబు గావించి దానవుం గదియం జనిన నంత నద్దానవుండు రౌద్రోద్రేకంబున యామ్యబ్రాహ్మ్యంబులు సమంత్రకంబులుగాఁ బ్రయోగించిన నవియు మహాఘోషంబుగా నిర్ఘోషింపుచు నరుదెంచి యావృషాస్త్రంబును గాంచి భయకంపితంబులై ప్రణామంబు లొనర్చి యథామార్గంబునం జనియె; మఱియు నసురుండు మహాదారుణంబగు నారాయణాస్త్రంబుఁ బరపిన నదియు ననేక నారాయణాకారంబును, ధృతపంచాయుధంబును, యతి భీమంబు నగుచు మహాజవంబునం జనుదెంచి వృషాస్త్రంబుతోఁ బోరుచున్నఁ గని దానిపై వీరబాహుండు వీరభద్రాస్త్రంబుఁ బ్రయోగించిన నయ్యస్త్రం బనేకకోటివీరభద్రపరివృతం బగుచు, 141

మ॥ కడురోషంబున నాకసంబు వణఁకన్ ♦ గంపింప భూభాగముల్
జడధుల్ ఘూర్ణిల భూధరంబు లదురన్ ♦ జండప్రచండోద్ధతిన్
మిడిగుఱ్ఱుం బ్రళయాగ్నికీల లడరన్ ♦ భీమాట్టహాసంబుతో
వడి నేతెంచె మహోగ్రమై కిలకిల♦ధ్వానంబులున్ మీరఁగన్. 142

వ॥ ఇట్లేతెంచి నారాయణాస్త్రంబు నివారించి యురుగుదెంచు దానిం గని, 143

ఆ॥ అంత భానుకోపుఁ ♦ డధికరోషంబునఁ, బాశుపతముఁ బఱపెఁ ♦ బ్రళయమార
వీరబాహుఁ డదియు ♦ వీక్షించి వేగంబ, యదియె విడిచె శౌర్య♦మతిశయిల్ల. 144

వ॥ అప్పు డా పాశుపతాస్త్రంబు లుభయంబులును, విజృంభితప్రళయదహనసంరంభ భీషణంబులు నుజ్జ్వలితసంవర్తసమయమహానలజ్వాలాభీలంబులు నుద్ధ్వాంత హాలాహలభయదంబులు నుదీర్ణవిలయమహార్ణవంబులు నుద్భూతకల్పాంత పుష్కలావర్తకాంభోధరంబులును, శృంఖలవిహారదుర్భూతప్రేతపిశాచనిచయంబులు నుదయదనంతాద్యష్టనాగేంద్రసముజ్జ్వలంబులు నుదంచితాఖువాహనగణనాథగణసమాకులంబులు నురుమోహాకారకంబులు నుదగ్రదంష్ట్రాకరాళముఖమృత్యుగణభీకరంబులు నుత్పాదిత మహానృసింహశరభసముదయ భయానకంబులు నుద్దీపితఖట్వాంగ ముసల ముద్గల భిండివాల ముసుండిక పరిఘ తోమర శతఘ్ని ప్రాస బాణ టంకాంకుశ గదా శక్తి చాప పాశ కుఠార త్రిశూల కరవాల హరిదినీప్రముఖ నిఖిలాయుధభాసమానంబులు నుత్తుంగభూత పిశాచ సింహ శార్దూల శరభ శతాంగ మాతంగ తురంగ వృషభ విమానాద్యనేకవాహనారూఢ నానారుద్రగణపరివేష్టితంబులు నున్నిద్రభద్రబ్రాహ్మ్యశ్రీ పౌరందర వారుణ వాయవ్య యామ్యాదిమహాస్త్రపరీవృతంబులు నుద్వేలగర్జాభర్జమాన జగజ్జాలంబులు నున్మీలితపరాక్రమంబులు నగుచు ఘోరంబుగా బరస్పరంబుఁ బోరిన నయ్యుద్ధంబు పరిశుష్యన్నదీసముద్రంబును, బరిదహ్యమానభూనభోంతరంబును, బ్రకంపితదిగంతదంతావళంబును, బ్రశమితౌర్వానలజ్వాలారవంబును, బరిభూతజంఝామరుద్ఘోషంబును, బరిత్రస్తపన్నగరాజాదివరాహకూర్మంబును, బరిధూయమాన నానాజంతువిరచితహాహాకారంబును, బరితప్యమానతారాగ్రహంబును, బరిస్ఫోటితాజాండకటాహంబును, బ్రతిముహుర్భయాకులజలజాలయాస్వయంపరిరంభజనార్దనంబును, బరిసమాగమనిరంతరాసక్తమునిపత్నీకదంబంబును నయ్యె; నయ్యెడఁ బ్రళయకాలంబునంబోలె ననేకసైన్యంబులు హతంబు లయ్యె; భీషణభీషణంబును, మోహకమోహకంబును, మృత్యుమృత్యుప్రదంబును, సర్వభూతభయావహంబును నగు నమ్మహాస్త్రఘోషంబాకర్ణించి శూరపురనివాసులగు శూరులందఱు భయభ్రాంతులైరప్పుడు,

క॥ ఇది యేమొకొ యని శూరుఁడు, మదిని విచారంబునొంది ♦ మసలక వేగం
బది యరయుటకై దూతను, బదపడిపు త్తెంచెఁ గార్య♦పటిమ దలిర్పన్. 146

వ॥ అంత నద్భూతవృత్తాంతంబు నంతయు నెఱింగివచ్చి శూరునితోఁ జెప్పిన, 147

క॥ శూరుం డిట్లని పల్కెను, వారలతో వీరబాహు ♦ వరశౌర్యకళా
ధౌరేయు దూతయని యాతీరుఁదలంచితి నొకింత ♦ తెలియక మదిలోన్. 148

వ॥ అని ప్రశంసించుచుండె నంత నప్పాశుపతాస్త్రంబు లట్లతిభయంకరంబులుగాఁ బోరి తమసమరంబున లోకంబులకుఁ బ్రళయం బగునని తలంచి నివృత్తంబులై పరిహార్తలం జెందినఁ గనుంగొని దేవతలు మౌనంబున నూరకుండి రంత, 149

—* భానుకోపుఁడు పింఛబాహ్యసుల మోసముచే సముద్రమున ద్రోయుట *—

తే॥ భానుకోపుండు విధ్వస్త ♦ సేనుఁడగుచుఁ, గపటమునఁ జనియభ్రమా ♦ ర్గముననుండె
దత్పలాయనమెఱఁగి భూ ♦ తములగములు, జటులకోలాహలంబులు ♦ సలిపెఁ బెలుచ.

క॥ దానవుఁడు గగనపథమునఁ, గానఁబడక భీతిచేతఁ ♦ గడుఁదూలఁగెన నా
ఘామండప్పుడు విగళ, ద్భానుండై పడియె నపర ♦ పాథోనిధిలోన్. 151

ఆ॥ అఖిలవీరులంత ♦ నలభూతతతితోడ, శివకుమారునంఘ్రి ♦ సేవఁ జేసి
యెల్లివృత్తమనుచు ♦ నీప్సిత మలరంగఁ, జని వసించిరెలమి ♦ స్వస్థులగుచు. 152

వ॥ ఇట్లు జయంబుఁగాంచి భూతసైనికు లరుగుట గనుంగొని భానుకోపుండు దురంత చింతాక్రాంతుఁడై, 153

క॥ ఇపుడే నూరకపోయిన, నపజయమగుననుచు మగుడ ♦ నలమాయాస్త్ర బపరిమితమోహాకరమును నిపుణుండై పఱపె భూ ♦ తనిచయముమీఁదన్. 154

వ॥ అదియును గల్పాంతఘనాఘననిర్ఘోషభీషణంబై యనేకాదిత్యసంకాశంబగుచు నరుగుదెంచి సకలసేనాపతులతోడ భూతగణంబుల మూర్ఛాక్రాంతులం జేసి బంధించి శుద్ధోదకార్ణవమధ్యంబునఁ బడవైచె నంత సంతోషంబున భానుకోపుండు తండ్రిసముఖంబునకుం జని, 155

క॥ వైరిని జయించివచ్చితి, వారధిఁ ద్రోచితిని వీర ♦ వర్గము నెల్లన్
ఘోరాజి నల్లి బాలుని, బీరం బణఁగింతు బాహు ♦ వీర్యం బెసఁగన్. 156

వ॥ మఱియు, 157

క॥ వారిజభవాది దివిజులఁ, గారాగృహబద్ధులుగను ♦ గావింతును నా
శూరుఁడు విని సుతువచనము, భూరికుతూహలము మదిని ♦ బొదలంగ దయన్.

వ॥ అతనిం గౌఁగిటం జేర్చి శిరంబు మూర్కొని చెంగటం గూర్చుండ నియోగించి రత్నకోటీరాద్యనేకదివ్యభూషణంబు లొసంగి ప్రియంబు సెప్పి యెల్లి సకలదేవతల మదీయాజ్ఞఁ జయించుమని యాదరించె; నంత నతనియనుజ్ఞను భానుకోపుండు గృహంబునకుం జనియె; నట విబుధులు విషణ్ణహృదయులై వీరుల విపద్దశ విన్నవించుటకు గుహునవిధంబుఁ జేరి రంతకు మున్న నారదుచేత విదితవృత్తాంతుండై, 159

—* కుమారుండు వీరబాహ్వాదుల సముద్రమునుండి లేవదీయుట *—

క॥ శివసూనుఁ డపుడు మాయా,స్త్రవిముక్తినిఁ జేసి వీర ♦ సంఘంబు నిలన్
జవమునఁ దోడ్కొని రమ్మని, రవికోటిద్యుతిని శక్తి ♦ రహి ననుపుటయున్. 160

మ॥ ప్రళయాంభోధరవిస్ఫురతులిత శుం♦భద్ఘోషసంరంభమున్
వెలయన్ గాఢతమాంధకారపటలీ ♦ విధ్వంసనాభీలమై
జ్వలదుద్వేలవిషాగ్నికీల లడరన్ ♦ ఝంఝామరుద్వాతముల్
బలు ఘోషింపఁగ లోకసంఘములు కం♦పంబొంద నాతేనియున్. 161

క॥ రవి చంద్ర విష్ణు పద్మజ పవనాగ్ని కృతాంత వజ్ర ♦ వరుణాస్త్రంబుల్
స్తవము లొనర్చుచుఁ దోడన, యవిరళగతి రాఁగ భీమ♦గార్భటు లొప్పన్. 162

వ॥ సత్వరంబుగా శక్తి చనుదెంచ నద్దానిం గని సముద్రుండు భయకంపితవిగ్రహుండగుచు నాచేయు నపరాధం బొక్కింతయైనం గలదే; నీకు రక్షణీయుండనని స్తుతిశతంబులు సేయుచు ననేకదండప్రణామంబు లాచరించిన, 163

క॥ శరనిధిని మనిచి మాయా,పరిమోహితమైన వీర♦వర్గము లేపెన్
వరపటిమ శక్తి యంతట, నురుబలు లవ్వీరు లబ్ధి ♦ నుబ్బితు లగుచున్. 164

వ॥ సకలలోకపావనియగు యాశక్తిం గని ప్రణమిల్లి పూర్వకాలంబునఁ దారకమాయామోహితులగు మమ్ము సంరక్షించి తిప్పు డిమ్మహోదధివలనఁ గాచితి నీకెయ్యది ప్రత్యుపకృతి సేయంగలవారమని స్తుతించిన, శక్తి వారల కిట్లనియె.

క॥ వెస దనుజునిమాయాస్త్రం, బసదృశమహిమన్ బొకార్చి ♦ యాదట మిము నిం
పెసఁగఁగఁ దోడ్తోని రమ్మని, పొసఁగ ననుం బనిచె గుహుఁడు ♦ భూరికరుణతోన్.

వ॥ అది గావున మీర లరుదెండని పల్కి యప్పుడ మరలి గుహుం జేరె. 167

ఆ॥ వీరబాహుఁ డపుడు ♦ వీరుల సేనా,ధిపతులఁ జూచి పలికె ♦ దితిజపురము
క్రోశమాత్ర మిటకుఁ ♦ గ్రూరత దానవుఁ, డందు నుండు దర్ప ♦ మతిశయిల్ల. 168

వ॥ వాఁడు సకలనిలింపుల మోహింపంజేసి నిప్పుడప్పట్టణంబు సొచ్చి యుంతనంబు జేసి యనలంబు దరికొల్పిన దాన నలిగి దానవుం డరుదెంచు నప్పు డబ్భానుకోపు రూపుమాపెద; నట్లుగానిచో శరశరాసనయుక్తుండనై యగ్నిప్రవేశంబుఁ జేసెద ననవుడు, 169

తే॥ వీరబాహునివిధమున ♦ వీరవరులు, భానుకోపుని బరిమార్పఁ ♦ బ్రతినవట్టి
సారెకోలాహలంబులు ♦ సందడిల్ల, దితిజనగరంబు పశ్చిమ ♦ దిశకుఁ జనఁగ. 170

మ॥ వరసింహాసనరూఢుఁ డంత కవిభా♦స్వద్దీపజాలుండు భా
స్వరమాయాతనయుండు వ్యాఘ్రముఖుఁడన్ ♦ ద్వారక్షకుండొప్ప ద
ద్గురుకోలాహల మాలకించి మదిలోఁ ♦ గోపంబు దీపింప, వి
స్ఫురణన్ సైన్యసమేతుఁడై వెడలి యా♦ ఘాతాళిపై వచ్చినన్. 171

వ॥ అయ్యవసరంబున భూతసైనికులు సమరసన్నద్ధులై యురవణించి వివిధాయుధం బులును, మహీధర మహీరుహాశోపలంబులును, రోషణ భీషణులగుచు, నొక్క పెట్టఁ బ్రయోగించిన వనేకులగు దనుజులు రుధిరంబు దొఱఁగ నేలంగూలి రపు డది గని వ్యాఘ్రవక్త్రుం డలుకవొడమినమనంబున వెడలి శూలంబునఁ దత్ప ర్వతవృక్షోపలంబులు విదళించి కోలాహలంబు లొనర్చె. 172

ఉ॥ అంతట భూతసైన్యవిభుఁ ♦ డద్భుతశౌర్యుఁడు సింహుఁ డార్చి క
ల్పాంతపయోదఘోషముల ♦ నాజికి రాఁ గని వానిమీఁద న
త్యంతము శూలముం బరపె ♦ దైత్యుఁడు వాఁడును దైత్యుమీఁద దు
ర్దాంతత శూల మేసె నవి ♦ దాకి పరస్పర మొందె భగ్నతన్. 173

వ॥ అంత. 174

తే॥ సింహుఁ డురుశౌర్యనిర్జిత♦సింహుఁ డగుచు
వ్యాఘ్రవక్త్రుని బడఁగూల్చె ♦ నవనిమీఁద
విరులు వర్షించె నప్పుడు ♦ విబుధగణము
వీరబాహుండు సంతోష ♦ వీచిఁ దేలె. 175

—✱ వీరబాహ్వాదులు శూరపద్ముని పురంబు ధ్వంసముఁ జేయుట ✱—

వ॥ తదనంతరంబు సకలభూతవీరులు పరాక్రమోదారు లగుచు నప్పురంబునం బ్రాకారగోపురంబులఁ బడఁగూల్చినఁ దత్పతనంబున దత్రత్యులగు దైత్యు లనేకులు హతులైరప్పుడు మఱియు నప్పట్టణంబు రాజవీధులు సొచ్చి చెచ్చెర రక్కసులం జక్కాడి యనేకగోపురవిమానసదనంబుల నిర్మూలనంబు సేసి యార్పుచు నెదురైన చతురంగబలంబులఁ బీచ మడంచుచు విజృంభించి రంత,

తే॥ వీరబాహుండు కోపంబు ♦ విస్తరిలఁగఁ, బవనపావకబాణముల్ ♦ పటిమఁ దొడఁగి, యేకకాలంబునందు దై♦త్యేంద్రుపురము, నిర్దహింపంగఁ బఱపెను ♦ నిర్దయతను.

వ॥ అంత నగ్నిదేవుం డసురపురంబు దహించుటకు భయంపడి చింతాక్రాంతుం డగుచు నొక్కింతసే పూరకుండి వీరబాహుండు మత్ప్రయోక్త యగు; నాకు భయంబు నొందం గారణమేమని, ధైర్యం బవలంబించి మహారవంబు లడర జ్వాలామాలావృతుం డగుచు నగరంబంతయు దహింపందొడంగిన నప్పుడు, జ్వాలామాలికలకు నాకసంబున గ్రహనక్షత్రంబులు పరిభ్రమించె; నిశాంతం బులు విడిచి దనుజ లాశాంతరంబులకుఁ బరువులిడి రది గనుంగొని దూతలు శూరపద్మునసన్నిధిం జేరి యిట్లనిరి. 178

క॥ వరబలుఁడు భానుకోపుఁడు, పురిచేరినయంత వీర♦భూతగణంబుల్
శరధి శరజన్మశక్తిని, పరివర్జితమోహు లగుచుఁ ♦ బటుబల మొప్పన్. 179

వ॥ భవత్పురంబుపై నురవణించి వ్యాఘ్రముఖవక్త్రప్రముఖులగు ననేకదైత్యులం బఱి

మార్చిదశసహస్రయోజనపరిమితంబగు పట్టణం బనలంబునభస్మీభూతంబుగావిం
చిరిప్పటికి నయ్యనలంబు శమింపదయ్యె; ననవుడు దైత్యేంద్రుండు దద్వచనం
బులు విని రోషరూక్షేక్షణుం డగుచు నాక్షణంబ వహ్నిప్రశమనార్థంబు మహో
న్నతంబులగు మేఘరాజంబుల నియోగించిన, 180

మ॥ అవి యెంతేనియు గాంతరూపముల నుద్యత్ప్రౌఢిఁ జూపట్టి య
ద్దివి సేమన్ బ్రశమింపఁజేసిన శిఖిన్ ♦ ధీరుండు వీరుం డితం
డు వధించెన్ మఱి చేయకున్న దనుజుం ♦ డున్ శృంఖలాబద్ధులన్
భువి గావించును మమ్ము ఖేదములకున్ ♦ మూలమ్ము లీకార్యముల్. 181

వ॥ అని చింతించి దురాత్ముండగు నీయసురచే గారాగృహబద్ధులగుటకంటె జగ
త్కర్తయగు నిమ్మహామహునిచేత నిధనంబు మేలని నిశ్చయించి యజ్జలధరంబులు
గర్జారవంబు లొనర్చుచు జగం బంతయు గాఢాంధకారావృతంబు గావించి
కార్కొని మిన్నుఁ దన్నిపన్ని యెడతెగని జలధారలు భోరునఁ వర్షించుచు న
ప్పావకు నుపశమింపఁ జేసె; 182

గీ॥ అంత వీరబాహుఁ♦డది గాంచి మాయచే, దానవేంద్రచోది♦తంబు లైన
ప్రళయకాలమేఘ♦పటలంబులో యని, లోలహృదయుఁడగుచు ♦ జాలినొందె.

వ॥ తదనంతరం బా గానవిద్యావిశారదుండగు నారదుం డతనికడకుంజని శూరప్రేరి
తంబులగుచు నిమ్మహాజలధరంబులు సంవర్తకారంభంబులై వర్షించు నట్లగుటం
జేసి తత్ప్రశమనార్థంబుగా నీవు బాడబాస్త్రంబుఁ బ్రయోగింపవలయునని
చెప్పి చనియె. 184

తే॥ వీరబాహుండు ధైర్యంబు♦వి స్తరిలఁగ, బాడబాస్త్రంబువరపెనోః♦పటిమమెఱయ
నదియు జ్వాలావళీవృతం♦బగుచు వేగఁ, దజ్జలంబులు గ్రోలె ను♦దారపటిమ.

వ॥ అంత నమ్మహాజలధరంబులు నిస్సారంబులగుచుఁ గొన్ని ధరాతలంబునఁ బడియె;
గొన్ని గుహునామస్తవంబునఁ బ్రాప్తబలంబులగుచుసముద్రంబునొందె; నయ్యవ
సరంబున సురలు విరులను గురిసిరి, యచ్చర లాడిరి, గంధర్వులు పాడిరి, సకల
జగజ్జనంబులు సంతోషంబునం బొదలిరి. 186

క॥ దూతముఖంబున శూరుం, డీతద్వృత్తాంతమెల్ల ♦ నెఱిఁగి మది సము
ద్భూతంబగు కోపంబున, సూతునిఁ గని రథముఁ దేఱ♦ సూచించుటయున్. 187

—* హిరణ్యుండు తండ్రియగుశూరునకు హితంబు సెప్పుట *—

వ॥ ఆసమయంబున మహామాయావియు మహాబలసంపన్నుండును, పరీక్షావిచక్ష
ణుండును, పాతాళరక్షకుండును, త్రిశిరస్కుండును, హిరణ్యనామకుండునగుతన
యుండు శూరపద్మునిముఖంబున కేగి ప్రణమిల్లి వినయంబున నిట్లనియె. 188

చ॥ సురగణమెల్ల బాధలను ♦ స్రుక్కఁగ జేయుటఁజేసి యాయువు
న్నిరియు బలంబు పోయు నిది ♦ సిద్ధము సెప్పెడిదేను దానవో

తత్కారమున కిప్డు దైవగతి ♦ తప్పినయట్లనఁ గానవచ్చె దు
ష్కారమగు కార్యమింక జన♦కా! విను పల్కెద నొక్కవాక్యముల్. 189

క॥ సుర లేతావత్కాలము, కరము మహాపదల జగతిఁ ♦ గాసిలిరిపు డా
హరసుతుఁడు వారి నందఱిఁ, గరుణాలోకమునఁ బ్రోవఁ♦గా జనుదెంచెన్. 190

వ॥ వినుము హరిబ్రహ్మాది విజయంబు మన కీశ్వరవరంబువలనఁగదా యట్లు బలంబిచ్చిన యమ్మహాదేవునకు మగుడ మనబలంబు హరింప దొడ్డభారంబౌనో? శివాజ్ఞాను వర్తులగు సుజనులు శుభంబులు వడయుటయుఁ దదాజ్ఞ నుల్లంఘించు దుర్జనులు దుర్గతిం గాంచుటయు సత్యంబని నీవెఱుంగవే? మున్ను మహాబలపరాక్రములగు త్రిపురాసురులును, గజాంధక, జలంధర, మండవ్యాఘ్రాసురులును, మదనుండును, నంతకుండును, మత్స్య కూర్మ వరాహ నారసింహ వామనులును, పంచరావణప్రముఖులును, శివాజ్ఞోల్లంఘనంబునం జేసిగాదె నశించిరి? గంగాగర్వాపహరణంబును, కాలకూటభక్షణంబును, యింద్రదోర్స్తంభనంబును, పితామహశిరఃకృంతనంబును, హరిరక్తపానంబును, కపాలమాలికాధారణంబును, నజీర్ణరూపాపస్మారపాదాధఃకరణంబును, నివి యాదిగాగల మహాదేవు కృత్యంబులు సంభావ్యంబులై యుండుగావున, 191

క॥ అతనికుమారునితోడను, బ్రతికూలించుటయు ధర్మ♦పద్ధతియగునే
దితిజాధీశ్వర! బాలుం, డితఁడీశ్వరరూపమనుచు ♦ నెన్నుము మదిలోన్. 192

సీ॥ విశ్వరూపముఁ జూపి♦ వెలయంగఁ దనమేన, నజుని కారాగృహం♦బాదు నిలిపె
నాకులు భయమంద ♦ లోకసృష్టియొనర్చె, నాదికోలము దంష్ట్రి♦నడచివైచెఁ
దారకు నీసహా♦దరు నుక్కడంగించెఁ, గ్రౌంచాచలము భూరి♦గరిమఁ దునిమె
చాలు దన్మందహాసము ♦ జగంబు లణంప, నితని బాలుఁడని ♦ యెంచఁదగునె?
కడుమహేశ్వరుండు ♦ గాంగేయ కార్తికే, యాదినాముఁడగుచు ♦ నవతరించె
నితని కీశ్వరునకు ♦ నెలమిభేదంబుగా, బల్కుదురు విమూఢ♦భావు లగుచు.

తే॥ స్వాదుజలవార్ధిఁబడియును♦స్వామిశక్తి, విగతమోహుండునగుచును♦మగుడివచ్చె
వీరబాహుండుబోరిలో♦వీనిచేత, దితిజుఁడెవఁడైన నిటమీఁద♦బ్రతుకఁగలఁడె? 194

క॥ దేవాస్త్రంబుల నెవ్వాఁ, డావంతయు భయములేక ♦ నలరెదు రణమం
దావీరు దూతయనుచుల్, నీవాత్మ దలంపనగునె ♦ నిర్జరవైరీ! 195

తే॥ మఱియునాతండుభండన♦మండనమున భాను, కోపునిదరిమి దోర్బలము మెఱయ
దానవులనేకులను మహా♦ధ్వతినడంచె, నగరమునుగాల్చెనిర్మూల♦నంబుగాఁగ. 196

చ॥ అతని నెదిర్చి సంగరము♦నందుఁ బ్రతాపముఁ జూప గ్రీవ్యభు
కృతతులలోన నొక్కరుని ♦ గానము తత్ప్రభువైన పార్వతీ
సుతు నెదిరింప నెవ్వరికి ♦ జొప్పడు? నీవిఁక దర్పదాజ్ఞముల్
సతతము గొల్వ మిమ్వబధ♦సంఘము బంధవిముక్తిఁ జేయుమీ. 197

వ॥ ఈయర్థంబు భగవంతుండగు నతఁడు మున్నె దూతముఖంబున నీకెఱింగించె నది విననైతి విప్పుడేనియు నతనికిఁ గోపంబు పుట్టకయ మున్న నివ్వేల్పుల విడిచి నమస్కరింపు మట్లైన బాహులేయుండు ప్రసన్నుండగుచు మన యభీష్టంబు లొసంగి సకలసేనాసమేతుండై మగుడ జనునని బహువిధంబులుగా హిరణ్యుండు దెలియఁ బలికిన శూరుండు కోపస్ఫురితాధరుండగుచు, బొమముడిపాటు వాటింప నిట్లనియె. 198

తే॥ ఏమి పల్కెదు భ్రాంత! నీ • వివ్విధమునఁ, బండితమ్మన్యుఁడవు నీదు • ప్రజ్ఞ చాలు
శత్రుఁడగు బాలు నామ్రోల • జాలఁ బొగడ, నీకు నెవ్వఁడు బోధించె • నిజము సెప్పుమ.

వ॥ ఈక్షణంబ వానిని వధించెద; మదైశ్వర్యబలశౌర్యంబులు నిత్యంబు లగుట నీవెఱుంగవే? మధుసూదనుండు మత్సహోదరునిపైఁ జక్రంబు వైచిన నతనికి భూషణంబగుటం జేసి హరి పలాయనంబు నొందె; బ్రహ్మయు, బుత్త్రులతోడ మత్కృపచేతం బ్రతిదినంబును దినశుద్ధిం జెప్పుచుండు; నింద్రాదిదేవతలందఱు మాలఁగొని తెచ్చి నాకుపాయనంబుగా నొసఁగుచు నిరంతరంబు నన్ను గొల్తు రింతియకాని మద్విరోధంబు వాటింప నేర్తురే? నీవు దానవకులరీతి నించుకేనియు నెఱుంగక మూఢబుద్ధిం జేసి యిట్లాడందగునే? యింక నీవివ్విధంబునం బల్కిన నాచేత హతుండ వయ్యెదు నిజంబని పల్కిన, 200

—• హితము వినని జనకాజ్ఞ హిరణ్యుండు యుద్ధమున కేగుట •—

ఆ॥ తండ్రిపల్కు లిట్లు • తద్దయు నాలించి, యలహిరణ్యనాముఁ • డాత్మలోనఁ
దాపమందియితఁడు • దనమాటవినఁడయ్యె, ఘటితమయ్యె నాశ • కాలమిపుడు. 201

వ॥ ఇంక నితని మనోరథానుసారంబుగ నుండవలయునని నిశ్చయించి యిట్లనియె. 202

క॥ క్షమియింపు మదపరాధము, సమధికభవదీయధైర్య • శౌర్యస్ఫురణ
క్రమ మరయఁగ నిట్లాడితి, సమరంబున కనుఁడు నన్ను • సాహసపటిమన్. 203

వ॥ ఇప్పుడే నని సకలసేనాసమేతంబుగా నిర్భరముదుండగు నర్భకుం జయించి వచ్చెద; నేతజ్జయంబు నాకు దుర్లభంబు గాదని పల్కి తండ్రికి బ్రణమిల్లి యతని యనుమతిం గైకొని హిరణ్యుండు నిజగృహంబున కరిగె; సహస్రసంఖ్యాకులగు నాత్మజులతోడ రణోద్యుక్తుండై దివ్యాంబరాభరణభూషితుండును, ద్రోణ ప్రసూనమాలికాలంకృతకంఠుండును, సహస్రహర్యక్షసంబంధసమున్నతరథారూఢుండును, సహస్రసంఖ్యసేనాసమేతుండును నై నిజవిలాసంబు పురీవిలాసినులమానసంబులకు నుల్లాసంబు సంపాదింప నగరంబు వెడలె; నయ్యవసరంబున నెనిమిదివాహినులు రథంబులు, నన్నియ గజంబులు, ద్విశతాధిక సహస్రవాహినులు, హయంబులు, తావత్సంఖ్యాకంబులు కాల్బలంబులు దోడ నరుదెంచె నయ్యవసరంబున, 204

తే॥ ప్రళయకాలాబ్ధి కల్లోల ♦ పటలజనిత
భూరి ఘోషంబులట్లన ♦ భేరి పటహ
కాహళారావములు మ్రోసె ♦ ఘనతరముగ
సైన్య ధుతపాంసుచయము భా♦స్కరునిఁ గప్పె. 205

వ॥ ఇట్లు శూరాత్మజుండు క్షణమాత్రంబున వీరునికటంబునుం జేరి, నిజపురంబు నిశ్రీకంబగుటయుం గని కనలుచు, బలంబు నాల్గుభాగంబులు గావించి, సహస్ర వాహినీ సంఖ్యంబులు వేర్వేర నలుదెసల నియోగించి, నిజబలంబుతోడ వీరబాహున కభిముఖుండై వచ్చెనంత, 206

ఆ॥ వీరబాహుఁ డతని ♦ వీక్షించి వీఁడెవ్వఁ, డనుచు వికలుఁడయ్యె ♦ నాత్మలోన
నపుడు బ్రహ్మపుత్రుఁ ♦ డగు నారదుఁడు వచ్చి, వేగఁ దెల్పె వానివృత్తమెల్ల.

వ॥ అంత వీరబాహుండును తనబలంబులు విభజించి నలుగడల నిర్దేశించి మూల బలంబులతోడ నిష్ఠురంబుగా సింహనాదం బొనర్చుచు హిరణ్యుతోడఁ బవరం బుసేయుట కభిముఖుండయ్యె; నయ్యెడ మునుకులుగ మొనసి దండనాథులు, దొరలు, సోదరులు, సామంతులుఁ దమతమ బలంబులం బురికొల్పుకొని యొండొరులం దలపడి ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల మోదియు, గదల నడచియుఁ, గరవాలంబుల ద్రుంచియు, భిండివాలంబుల ఛేదించియు, చక్రంబుల జక్కణంచియు, సురియలం గ్రుచ్చియు, గుంతమ్ములం గ్రుమ్మియు, దోమరంబులం జిమ్మియు, శరంబుల నాటియు, శక్తులం బఱపియు, శూలంబుల వైచియు, పాషాణద్రుమంబులుఁ బ్రయోగించియు, లోష్టంబులు వఱపియు, బహువిధంబుల బిరుదివియకఁ జలంబు బలంబు నూలుకొల్పుచు, ధైర్యంబులు వాటించి, శౌర్యంబులు ప్రకటించుకొని, యొకరికొకరు దలగడచి పోరు ఘోరంబుగా సల్పుచు, విదళిత వదనులును, విశకలిత రదనులును, విఖండితపదులును, విదారిత ప్రపదులును, విధ్వస్తహస్తులును, విచ్ఛేదిత మస్తకులును, విచ్ఛిన్నపిచండులును, విస్రస్త దోర్దండులును, విలూన కర్ణనాసికా జంఘోరులును, విపాటిత కటి కంఠ మధ్య మణిబంధులునై రుధిరంబులు దొఱుఁగ ననేక భటులు భయబలంబులం గొందఱు మృతులయ్యెఁ గొందఱు మూర్ఛాగతులై నేలఁగూలి రయ్యవసరంబున, 208

ఆ॥ వీరబాహుఁడంత ♦ వ్రేల్మిడి జనుదెంచి, గుణరవం బొనర్చి ♦ కోపమెసఁగ
నిశిత విశిఖపంక్తి ♦ నిగుడించి బహుదైత్య, వితతిఁ గూల్చె ధైర్య ♦ విభవ మొప్ప.

క॥ అత్తఱి నదులై పాఱెను, నెత్తురులు కబంధతతులు ♦ నెఱిభయదములై
నృత్తంబులఁ జూపట్టె స,మిత్తలమున గాక కంక♦మేళన మొప్పన్. 210

వ॥ అప్పుడు హిరణ్యుండు కోపంబు గదుర సహస్రాయుత నియుతకోటి సంఖ్యలగు నిశితవిశిఖంబులు పుంఖానుపుంఖంబులుగాఁ బఱపి భూతజాలంబుల మూర్ఛాగ

తంబులఁజేసి తనివి సనక కనకపుంఖంబులగు శరంబులు నిగుడ్చుచు, నుక్కుమిగి
లిన తేజంబున, మఱియు భూతసైనికుల మొగ్గరంబుల పైకురికె నయ్యెడ భూత
సైన్యంబులు బెగ్గడిలి యథాయథలై పరుగుటం గనుంగొని, 211

శా॥ నీలాఖ్యుండగు భూతసైన్యపతి ని♦ర్భిద్రిక్రతాపోగ్రుఁడై
క్ష్వేలాపూరిత దిఙ్ముఖుండగుచు రా ♦ శీఘ్రంబ దైత్యేంద్రు పు
ద్వేలప్రౌఢిమ వానిపైఁబఱపె శ♦క్తిన్ దత్ప్రహారంబునన్
నేలన్ మూర్ఛిలి లేచి యాక్షణమ యా♦నీలుండు కోపంబునన్. 212

తే॥ సాలవృక్షంబు గైకొని ♦ చటులపటిమ,దనుజరథముఁజక్కణఁచన♦దైత్యుఁడంత
నలుకనొండొకరథమెక్కి ♦యతనియురము, గాడనేసెను సితసాయకము లగముల.

క॥ భూతేశుఁడలిగి దోర్దృ, ప్తైతేయుని మీఁదఁ బర్వ♦తముఁ బరపె నతం
డాతతబలుఁడై యదియు ని,శాత శరత్రయముచేతఁ ♦ జయ్యన దునిమెన్. 214

వ॥ అంత నీలుండు పరాక్రమాభీలుండై పర్వతోపమానంబగు తద్రథంబు దాన
వునితోడ నాకసంబున కెగుర వైచినవాఁడు పుడమిం బడక నింగినుండి మగుడ
వచ్చి యొండొక రథం బధిరోహించు నంతలోన నీలుం డతని యురంబుఁ బగుల
నడచిన, 215

క॥ అసురుండు పట్టి నీలుని, వెసనెగయఁగ వైచె వాఁడు ♦ వెంటనె జనుకొం
చి సముద్ధతిఁ జెలఁగఁగ నయ్యసురుని బదనిహతిఁ జిమ్మె ♦ నాకసమంటన్. 216

వ॥ అంత గగనమ్ముననుండి పుడమింబడిన యద్దనుజు నురంబున జయశీలుండగు
నీలుండు కోలాహలోద్వేలంబుగా నార్చి దుమికినం దత్పతనఘాతంబున రక్క
సుం డుక్కుసెడి రుధిరంబు బొళబొళం గ్రక్కుచు మూర్ఛిల్లి యంతలోన, 217

మ॥ దనుజేంద్రుండు నివృత్తమూర్ఛుఁడయి ప్రో♦ద్యత్ప్రౌఢిమాయామయం
బు నిజాకారము నొందు నాక్షణమునన్ ♦ బుట్టించె యుద్ధార్థమై
యున్నత క్రవ్యభుజుండు వేగమ హిర♦ణ్యాభాకృతిన్ విస్ఫుర
ద్ఘనగర్జారవముల్ సెలంగ నెదురం♦గా జూచి రోషంబునన్. 218

వ॥ నీలుండు తన్మార్గంబు మహోద్ధతంబగు దండంబునం జెందిన స్నిగ్ధ్యాసురుండు
ప్రప్రమోహుండుఁబోలె గర్జిల్లుచు శరసహస్రంబులఁ బ్రయోగించిన నిమిష
మాత్రంబు ధరన్ దొఱఁగి లేచి, నభంబున కెగసి పెడబొబ్బలిడుచువచ్చి భూత
సేనాథపునితోడ, సమరంబుసేయ సమకట్టెనంత, 219

క॥ నీలుఁడు శౌర్యాభీలుఁడు, కోలాహల ఘోషమడరఁ ♦ గుహానాసురుతో
నాలమొనర్చెనుఁ గోపో,ద్వేలత నలఘోర సమర ♦ విజయోత్సకుఁడై. 220

వ॥ అద్దనుజుండు బరవంబు సేయువాఁడునుంబోలె భూతసేనాధిపుం గొనిచని, సము

ద్రింబులు, ద్వీపంబులు, పర్వతంబులు, వనాంతరంబులు, గుహాంతరాళంబులు లోకంబులు; జలుమాఱుఁ దీప్తించు నతండు కిన్కమైన మనంబునఁ బడలు వడియు బాలివోసి ధైర్యంబున వానిం బోనీక దరంబుసేయునెడ హిరణ్యుండు పాత్రసచేతనుండై కుహనాదనుజ సమేతంబుగా మగుడ యుద్ధ సన్నద్ధుండై రథాంతరారూఢుండగుచు, నాగ్నేయాస్త్రంబు నీలు బయిం బఱపిన, నతండు మూర్ఛాగతుండయ్యె, 221

క॥ అతనిఁ గని వీరబాహుం, డతిరోషంబొదవఁ దెలిసి ♦ యసురునిమాయన్,
జతురత విజ్ఞానాస్త్రం, బతిరయగతిఁ బఱపె దివిజ ♦ లభినందింపన్. 222

వ॥ తదీయాస్త్రంబున దానవుండు, పరిత్యక్తమాయాసురుండగుచు. నొంటి నిలచె నంత నవ్వీరబాహుండు మహామేఘంబులో లెగర్జిల్లుచు శరసహస్రంబులఁ బ్రయోగించిన నవియు, వానియురంబు నాటఁజాలవయ్యె నయ్యెడ, 224

క॥ కోపమున వీరబాహుం, డేపెసఁగ నిశాత శరము ♦ లేసి తదుద్య
చ్చాపధ్వజ కవచములు భుజాపటిమఁ జెలంగ దునిమె ♦ క్షణమాత్రములోన్.

వ॥ అంత నసురుండు నొండు విల్లు నందుకొనునంతలోన వీరబాహుండు వాని ధనుస్తూణంబులు తుత్రించివైచి సారథిసమేతంబుగా నరదంబు నుగ్గునూచంబు గావించి వాడినారసంబులఁ దద్వక్షంబు భేదించి మూర్ఛవేర్చిన, 225

క॥ దానవుఁడు మఱియుఁ గోపముఁ, బూని రథాంతరము నెక్కి ♦ పోవఁగ నతఁడా
లోనన తదగ్నిమస్త్రవి, తానముచేఁ దునిమి యార్చె ♦ దారుణలీలన్. 226

—* హిరణ్యుండు పిఱికివాఁడై సముద్రమున దాఁగొనుట *—

వ॥ మఱియుఁ, దక్కిన యరదంబు లన్నియుం జక్కాడిన, నంత హిరణ్యుండు విదళితరథుండును విగతాయుధుండును నై వీరబాహు బలంబునకు విస్మయంబొందుచు మనంబున నిట్లని తలంచె; నింక బాహులేయుండు శూరపద్మాదుల సంహరింపఁ గలఁడు. జనకుండు మహావీరులగు కుమారులం బెక్కండ్రం గనియె; నాదొక్కండేనియు నతనికిం బ్రత్యుపకారంబు సేయుటకు లేకుండిన జగంబున నపయశంబు వాటిల్లుఁ గావున నేనిటమీఁద సమరంబు చాలించవలయునని నిశ్చయించి మాయామహంబు వహించి నిమిషమాత్రంబున మీనరూపంబై సముద్రంబుసొచ్చె; నవ్విధంబునఁ ద్రివిధంబగు బలంబు దక్షమ్యాతగణంబుల చేత హతంబయ్యె నప్పుడు, 227

క॥ దనుజబలము పరిభవముగ్, గని భూతములెల్ల సైని ♦ కవ్యూలతోన్
ఘన కోలాహల రవములు, దనరఁగ మోదమునఁ జెలఁగె ♦ దద్దయు ననిలోన్.

తే॥ వేక్కశంఖంబుఁ బూరించె ♦ వీరబాహుఁ, డసురబృందంబు సమవృష్టి ♦ లమరఁగురిసె
నప్పుడావార్త నెంతయు ♦ నాలకించి, మ్లానముఖమున శూరపద్ముండు పురిని.

వ॥ లజ్జావనత వదనుండై కోపఘూర్ణిత మానసుండగుచు ఖిన్నుడై యున్నకయుండ
నాసమయంబున, 230

సీ॥ దినకర రథవాజి ♦ దిగ్గజంబులు దెచ్చి, చదరంగమాడెనే ♦ చతురుఁ డెలమి,
హరి పద్మజుల దార్క్ష్య ♦ హంసంబులనుఁ దాఁట, బంధించె నెవ్వాఁడు ♦ బాల్యమున న
గర్భంబులోనుండి ♦ కడుతీవ్రతాపంబు, జననికిఁ జేసెనే ♦ సాహసాఢ్యుఁ
డగ్నిముఖుండని ♦ యలపితామహుమాయ, యెవ్వాని కభిధాన ♦ మిడెనుఁ బ్రేమ
నర్కునోడించిన యగ్రిజు ♦ నట్ల తుహినకరుని బంధించె నెవ్వాఁడు ♦ గరిమమీఱ
నట్టి శౌర్యధురంధరుం ♦ డగ్నిముఖుఁడు, పుత్రరత్నంబుఁ జనుదెంచి ♦ భూరిమహిమ.

క॥ జనకుఁడగు శూరపద్ముని, గనుగొని చరణాబ్జములకుఁ ♦ గడు నమ్రుండై
వినయంబొప్పఁగ నిట్లను, ననుపమ చతురోక్తి మెఱయ ♦ నాస్థానమునన్. 232

క॥ హరి పద్మాసనముఖులగు, సురలఁ గెలిచి పేరుగాంచు ♦ శూరుఁడవకటా!
శిరమును వంచుక చింతా, భరమునఁ గుందంగ నేల ♦ బలుమరు తండ్రీ! 233

వ॥ అనిన సుతునితోడ శూరపద్ముం డిట్లనియె. 234

తే॥ విబుధసేనాధిపతిదూత ♦ వీరబాహుఁ, డనఁగ నొక్కఁడు జనుదెంచి ♦ యలఘుపటిమ,
గోపురంబులు సౌధముల్ ♦ గూల్చి కడిమి, ఘనశరానలమున ♦ బురిగాల్చె ననియె. 235

వ॥ అప్పుడు మత్ప్రేషితంబులగు మేఘరాజంబులు తద్వహ్ని శమింపం జేయంజాలక
తద్బ్రహ్మాండనంబునఁ బరాభవంబునొందె, హిరణ్యుండతనిచేతన సంగరాంగణంబున,
నిర్జితుండై సముద్రంబున మీనరూపంబై వర్తించె; మఱియు బలపరాక్రమ
శాలురగు, దనుజవరులనేకులు హతులైరని జనకుండు పల్కిన విని యగ్ని
ముఖుం డిట్లనియె. 216

క॥ దూతయగు వాని గెలువఁగ, తాత! విచారింప మనకుఁ ♦ దగునే? వైరి
వ్రాతము భీతిలఁ ద్రుంచెద, నాతని నాకాజ్ఞయొసఁగు ♦ మసురాధీశా! 237

వ॥ అని పల్కి తండ్రియనుమతి వడసి యగ్నిముఖుండు నిజగృహంబున కరిగి మా
యాదత్తంబైన శరాసనంబుఁ గొని దివ్యశస్త్రాస్త్రధురంధరుండగుచు, సహస్ర
వాహినులేనుంగులు, నన్నియు నరదంబులు, ద్విసహస్ర వాహినులు దురంగం
బులు, ననేక వాహినులు దైత్యులు, నిరుదెస బలసి చనుదేరఁ, జామరచ్ఛత్ర
ధ్వజంబులుఁ జెలంగ, నానావాద్య ఘోషంబులు మెఱయ, సోముఁడును,
సోమకంటకుండును, మేఘుండును, పింగళుండును, మొదలుగాఁగల దండ
నాథులు బాసటలై తోడనఁ జనుదేరఁ బ్రభాతసమయంబున మహావీరప్రతాప
దీపితంబగు సమరభూతలంబు సేరె; నప్పు డుభయబలంబులుఁ దలపడి పరస్పరా
హంకృతులు సెలంగ నానాయుధోపలద్రుమపర్వతంబులుఁ బఱపుచు, దుము
లంబుగా సమరంబొనర్చి రయ్యవసరంబున, 238

క॥ రోషమున లక్షవీరులు, భీషణబలమెసఁగ విశిఖ ♦ బృందము మార్కో
ఘోషము లడరఁగ బఱపి రశేష సురారివ్రజములు ♦ చెదరి పఱవఁగాన్. 239

వ॥ అంత సోముండును, సోమకంటకుండును, మేఘుండును, సింహనాదంబు లొన
ర్చుచు, వివిధాయుధంబులుఁ బఱపుచు, లక్షవీరులు మార్కొనిరాసమయంబున,

ఉ॥ వీరపురందరుండు పటు ♦ విక్రమధుర్యుఁడు భూతనాథుఁ డే
పారఁగ భూరి ఘోరవిశి♦ఖావళిఁ దద్రథముల్ మహోద్ధతిన్
ధారుణిఁగూల్చి దివ్యనిశి♦తప్రదరంబులఁ ద్రుంచె విక్రమో
దారుని సోమకంటకుని ♦ దారుణలీల రణాంగణంబునన్. 241

వ॥ ఇట్లు సోమకంటకుండుఁ బడినఁ గనుంగొని సోముండునుం దక్కిన దైత్యనాథు
లందరు రథారూఢులై యుక్కుమిగిలిన తేజంబుల దిక్కులకు వెక్కసంబుగా
సింహనాదంబు లొనర్చుచు, దురంబునకుం దొడంగిన, 242

మ॥ కని వీరాగ్రణి భూరికోపమడరం♦గాఁ దచ్ఛరాసారముల్
ధనువుల్ దేరులు ద్రుంచి వైచి మిగులన్ ♦ దత్పాలదోర్ద్వంద్వ లో
చనయుగ్మంబుల బాణముల్ జొనిపి యా ♦ శ్చర్యంబు సంధిల్ల సిం
హనినాదం బొనరించె నిస్తులిత శౌ♦ర్యాటోపముల్ మీరఁగన్. 243

వ॥ అంత మేఘుండమోఘంబగు దండంబున నతని సారథిం దెగటార్చినం గనుంగొని
యవ్వీరుం డతిరోషంబున, మహాభయంకరంబగు శక్తిచేతఁ దద్వక్షముఁ గ్రొచ్చిన
నతండు నిహతుండయ్యె; నట్లవుటం గనుంగొని దనుజసైనికు లమ్మహామహుని
కోల్తలకు నిలువంజాలక పలాయనంబు నొందిరి. 24!

—* సేనాపరాజయమునకు గోర్వక అగ్నిముఖుడు వీరులనెదుర్కొనుట *—

క॥ తనసేన పరాజయమై, జనఁ గనుఁగొని యగ్నిముఖుఁడు ♦ సాయకవర్షం
బనుపమగతిఁ గుఱియుచు భూ,తనివహమున్ దరిమె శౌర్య ♦ దర్పమెసంగన్.

వ॥ అంత మహావీరుండగు వీరపురందరుండు, రథంబు గదియందోలి కోలాహలంబు
లడర నయ్యగ్నిముఖునిపై నిశితశిలీ ముఖంబులు గురిసిన నద్దానవేంద్రుండు
వాడితూపుల నతని శరశరాసనంబులం దునుమాడి మనంబునం గనలుచు,
శక్త్యాయుధంబున నవ్వీరవర్యుని మూర్ఛాగతుం జేసిన, 246

ఆ॥ వీరుడేమ్వరపుడు ♦ వీరపురందరు, మూర్ఛఁగాంచి కోప♦మునఁ గడఁగి
యసురవర్యునుదాట ♦ నతులదోర్యుగముల, శరసహస్రములను ♦ జాలగురిసి.

వ॥ మఱియు, వాడితూపుల నతని శరాసనంబుఁ ద్రుంచిన నద్దానవేంద్రుం డలుక
వొడమిన మనంబున వారిం గనుఁగొని యిట్లనియె. 248

ఆ॥ పోరిలోన మిమ్ముఁ ♦ బొరిగొని వేగంబ, వీరబాహుఁ ద్రుంతు ♦ విజయమెసఁగఁ,
గనిమెదరు మదీయ♦ఘనభుజావిక్రమం, బనిన వానివచన ♦ మాలకించి. 249

వ॥ మహాబలులగు నవ్వీరాగ్రిణులు కోపాటోపంబున, దదగ్రిఘాతురంగంబులం దునుమాడి, మహోపలసదృశంబగు తద్వక్షంబు వెదంద హాడినారసంబుల ప్రక్క లించిన, 250

క॥ అక్షణమున దైత్యేంద్రుఁడు, వీక్షణముల విస్ఫులింగ♦వితతులాలుకఁగా దక్షత వేఱొక రథమున, నక్షీణబలం బెసంగ ♦ నధిరూఢుండై. 251

వ॥ ప్రళయకాలానలజ్వాలాభీలంబగు పాశుపతాస్త్రంబుఁ బ్రయోగించిన, నవ్వీరు నజ్ఞానంబున నాగ్నేయంబని మదిఁదలంచి, దానిపై వారుణాస్త్రంబు నిగుడించిరి.

క॥ పాశుపతాస్త్రంబయ్యెడఁ, బాశధరాస్త్రంబుమ్రింగి ♦ పటుగతి వారిన్ నాశము నొందించినఁగని, యాశరవరుఁడగ్నిముఖుఁడు ♦ హర్షించె మదిన్. 253

వ॥ అప్పుడు భూతంబులు పరిభూతంబులగుచుఁ, దిగ్భ్రాంతంబగు భయంబొదవ నలు గడలకు విరిగి చనియె. 254

ఆ॥ వీరబాహుఁడడియు ♦ వీక్షించి రయమున, గర్జితంబొనర్చి ♦ ఘనతరముగ గజముమీఁద నెదురు ♦ కంఠీరవముఁబోల్కి, నాఁకరుగఁదేర ♦ నతనిఁజూచి.255

వ॥ అగ్నిముఖుం డిట్లనియె. 256

క॥ ఓరీ! యనేకుల దనుజులఁ, బోరి జయించితివి మున్ను ♦ పొగరుడుగగ మ ద్ఘోరశరాహతి నేడిదె, ధారుణిఁబడగూల్తు నిలుము ♦ ధైర్య మెసంగన్. 257

తే॥ జగతి నిన్నుజయింపఁగా ♦ శక్తిలేని, పురుషుఁడొప్పునె యువతిసం♦భోగమునకు? ననుచు, బల్కిన విని వీరుఁ♦డాగ్రహమునఁ, బలికె దానవపుంగ♦వరుషఫణితి.

క॥ ఘూకంబు ధరణి సూర్యా,లోకంబునకులికి నొందిలోఁ డాగుక్రియన్ నాకెదుర నిలువలేక భ,యాకులత హిరణ్యుఁడలఁగి ♦ యంబుధిఁబడియెన్. 259

తే॥ భానుకోపుఁడు దురమున ♦ బఱచెమున్ను, మాయఁగొని నాతోడ♦మగుడననికి వచ్చెనేనియుఁ బరిమార్తు ♦ వానినాజి, నీవు నవ్విధి నరుగక నిలుతువేని. 260

వ॥ రణాంగణంబున నిన్నుఁదెగటార్చెద, నప్పుడు నీకడ్డపడు మగండెవ్వండొకో చూ డవలయుననిపల్కి మహాకోపంబునఁ జాపం బెక్కిడి గుణధ్వనిఁజేసిన, 261

క॥ దానవనాథుండపుడు భ,యానకమగు ధనువుఁగొనియు ♦ నద్భుతముగ మౌ ర్వీనాద మొనర్చెను, గోపానల కీలామహోగ్రుఁ♦డగుచున్ బోరిన్. 262

—* అగ్నిముఖ వీరబాహుల యుద్ధము *—

వ॥ ఇట్లు గుణారావంబుఁ గావించిన విని భూతంబులు భీతంబులయ్యె నంత దైత్యుఁడు నిశితంబులగు చతురశ విశిఖంబులు వీరబాహునపయిఁ బరపిన నతండన్నియు శరంబులఁ దునిమి బ్రహ్మాండభాండంబు పగులఁ గోలాహలం బొనర్చెనంత, 263

తే॥ అగ్నిముఖుఁడంతచటులకో♦పాగ్నియెసఁగ, వీరబాహునిపైమహో♦దగ్రతఁబఱపె నిశితపింఛతిసంఖ్యాక♦విశిఖములను, సింహగర్జారవంబులు ♦ చేసికొనుచు. 264

క॥ వీరుండు వానినన్నిటి, నారూఢిం దునిమెం దావ ♦ దంబకతతులన్
వారక దైత్యేంద్రుఁడు వెస, నారాచసహస్రములను ♦ నాటించె మెయిన్. 265

వ॥ ఇట్లు నాటించి శంఖంబుఁ బూరించెఁ దదీయ శిరంబులు మేను సొచ్చిపోయిన వీరబాహుం డలుక మనంబునం దొలుక విస్ఫురితాధరుం డగుచు నన్నివాడి తూపులఁ దద్రథంబు విదళితంబుఁ గావించి హయంబులం బరిమార్చి కార్ముకంబుఁ దునియలు చేసిన, 266

క॥ ఆరోహించి రథాంతర, మారాక్షసవర్యుఁ డద్భు ♦ తాటోపమునన్
వీరాగ్రణిపైఁ బరపెను, ఘోరత దండంబుద్రిప్పి ♦ దిశ లదర్వంగన్. 267

వ॥ అంత వీరబాహుం డు సముద్దండంబగు నతని దండంబు నొక్క వాడిశరంబునం దునుమాడిన దనుజవర్యుం డద్భుత మహోన్నతంబగు కోదండంబుఁగొని వాయవ్య సౌర వారుణ యామ్యంబులు తోడుతోడనఁ బ్రయోగించె. 268

క॥ వీరుండు తాదృశ్యాస్త్రముల, వారక సంధించి తునిమెఁ ♦ దద్బాణములన్
ఘోరమగు నొకమహాస్త్రము, వారక నాటించె నగ్ని ♦ వస్త్రినిమేరన్. 269

వ॥ ఇట్లు నాటిన రక్కసుం డొల్లంబోయి నిజరథంబున మూర్ఛాక్రాంతుండై నిమిషమాత్రంబునఁ దెలివొంది యారాధితయగు కాళిం దలంచిన, 270

శా॥ వేత్రితానీకము ఘాకిను ల్గొలువఁగా ♦ భీమాట్టహాసంబురు
స్ఫీతాభీల మృగేంద్రవాహయగుచున్ ♦ బెంపొంద నానాయుధ
వ్రాతంబుల్లయి బూని దిక్తటములన్ ♦ వాద్యధ్వను ల్నిండఁగా
నేతెంచె న్వెస భద్రకాళి దనుజా ♦ భీష్టంబు సిద్ధింపఁగన్. 271

వ॥ ఇట్లు చనుదెంచిన భద్రకాళిం బ్రార్థించి దానవుండు వీరబాహుం జయింపుమన వుడు నట్లయగుంగాతమని యంగీకరించి మహాకాళి యతిఘోరంబుగాఁ జనుదేర సకలభూతసైనికులు మహాభయభ్రాంతు లైరి. 272

క॥ కాళి మహోజ్జ్వలమగు నొక, శూలముఁగొని మీఁద వైవ ♦ శూరత మెఱయన్
లీలఁ దునుమాడె వెసఁ బసు, నాలుగుబాణముల వీర ♦ నాథుం డలుకన్. 273

వ॥ మఱియు నక్కాళియు మహాభయానక రణకేళినై పరుషవచనంబుల నతని భర్జింపుచు నిష్ఠురంబగు వేఱొక్కశూలంబు గేలుకొల్పిన నతండు కోపాటోపంబున సహస్రవిశిఖంబులం దునుమాడె. 274

క॥ కాళిక మగుడన్ గోపో, ద్వేలత వాహనము డిగ్గి ♦ వెస ఖడ్గంబున్
గేలంగొని భీషణముగ, మ్రోలన్ సంహారమునకు ♦ మొనయుచు రాగన్. 275

వ॥ దానింగని వీరబాహుండు వనితం జంపుట దురితంబని తలంచి తదీయాష్ట భుజంబులు నొంచుగేలం గీలుకొల్పి వేఱొండు కేల వక్షంబుఁ జదిపిన నది రుధిరంబు బొళబొళం గ్రక్కుచు నుక్కుచెడి పుడమింబడి రోదనంబు సల్పుచు లేచి యాత్మగతంబున, 276

క॥ గుహు సోదరుతోఁ బోరిన, మహి జయముఁ గాంచఁ దరమె ♦ మాదృశుల కహో
బహుమూఢబుద్ధి యదియని, మహితబలుఁ వీరబాహు ♦ మదిఁ గొనియాడెన్. 277

వ॥ ఇట్లనేక విధంబులఁ గొనియాడి, దేవా! భవత్పరాక్రమం బెఱుంగక సంగరంబునకుం దొడంగితి మదీయాపరాధంబు సహించి కోపం బుడుగవలయు, నిటమీఁద నీవు పార్వతేయునిప్రసాదంబువలన భానుకోపాగ్నివక్త్రప్రభృతు లగు నసురుల ననేకులఁ బరిమార్పం గలవని పల్కి సంస్తుతించి యతని యనుమతి వడసి భద్రకాళి సింహవాహనారూఢయై నిజస్థానంబునకుం జనియె. 278

ఆ॥ అంత భద్రకాళి ♦ యరుగుట గనుఁగొని, యగ్నివక్త్రుఁ డాత్మ ♦ నాజియందు
దీని విక్రమంబుఁ ♦ దెలియుట కనిపితి, నింక సేయఁ దగిన ♦ దేమి నాకు? 279

వ॥ త్రిభువనంబులు జయించునప్పుడేనియు నితర సహాయంబు నాకనపేక్షణీయం బగుటం జేసి వీరిని జయించుటకు నేన చాలుదుఁ గావున, నిబ్బవరంబున జయించి గాని తండ్రిసముఖంబునకుం బోవనని ప్రతిన పన్ని లేచి యుద్ధసన్నద్ధుండై,

గీ॥ అగ్నివక్త్రుండు ప్రళయకా ♦ లాభ్రమట్లు, దశదిశలు నిండ సింహనా ♦ దంబు నార్చి
బహుతరక్రోధమున వీర ♦ బాహుమీఁద, శితశరంబులఁ బఱపె, ని ♦ స్సీమపటిమ. 281

క॥ వీరుం డన్నియ శరముల, వారించి తదీయవిశిఖ ♦ వారము మఱియున్
దారుణశరములఁ గురిసె న, వారణ దైత్యేంద్రుమీఁద ♦ వరశౌర్యమునన్. 282

క॥ దనుజుఁడు తద్విశిఖంబుల, వినిశితశరశతము చేత ♦ విదళించి మహా
నినదం బొప్పఁగ శంఖము, ఘనముగఁ బూరించె నాజిఁ ♦ గౌతుకమొదవన్. 283

వ॥ అంతఁ జలంబు పెంపుఁగ మహాధీరుండగు వీరుండు పదునాల్గు వాఁడిములుకుల నగ్నిముఖుధనువుం దునుమాడి దిగంతంబులు చలింప నిబ్బరంబుగాఁ బెడబొబ్బలిడిన,

—* వీరబాహుఁ డగ్నిముఖుని సంహరించుట *—

చ॥ అది విని యగ్నివక్త్రుఁడు మ ♦ హాగ్రహ మొప్పఁగ సర్వవిద్విష
న్మదహరు నబ్జజాస్త్ర మస ♦ మానపటిమ్నతఁ బూని వైచె నే
పొదవఁగ వీరబాహుఁ డపు ♦ డుగ్రశరంబగు వైరభద్రము
న్మదగతి వానిపైఁ బఱపె ♦ నాకనివాసులు సంతసిల్లఁగన్. 285

వ॥ ఇట్లు పరపిన వీరభద్రాస్త్రంబు మహారౌద్రంబునం జనుదెంచి తద్బ్రహ్మాస్త్రంబుం గబళించి యగ్నిముఖుశిరంబుఁ దునిమె; నిది యెఱింగి చతుర్వింశతిసహస్రసంఖ్యాకులగు సేనాధిపతులు తమతమ బలంబులతోడ నురవణించి నిదాఘసమయధారాధరంబులవిధంబున గర్జించుచు నిశితశరపరంపరలు గురిసి రంత. 286

మ॥ తతశౌర్యంబున వీరబాహుఁ డసురేం ♦ ద్రశ్రేణిపై బాణముల్
శతకోటుల్ నిగుడించుచున్ దరిమె నా ♦ శావీథికిం గొందఱన్
ధృతిమైఁ గొందఱ నాయుధప్రకర మొం ♦ తేనిన్ విదారించె సం
హతి గావించెను గొందఱన్ బ్రళయకా ♦ లాభీలరుద్రాకృతిన్. 287

వ॥ మఱియుఁ గృతాభివందనులగువారిఁ గొందఱ విడిచియు, నిట్లతిభీమంబుగా సంగ్రామంబు సల్పునవసరంబున నతనిశరాహతిఁ గోహాటిపంజాలక యసురబలంబులు, కళేబరంబులు మీఁదనిడుకొని తద్భారంబున గతప్రాణులగువారును, నమ్మహావీరునకు బట్టనడినట్టున భ్రమసి మోహపరవశులై నేలంగూలువారును, రక్తనదీప్రవాహంబునఁ బడి సముద్రంబునంగలిసి నిధనంబునొందువారునునై బహువిధంబుల హతంబులై, రట్టియెడ, 289

గీ॥ బలు నటించె రణోర్విఁ గబంధతతులు, కాకగృధ్రావళులుమాంస♦కాంక్షఁదిరిగెఁ
బట్టణంబునఁగిలకిలా♦ద్భుటులు మించె, దైత్యకాంతలరోదన♦ధ్వనులు ప్రబలె.

వ॥ ఆసమయంబున దేవతలు సుమవర్షంబులంగురిసె; సంఫుల్లలోచనులై పుట్టంబులెగయవైచుచుఁ గోలాహలంబులు సెలంగ నర్తించి రప్పుడు భూతగణంబులతో సేనాధిపతులు వీరులు విగతమోహులై విజృంభించి రంత, 290

క॥ మతిమంతుఁ డుగ్రసేనుఁడు, గతమోహుఁడు వీరబాహుఁ ♦ గనుగొని పల్కెన్
శతయోజనదూరంబున, స్థితమగు నొకవటము దాని♦చెంగట నొకఁటన్. 291

వ॥ భవత్సోదరులు విగతప్రాణులై పడియున్నవారు. వారిప్రాణంబులు కాలుండు దనపురంబునకుం గొనిచనియెఁ; గావున విచారింపవలయు నని పల్కిన, నతని వాక్యంబులు విని దుఃఖితుండై పదంబులుతొట్రిల రయంబున, నవ్వటనికటంబునకుం జని యందు మూర్ఛాక్రాంతులైయున్న నిజానుజులంజూచి పైఁబడి కొంత తడవు తాను మూర్ఛిల్లి తెలివినొంది బహువిధంబుల విలపించుచు నిశితాస్త్రహతులగువారి జముండు గొనిపోవ నెట్లు సమర్థుండగు నని మనంబున నతనిపై నలుకవొడమి, 292

ఉ॥ "అంతకుఁ డిట్లు క్రొవ్వుచు గు♦హానుజులం గొనిపోవవచ్చునే?
యెంతవివేకహీనుఁడు మ♦హేశ్వరభక్తి మృకండుసూనుఁడో
కింత సుమంబొసంగి భజ♦యించినమాత్ర శివాంఘ్రితాడనా
క్రాంతతచే మునుంబడిన ♦ కష్టము విస్మృతమయ్యెనో మదిన్. 293

వ॥ మఱియు దుశ్శకదుర్మతులకొఱకునైన హరపాదతాడనంబదియుఁ దలంపఁడొకో" యని కోపించి, విభూతిరుద్రాక్షధారులైన మహాత్ముల దారింబోవకుండు మని నీకింతగర్వంబేల, సత్వరంబ వారిందెచ్చి యొప్పించుమని సాయకంబున లిఖించి కాలునిసన్నిధి కనిచిన నయ్యస్త్రంబు సకలదిక్ప్రకాశంబై మహాజవంబునం జనుదెంచి మ్రోలంబడియున్నఁ గాలుం డది కేలంగొని విస్మయంబందుచు, తల్లేఖనంబుఁ జదివికొని మహాభయాకులుండై, 294

గీ॥ అధికముదమొప్పఁ గైలాస♦మందునుండు, వారి సుజ్ఞానదృష్టిచే♦ సారెఁ దెలిసి
బహుభటాన్వితుండై మహా♦మహిమ మెక్కె, శమనుఁడరుదెంచె నవ్వారి♦సన్నిధికిని.

వ॥ ఇట్లు చనుదెంచి దివ్యభూషణాలంకృతులును, దితిజమారిత భూతగణ పరివృతు

లును, దివిజగంధర్వ విద్యాధరోరగజన సేవితులును నాసందిపరిపూర్ణులునునగు మహావీరులంగని దండప్రణామం బాచరింపుచు, దండధరుండు కృతాంజలియై యిట్లనియె. 296

—* వీరబాహుండు కైలాసమునుండి వచ్చిన తమ్ములంజూచి సంతసించుట *—

క॥ వీరవరులార! మిము నే, నూరక కొనిపోయితంచు ♦ నొగి నామీఁదన్
భూరితరక్రోధంబున, వారక యున్నాఁడు వీర♦బాహుండు గనుఁడీ. 297

క॥ అతఁడున్న యెడకుఁ గరుణా,మతి మీ రరుదేరవలయు ♦ మానుగ ననినన్
గుతుకమున భూతవీర,ప్రతతియుఁ జనుదెంచె వీర♦బాహుని కడకున్. 298

వ॥ అంత నవ్వీరబాహుండు డవ్వీరులంగాంచి యాలింగనంబుచేసి శిరంబులు మూర్కొని యాదరపూర్వకంబుగా ననునయింపుచు, హస్తోత్కర్షంబునఁ జెలంగె ననిచెప్పి. 299

శా॥ స్వాంకక్రీడవిభాస్య, భాసురకరా♦గ్రీంద్రోద్ధతాంచజ్జటా
గాంగోత్తంస ముహుస్సముద్ధరణలీ♦లాసక్త హస్తాబ్జమీ
నాంకస్ఫూర్జ దహంయుతా, నగభిదో ♦ ద్యద్ధాత్రిదిసీపాణి శ్రీ
పంకీభూతి మనోజభూతి శతకో♦భానిర్జితేందు ద్యుతీ. 300

క॥ దీనాదీనవశంమన ని,దానా! దానవ మహాప♦దతమిస్రినికా
యేనా యేనస్సంఘా, హీనా హీనస్మయాప♦హ్యాతిపతగేంద్రా! 301

ధృతవిలంబితము॥ నిజపదాంబుజ ♦ నిశ్చలభక్త కృ
త్సుజనతా గృహ ♦ సుస్థిరకల్పకా!
రజతశైల వి♦రాజిత గోవర
ధ్వజ విరాజర♦ఫస్తుతపద్వయా! 302

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్పిత హృచ్ఛతపత్రి సకల సుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపసగోత్ర కోడూరి
మల్లనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మ్యంబికాతనయ
వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచల
కవిప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత
శంకరసంహితయందలి శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయ గురవే నమః.

శ్రీస్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము

## యుద్ధకాండము.

ప్రథమాశ్వాసము.



మహిళావరమానస
సీమసితచ్ఛదసమస్త ♦ చింతితఫలదా
శ్రీముఖవాగలుభూప
క్షేమంకర కనదపాంగ ♦ శ్రీశివలింగా!

వ॥ అవధరింపుము, సకలపురాణార్థవిచారసమేతుండగు సూతుండు కథాకర్ణనావధిక ప్రమోదులగు శౌనకాదుల కిట్లనియె. 2

—* యముఁడు వీరబాహుని బ్రార్థించుట *—

గీ॥ శమనుఁ డప్పుడు వీరబాహుని ♦ చరణములకుఁ, బ్రణతిఁ గావించి భక్తితోఁ ♦ బలికె దేవ
భసితరుద్రాక్షధారుల ♦ పదముఁ జేరి, చూడ నామది భయమందు ♦ సువ్వె యెపుడు.

వ॥ భవత్సహోదరులు వరకైలాసనగరంబున సుఖంబున్నవారల నీసన్నిధికిం దోడ్కొని వచ్చితిఁ గోపంబుడిగి మదీయాపరాధంబు సహింపవలయునని వినయంబునం బల్కినఁ గృతాంతునిం గరుణించి వీరబాహుం డిట్లనియె. 4

క॥ నీవెపుడు శివప్రియుఁడవు, గావున శివభక్తులకును ♦ గడుప్రియుఁడవు నీ
భావంబున భయమేటికి? నీవీటికి నరుగు మింక ♦ నిశ్చింతఁ దగన్. 5

గీ॥ వీరి నెవ్వగఁ గనుగొని ♦ వికలబుద్ధి, నీవు గొనిపోయి తనుచును ♦ నేను చాల
యాత్మఁ గోపంబు నచ్చితి ♦ నదియు నిము, హృదయమున నుంచవలదు, ప్రేతనాథ! 6

వ॥ అని యూరడించి వీరబాహుం డనుజ్ఞయొసంగిన శమనుండు నిజభటసమేతుండై నిజపురంబునకుం జనియె; నంత, 7

గీ॥ వీరబాహునిమీఁదను ♦ విరులవాన, గురిసె నంతయు నిర్జర ♦ కోటి దివిని
భూరికోలాహలంబుల ♦ భూతవితతి, సైన్యనాథులతోడను ♦ సంతసించె. 8

వ॥ అంతఁ దద్వృత్తాంతం బంతయుఁ దెలిసి చారులు శూరపద్మున కెఱిఁగించిన నతం
డంతయు విని యత్యంతశోకాక్రాంతుఁ డయ్యె; నసురులందఱుఁ శోకంబునొంది
రయ్యగ్నిముఖుని పత్నులాదగ హాహారవంబుల నంతయు విలపించిరి. 9

గీ॥ అపుడు త్రిసహస్రసంఖ్యచే ♦ నతిశయిల్లు, శూరతనయులు తండ్రిని ♦ జూచి తాము
శోకమును బొంది పలికిరి ♦ శూరముఖ్య! దైవగతి కింత చింతింపఁ ♦ దగునె మదిని.

మ॥ అలయష్టోత్తరలక్షవీరతతితో ♦ నభ్యాతసంఘంబుతోఁ
గలనం బోరఁగ నగ్నివక్త్రు నసుపం♦గా యుక్తమే యిప్పుడు
జ్వలశౌర్యం డతఁ డాజి నీల్గుటకుఁ గ్లే♦శం బేల చిత్తంబునం
దలఘుస్థేముఁడు భానుకోపుఁడు హిర♦ణ్యాఖ్యుండును నీకుండఁగన్. 11

వ॥ మఱియు రణరంగభీము లగు మేము గలుగ నీ కీ విచారం బేల? సముద్రంబు
ఘోషించినను భవద్బలంబు శోషింపనేరదు. వినుఁడు. 12

మ॥ అతిరోషంబున మేరుభూధరము వ్య♦త్యాసంబుఁ గావింతుమో
యతులాంభోధి శమింపఁజేతుమొ సను♦ద్యద్బాడబాగ్నిం, ద్వదీ
ప్సితముం జెప్పుమటన్న శూరుఁ డనియెన్ ♦ శీఘ్రంబ యవ్వీరభూ
త తతిన్ బాలకుఁ ద్రుంచి రండిటకు దు♦ర్భ్రాంతప్రతాపోన్నతిన్. 13

వ॥ అని పలికి శూరపద్ముం డనుమతియొసంగిన మహాభయదారులగు తత్కుమారు
లందఱును యుద్ధసన్నద్ధులై సమ్యగ్రత్న మాలికాలంకృత కంఠులును, సకల
భూషణ భూషితులును, సముద్యత్తుంగ శతాంగారూఢులును నగుచు, ననేక
శూరులు బాసటలై చనఁ దేరఁ జతురంగబలసమేతులును, చటులవాద్యఘో
షముఖరిత హరిన్ముఖులును, ఛత్రచామర ధ్వజపరిశోభితులును, చాపతూణీర
ధారులును నై దురంబున కరుదెంచి రప్పుడు, 14

క॥ శూరసుతులు వీరందరు, బోరిని ద్రెళ్లెదరు సత్య♦ము గ నిఁక తనకుం
భారవిమోచన మగునని, వారక నటియించె ననగ ♦ వసుమతి గదలెన్. 15

గీ॥ దానవులమీఁదఁ గాకగృ♦ధ్రంబులాడె, నులక లెల్లెడ గురిసె మ♦హోగ్రముగను
శ్యేనములు కేతనములపై ♦ జెలగి తిరిగె, దుష్టశకునా లనేకముల్ ♦ దోఁచె నెదుర.

వ॥ ఇట్లు భావిమృత్యుసూచకంబులైన దుశ్శకునంబులు గణింపక దానవాగ్రణు
లును రణాంగణంబు సొచ్చిరి. అత్తఱి నుభయబలంబులు మొత్తంబులై మో
హరించి మహీరుహోరుకులధరాధరంబులును, వివిధాయుధంబులును గురియుచు
సంకులసమరంబు గావించి రంత. 17

—* శూరపద్ముని త్రిసహస్రకుమారుల యుద్ధము *—

గీ॥ భూతవీరులచేఁ బరి♦భూతులగుచు, బఱ్వడి రసురవరులు ది♦క్పటలమునకు
వారి దుర్దశ గనుఁగొని ♦ శూరపద్మ, తనయులందఱు మది ♦ రోష మినుమడింప.

మ॥ ధనువుల్ సజ్యము లొప్పఁజేసి కడునుద్యద్ఘోషము ల్మీరఁగాఁ
గనదస్త్రప్రతతుల్ వెసంబరపి యుగ్రస్ఫూర్తి భూతావళిన్
ఘనశౌర్యంబునఁ జెండ నద్భుత మెసంగన్ సంగరోర్విన్ గలా
యనముం బొందియు భూతసైన్యపతు లుద్యత్ధైర్య ధౌరేయులై. 19

వ॥ మఱుఁడి దానవులపై నురువడించి వృక్షంబులు వైచియు, శిలలు రువ్వియు, బర్వ
తంబుల బఱపియు, దండంబులు జెందియు, నరదంబుల ద్విరదంబుల హయం
బుల సారథుల నుగ్గునూచంబు గావించియుఁ, గొందఱ యురంబులు ముసలం
బుల మోదియుఁ గొందఱశిరంబుల కుఠారంబుల నఱికియు, గొందఱ శరా
సనంబులు శరంబులం దునిమియు, గొందఱ కవచంబుల కరవాలంబులఁ దెగ
వైచియు, నిట్లు నానావిధంబుల భూతసైనికులు పరాక్రమంబు సూపిన, 20

క॥ శూరతనూభవు లందఱు, శూరత మెరయంగ మఱియు సురుచిరహేత భు
గ్నారాచంబులఁ బరపి రు, దారతభూతాళిమీఁద ధైర్యము లొలయన్. 21

వ॥ తన్మహాశరంబులవేడిమికిఁ బోడిమి సెడి యొల్లంబోయిన యుల్లంబులు తల్లడిల్ల,
భూతగణంబులం గనుంగొని, లక్షవీరులలోన విజయుండును, జయుండును, మణి
ఘోషుండును, కరవీరుండును, వృషాహ్వయుండును, మహానందుండును, నసం
తుండును, నకలంకుండును, నతిగుణాంకుండును, మారుండును, శశికంటకుం
డును, శతవళియును, నాదిగాఁగల సహస్రవీరులు వెడలి యద్దురాత్ముల వధిం
చుటకు నాలోచించి వీరబాహుతో విజ్ఞాపనం బొనర్చి తదనుజ్ఞ వడసి, 22

క॥ శూరతనూజులఁ దార్కొని, వీరసహస్రం బుదార విక్రమమొదవన్
భూరిశరంబులు గురిసెను, వారక పెడబొబ్బలిడుచు వసుధ చలింపన్. 23

వ॥ ఇవ్విధంబున నమ్మహావీరులకుఁ బరస్పరంబు మహాయుద్ధంబయ్యె. 24

క॥ వీరసహస్రము రథములు, శూరత నురుమాడి రపుడు శూరతనూజుల్
వారి యరదములు ధనువులు, వీరవరుల్ దునిమి యుగ్రవిశిఖావళులన్. 25

వ॥ మఱియుఁ బర్వతోపమానంబులగు తత్తరథంబులన్నియు భంజించిన, 26

క॥ దనుజులు ధరణీగతులై, ఘనభూజమహీధరములు గైకొని శౌర్యం
బునఁ బరపిరి సురతతిపై, ననుపమకోలాహలంబు లడరఁగ మిగులన్. 27

క॥ వీరతతులంత వెంటన, వారక నిశితాస్త్రతతులు పరపి ప్రతాపో
దారస్ఫూర్తి జెలంగ వి, దారించిరి తద్ద్రుమక్ష్మాధరశైలంబుల్. 28

వ॥ ఇట్లు తునిమి మహాఘోరంబగు నాగ్నేయాస్త్రంబు నద్దానవులమీఁదఁ బ్రయో
గించిన నిర్దళితాంగులును, నిర్గళదుధిరపూరులును, నగుచుఁ, గొందఱు మూర్ఛం
జెందిరి. కొంద రసురులు చలంబున నీడంబోక పోరుచు మహాబలులగు వీరవరుల
నంభోనిధిమధ్యంబున వైచిరి. 29

శా॥ వీరుల్ దోడనవచ్చి సంగర సము♦ద్వేలావలేపంబుతో
నారూఢాన్య శతాంగులై సునిశితా♦స్త్రౌఘంబు వర్షించినన్
బోరన్ దచ్ఛరపీడితాంగులగుచున్ ♦ బూర్వామరుల్ కోప వి
స్ఫారోదగ్రతమీర వారి ధనువుల్ ♦ భంజించి రుద్యద్గతిన్. 30

వ॥ ఇట్లన్యోన్యంబు జవంబున నన్యాదృశంబుగ సల్పునెడ దివిజులు దితిజసంతా
డితులై సంతాపంబునుం బొందిరి. 31

క॥ అంత విజయుండు విక్రమ,వంతుఁడు వినయంబు దనర ♦ వరభక్తి నుమా
కాంతుపదాంబుజసేవని,తాంతము గావించె నెలమిఁ ♦ దత్కృపచేతన్. 32

వ॥ అమోఘంబులగు పినుస్తూణబాణంబులు వడసి దానవులపైఁ గోపాటోపంబు
దీపింప శరవర్షంబు గురిసె నప్పుడు తద్బాణంబులు రక్షోవ్రాతంబుల, శిరంబులు
చెండి వానితోడ సకల దిగంతంబుల సప్తసముద్రంబులం బడియె నంత, 33

మ॥ పునరుద్భూతశిరస్కులై దితిసుతుల్ ♦ స్ఫూర్జన్మహాగర్జనల్
దనరన్ సంగరకేళికిం దొడర ను♦ద్యత్రౌఢి వీరుండు [illegible]ల్
కినుకన్ వారిశిరంబు లంఘ్రికరముల్ ♦ గీలాలముల్ జొత్తిలన్
దునిమెన్ దారుణసాయకప్రతతులన్ ♦ దోస్సార మేపారఁగన్. 34

వ॥ మఱియు దానవులు పూర్వంబట్ల సముత్పన్న సర్వాంగులగుచు ననేక విశిఖంబుల
నిగుడింప విజయుండు మనంబున విచారంబునొంది. 35

ఆ॥ స్వామి! కార్త్తికేయ! ♦ సకల శత్రువిదార, యిమ్మహావిచిత్ర♦మేమొ యసుర
మస్తకంబులెన్ని♦మారులు దున్రించిన, పుట్టుచుండు మరల ♦ బూర్వమట్ల. 36

వ॥ వీరల జయించు నుపాయంబు కరుణింపవేయని గుహునిహృత్కమలంబుఁ
దలంచిన నక్రౌంచభేది ప్రసన్నుండై వాని కిట్లనియె. 37

క॥ విజయా! శీఘ్రమ నీకున్, విజయంబగు నస్మదాజ్ఞ ♦ నీవిక దనుజ
వ్రజములఁ బరిమార్పుము నిజ,భుజవిక్రమగరిమ దివిజ♦పుంజము వొగడన్. 38

వ॥ ఇద్దురాత్ములు పద్మజవరంబున మహాబలాఢ్యులై యుండుటంజేసి వీరలశిరంబు
లేకకాలంబున నొక్కబాణంబున నెవ్వండు ఖండించు నప్పుడు నాశంబునొందు
దు రిందులోపల నొక్కంశుతక్కిన వధ్యులుగా రదిగావున, 39

గీ॥ ఒకపరియ నీవు నిశితమా♦నొకశరమున,శిరము లురువడి దునిమి ని♦శ్శేషముగను
కదనతలమున వీరిఁ జ♦క్కాడవలయు,నంబుజాసనువర మిది ♦ సార్థకముగ. 40

వ॥ అని పలికి సకలశత్రుసంహారభైరవం బగు భైరవాస్త్రంబు నొసంగి పార్వతీ
సుతుం డంతర్హితుండయ్యె. 41

—* విజయుఁడు త్రిసహస్రకుమారుల జయించుట *—

క॥ గుహువరలబ్ధాస్త్రుండై, బహుబలుఁడగు విజయుఁడపుడు ♦ కటురవమెసఁగన్
దహనజ్వాలలు నిగుడఁగ, నహితులపైఁ బరపె నమ్మహాస్త్రముఁ బెలుచన్. 42

వ॥ అదియు ననేక భైరవాకారంబుల మహాభయంకరంబై చనుదేరం గనుంగొని సకలరిపునికరంబు వికలంబయ్యె నప్పుడు, 43

క॥ ఘనబలుఁడు మత్తుఁడనియెడు, దనుజేంద్రుఁడొకండు దాని ♦ దళితమొనర్పన్
సునిశితమగు మాయాస్త్రముఁ, దనరఁ బ్రయోగించె రోష ♦ తామ్రాక్షుండై.

మ॥ జవమున్ మీఱఁగ భైరవాస్త్ర మురుభా♦స్వద్దీప్తి నయ్యస్త్రమున్
లవమాత్రంబు గణింప కాక్షణమ కీ♦లల్ గ్రక్కుచున్ వచ్చి యా
హవరంగంబున నేకకాలమున వ్ర♦య్యల్ సేసి మూర్ధంబులన్
భువిఁగూల్చెం ద్రిసహస్రదానవగణం♦బుల్ విస్మయం బొప్పఁగన్. 45

వ॥ ఇట్లు త్రిసహస్రదానవగణంబులుఁ బడుటం జేసి విజయుండు సమరలబ్ధవిజయుండై స్కందుని నుతించె, భూతవ్రాతంబులు కోలాహలంబులఁ జెలంగిరి; నిలింపులు గుంపులుగూడి సొంపలర సుమపరంపరలు గురిసి రయ్యవసరంబున, 46

క॥ అదియంతయుఁగని దూతలు, పదపడి శూరునకు విన్న♦పం బొనరింపన్
మది వికలుఁడగుచు దానవ, మదకుంజరుఁ డపుడు శోక ♦ మగ్నుండయ్యెన్. 47

వ॥ అప్పుడు ధర్మకోపుండను మంత్రివర్యుండు శూరపద్మున కిట్లనియె. 48

క॥ జనక, సుత, సహజ, బాంధవ, జనమతి జగతీశశౌర్య♦శాలురు వీరల్
మనమున ఖేదము నొందరు, దనుజేశ్వర! వంతనొందఁ♦దగునే నీకున్? 49

క॥ దితిసుతులకెల్ల విభుఁడవు, మతిమంతుఁడ వనుదినంబు ♦ మాబోంట్లకు ధీ
చతురతఁ గరపఁగఁ జాలిన, ధృతిశాలివి నీ కిదేల ♦ ధీరత వదలన్? 50

మ॥ సకల ప్రాణహరుండు కాలుఁడు త్వదా♦జ్ఞాధారియై యుండు ద
ప్పక నీకున్ వశవర్తియై విధిగత ♦ ప్రాణంబులన్ దోడనే
ప్రకటప్రౌఢి సృజించు నిట్లయి, యహో ♦ ప్రజ్ఞావిహీనుండవై
యకటా దీనునిపోలె నార్తిఁబడు టన్యాయంబు దైత్యేశ్వరా! 51

మ॥ విలసద్రత్నవిచిత్రితంబయి రణో♦ర్విన్ దిగ్జయశ్రీసము
జ్జ్వలతం గాంచిన నింద్రలోకరథ మెం♦చన్ నీయధీనంబగున్
ప్రళయాభీలమహాగ్నులట్లు కలనం ♦ జాటిల్లు నీసైన్యముల్
బలమైశ్వర్య ముదారవీర్యమహిమల్ ♦ జాటిల్లు నీకెంతయున్. 52

క॥ సేనాధిపతులు మఱియుఁ బ్రధానులు బలయుతులు గలరు ♦ తావకవిభవం
బేనాఁటి కక్షయంబగు, దానవకులనాథ! యేమి ♦ తక్కువ నీకున్. 53

వ॥ అని మఱియు బహువిధముల మహామతియగు ధర్మకోపుండు దుఃఖాక్రాంతుం డగు శూరునకుఁ గ్రమంబున సాంత్వనవచనంబులం దెలియం జెప్పిన విని శూరపద్ముండు విగతశోకుండగుచు ధైర్యం బవలంబించి కార్యోద్యుక్తుండై సమరంబునకు సకల సేనాధిపతులబలంబుల నేనే కలంచెదం గాక యని పలికి, రోష

రూక్షేక్షణుండై వెడలునప్పుడతనితో మహామనీషోద్దీపుండగు ధర్మకోపుండిట్లనియె.

క॥ అనుజన్ము లస్మదాదులు, ఘనతరబలు లుండ, నీవు ♦ కదనంబునకుం
జన యుక్తమె బాలుని పై, తన కనుమతి యొసఁగుమిపుడు ♦ ధైర్యాహార్యా! 55

వ॥ దేవా! భవదాజ్ఞ శిరసావహించి యేన చని నిమిషమాత్రంబున శత్రువులం
జయించి భవత్సన్నిధికిం జనుదెంచెద నని పలుకు నతని వచనంబులు విని సంతో
షం బొదవ శూరపద్మం డతని కనుజ్ఞ యొసంగి మగుడి సింహాసనాసీనుండై
యున్న, 56

—* ధర్మకోపుఁడు వీరబాహుని నెదిరించి పుడియుట *—

సీ॥ ధ్వజపతాకౌఘముల్ ♦ ధవళాతపత్రంబు, లాదిత్యమండలం ♦ బావరింప
పటహకాహళముఖ్య♦బహువాద్యరవములు ప్రళయాబ్ధిఘోషంబు♦పగిది మ్రోయ
చతురంగబలములు ♦ సత్ప్రధానాగ్రణుల్, చనుదేర వెంబడి ♦ సరభసమున
సకలాస్త్రధారియై ♦ చండత పుండరీ,కాఖ్య దిగ్వేదండ ♦ మర్థి నెక్కి
యుల్ల మలరంగ పురవీధు♦లెల్లఁ గడచి, సైన్యధుతధూళి నభ♦స్థ్సలము గప్ప
వందిమాగధసంస్తుతుల్ ♦ గ్రందుకొనఁగ, ధర్మకోపుండు సంగర♦స్థలికి వచ్చె.

వ॥ ఇట్లు వచ్చు నతనిం గని భూతంబులు పరాక్రమోపేతంబులై గంతులు వేయుచు,
సముద్రఘోషభీషణంబు లగు మహారవంబులు చేసిన నమ్మహాధ్వనులు విని
విచారాక్రాంతమానసుండై, 58

ఉ॥ అంతట ధర్మకోపుఁ డరు♦దార దురంతనితాంతకోపదు
ర్దాంతత కార్ముకంబుఁ గొని ♦ దారుణలీల గుణారవంబు ల
త్యంత మొనర్చి తీవ్రవిశి♦ఖావళులం గురిసెన్ మహోగ్ర క
ల్పాంతఘనాఘనప్రకర♦మట్టులను భూతగణంబుపై వెసన్. 59

సీ॥ తేజంబు రాజిల్ల ♦ దివ్యాస్త్రసంఘముల్, పటుతరప్రౌఢిమఁ ♦ బరపి పరపి
నిపుణత మీరంగ ♦ నిజనామధేయముల్, విడువక వేర్వేర ♦ నుడివి నుడివి
బహుతరసింజనీ♦భయదటంకారముల్, చెలరేగి వేమారుఁ ♦ జేసి చేసి
యురుతరహుంకార♦హుంకారముల్ మీర, నసదృశస్ఫూర్తిచే♦ నార్చి యార్చి
భూతములు దానవవ్రాత♦ములును లక్ష,వీరులును దైత్యమంత్రులు ♦ విక్రమించి
పోరి రన్యోన్యమప్పుడ♦ద్భుతమెసంగ, దురము గన్పట్టె నత్యంత♦తుములమగుచు.

వ॥ ఇట్లు మహాఘోరంబుగాఁ బోరునెడ లక్షవీరులు నక్షీణబలోదారులగుచు యమ
దూతలుంబోని నిశితభల్లపరంపరల దానవులప్రాణంబులు గొనం గనుంగొని
కొందఱు నిశాచరులు దిశాంతంబులకు విరిగి చని; రంత, 61

క॥ కోపమున ధర్మకోపుం, డే పెసఁగఁగ భూతసేన ♦ నెదిరించి కన
ద్రోపంబులు గురిసె రవా,టోపంబు సమస్తదిక్త♦టులు నిండంగన్. 62

వ॥ అంతఁ బుండరీకవేదండంబు పరాక్రమోద్దండంబై తలపడి యఖండసాహసంబునఁ
దక్కిన రిపుమండలంబు శుండాదండంబునం జెండి బెండువడం జేయుచుఁ బరి
ఘూర్ణం దొడంగిన, 63

ఉ॥ వీరు లుదగ్రకోపమున ♦ విస్ఫురదాశుగసంఘముల్ మహా
దారుణలీల వైచిరల ♦ దంతి పయి న్రుధిరాప్లుతాంగమై
వారణము న్మహోగ్రగతి ♦ వ్రాలి యయోముసలంబుఁ బూని యే
పారఁగఁ జెండె భూతముల ♦ నద్భుతలీల రణాంగణంబునన్. 64

వ॥ తత్ప్రహారంబుల సారంబుల నెఱసెడి భూతంబులు పరిభూతంబులగునవియు,
మూర్ఛాగతంబు లగునవియు నై తొడబడియు, బడలువడియు మఱలఁ బారి
కొనంజాలక వెఱ చఱచియు నలుదెసలుం బఱచిన, 65

క॥ అది గాంచి వీరబాహుఁడు, మది రోషావేశ మడర ♦ మాతంగముపైఁ
బ్రదరంబులు గురిసిన గజ, మదియుంచుక బలముఁదగ్గ ♦ యలమటనొందెన్. 66

వ॥ ఇట్లు హీనబలంబైన దిగ్గజంబుఁ గని సేదదీర్చి ధర్మకోపుండు కోపంబుగదుర
నవ్వీరుపై నిశితభల్లంబులు శతాయుతంబులు నాటించిన వీరబాహుండు భిదుర
సదృశదేహుండయ్యు నవ్వాడిములుకుల బోడిమిసెడి రుధిరంబుదొరఁగ నిజ
రథంబున విన్ననైన మనంబునం జేయునదిలేక నిమిషమాత్రం బూరకుండిన,

క॥ దనుజుం డది గని శక్తిని, ఘనశౌర్యము మెఱయఁ బఱపఁ ♦ గనుఁగొని వీరుం
డును దాని నునిమె రయమున, సునిశితవిశిఖమున దివిని ♦ సురలు నుతింపన్. 68

వ॥ మఱియు వీరబాహుం డమోఘంబులగు శరౌఘంబులం దత్కవచంబు విదళిం
చిన గతవర్ముండై ధర్మకోపుండు కోపంబున దండపాణి యగు దండధరుండువోలె
దండంబు భుజాదండంబునం బూని సముద్దండంబుగా ద్రిప్పి వైచిన, 69

క॥ వీరుఁడు తద్ఘాతంబునఁ, బోర నిమిషమాత్ర మార్తిఁ ♦ బొందె నసురుఁడున్
వీరాలాపము బలమున్, శూరతఁ జేర్కొనుచు సారె ♦ శుంభత్ప్రౌఢిన్. 70

వ॥ ఆదేవనాయకునిపైన ననేకసాయకంబులు గురిసిన నవ్వీరుండును బలంబు జలంబు
మెఱయ మహాకోపంబున నద్దనుజుపై నస్త్రంబులు నిగుడించె నయ్యస్త్రంబుల
నతండు ధైర్యంబు వదలమింజేసి యసదృశం బగు శక్తిఁ బ్రయోగించిన నద్దురా
త్ముం డగు నయ్యసురుం డొక్కశరంబునం దాని దునియలుసేసె. 71

క॥ కని యదియు వీరబాహుఁడు, గనలుచు దానవునియురము ♦ కఠినతరంబున్
దునుమాడ విశిఖ మొక్కఁడు, గొని శౌర్యము దివిజగణము ♦ గొనియాడంగన్.

వ॥ అయ్యెడ దనుజపుంగవుం డేనుంగుపై మూర్ఛాక్రాంతుం డయ్యె; నంత కోపం
బున మహాబలసాంద్రం బగు నగ్గజేంద్రంబు శుండాదండంబున ముసలంబు బిసబి
స విసరి వైచి వీరబాహునిసూతుని విగతప్రాణునింజేసిన గనుఁగొని, 78

ఆ॥ వీరబాహుఁ డంత ♦ వేగంబ యరదంబు, డిగ్గి మదిని కోప ♦ మగ్గలింప
దిగ్గజంబు గండ♦దేశంబు వడిఁ జెండి, యూర్ధ్వమునకుఁ జిమ్మె ♦ నురుపటిమను.
వ॥ ఇట్లు చిమ్మిన దిగ్గజం బీశ్వరుచేత గజాసురుండునుబోలెఁ బుడమింబడి మూర్ఛిల్లె; నంత మగుడి లేచి యప్పాపాత్ముం డగు నిశాచరుండు దండంబున వీరబాహునురం బు వైచిన నతండు విహ్వలుం డగుచు నది కరంబునం గొని తునియలుఁ జేసిన గని
క॥ దానవుఁడు మహాకులిశము, వానిపయిం బరప వీర♦వర్యుఁడు కేలం
దానిని గొని కోపం బెం, తేనియుఁ జనియింప నేసె ♦ దితిసుతుమీఁదన్. 76
వ॥ ఇట్లేసిన దాన దానవుండు పుడమిం బడియె; నంత నవ్వీరబాహుండు నతనిం బా దంబున దన్నుటయు, రక్తంబుఁ గ్రక్కుచు ధర్మకోపుండు నిహతుండయ్యె; నంత దైత్యు లతనిమోఁకిల నిలువంజాలక విస్రస్తకేశధరులును, విగళితాయుధులును, విషణ్ణచిత్తులు నగుచు, వివిధదిగంతంబులకుం బారిరి. 77
గీ॥ దిగ్గజేంద్రంబు మూర్ఛను♦దెలిసియుంత, వీరబాహునిగని మొక్కి♦వినయ మొప్ప
బలికె నేను దిగ్గజమను ♦ భవ్యచరిత!, నన్నిటులఁ బట్టి తెచ్చెదు♦ర్నయుఁ డితండు.
వ॥ నిగళబంధనంబుఁ గావించి వలసినయపుడు బంధంబులు విడిచి న న్నధిరోహించు చుండు నితనియాజ్ఞ నుల్లంఘింప వెఱతు. 79
శా॥ దైతేయాధము వీనిదుర్మదముఁ జెం♦డన్ జేసి న న్నీవిధిన్
జేతోహర్ష మెసంగఁ బ్రోచితి దయా♦చిత్తంబునన్ నీకు నేం
తో తానున్ రచితాపరాధుఁడ త్వదీ♦యోద్యత్ప్రభావంబు ప్ర
ఖ్యాతం బే నెఱుఁగన్ క్షమింపఁ దగు న♦య్యా వీర! నా నేరముల్. 80
వ॥ ఇప్పు డనుమతి యొసంగిన పూర్వంబుపగిది మదీయస్థానంబున కరిగెద నని పలికి దీనవచనంబుల నతని నమస్కరించి తదాజ్ఞవడసి పుండరీకవేదండంబు స్వప దంబుఁ జేరె నయ్యవసరంబున వీరబాహునిపై సురలు సుమవర్షంబు గురిసి రఖిల భూతసేనలు సంతోషంబుం బొదలిరి. 81
క॥ అది సకలము విని దుఃఖా, స్పదుఁడయ్యెను శూరుఁ డపుడు ♦ శమనుం డలమన్
గదనహతులైన దైత్యులఁ, బదపడి కొనిపోయి మిగుల ♦ భయపడుచుండన్.82
వ॥ తదనంతరంబ భానుకోపుండు పూర్వదిశంబున మాయం బన్ని రణాంగణంబు వాసినది మొదలుకొని నడచువృత్తంబును, ధర్మకోపునిమరణంబును, భూతసైన్యం బులు నిజపురంబు చూరఁగొనుటయు, నిజసూతునివలన విని దుఃఖానలదంద హ్యమానమానసుం డగుచు నాక్షణంబ నిజగృహంబు వెడలి తండ్రిపాలికిం జని నమస్కరించి యిట్లనియె. 83

—✱ భానుకోపుఁడు పితృనిదేశంబుఁ బొందుట ✱—

క॥ బలవంతు లగు విరోధులఁ, గలనం బేర్కొనఁగ ♦ దరమె కడిమిని మనకున్
బలశాలి వీవు మును చని, బలుగాసిం బొందితావె ♦ పరిభూతుఁడవై. 84

క॥ జనకి! మఱి నీదుముండట, దనకుం భయ మగును సెప్పు ♦ దానవబలమె
ల్ల నిహతమయ్యెను గుహుచే, మన మిఁక జీవించునట్టి ♦ మార్గ మెటు లో కో!

వ॥ అయినను బ్రతుకుఁడో వ వచించెద వినుము; బందీకృతు లగు బృందారకుల నందఱ విడిచి స్కందుని చరణారవిందంబులు శరణంబొందిన నతండు కృపాక టాక్షంబుల మనలనందఱ సంరక్షించు, నిదియ కర్జం బనినఁ దనయువచనంబులు విని శూరుండు కోపంబుఁ గదుర నిట్లనియె. 86

గీ॥ బ్రహ్మవిష్ణుముఖామర ♦ ప్రకరమెల్ల, ననుదినంబును ననుగొల్తు ♦ రధికభీతి
నట్టి యే నిఁక బౌరుష♦మకట విడిచి, శరణుఁజొచ్చుట యెట్లు నా♦శాత్రవునకు?

వ॥ ప్రాణంబులు కంఠగతంబులైనను నాశపథంబు విడువనేర; నీవు రేపటియుద్ధ ప్రయాణంబుఁ దలంచి, 88

క॥ ఎంతేని యధీరత నా, చెంత న్నీవిట్టుల న్వ♦చించెద వోహో
భ్రాంత! దివాభీతుఁడ వ, త్యంతము శయనింప నరుగు ♦ మట నెందైనన్. 89

క॥ నేను రణాంగణమున రిపు, సేనలఁ బరిమార్చి వత్తు ♦ శీఘ్రం బనుడున్
సూనుండు భానుకోపుఁడు, మానుగ జనకునకు ననియె ♦ మది రంజిల్లన్. 90

క॥ క్షమియింపు జనక! నావా, క్యము మిన్నక నీ మనంబుఁ ♦ గన నంటిని స
త్యముగాఁ దలపకు మిది మది, సమరమున జయింప నేన♦చాలుదు రిపులన్.91

వ॥ నా కనుజ్ఞయొసంగు మను తనూభవుని వచనంబు విని రాత్రించరపుంగవుండు సంతుష్టాంతరంగుం డగుచు, నప్రతిమప్రతాపాటోపుం డగు భానుకోపునకు దురంబున కరుఁగ ననుజ్ఞయొసంగిన నతండు స్వగృహంబున కేతెంచి, 92

మ॥ జనకాజ్ఞ న్వెస భానుకోపుఁడు మహా♦సంగ్రామసన్నద్ధుఁడై
ఘనదివ్యాస్త్రధనుర్ధరుం డగుచు పీ♦ఠం దేరుపై నెక్కి చెం
తను ఛత్రధ్వజము ల్వెలంగ బహువా♦ద్యధ్వానము ల్మ్రోయఁగాఁ
దనరంగాఁ జతురంగసైన్యములు గు♦ప్తస్యందనాన్వీతుఁడై. 93

వ॥ ఇట్లు సమరప్రయాణోత్సుకుండై తండ్రి నెడబాయుటకు విషాదంబు నొందుచుఁ బురవీథులంగడచి సంగరాంగణంబుఁ జేరి యందు హతులై పడియున్న త్రిసహస్ర సంఖ్యాకు లగు నిజానుజులను, నితరదనుజులం గనుంగొని శోకాక్రాంత హృదయుం డగుచుఁ, గోపంబు దీపింప శూరతనయుండు దన మనంబున, 94

క॥ ఈ శత్రువ్రజమెల్ల వి, నాశను నొందింతు వెస రణక్షోణి నిశా
తాశుగముల లేకుండిన, నాశౌర్యను మెత్తురే జనంబులు జగతిన్? 95

క॥ వైరులను గెలువనేనియు, దారిద్ర్యముఁ బొంది మన్మ♦థవ్యథచేతన్
వారవధూసంగమమును, గోరిన జనునట్లు నన్నుఁ ♦ గుంభిని నగరే? 96

వ॥ అని వితర్కించి రోషభీషణుం డగుచు రిపుసేనలం దాఁకిన నతని గని భూతంబులు

మహాభయసమేతంబులై వీఁ డెవ్వం డొకో మహాసురుం డొక్కఁడనేకమహాసైన్యంబులతో నరుగుదెంచె నని మనంబుల గలంగుచు, బీరంబు సెడక ధైర్యధారేయులై తలంపడి, రప్పు డుభయదళంబులుం గదిసి మహీధరమహీరుహమహోపలంబులును, గదా ముద్గర ముసలంబులు మొదలుగాగల యాయుధంబులు గురియుచు నతిభయంకరంబుగాఁ దురంబు సేయునెడ, 97

మ॥ హతులై శూరు లనేకులుం బడిరి ప్రోద్యల్లీల వర్తించె నా జితలంబందు కబంధసంఘములు డాసె న్మాంసకాంక్షన్ శివ ప్రతతు ల్గృధ్రలు కాకము ల్గిరిగె ధైర్యంబెంతయు న్లేక య ద్దితిజశ్రేణుల మోలఁ బారె బెలుచ న్దిక్ప్రేణికిన్ భూతముల్. 98

వ॥ ఇట్లు పాటిన సేనలం గనుంగొని భూతసేనాధిపులు బలంబులం జేయూచి కినుక వాడమిన మనంబున దనుజబలంబులపైఁ గదిసి నిశితశరంబుల మర్మంబుల గాడనేసిన భిన్నభిన్నాంగు లగుచు నసురులు కసటువడి పలాయనంబు నొందినం గని భానుకోపుండు కోపంబున నిశాతభల్లంబులఁ దన్ముక్తమహాతరుగిరులు చూర్ణంబుఁ గావింపుడు నబ్బురంబుగా నిబ్బరంబు లగు పెడబొబ్బలిడుచు మిడుగురులుఁ గడల సెదర నాగ్నేయాస్త్రంబు లనేకంబులఁ బరపిన నవి యొడలం గాడిసనుటయు భూతసేనాధిపులు రక్తసిక్తాంగులై తద్బాణఘట్టనల నెట్టుకొని నిలువంజాలక పలాయనంబు నొందిన, 99

—* భానుకోప వీరబాహుల తృతీయ యుద్ధము *—

చ॥ అది గని వీరబాహుఁడు మహాగ్రహ మొప్పఁగఁ దేరుఁదోలి య క్కడన ధరాతలంబునకుఁ గార్ముకము న్గయిఁబూని విస్ఫుర త్ప్రదరచయంబులం గురిసి భగ్న మొనర్చి తదాయుధావళిన్ మదమణగించె దానవుల మార్కొని నిస్తులశౌర్యధుర్యుఁడై. 100

వ॥ అంత భానుకోపుం డమ్మహామహునిం గని కనలుచు నిట్లనియె. 101

శా॥ దూతత్వంబున వచ్చి పూర్వము మహాదోర్దర్పము న్మీరఁగా దైతేయావళిఁ ద్రుంచివైచితివి నీధైర్యంబు నీశౌర్యమున్ ఖ్యాతిం జెందుటఁ జూత మిప్పు డిట సంగ్రామంబున న్నిల్వుమా నాతో నీ విఁక, నెందుఁ బోయిన ననూనప్రౌఢిమ న్ద్రుంచెదన్. 102

వ॥ అని యిట్లు గర్వోక్తులాడు నిశాచరునకు వీరబాహుం డిట్లనియె. 103

క॥ మనమిరువుర మాహవమున, ఘనధృతిఁ బోరుదము దివిజగణములు నింగిన్ దనరుచు సంతోషంబులఁ, గనెదరు జయమపజయంబు గరిమదలిర్పన్. 104

వ॥ రిత్తమాట లాడిన దాన నేమియగు; మగంటిమిగలవాఁడ వగుదువేని నాతోడ నిమిషమాత్రంబు రణంబుసేయుఁబూను; మనవుడు భానుకోపుండు కోపంబు

గదుర భిదురసదృశంబగు నమ్మహావీరు నురస్స్థలంబు తీవ్రంబులగు నారాచసహ
స్రంబుల నొప్పించిన, 105

క॥ కోపించి వీరబాహుఁడు, పాపాత్ముం డగు నిశాటు ♦ బాహుయుగమునన్
రోషసహస్రము గ్రుచ్చెఁ బ్రతాపము మెఱయంగ సమర♦ధాత్రీస్థలిలోన్. 106

క॥ అసురుం డంత మహోగ్రత, ససదృశగతి దునిమె నతని ♦ యంబులపోదియున్
వెస వీరుం డా దైత్యుని, నొసటం బ్రయోగించె శక్తి ♦ నూల్కొనుకడిమిన్. 107

వ॥ తచ్ఛక్తిఘాతంబున నసురవిరోధి శిరోధి వ్రేలవైచి కొండొకసేపు మూర్ఛా
గతుండయ్యె; నంత వీరబాహుండు వాయవ్యంబుఁ బ్రయోగించె. 108

ఆ॥ కడిమి మెఱయనాజి♦ఘనరోషవిస్ఫూర్తి దనుజుఁ డడియనైది ♦ తునిమె దాని
వీరుఁ డలుక నగ్ని♦విశిఖంబుఁ బరపిన, దాని దాన దుంచె ♦ దానవుండు.

వ॥ ఇట్లు తుంచి రోషంబున సౌరాస్త్రంబుఁ బ్రయోగించిన వీరబాహుం డయ్యస్త్రం
బున దాని విదళించె, నంత భానుకోపుఁడు కోపంబుతోడ రిపుభయంకరుండగుచు
సర్వసంహారకారకంబగు బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన, 110

గీ॥ అదియు వారించె బ్రహ్మాస్త్ర♦మడరఁ జేసి, వీరబాహుండు సాహసో♦ద్వేలుఁడగుచు
నంత నఖిలదివ్యాస్త్రముల్ ♦ వ్యర్థముగనుఁ, జేవ దానవనాథుండు♦భూరిపటిమ.

వ॥ మఱియు మహాఘోరంబగు నారాయణాస్త్రంబు సంధించి వైచిన నది ప్రభావిభా
సితదశదిశాంతరాళంబై మహాకరాళంబగుచుఁ, బరతేర వీరబాహుండు గనుంగొని
తాను నయ్యస్త్రంబుఁ బ్రతిసంధానంబుఁ జేసినంత, 112

క॥ అవియుఁ బరస్పరఘృష్టన్, జవ మడరఁగఁ బోరిపోరి ♦ సడలుచు నిలిచెన్
దివిజపరిపంథి యంతట, నవశిఖసంకాశకోప♦దారుణుఁ డగుచున్. 113

వ॥ ఇంకేను సర్వశత్రునిషూదనంబైన పాశుపతాస్త్రంబు విడిచిన, నతండు నదియ
నిగుడించుంగాన, దానఁ గార్యంబు నిరర్థకంబగు నని వితర్కించి, 114

క॥ మాయావిగాన దనుజుఁడు, మాయ నదృశ్యుండునగుచు, ♦ మారుతమువలెన్
సాయకవృష్టిని నలుదెసఁ, బాయక తిప్పుచును వీరు♦పై వర్షించెన్. 115

వ॥ ఆసమయంబున వీరబాహుండు భిదురసదృశదేహుం డయ్యును నమ్మహాశర
ఘాతంబుల రక్తసిక్తాంగుఁ డగుచు నిష్ఠురాత్ముం డగు దనుజుం డెందు చనియెనో,
తద్విశిఖంబులు నాపైఁ దొఱఁగుచున్నవి; వాఁ డలక్ష్యుం డయ్యె బాణంబులు
లక్ష్యంబగుచున్నయవి యని వ్యాకులచిత్తుండై నలుగడలు గలయ విలోకించి,
రిచ్చపాటొదవం జేయునది లేక విన్ననై మిన్నకయుండె; నయ్యవసరంబున దేవత
లును, భూతసేనాధిపతులును భయభ్రాంతులైరి. 116

మ॥ అనయం బత్తరి వీరబాహుఁడు నిజ♦స్వాంతంబునన్ దైత్యమా
యనిరూఢిన్ గని సర్వమోహకము జ్ఞా♦నాస్త్రంబు సంధించి త

ద్ధనదీ ప్తి న్గగనంబున న్సురథుండై ♦ కన్పట్టు రాత్రించరుం
గని కోపంబునఁ దేరుతో గదిసి సం♦గ్రామంబొనర్చె న్గడున్. 117

వ॥ అప్పు డయ్యిరువురు పరస్పరంబు రథంబులు వివిధగతుల నలుగడలం ద్రిప్పుచు జయఘోషంబుల రొప్పుచు బ్రళయకాలఘనాఘనంబుల పగిది శరవర్షంబులు గురియుచుఁ బ్రథమానశౌర్యధైర్యంబుల మెఱయుచుఁ బ్రదరంబుల విడుమిడ్వుడ మద్బాణంబుల భవత్ప్రాణంబులఁ గొనియెద; నాముందర నీ వెందు సనియెదని యన్యోన్యంబులు శపథంబులు వెలయ ప్రభావంబు లుగ్గడింపుచుఁ బౌరుషంబులు మించి నిజనామంబుల నుడివి పరాక్రమంబులఁ బ్రకటింపుచుఁ బలుమరు నొండొరుశరంబులు ఖండించి పైపై నిశితకాండకాండంబుల నించుచుఁ బరస్పరంబ పటుశిలీముఖౌఘంబు లమోఘంబులు గావింపుచుఁ బాణితలంబుల దొడలుదట్టి బెట్టుగ నట్టహాసంబులు సెలంగఁ దార్కొనుచు, బగర కుత్సాహంబొదవ బరనామంబులుఁ బేర్కొనుచుఁ, బ్రతిఘటించి కోలాహలంబు లడర శంఖంబులఁ బూరింపుచుఁ బరుషోక్తు లడర నీసున నితరేతరంబు భర్జింపుచు బహువిధంబులఁ బోరి రప్పు డారణం బతిదారుణం బతితుములంబుగాఁ జూపట్టె.

క॥ భూతలము తత్కదంబ, వ్రాతంబులఁ గప్పె వసుధ ♦ వ్రాలిరి దైత్యుల్
భూతములఁ దొఱఁగ నట్లన, భీతిల్లె రణంబుఁ గాంచి ♦ పెలుచన్ గ్రహముల్.

వ॥ మఱియు దాహకత్వంబునఁ బ్రళయాగ్నిసమంబులును వేగంబున వాయుతుల్యంబులును మారకత్వంబున నంతకోపమానంబులును ప్రకాశంబున నాదిత్యసంకాశంబులును మహారవంబుల నశనిసదృశంబులును సంహారకత్వంబునఁ ద్రిపురాంతకాస్త్రనిభంబులు నగు నానావిధశస్త్రంబులం బోరి పోరి పరపియుఁ దనివిసనక మల్లులగుచుఁ దలఁపడి హరిహరియును గిరిగిరియును కరికరియునుంబోలెఁ బరస్పరంబులం బెనంగిరి. 120

క॥ గగనంబు దిశలు వనధులు, నగములు నిండెన్ దదీయ♦నారాచంబుల్
భుగభుగమంటలు గ్రక్కుచు, ధగధగ వెలుఁగుచును మిగుల ♦ దారుణభంగిన్.

గీ॥ అంబుదంబులు గొన్ని భి♦న్నంబులయ్యెఁ, గ్రాలె నుడుపంక్తి చెదరెది♦గ్గజములపుడు నంబునిధులెల్ల శోషిల్లె ♦ సచలములును, గంపమొందెను దద్బాణ♦ఘుర్షణమున.

వ॥ తచ్ఛరానలధూమం బజాండభాండంబు మెండుగ నిండె. 123

క॥ ఆరణకేళిం గనుఁగొని, యీరి పరాక్రమము ధైర్య ♦ మార బలంబుల్
వీరికి వీరే సము లని, వారక కొనియాడి రమర♦వర్గము మునులున్. 124

వ॥ అంత భానుకోపుండు కోపాటోపంబున శరసహస్రంబుల వీరబాహునరదంబు వ్రయ్యలు చేసిన, 125

గీ॥ వీరవర్యుండు రోషించి ♦ వేగ దునిమె, నసురునరదంబు బాణస♦హస్రములను,
మఱియు దనుజుండు ముప్పది♦మార్గణముల, వీరువక్షంబునాటె న♦విస్మయముగ.

వ॥ వీరబాహుం డవ్వీరుఁ గేలం దునిమి పదునాల్గునిశితపత్రిశరంబుల నిశాటుని మకు
టంబు పుడమిం బడవైచిన, 127

క॥ అసురుం డన్నియు శరముల, వెసఁ దునియలుగా నొనర్చి ♦ వీరుని కవచం
బసురవిలు వీరబాహుఁడు, లసమరుగతి నేడుశరము♦లను దునుమాడెన్. 128

క॥ శకలీకృతకార్ముకుఁడై, భృకుటీకుటిలతను దాన♦వేంద్రుం డుద్ద
ప్త కమలజదత్తశక్తిన్, బ్రకటితముగఁ బరపె వీర♦బాహునిమీఁదన్. 129

క॥ వీరుం డాశక్తిపయిన్, వారక శతకోటిశస్త్ర♦వర్షము గురిసెన్
నారాచము లవి నడుమ ని, వారించి సమీపమునకు ♦ వడి నది రాగన్. 130

క॥ అనుపమబలుఁ డా శక్తిం, గని వీరుఁడు కార్తికేయుఁ ♦ గారుణ్యపయో
ధిని దలఁచి యుగ్రఖడ్గం,బున దానిం ద్రుంచె సురలు ♦ బొగడ ముదమునన్. 131

వ॥ అంత నవ్వీరపుంగవుండు కోపంబున ఖడ్గంబు నిడి యూరకుండె; నయ్యెడ మహాపా
పుం డగు భానుకోపుండు కోపంబుగదురఁ గరాళంబగు కరవాలంబుఁగొని త్రిప్పి
సింహనాదంబొనర్చుచు వీరబాహుపయిం గవిసినం గని యతండు సునిశితవిశిఖం
బుల వజ్రనిష్ఠురంబగు తద్వక్షస్థలంబు భేదించె. 132

క॥ దనుజుం డదియు గణింపక, తనువున రుధిరములు దొరుఁగ ♦ దద్దయు వేగం
బనుదెంచి వీరబాహుని, ధను వరిమురిఁ ద్రుంచె ఖడ్గ♦ధారన్ గిన్కన్. 133

వ॥ ఇట్లు త్రుంచి సింహనాదంబులు సేయుచు నలుగడలం దిరుగుచున్నంత వీరబా
హుండు ఖడ్గంబుఁ గొని చూపరులు వెఱగంద నతనితోడం దలఁపడియె; నప్పు
డయ్యిరువురకు దహనశమనులకుం బలె ఖడ్గయుద్ధంబు మహాభయంకరంబై
చెల్లె; నంత, 134

క॥ పాపాత్ముఁ డసురుఁ డురుతర కోపం బడరంగ వీర ♦ కుంజరుభుజముల్
దీపితకరవాలంబున, నేపెసఁగఁగ నేసె దోస్స♦మిద్ధపౌర్షిన్. 135

—* వీరబాహుఁడు భానుకోపుని యాకసంబున చిత్రవధ సేయుట *—

వ॥ వీరబాహుండు వాని నిరర్థకంబుజేసి తద్ఘాతంబు సరకుఁగొనక సంగరకళాకౌశ
లంబు మెఱయఁ గోపోద్దీపితుండై కౌక్షేయకంబున నతనిదక్షిణహస్తంబును ఖం
డించిన, 136

గీ॥ మఱియుదనుజుండుడాకేల♦మండలాగ్ర, మలరఁగొని మీఁదఁజనుదెంచు♦నంతలోన
వామకరమును దునిమె న♦వార్యపటిమ,వీరవర్యుండు దివిజులు♦వినుతి సేయ.137

వ॥ అంతఁ గోపంబున నంతకోపమానుం డగుచు నద్దానవుండు మాయాస్త్రంబుఁ
బ్రయోగింపం దలంప నాక్షణంబ యుదారబాహుం డగు వీరబాహుం డాహ
వంబున నతనిశిరంబుఁ బర్వతశిఖరంబునుం బోలెఁ గరవాలధారం దునిమి
పృథ్వీతలంబునం బడవైచె; నంత, 138

క॥ హాతు భానుకోపుఁ గనుఁగొని, యతిశయముగ గురిసి రమరు ♦ లలరులవానన్
గుతుకమున నార్చె భూత,ప్రతతియు హర్షించె మిగుల ♦ భానుండు దివిన్. 139

వ॥ ఆసమయంబున వీరబాహుండు గగనంబు విడిచి భూతలంబుఁ జేరి సహోదరులు తన్ను నలంకరింప సొంపెసంగుచు నిష్పాపాత్ముం డసురుండు నీల్గుట నాచేసిన ప్రతిన సెల్లె; పూర్వదినంబుగదా గుహునియుక్తుండనైతి నని పల్కి సంతోషంబున వాద్యఘోషంబులు మొఱయ హేమకూటపురంబున కరిగి స్కందు మందిరద్వారంబున నిజరథావరోహణంబుఁ జేసి యంతఃపురంబున దివ్యమంగళ విగ్రహుం డగు గుహునిం గని యతని పాదారవిందంబుల కతివినయంబునఁ బునః పునఃప్రణామంబులు గావించిన, 140

క॥ సేనాని వీరబాహుని, మానుగ హస్తముల నెత్తి ♦ మన్ననఁ దనరన్
దేసియసోనలు గురియఁగ, సీనుల విందుగను బల్కె ♦ వీరునితోడన్. 141

క॥ చలపాది భానుకోపుని, గలనన్ బరిమార్చి మిగుల ♦ గాసిలితి వహో
బలు సంతసిల్లె నామది, చెలువుగ భవదీప్సితంబుఁ ♦ జెప్పుము వీరా! 142

వ॥ అంత బాహులేయునకు వీరబాహుండు కృతాంజలిపుటుం డగుచు నిట్లనియె.

క॥ నీకృప శూరజుఁ గెల్చితి, నాఁకేమి ప్రియాస లేదు ♦ నాయభిప్సితమున్
జేకూరెఁ గరుణ నొసఁగుము, ప్రాకట భవదీయపాద♦పంకజభక్తిన్. 144

వ॥ నాకు హరిబ్రహ్మాదిపదంబులేనియు నకాంక్షితంబు లగుచుండు; సకలశ్రేయః ప్రదం బగు భవద్భక్తియ నా సదభీప్సితంబై యుండు నని ప్రార్థించినఁ బార్వతేయుం డతని కనన్యసులభం బగు నిజభక్తిఁ బ్రసాదించె; నంత వీరబాహుండు గుహునకుం బ్రణమిల్లి సహోదరసమేతంబుగా నిజగృహంబునకుం జనె నని చెప్పి సూతుండు మఱియు నిట్లనియె. 145

క॥ ఈ వీరబాహువిజయము, భూవలయములోన వినిన ♦ పురుషు లభీష్ట
(శ్రీ) వెలయుచు సమరోర్వ మ,హావిజయము గాంతు రీశ్వ♦రాత్మజుకరుణన్. 146

వ॥ వినుఁడు తత్కథాశ్రవణంబునఁ బాండవులు రణంబున దుర్యోధనాదులం జయించి ధర్మమార్గనిరతులై వెలసిరి; జామదగ్న్యుయు నిది విని బలపరాక్రమ సంపన్నులైన కార్తవీర్యాదులం గెల్చె; ఋషిముఖంబున నాకర్ణించి వాలియు మారుతాత్మజుండును నజేయు లగు ననేకశాత్రవుల సంహరించి రని పల్కి మఱియు నిట్లనియె. 147

గీ॥ అంత శూరపద్ముఁ ♦ డాత్మజనిధనంబు, నెలమి దూతముఖము♦వలనఁ దెలిసి
శోకభరముచేత ♦ సుక్కుచుఁ గడుమూర్ఛ, నొంది పడియె నప్పు♦డుర్విమీఁద.

వ॥ ఇట్లు మూర్ఛాగతుండై కొండొకదడవునకుఁ బరిచారకులవలనం దెలివొంది యిట్లని విలపింపం దొడంగె. 149

—* శూరపద్మాదులు భానుకోపుని మరణము విని విలపించుట *—

క॥ హాపుత్త్ర! భానుకోపుఁడ! నీపటుతరభుజబలంబు ♦ నే డడఁగె నోకో
నీ పేరు నుడువ భానుం, డీపట్లను వెఱచుభీతి ♦ నిఁక మానెకదా! 150

క॥ నీ కీర్తులెనఁగోఁ నిఁక, నాకులు సుఖయింపఁగలరు ♦ నారాయణుఁడుం
భూకమల లూరు లొత్తఁగఁ, జోకఁ శయనింపఁగలఁడు ♦ సుఖముగ నబ్ధిన్. 151

క॥ త్రిదివంబున గిరిభేదియు, సుదతీమణి శచినిగూడి ♦ సొంపుగ నోహో
ముదమందఁగలఁడు కదు న,భ్యుదయంబునుఁ బొందఁగలరు ♦ భువి దిక్పతులున్.

వ॥ అని మఱియు, 153

ఉ॥ హాయనిమోహబుద్ధి ననఁ ♦ హాయని శాతశిలీముఖాగ్రిహా
హా యనివార్యధైర్యనగ ♦ హా యని మేషవిభంగసుప్రితా
హా యనిశాత్రిశస్త్రిత ♦ హా యనిలోపమవేగ భానుకో
హా యని యేడ్చు బీదహృదు ♦ హాయని రూఢిని బొందశేకొగిన్. 154

వ॥ ఇవ్విధంబున విలపించు సమయంబున, 155

క॥ దనుజులు కొందఱు తన తన,యుని శీర్షకబంధపాణు ♦ లొగిఁ గొనితేరం
గని యాయవయవములఁ గ్రమ,మున సంధించి యసురపతి ♦ పొగిలెమనమునన్.

వ॥ అయ్యవసరంబునఁ బద్మకోమల సపత్నులతోఁ జనుదెంచి కుమారునంగంబులు
గని భూతలంబునం బడి లేచి తదవయవంబులఁ గరంబుల నంటి మూర్ఛిల్లనుచుఁ
గన్నీరు దొఱఁగఁ గచభరంబు చెదర దురంతశోకాక్రాంత యగుచు నిట్లని విల
పించె. 157

క॥ కమలాకరసంస్థిత మగు, కమలముఁ గావలయు ననుచుఁ ♦ గాంక్షించిన శ్రీ
ఘ్రిమ తెచ్చి నా కొసంగెను, కొమరుండితఁ డివ్విధమున ♦ గుంభినివడెనే? 158

క॥ సురలెల్లఁ దనకు నివ్విధిఁ, బరితాపమొనర్చి రకటఁ ♦ బాధించెదె యీ
కరణి మహాఖేదము నిజ,తరుణుల కీ దోష మిఁక వృథా చనునోకో. 159

వ॥ అని యీవిధంబున శూరుండును యెల్లదానవులును గాంతాజనంబులును హాతుం
డగు సుతుం బేర్కొని విలపించి రంత దానవేంద్రుండు లేచి కోపోద్దీపితుం డగుచు
నీక్షణంబున తాన కయ్యంబునకుం జని సకలశత్రుసంహారంబుఁ గావించి తద్రుధి
రంబున వీరయజ్ఞంబు సల్పి తనూభవుని బ్రతికించెదగాక యని పల్కి తన్పుత్త్రు
తకళేబరమును సంరక్షించుకొనియుండ రాక్షసులకొందఱ నియోగించి పద్మ
కోమలాది భార్యల నంతఃపురంబున కనిచి, మాతలిం గనుగొని యిట్లనియె. 160

గీ॥ అమితవిభవమొప్ప ♦ నసురాఖ్య పట్టణ,మునకు నేగి సింహ ♦ ముఖునితోడ,
భానుకోపముఖ్య ♦ బహుదైత్యనిధనంబు, సెప్పి తోడి తెండు ♦ శీఘ్ర మతని.

వ॥ అనిన విని దూత లతిత్వరింబునం జని నానారత్నచిత్రితంబగు నసురపురంబు సేరి మహాబలుండగు సింహవక్త్రునిం గని ప్రణమిల్లి సవినయంబుగ నిలిచి యిట్లనిరి. 162

క॥ దానవవర నీజ్యేష్ఠుఁడు, మానితబలశాలి దనుజమాళియు నిపు డెం
తేనియు నినుఁ దోడ్తెమ్మని, మానుగ నిట కనిపె మమ్ము మహితబలాఢ్యా!

వ॥ కావున నాలస్యంబు వలదు; శీఘ్రుం బరుదేర వలయు; ననవుడు నతండు వృత్తాంతం బేమి యని యడుగుటయు దూతలు భానుకోపుని వధంబు సెప్పిన విని రాక్షసేంద్రుండు శోకాక్రాంతహృదయుం డగుచు, శిరంబు వాంచి కొండొకసేపు చింతించి, 164

మ॥ అతిరోషంబున లేచి తేరుపయి బోరిద్యత్ప్రౌఢి నాయూధుఁడై
చతురంగంబులు సైన్యము ల్గొలువఁగా ఘటిధ్వజశ్రేణికా
యుతుఁడై సయ్యన వాద్యఘోషములతో దోయీధి నేతెంచె న
ప్రతిమానం బగు శూరపద్మపురికిన్ ఘోస్యత్ప్రభావోన్నతిన్. 165

వ॥ ఇట్లు వచ్చి సింహవక్త్రుండు శీఘ్రంబ రథంబుడిగ్గి భ్రాతృమందిరంబు సొచ్చి కక్ష్యాంతరంబులుగడచి యంతఃపురంబున కరిగి యందు పుత్రశోకాకులుం డగు నగ్రజు శూరుం గని పదంబుల కెరగిన నతండు సోదరుని బాహుతలంబునఁ జేర్చి కౌఁగిలించుకొనియె. 166

ఆ॥ అంత సింహవక్త్రుఁ డనియె నగ్రజుతోడ, శౌర్యధైర్యములకు సదన మీవు
ఖేదపడియె దేల కేవల మీరీతి, తెలియ నుడువు నాకు దితిజవర్య! 167

వ॥ అని యడిగిన సహజన్మునకు శూరపద్ముండు నఖిలంబును దెలిపి, శీఘ్రంబ నీవు రణంబునకుం జని సకలశత్రుసంహారంబు గావించి మగుడ నాసముఖంబున కరుదేరవలయు; నేతదర్థంబు నిన్నిటకు రావించినది యనవుడు, 168

—* సింహవక్త్రుండు శూరునకు హితంబు సెప్పి యని కరుగుట *—

క॥ శూరునివచనము విని కడు, వారక సింహాస్యుఁ డనియె వ్యర్థం బకటా
పోరం జంపితి నిశిచర, వారంబు నొకింత నాదువాక్యము వినక౯. 169

వ॥ సాక్షాత్పరశివుండు సత్యజ్ఞానానందమయుండునగు వానిం బాలకుం డనుచు బల్కితి; తత్ఫలంబిప్పుడ యనుభూతంబయ్యె; నేరికేనియు దైవగతిదుర్లంఘ్యంబు; నావాక్యంబు నీకు సత్యాంతదాహకం బగు విషం బయ్యె; నింక నేమిసెప్పనగు; నా కనుజ్ఞయొసంగు మేను కయ్యంబునకుం జని సకలరిపుల జయించివచ్చిగాని నీముఖంబుఁజూడనని పలికిన విని శూరపద్ముండట్లు కాక యనియనుజ్ఞనొసంగ,

క॥ తనవిడిదిఁ జేరి సింహా,ననుఁడు దధిక్షీరరుధిరనానామధువుల్
వననిధులట్లన గ్రోలుచుఁ, దిని మాంసపు రాసులెలమిఁ దృప్తుండగుచు౯. 171

క॥ కౌతుక మొప్పఁగ బరిమళ,జాతంబులు మేన నలఁది ♦ స్రగలంకృతుఁడై
నూతనవస్త్రాభరణ,వ్రాతంబులఁ దాల్చి యతుల♦వైభవ మెసఁగన్. 172

వ॥ ఈశ్వరదత్తంబులైన దండచక్రకులిశశూలంబులును నితరదేవతాస్త్రంబులును మహాఘోరంబగు మాయాపాశంబునుం గైకొని దశలక్షతురంగంబులం బూన్చిన రథం బధివసించి పరాక్రమసహితు లగు సేనాపతులును, సుతులును, బాసటమై చనుదేర భయదనినదంబు లెసంగ నానాయుధభాసమానంబులును లక్షవాహినీసంఖ్యాకంబులును నగు చతురంగబలంబులతోడ శూరాసురుండు పురంబు వెడలె; నంత, 173

మ॥ గజవాజిప్రకరంబులుం ఘనశతాం♦గశ్రేణులున్ సైనిక
వ్రజముల్ భూతల మావరించె మొరసెన్ ♦ వాద్యప్రఘోషంబులున్
విజితాంభోధిరవంబులై దెసలఁ బ♦ర్వెన్ ఛత్రము ల్చామర
ధ్వజకోట్లొప్పె ననేకము ల్బలురజో♦వ్రాతంబుఁ గప్పెన్ రవిన్. 174

వ॥ ఇట్లరుదెంచుసమయంబున, 175

గీ॥ అరదములమీఁదగృధ్రంబు♦లాడెఁ గూసె, కాకిసంఘంబు శుష్క-వృక్ష♦ముల నెక్కి-
యుల్కలెల్లెడవ్రాలెని♦ర్వ్యాజమిగుల, దుర్నిమిత్తంబు లెంతయుఁ♦దోఁచె నెదుర.

వ॥ అంత హరిచతుర్ముఖప్రముఖు లగు నిఖిలబర్హిర్ముఖులు సమరాభిముఖుం డగు సింహముఖునిం గని కాందిశీకు లగుచు స్కందునిమరువుఁ జేరి తత్పాదారవిందంబులకు వందనంబు చేసి కృతాంజలులై యిట్లనిరి. 177

క॥ దేవోత్తమ! కరుణాంబుధి, గావుము మా కభయ మొసఁగి ♦ ఘనశౌర్యుఁడు శూ
రావరజుఁడు సింహాస్యుఁడు, వేవే చనుదెంచె సమర♦విజయోత్సుకుఁడై. 178

వ॥ దేవా! వీఁడు సహస్రమూర్ధుండును, ద్విసహస్రభుజుండును, సహస్రయోజనాయామదృఢతర భుజాంతరుండును, బ్రహ్మాండసహస్రశాసనుండును, నఖిలవైరిసంహారకుండును, మహేశ్వరదత్తమాయాపాశశూలాద్యనేకాయుధధరుండును, మహాబలపరాక్రముండును నగు; మఱియును, 179

క॥ కులనగములు దిక్కుంజర,ములు కూర్మం బష్టనాగ♦ముఖ్యులు బలస
త్త్వులగుచు దాల్చు వసుంధర, బలయుతుఁ డితఁ డేకదినము♦భరియించెబయిన్.

మ॥ భువనవ్రాత మితం డఖండసహితం♦బున్ వేగ భక్షింపనో
పు, విలాసంబుగ నొక్కనాఁ డితఁడు వి♦స్ఫూర్జద్గతిన్ ద్రిప్ప మే
రువాఁగెన్ దండముగాఁగ గేలఁగొని నా♦నామార్గ దదాస్ఫాలనం
బు వసిష్ఠేయ నసారమైన మునిచే ♦ బూర్వప్రకారంబునన్. 181

వ॥ అదియునుంగాక నిష్పాపాత్ముండు ఛాయావిరాజితపార్శ్వద్వయంబును, శంభుదత్తంబును నగు నాశిలంబు శూలంబు ధరియింపుచుండు; నితని యగ్రజుండు

హారుని, నేకాదశకోటిరుద్రులను, నీశానునిం దక్కఁ దక్కిన యాదేవగణంబుల నెల్లఁ గృషినియుక్తులంజేసి బాధింపుచుండు; నిస్సురాత్ముల మరణంబున వధించి మమ్ము రక్షింపు మను వేల్పులదీనాలాపంబులు విని వారి కిభయంబు లొసంగి సుబ్రహ్మణ్యుం డాక్షణంబ, 182

క॥ సారథియైన సమీరుని, తేరుం దెమ్మని ప్రియానఁ గిపితమతియై
ధీరత లేచుటఁ గాంచి యపారబలాఢ్యుండు వీర బాహుండు వేగన్. 183

వ॥ సత్యజ్ఞానానందలక్షణుండు నగు స్కందునిపదారవిందంబుల కెఱగి నాకనుజ్ఞ యొసంగు; మేను సంగరాంగణంబున సకలశత్రుభంగంబు గావించి వచ్చెద ననిన విని గుహుండు మందహాసవిలసితముఖారవిందుం డగుచు నాహావంబున కనుజ్ఞ నిచ్చిన నతండు నిజగృహంబునకుం జనుదెంచి, 184

మ॥ ధృతనానాయుధుఁడై విభూషణలసద్వస్త్రాంబరోపేతుఁడై
యతులప్రౌఢరథంబునెక్కి బహుసైన్యాధ్యక్షుల న్సాహసా
న్వితు లక్షాధికలక్షవీరులును, భేరీ ధ్వనుల్ నూపస్వరూ
ద్ధతి నేతెంచెను వీరబాహుఁడు సముద్రప్రాంగంబు సేరం గనన్. 185

వ॥ అయ్యవసరంబున సహస్రవాహినీసంఖ్యంబు లగు సకలభూతములును సర్వా యుధసమేతంబులై తోడంజనుదెంచి మించె. 186

క॥ సేనాంఘ్రిభవపరాగము, భానుం గబళించె, మొరసె భయదంబుగ భే
రీనిస్సాణస్వనములు, మానితకేతనము లభ్రమండలి మొరసెన్. 187

వ॥ ఇట్లు చనుదెంచి యసురబలంబులం గవిసిన యయ్యుభయదళంబులు పరస్పరా హంకారజనితహుంకారభయంకరంబులును, ప్రకటితభేరీభూరిభాంకారపూరితహరి న్ముఖరంబులును, ప్రస్ఫురితధనుష్టంకారభీషణంబులును, ప్రసారితనానాస్త్ర ఘుంఘుణ ఘోరఘోషితంబులును, పరిభ్రాజితకేతనపటపటత్కారభయానకంబు లును, బరిభ్రమద్రథనేమినినదభయదంబులును, బవనజవనకంఠీరవహేషారవబధిర వంబులును, బటుగజఘటాబృంహితధ్వానభాసురంబులును నగుచుఁ బర్వతోపల భూరుహంబులు గురియుచు, నిశితవిశిఖంబులు నిగుడించుచుఁ బరశుపట్టిస కరవాలశూలకులిశతోమరాదులు బఱపుచు ఘోరంబుగాఁ బోరు నవసరంబున,

క॥ దనుజులు రణకోవిదులై, మునుకొని తన్మక్తిశైలములు భూరుహముల్
దునిమి దిగంతవ్రాతం, బునకుఁ దఱిమి రఖిలభూతపుంజముల వడిన్. 189

వ॥ ఇట్లు రక్కసులచే నుక్కుసెడి దెసలకుఁ దిరిగి చను మూకలం గని, నిలునిలుం డని చేపిచి నిజబలంబులం బురికొలిపికొని భూతసేనావిభుం డగు సింహుండు సింహ నాదంబుసేయుచు మదగజంబుపై కురుకు కొదమసింగంబుకరణి నసురవీరుల పయిం గవిసి మహోద్దండం బగు దండంబున రిపుమండలంబుఁ జెండి చెండి దండ ధరుదండ కనిపె; నంత, 190

—* దశముఖాసురుఁడు సింహునితో యుద్ధము సేసి మడియుట *—

క॥ హరిశౌర్యుఁడు దశముఖుఁ డను, సురవైరి చమూవిభుండు ♦ శుంభద్గతిచే
నరుదెంచి రోషమడరఁగ, శరవితతుల సింహు నేసె ♦ సమరక్షోణిన్. 191

వ॥ భూతసేనావిభుండు నవియన్నియు దండంబునం జెండి వెండియుఁ గోపంబడర దానును దద్వక్షంబుపై వైచిన నావ్రేటునం గవచంబు నుగ్గునూచంబయ్యె; నంత దానవుండు ప్రతిదండంబుఁ గొని యుద్దండంబుగాఁ గేలం ద్రిప్పుచు సింహుని వక్షస్స్థలంబున వైచిన, 192

క॥ దండము తత్పటువక్షో,మండలి సంఘృష్టి రేణు♦మయమై పడియెన్
మెండొప్ప మఱియు దనుజవ,రుండును పరశువునుఁ బరపె ♦ రోషం బడరన్. 193

వ॥ అప్పరశ్వధంబును భూతసైన్యాధిపుఁడు దండంబునం జూర్ణంబు గావించి తూర్ణంబుగా నతని బాణాసనంబుఁ దునిమిన, 194

క॥ దానవుఁ డతికోపోజ్జ్వల,మానసుఁడై శక్తిఁ బరపె ♦ మహిమ సెలంగన్
దానిని భూతగణాగ్రణి, మానితచక్రమునఁ దునిమె ♦ మగఁటిమి దనరన్.

వ॥ అంత దానవుండు ఖండితం బగు శక్తిం గని ప్రచండకోపంబున మండుచు, దోర్దండంబున వేఁడాండు దండంబునుం గొని దండధరుని పగిది నుద్దండంబుగా భూతసేనావిభుం జెండిన, నతండు రుధిరంబు దొరఁగ నిమిషమాత్రం బూరకుండి వెండియు నరుదెంచి కినుక జనింప రెండుచేతుల దండంబులఁ గీలించి దశముఖు నురంబుఁ జిదిపె; నంతయు, 196

గీ॥ అద్దురాత్ముఁ డప్పు ♦ డాననంబున రక్త, ధార లొలుక ధరణి♦ధరము వోలె
ధరణిగూలె నిర్గ♦తప్రాణుఁడై యంత, నసురులెల్ల గదిసి ♦ రతనిమీఁద. 197

వ॥ ఇట్లు రక్కసులు పెక్కం డ్రొక్క మొగి నమ్మహావీరుం డగు సింహునిపయిం గవియునెడ మహాబలుండును, శ్రీమంతుండును నగు కనకనాభుం డనుకనకుండు లక్షవీరులలో నుండి వెడసొచ్చి కనకపుంఖంబు లగు నిశితసాయకనికరంబులఁ గనికరంబెడల నొడలఁ బఱపినం గని కరంబు భయఁపడి కంపితాంగు లగుచు నసురులు నలుదెసలకుం బరచి; రంత, 198

ఉ॥ దానవసైన్యనాయకుఁ డు♦దారబలాఢ్యుఁడు దుర్ముఖుండు, కో
పానలభాసమానుఁడయి ♦ యద్దనుజవ్రజమెల్లఁ ద్రిప్పిఁ గ
ర్జానినదంబు ఘొప్ప శిత♦సాయకము ల్గురిసె న్నిశోర్వి నెం
తేని భుజాపరాక్రమ వి♦నిర్జితభాస్కరకోటితేజుఁడై. 199

వ॥ అత్తఱి భూతంబులు మొత్తంబులై మహారవంబు లొనర్చుచు భూధరభూరుహశిలాప్రకరంబు లద్దురాత్మునిపయిం గురిసిన, నద్దుర్ముఖుండు క్రోధారుణముఖుం డగుచు శతధాదళితగాత్రుండై రణవంచకుండు గావున భూతసైన్యంబును

మాయఁ గప్పె; నప్పు డప్పాపాత్ముని మాయం దెలిసి వీరమార్తాండుఁ డరు దెంచి జ్ఞానాస్త్రంబు సంధించె. 200

గీ॥ అంత దానవవిభుఁడు మా♦యను దొలంగి, యలుకఁ బొడమంగ నొక్కఁడ♦యాజిలోన నిలిచి బాణసహస్రంబు♦నిష్ఠురముగఁ, బరపె నవ్వీరుపై భుజా♦ప్రౌఢిమెరయ. 201

గీ॥ వీరమార్తాండుఁ డు సహస్ర♦విశిఖములను, నవియుఁ దును మాడిన స్తశి♦తాస్త్రములను వానిధనువును ఖండించి ♦ వాడిములికిఁ, గంచుకంబును గడు వ్రక్క♦లించి మించి.

వ॥ మఱియు నిశితవిశిఖంబుల నతని గాత్రంబు నొప్పించిన నద్దానవుండు రక్తసిక్తాంగుఁ డగుచు నొల్లఁబోయి యొక్కింతసేపు మూర్ఛాక్రాంతుఁడై మఱలఁ దెప్పిరిలి యమ్మహామహునితోడఁ గయ్యంబున కియ్యకొనక చయ్యన మాయ నదృశ్యుండై పలాయనంబు నొందె; నట్లగుటం గనుఁగొని దనుజసైనికులందఱు యథాయథంబుగా బారుటం జూచి భూతంబులు విజయసమేతంబులై పరాజితులతోడ సమరంబుసేయఁ దగ దని సింహనాదంబు లొనర్చుచు మఱలె; నప్పుడు. 203

క॥ దనుజుల పలాయనంబుం, గని సింహముఖుండు వేగ ♦ కడురోషమునన్ జనుదెంచి భయదగర్జా,ధ్వను లడరఁగ సమరమునకు ♦ దారుణపటిమన్. 204

వ॥ ఇట్లరుదెంచు పర్వతోపమానకాయుండును, మహాభీముండును, సింహనాదముఖరితదిఙ్ముఖుండును నగు సింహముఖుంగని భూతవ్రాతంబు లుత్తుంగంబు లగు మహీంధర తరుమండంబులు గురిసిన, నద్దానవుని కరాస్ఫాలనంబునం గంపితంబులై తరుగిరులు గొన్ని చూర్ణంబులై యెగసి తారాగ్రహమార్గంబుఁ గప్పెఁ; గొన్ని చిదురులై నేలంబడిన నచట సింహవ్యాఘ్రాది మృగంబులు బెదరి నలుదెసలం బరచె; నంత, 205

శా॥ భూతవ్రాతము భూరిభూరుహనగం♦బుల్ నింపఁగాఁ జూచి సం జాతక్రోధత తేరు డిగ్గి స్థిరుఁడై ♦ చండప్రతాపంబునన్ దైతేయాధిపుఁ డమ్మహీధరము లు♦ద్యత్స్ఫాలజాలంబులన్ జేతంబట్టి జవోన్నతిం బఱపె నా♦జిం గొన్ని భూతాళిపై. 206

—* సింహముఖుండు భూతసేనల చిత్రగతుల వధించుట *—

వ॥ మఱియుఁ బ్రచండరోషంబున నన్నిశాచరుండు భూతంబులం గొన్నింటిని గేలం గీలించి నేలంగొట్టి కొన్నింటిని సూర్యరథంబునఁ బర్వతసముద్రద్వీపంబులం గొన్నింటినిం బడవైచియు, వెండియుఁ జలంబు రెట్టింపఁ గొన్నింటిని ముష్టిప్రహారంబులం బొడిచియుఁ, గొన్నింటిని వ్రయ్యలుగాపించియు, బ్రహ్మాండకటాహంబు దాటం గొన్నింటిని నెగయనేసియుఁ, గొన్నింటినిం బిరబిరం ద్రిప్పి దెప్పరంబుగా మోదియు, బ్రహ్మవిష్ణులోకంబుల దాఁటఁగఁ గొన్నింటిని వడింజిమ్మియుఁ, గొన్నింటి నింద్రాద్యష్టదిక్పాలకులసదనంబులం బడఁ గెడపియుఁ, బడబానలం

బునం గొన్నింటినిం గూలంద్రోచియుఁ, గొన్నింటినిఁ బాతాళంబున నణంచియు,
గొన్నింటినిఁ దునిమియుఁ, గొన్నింటి భూతలంబున నెఱపియు నమ్మహాబలుండు
భూతవ్రాతంబుల సకలదిశలు సర్వభువనంబులు నించి మించినరోషంబునం జరణ
తలంబున మెదిపియుఁ జిదిపియు, నేచియు, చీరేచియు, శిరంబులఁ ద్రెంచియు,
రూక్షేక్షణంబుల నవలోకించియు, హుంకారముల భర్జించియుఁ, గరతలంబుల
నలినలి గావించియుఁ, గోపంబునం గరగర నమలియు, మగుడ నగ్గురాత్ముండు
పరశుపట్టిసముసలముద్గరకరవాలశూలాద్యాయుధంబులఁ జక్కణంచియు,
నుక్కుమిగులం గులాచలంబులుం బ్రయోగించి నుగ్గునూచంబులు సేసియు
నిట్లు ననేకభంగుల సంగరాంగణంబున భూతములన్నింటినిం బరిమార్చె. 207

క॥ అపుడు హరిబ్రహ్మాదులు, విపులభయభ్రాంతులగుచు ♦ వేగమ చని రా
జిపలాయనంబుఁ బొందుచు, నపరిమితానందులైరి ♦ యసురులుఁ జేర్మిఁ. 208

వ॥ సింహవక్త్రుం డంత మఱల నతిసుందరరథారూఢుం డయ్యె; నయ్యెడ నగ్నికోపుం
డను భూతేశ్వరుండు చనుదెంచి కోపాటోపంబున నిజపరాక్రమంబుఁ బ్రశం
సించుచు మహాభీలంబును, నతిదృఢంబును నగు శూలంబు సురవిరోధిపయిఁ
బరపిన నదియు నతని వక్షంబునం బడి భగ్నంబయ్యె నయ్యవసరంబున, 209

ఆ॥ మఱియు భూతవరుఁడు ♦ మది రోషమొదవంగ, సింహదమెలమి ♦ జేసి కేల
దండమొకటి ద్రిప్పి ♦ తత్సారథని జెండి; దండిపురికి ననిచెఁ ♦ దత్క్షణంబ. 210

వ॥ అదియుంగని సింహవక్త్రుండు నిజభుజాదండమండితం బగు దండంబునం బరా
క్రమోగ్రుం డగు నగ్నికోపునిం జదిపిన నతండు మూర్ఛాగం డయ్యె; నంత,

గీ॥ దానవేంద్రుండు మగుడ ర♦థంబునందు, వేఱొకనిసూతునియమించి ♦ విక్రమమున
భూతనాథసుమాలిని♦బోరఁగదియ, నసురపై నేసె నతఁడు మ♦హానగంబు. 212

వ॥ అప్పర్వతం బఖర్వగర్వహుం డగు నమ్మహాసురుండు బాలుండు కందుకంబు
నోలెఁ గేలం గీలించి మగుడ సుమాలివక్షంబునం బరపినఁ దత్పతనంబున నతం
డించుకసేపు మోహపరవశుండై పడియె. 213

ఆ॥ ఇట్లు పడిన నతని♦ నీక్షించి దండియు, వజ్రకలితమైన ♦ వానియురము
దండమునను మోదెఁ ♦ దద్ఘట్టనంబున, నదియుఁ జూర్ణమయ్యె ♦ నాక్షణంబ.

వ॥ మఱియుఁ గోపంబుగదుర భూతసేనావిభుం డగు దండి మహాసింహబు వేదండ
తుండంబుం బెనుపోల్కి బ్రతాపోద్దీపితుం డగు నద్దైత్యనాథునికరంబులఁ
జెండిన నమ్మహాదనుజుం డలిగి పాదంబునం దన్ని యతని నేలఁ బడవైచి నభో
మండలంబున కెగయుఁజిమ్మిన, 215

క॥ దివినుండి దుమికి దివిజుఁడు, జనమొప్పఁగ దైత్యుబాహు♦శాఖలమీఁదన్
ప్లవఁగవరేణ్యమబోలెను, వివిధగతిం గంతులిడియె ♦ వేమరు బల్మిన్. 216

గీ॥ మఱియు లతలనుఁ ద్రిమ్మరు♦ మధుపమట్ల, నంసమండలిఁ జరియించు♦నతనిదాన
వుండు మక్షికను నరుఁడు ♦ వోలె గేలఁ, బట్టి నలుఘుచు దవ్వనఁ ♦ బారవైచె. 217

వ॥ ఇట్లువైచిన భూతేశుండు మూర్ఛాగతుం డయ్యె నంత, 218

క॥ సేనాపతు లివ్విధమున, దానవుచే విజితులైన ♦ దత్క్షణమే య
బ్భానుతశౌర్యులు వీరులు, మాఱుగఁ జనుదెంచి సమర♦మండలి కెలమిన్.

ఆ॥ నిశితసాయకములు ♦ నిగుడింప దనుజుపై, నవియుఁ బుష్పవృష్టి ♦ యయ్యె నతని
కపుడు దైత్యనాథుఁ ♦ డరదంబు దిగి వేగ, సింహనాదములమిఁ ♦ జేసి కినుక. 220

క॥ కేసరివోలె గజంబుల, భాసురశౌర్యమునఁ గేల ♦ బరిపంథుల నెం
తే సమరమున నొడిసికొని, చేసెఁ బరస్పరహతుల వి♦శీర్ణాంగులుగన్. 221

వ॥ మఱియు రథంబులతోడనఁ గొందఱు వీరులఁ బాదఘూతంబుల నింగి కెగయఁ దన్ని నిహతులం జేసె; నిట్లు బహుప్రకారంబుల వీరవరుల నేపణంచినం గనుంగొని ఘూతంబులు భీతంబు లగుచుఁ బరిభూతంబులై మృగంబులపగిది దిగంతంబులకుం బాఱె; నంతయు, 222

శా॥ వీరాధ్యక్షుఁడు వీరబాహుఁ డది తా ♦ వీక్షించి కోపంబునన్
నారాచంబుల నారిఁగూర్చి పఱచెన్ ♦ నానారిపుశ్రేణిపై
బోరన్ గ్రీష్మఘనాఘనంబు సలిలం♦బుల్ నించుచందంబు దే
వారుల్ ధారుణి గూలి రత్తఱి సమ♦స్తానీకసంయుక్తులై. 223

క॥ భూరికబంధంబులు నృ,కూర్పరముల నటించి మించె ♦ ఘోరపిశాచో
ఘూరవములు ఘుటికంకము, లారూఢిఁ బలాభిలాష ♦ మడర భ్రమించెన్. 224

వ॥ అవియుం గని సింహవదనునితనూజులు నూర్ధ్వరమ్షంబున శరవర్షంబులు గురిసిన వీరబాహుం డలిగి సింహనాదం బొనర్చుచు ననేకసాయకంబులు వారిపైఁ బఱచె. 225

గీ॥ సింహవక్త్రసుతులు ♦ శితశరంబు లనేక,కోటిసంఖ్య లెలమి ♦ గుఱిసి రాజి
తావదంబకముల ♦ తచ్ఛరంబులు విఱ్ఱ, నరదములును దునిమి ♦ యార్చె నతఁడు.

వ॥ అంత దనుజసేనలం గల బలుమగలు పలువురుం గూడికొని యితనితోడ ధనుర్యుద్ధంబు సేయ మనబలంబుల నెవ్వఁడు సాలఁడని యాలోచించి ఖడ్గఖేటకంబుల ధరించి మెరవళ్లఁ జూపుచు నొక్కపెట్టన నవ్వీరాగ్రణిఁ జుట్టుకొని పోరి; రయ్యెడ,

మ॥ ఘనరోషంబున వీరబాహుఁడు మహో♦గ్రంబైన ఖడ్గంబు గొ
బ్బున సంధించి రణాంగణంబునకు వి♦స్ఫూర్జద్భుజాప్రౌఢి మా
ర్కొనిరాఁ గన్గొని సింహవక్త్రసుతులుం ♦ గోపంబు దీపింప నా
తనిఖడ్గంబున నొంపఁజాలమి సము♦ద్యత్ప్రౌఢిఁ దా మాందఱున్. 228

వ॥ అతనిపైఁ బడి సంహరింపఁ దలంచు నంతలోన నవ్వీరబాహుం డొక్క నిశితకర

వాలంబున నప్పాపాత్ములగు సింహాస్యతనయుల నూర్వురం దునిమి వైచి శీఘ్రంబ పరమమంగళం బగు రథం బధిరోహించిన నప్పుడు సురవరులు విపులవాన గురిసి రంతయు నంతసంబున, 229

ఉ॥ అంతట సింహవక్త్రుఁ డది ♦ యారసి పుత్రవియోగ శోక మ
త్యంతము దుర్నివారమయి ♦ యక్కట పీఁ డొకరుండ నిర్దయ
స్వాంతత వీరినందఱను ♦ సంహృతిఁ జేసె నటంచు సిగ్గుచే
నెంతయుఁ జింతనొంది మది ♦ నేపెసఁగంగ మహాగ్రహంబునన్. 230

వ॥ ధైర్యహానిఁ జేయుండు గావున విక్రమంబు నెక్కొలుపుచు, సకలభూతంబుల నిమ్మహామహునితోడంగూడ దిగమ్రింగెద; నిఖిలలోకంబు లణంచెద; నట్లు కాని నాకోపం బుపశాంతంబు గా దని తలపోసి రథారూఢుండై వీరబాహుం గదిసిన. 231

—* వీరబాహుఁడు సింహవక్త్రు లెక్కి [illegible] ధనుర్యుద్ధము సేయుట *—

గీ॥ వీరబాహుఁడపుడు ♦ వేగంబ యెదిరించె, బాహుశౌర్యమెసఁగ ♦ బ్రధనమునకు
నంత నతని జూచి ♦ యాత్మలో నత్యంత,దర్పమెసఁగఁ బలికె ♦ దానవుండు. 232

క॥ ఏరా యెవ్వఁడ వీవు కు,మారుఁడవో లక్షవీర♦మండలిలోనన్
వీరుఁడవో గాకను నవ,వీరులలో వాఁడవో భు♦విన్ దూతవొకో. 233

వ॥ సత్యంబుగా నా కెఱింగింపు మనవుడు వీరబాహుం డిట్లనియె. 234

మ॥ విను మో దానవ! దేవదేవుఁడు మహా♦వీరుండు నా కార్తికే
యునకున్ దాసుఁడ దూతభావమున ము♦న్నుద్యత్స్థితిన్ వచ్చి దై
త్యనికాయంబుఁ గలంచు టీ వెఱుఁగవే ♦ తా వీరబాహుండ సం
జ్ఞను నే నెవ్వఁడనైన నే మిపుడు పృ♦చ్ఛన్ జేయ నీ కేటికిన్? 235

వ॥ అని పల్కిన వీరబాహునకు సింహవక్త్రుం డిట్లనియె. 236

మ॥ కరమున్ దుర్బలులైన దానవుల సం♦గ్రామక్షితిన్ గూల్చుటన్
వరశౌర్యం బగు నొక్కొ నీకు నరయన్ ♦ మత్పుత్రులన్ బాలురన్
ధరఁ ద్రెళ్ళించుట దొడ్డపౌరుషమొకో ♦ దర్పింపఁగా నేల సం
గరమందున్ నిలు ని న్వధించి ముదము ♦ న్గాంచింతుఁ గంకాళికిన్. 237

వ॥ విను మింతమాత్రంబు కాదు; నిన్నుఁ బరిమార్చు నెడ, నెడనాచ్చి భవన్నాథుం డగు గుహుండు భూతసేనాసమేతుండై దేవగణంబులఁ గూడుకొని వీరవరుల తోడ నరుదెంచె నేనియు సంగరాంగణంబునం బరిమార్చెద నని సాహంకారుండై పలుకు నతనివచనంబులు శ్రోత్రపుటంబులకు నతికటువు లగుట నించుకించుక విని మనంబునం గనలుచు నేత్రంబుల నగ్ని బగు కోపరసంబుఁ గ్రక్కుచు నుక్కునంగ వీరబాహుండు నిశితంబు లగు దశవిశిఖంబులు గైకొని సింహాముఖుని

కఠినం బగు నురంబునఁ జొనిపిన నవియు భగ్నంబులై పడియె; నంత, 238

క॥ దండముఁ గొని దానవుఁ డుద్దండత నవ్వీరుమీఁద ♦ దద్దయు నెవఁగన్
గాండంబుల నాల్గిఁట నది, ఖండించె సురేంద్రుఁ డలుక ♦ గదలుకొనంగన్.

వ॥ మఱియు శరసహస్రంబు లసురశిరంబులఁ జొనిపిన నవియుం బొడిమై నేలం
బడియె నంత, 240

క॥ దనుజపతి మఱియు శూలము, గొని భీకరపటిమ నెవఁ ♦ గొబ్బున నదియున్
దునుముటకు వీరవర్యుఁడు, కనదస్త్రసహస్రములును ♦ గడువడి గురిసెన్. 241

క॥ శూలం బది తత్సాయక,జాలము ఖండించి యెదుటఁ ♦ జయ్యన రా, నా
భీలత వీరుఁడు మఱి శర,సాలిసహస్రంబు గురిసెఁ ♦ బటిమ నెసంగన్. 242

వ॥ అదియును శరసహస్రంబులఁ బ్రతిహతంబు గావించి శూలంబు సత్వరంబుగా
నవ్వీరుం గదిసిన నతండు ససంభ్రముం డగుచుఁ గరవాలంబుఁ గొని తచ్ఛూలంబుఁ
దునియలుగాఁ జేసె నప్పుడు వేల్పులు నవ్వీరశౌర్యపరాక్రమంబు నగ్గింపుచు
సంతసించిరి. 243

మ॥ మఱియున్ రోషణభీషణుం డగుచు సుం♦భగ్నోగ్రథి నవ్వీరుఁ డ
స్త్రరి సంధించె మహోగ్రపాశుపతమున్ ♦ దైత్యేంద్రుఁ డాతండు సే
స్త్ర తద్బాణముఁ బూని యేసె నపు డా♦తే నవ్వియున్ రెండు డ
గ్గరి యన్యోన్యనివారణంబు సేసి మగుడన్ ♦ గర్వ్యంబులున్ వీడుచున్. 244

వ॥ వీరబాహుం డద్దైత్యుపరాక్రమంబునకు మనంబున నాశ్చర్యంబు నొందుచు
గుహుండుఁ దక్క నా కితని జయింప నశక్యం బితని సేనల నేన సంహరించెద నని
కోపోజ్జ్వలితుండై మహాసాహసంబున, 245

క॥ కదనంబునఁ దత్సూతుని, బదునాలుగు విశిఖములను ♦ బడ వైవ భుజా
మదమున నది గని దైత్యుఁడు, గదఁగొని నవ్వీరు సేసెఁ ♦ గడుకోపమునన్. 246

వ॥ ఇట్లు పరపిన నదియు వీరవరుని శరీరంబునం బడి సహస్రధా భగ్నంబు నొందె;
నంత నవ్వీరుండు శరసహస్రంబున నశనిరథంబుఁ దునిమి యార్చి పేర్చిన, 247

క॥ భూతంబు లెల్ల శైల,వ్రాతంబులు వృక్షతతులు ♦ బ్రస్తరములుఁ బ్ర
ఖ్యాతబలంబులు దనరఁగ, దైతేయవరేణ్యుమీఁద ♦ దద్దయుఁ గురిసెన్. 248

వ॥ అంత సింహముఖుండు కోపోద్దీపితుండై పేరోంకారరథం బధిరోహించి ధనుస్స
హస్రంబునుం గొని భయదంబుగ మౌర్వీనినదంబుఁ జేయుచు, బహుకోట్లశిలీ
ముఖంబులు కోలాహలంబు లొనర్చుచు భూతవ్రాతంబులపై నమర్షంబున
వర్షించి మించె. 249

గీ॥ తచ్ఛరాహతి మఱిసి భూతవ్రజంబు, శైలవిపినసరిద్ద్వీప♦సాగరముల
భానుమండలదిఙ్నభో♦భాగములను, బడిగెను నీరంధ్రముగ మహా♦ప్రళయమట్లు.

వ॥ మఱియు జ్యోతిశ్చక్రంబును, పాతాళంబును, లోకాలోకంబును, బ్రహ్మాండంబులు నిండె; నయ్యవసరంబున జగత్త్రయంబునందు నతని బాణంబులు బడని ప్రదేశంబు లేదయ్యె నెందు. 251

గీ॥ వీరబాహుండు నతులితవిక్రమమున, నిశితపటుసాయకంబులనేకగతులఁ
గురిసి దురమున నత్యుగ్రకోప మడరఁ, దద్భటావళినెల్లను ధరణిఁ గూల్చె. 252

క॥ ఎందెందు దైత్యసాయక, బృందం బరుదెంచు నధిక వేగంబున, నం
దందు నపుడు వీరుఁడు శర,సందోహముఁ బరపెనదియు సారెకు దునిమెన్. 253

వ॥ ఇట్లు మహాసాహసంబు సూపు నవ్వీరబాహుధనుర్విద్యాకౌశలముఁ గని వియచ్చరు లచ్చెరు వందిరి. 254

గీ॥ అంత సింహవక్త్రుఁ డధికరోషంబునఁ, బలికె వీరవరుని బరుషఫణితి
శ్రుతికటూక్తు లొప్ప నతఁడును భర్జించె, దనుజవిభుని సరకుఁ గొనక మదిని.

వ॥ అంత దనుజవల్లభుండు సింహనాదంబు లొనర్చుచు దశసహస్రవిశిఖంబులు మహాఘోరంబుగా వీరబాహుపైఁ గురిసిన నతండును దశలక్షశరంబుల నవియన్నియుం దునుమాడి కోలాహలంబు లడర మఱియు, బాణసహస్రంబుల సంధించి గ్రీష్మకాలఘనాఘనంబు చందంబున నసురాత్ముపై వర్షించె; నాసమయంబున, 256

క॥ అది గని దనుజుఁడు రోషముఁ, గదురఁగ దశలక్ష విశిఖకాండంబులచే
విదళించె నవియు మఱియును, బ్రదరంబు లనేకకోట్లు పఱపె వీరుపై. 257

వ॥ అంత వీరవరుండు తద్విముక్తంబులగు సహస్రకోటిసంఖ్యాకంబులైన శిలీముఖంబు లాక్షణంబ తునిమివైచె; నంత సంచలితహృదయుండై దైత్యుండు ద్విసహస్రశరముల వీరబాహుని దృఢతరం బగు చాపంబుఁ దునిమినఁ గోపంబున,

క॥ వీరుండొండొక చాపము, ధీరతఁ గొనునంతలోనఁ దీక్ష్ణంబకముల్
వారక ననేకకోటులు, ఘోరంబుగఁ బఱపె దనుజకుంజరుఁ డలుకన్. 259

వ॥ తద్బాణఘాతంబుల రక్తసిక్తాంగుఁడయ్యును ధీరంబు సెడక వీరబాహుండు శరాసనంబునం గొనయం బెక్కించి దుర్వారంబుగా శతసహస్రసంఖ్యాక నారాచంబులు నిశాచరుపైఁ గురిసిన, 260

క॥ అసురేంద్రుఁడు కోలాహల, మెసఁగఁ దదస్త్రములు రోషతీక్ష్ణుఁడగుచున్
వెసఁ దునిమి లక్షశరముల, దెస లద్రువఁగ మఱియుఁ బఱపెఁ దివ్యశరంబుల్. 261

వ॥ అంత మహాబలుండగు వీరబాహుం డవియన్నియు ఖండించి శస్త్రసహస్రంబుల నత్యున్నతంబును, నతిసుందరంబు నగు నతనియరదంబు భగ్నంబు జేసిన, 262

శా॥ అంతన్వాఁడొక తేరుపై నిలిచి సింహాస్యుండు భూభాగ మ
త్యంతంబున్ జలియింప వేగముగ నుద్యత్ప్రౌఢిమం దోలె దు

ర్ధాంతస్థేముఁడు వీరబాహుఁ డురుశౌర్యశ్రీని ఖండించె నా
శాంతంబుల్ వణఁకన్ శరాసనసహస్రంబుల్ దదీయం బొగిన్. 263

వ॥ అప్పుడు సకలభూతంబులు కుతూహలసమేతంబులై కోలాహలంబు లొనర్చె.

—* సింహవక్త్రుఁడు వీరబాహ్వాదుల యుదయాద్రిని బంధించుట *—

మ॥ అది వీక్షించి దురాత్ముఁ డద్దనుజుఁ డుద్యత్క్రోధుఁడై భూతలం
బదరన్ భ్రూకుటి బెట్టి ఘోరమగు మాయాపాశముం బూని య
య్యుదయాద్రిన్ రిపుకోటి నెల్లఁ బతనం బొందింప మంత్రించి యే
పొదవన్ దక్షిణమూఁద వైచె సమరోత్సాహద్యన్మహాశౌర్యుఁడై. 265

వ॥ అదియు నత్యంతఘోరంబును నతిగాఢతమోవృతంబును, ననవదధికారవం
బును, నతులవేగంబును నఖిలరిపుయభంకరంబును నగుచు చనుదెంచి, దేవ
దూతలు విలోకించుచుండఁగనే వీరబాహుప్రముఖులగు సకలసేనాపతుల బం
ధించి పూర్వాచలంబునఁ బడఁద్రోచె. 266

గీ॥ అంత సింహాస్యుఁ డత్యంతహర్షముదవ, నతులకోలాహలధ్వను లమరఁజేసి
భండనక్షోణి వెడలియర్భకుఁడు గుహుఁడ,తండె చటనుండు ననుచుదూతలనునడిగె.

వ॥ అప్పుడు సింహవక్త్రునకు దూత లిట్లనిరి. 268

మ॥ అనఘప్రోథిమ హేమకూటనగరంబందున్ షడాస్యుండు పా
వనచర్యుండు మహాబలుం డెపుడు దా వర్తించు సాహసిప్రవా
హినులున్ భూతగణంబుఁ గొల్వ ననుఁడున్ హీనాత్ముఁ డాదైత్యుఁడు
న్వని వానిం బరిమార్చి వత్తు ననుచున్ వే పోయె నవ్వీటికిన్. 269

వ॥ అయ్యవసరంబున నిఖిలదనుజబలంబు లతని వెంబడిం జనియె; నదియుం గని పవ
నుండు శరవణోద్భవున కిట్లనియె. 270

గీ॥ వీరబాహుముఖులు వీరులందఱు నేఁడు, భండనమున బాహుపటిమ దొలఁగి
ప్రాఙ్నగంబునందుఁ బడిరి మాయాపాశ, బద్ధులగుచు నింకఁబలుకు లేమి?

క॥ దానవవిభుఁ డిదె నీపై, సేనాన్వితుఁడగుచు వచ్చె శీఘ్రము యనుఁడున్
సేనాని పవనువచనము, వీనులవిని చటులరోషవిస్ఫురణమొయిన్. 272

వ॥ అపుడు సింహాసనంబు డిగ్గి దానవుం డెందున్నవాఁ డని యుద్ధసన్నద్ధుం డగుచుఁ
బద్మభవానీతంబులైన మణిపాదుకలు మెట్టి కక్ష్యాంతరంబులుఁ గడచి నిజమందిర
ద్వారపురోభాగంబున సమీరప్రేరితం బగు మహోన్నతస్యందనం బధిరో
హించి, 273

సీ॥ విధికైటభారులు విరులసేసలుజల్ల, సురరాజు ధవళచామరము వీవ
చంద్రార్కు లిరువంక ఛత్రముల్ ధరియింప, ననలుండు కరదీపికను వహింప

దండి ఖడ్గముఁ బట్టి ♦ దండను జెలువొంద, నసురవల్లభుఁడు కా♦హళము నూద
వరుణుండు శాళాంజి ♦ వల నొప్పఁబూనంగ, ధనదుండు వీటికా♦ధరుఁడు గాఁగ
శూలమీశానుఁడు ధరించి♦మ్రోలనడువ, నమరులాగినఖిలోపచా♦రములొనర్ప
భాసురంబుగ దివ్యవై♦భవముదోఁప, వెడలె సేనాని శాత్రవ♦విజయయాత్ర.

మ॥ చెలఁగె న్వాద్యరవంబులెల్లెడల భా♦సిల్లెన్ ధ్వజౌఘంబులున్
వెలసెన్ మానిగణంబు సంస్తవములున్ ♦ విద్యాధరు ల్వాడి ర
త్యలఘుప్రౌఢిమ వందిపంక్తి నిజశౌ♦ర్యౌదార్యగాంభీర్య కౌ
శలము ల్వీనుల విందుగాఁ బొగడె ను♦త్సాహంబు రెట్టింపఁగన్. 275

గీ॥ నారదాదులు వేడ్కఁ గా♦నము లొనర్ప, నలర ధ్వజముల బట్టి ♦ యక్షవరులు
భూతజాలంబు లాయుధ♦ములను గేలఁ, ద్రిప్పు చెల్లెడవచ్చి రు♦ద్వృత్తి మెఱయ.

మ॥ అదె వచ్చెన్ గిపురాణ్మదద్విపఘటో♦ద్యద్గర్వసర్వంకషో
న్మదకంఠీరవ మద్రిరాడ్దుహితృసూ♦నుచ్ఛక్తిముఖ్యఫలం
బది యేతెంచె నటంచు నింగిని సుప♦ర్వానీకముల్ జూచి స
మ్మదము న్మీరఁగఁ బుష్పవృష్టిఁ గురిసెన్ ♦ బల్మారు నద్దేవుపైన్. 277

వ॥ ఇవ్విధంబున నఖిలజగజ్జేగీయమానుండు నఖిలేశ్వరుండు, నశేషభువన సృష్టిస్థితి సంహారకారకుండు, ననంతకళ్యాణగుణాభిరాముండు, ననవధికసంపత్కరుండు, నమరబృందసంరక్షకుండు, నసురకుల శిక్షకుండు, నణిమాద్యైశ్వర్యోపేతుండు, నఖిలస్వతంత్రుండు, ననుపమశక్త్యాద్యాయుధపరిశస్తహస్తుండు, నద్రికోదండ సమానుండు, నంబికాసూనుండు, సుకుమారుండు నగు నక్కుమారుండు మహాబలు లగు వీరులతోడ నతివైభవధురంధరుండై పటహాదివాద్యరవంబుల నధఃకరించి మనోహరంబులగుచు, జగత్త్రయంబు నిండిన సకలజనకలకలధ్వనుల వినుచు సాగ్రామరంగంబు సేరె నపుడు, 278

క॥ హరిచతురాస్యపురోగమ, సురలన్ దూరమున నునిచి ♦ సుబ్రహ్మణ్యుం
డురుశౌర్యనిధులు వీరులు, పరిసరమున గొలువనొక్క ♦ పజ్జ వసించెన్. 279

—* ఎదిరించిన కుమారసేనల సింహవక్త్రుఁడు నిర్జించుట *—

వ॥ అయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై మహీరుహోర్వీధరోపలంబుల గురియుచు నసురసైనికులతోడ రణం బొనర్చిరి. 280

గీ॥ దనుజు లవ్వేళ భూతసం♦తతులచేత, భంగ మొందిరి సంగర♦రంగమందు
నదియుఁగనుఁగొని సింహాస్యుఁ♦డాగ్రహమున, ఘోరవిగ్రహుఁడగుచును భూరిమహిమ.

క॥ అనికిఁ బరతెంచువానిం, గనుఁగొని భూతంబులెల్లఁ ♦ గడుకోపమునన్
ఘనశైలభూజశిలలున్, గొని దానవుమీఁదఁ బఱపెఁ ♦ గూడి యొకమొగిన్.

మ॥ అసదృక్ప్రౌఢిమభూతసంఘముల సిం♦హాస్యుండు రోషంబునన్
ద్విసహస్రోజ్జ్వలబాహుదండముల నెం♦తే పట్టి యొక్కుమ్మడిన్
వెస నించెన్ వదనంబులుం దెరచి యా♦భీలంబుగాఁ గుక్షిలో
దెసలున్ ఘూర్ణిల హుంక్రియార్భటులు ను♦ద్వేలంబు గావింపుచున్. 283

వ॥ అయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై తదీయనాసాపుటంబులనుండియుఁ, గర్ణరంధ్రంబులనుండియు గొన్ని వెడలి దిగంతంబులకుం బరచెఁ; గొన్ని వెలువడ నలవిగాక యుదరంబుననయుండెఁ; గొన్ని మహాసాహసంబున నిజాయుధంబుల నతనియుదరంబు భేదింపఁ బూనియుండెఁ; నిట్లు దురితాత్ముండగు దానవుండు సహస్రవాహినీసంఖ్యాకంబు లగు భూతంబులం గబళించి, మఱియు వీరులను సేనాపతులను గ్రమంబునం గ్రసించెఁ; నంత గుహుం డొక్కరుండ నిలిచి తన్నును స్తంభాశ్చర్యంబుగా వీక్షింపుచుండెఁ; నట్టియెడ; 284

క॥ ఆవృత్తాంతముఁ దెలుపుచు, వేవే చని దూత లపుడు ♦ విబుధాసువసీ
దావానలనిభశౌర్యవి,భావసుఁ డగు శూరుతోడఁ ♦ బలికిరి వరుసన్. 285

క॥ నీ యనుజన్ముఁడు వీరని,కాయంబును వీరబాహుఁ ♦ డును బలహీనుల్
మాయాపాశనిబద్ధులఁ, జేయుచు భూతముల మ్రింగె ♦ నతరిపుపేరా ! 286

వ॥ అనిన విని శూరపద్ముం డత్యంతసంతోషభరితాంతరంగుం డగుచు, నద్దూతలకు దివ్యభూషణాంబరములు బహుమతి నొసంగి సహోదరునికిం గనేకదానవులం బనిచి తానును సింహాసనంబు డిగ్గి, సకలశత్రుభక్షకుం డగు నిజానుజుం గనుంగొను నుత్సాహంబున సముత్తుంగం బగు గోపురశృంగం బెక్కి రణాంగణంబున నొంటి నిలిచియున్న గుహుని జూచుచు, భీమరూపుండును మహాకాయుండును నగు సింహవక్త్రునిం జూచి యెడతెగని ప్రమోదంబున వారలపోరు జూచువాఁడై యందు వసించె నని సూతుండు శౌనకాది మహామునులకుఁ దెలిపె. 287

శా॥ క్రీడాశంబరచారుహస్తప్రణమ♦ద్గీర్వాణమాళిప్రభా
భ్రాడంఘ్రిద్వయ యోగిపుంగవమనః♦పద్మస్ఫురద్భృంభరా
క్ష్వేడాహారవినోదమోదిత జగ♦త్కర్తృప్రభావోదయా
చూడాకల్పితచంద్రభూషణ జటా♦జూటస్ఫురద్యోధునీ. 288

క॥ లింగత్క్ష్మాపాలక తన,యాంగణసురభూజ శైల♦జాలింగన హా
రాంగదవలయాకారభు,జంగ ! యనంగావలేప♦సంతమసరవీ ! 289

మయూరవృత్తము॥ కంజభవసేవ్యపద♦కంజయుగలీలా
రంజితనిషజ్జనని♦రంజనవిలాసా
మంజులదరస్మితస♦మంజసముఖాబ్జా
కుంజరమదాపహర♦కుంజరముఖాంకా. 290

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్రి సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపసగోత్ర కోడూరి
యెల్లనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మ్యంబికాతనయ
వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచల
కవిప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత
శంకరసంహితయందలి శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీశివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము.

## యుద్ధకాండము.

చతుర్థాశ్వాసము.



ఖరకూటనిలయ
బలరిపుతనయాసేవ్య • చరణ... ధవా
నీలాంబురపరిరంభ
శ్రీబహుళకుతుకాంతరంగి • శ్రీశివలింగా. 1

వ॥ అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

గీ॥ రాక్షసేంద్రుండు గోపురాగ్రమున నిల్వ, లంక సేనాని శీఘ్రింబ • యుద్ధమునకు
వెడలె సింహాస్యు నెదిరించి • విక్రమమున, సింధురము మీఁదఁ బర తెంచు • సింహమట్లు.

వ॥ అయ్యవసరంబున దనుజసైన్యంబు పెడబొబ్బలిడుచు గుహుని జుట్టుకొనియె. 4

మ॥ అసదృక్షాస్యుఁడు కార్తికేయుఁ డపు డుద్యద్గీల నద్దైత్యపీ
రసమూహంబులు పారఁజూచి మశక • ప్రాయంబుగా నెంచుచున్
వెస సుస్థిరగమ్య చెన్నొసఁగు మౌర్వీన్ వింట సంధించి యే
సినఁ గ్రేసె రవం బఖండ మొగిఁ జే • ... మహోగ్రింబుగన్. 5

వ॥ అప్పు డమ్మహారవంబు విని దానవేంద్రుని రథతురంగంబు లధోముఖంబులై నేలఁగూలె నిట్టులు గనుంగొని సింహముఖుండు మనమునఁ దారకసంహారకుం డితం డని నిశ్చయించి యమ్మహాబలుండు గుహుని సమీపంబునకుం జని యతనిం గని యిట్లనియె. 6

క॥ భవదాగమనం బేటికిఁ, బవరంబునఁ దుఱ్ఱింతు నిన్నుఁ • బ్రతిరోధతతిన్
ధ్రువ మిది నను గెనకఁగ నీ, కవసే నీ వచ్చు, తొలఁగి • నరుగుము బాలా! 7

వ॥ అనిన నతనివచనంబులు విని దేవసేనావిభుండు మొగంబునం జిఱునగవు దొలుక వాని కిట్లనియె. 8

క॥ దుష్టజనుల శిక్షించుట, శిష్టుల రక్షించుటయును ♦ శ్రీమండలి మా
కిష్టం బెంతయు గానఁ బ్రహ్మాద్యాత్మత నరుగఁ దెంచి ♦ తే నిచ్చటికిన్. 9
క॥ పాపాత్ములైన మీచే, నాపన్నతఁ గాంచె మిగుల ♦ నమరగణం బో
హో పలుమాట లి కేటికి, నేపణఁగన్ మిమ్ము వచ్చి ♦ తిచ్చటి కెలమిన్. 10
వ॥ అనిన సింహవక్త్రుఁ డిట్లనియె. 11
క॥ వీఁకన్ సర్వసుపర్వా, నీకము విడిపింప నిపుడు ♦ నీచే నగునే?
మాకు బలరహితమగుచో, నీకామితమున్ ఘటించు ♦ నిక్కం బరయన్. 12
వ॥ ఇంక బహూక్తు లేటికి; భవజ్జనకుం డేనియు సమరంబున మమ్ము జయింప నస మర్థుండు: నీవు బాలుండవు; సంగరకళాకౌశలంబుఁ గాలమిం జేసి మద్భుజపరాక్ర మంబు సహింపంజాల వట్లు గావున నాదు వచనంబు విని శీఘ్రం బెందేని పలా యనంబు గొందు; మింతకుమున్ను భవదీయు లగు వీరబాహుప్రభృతుల ను దయాచలంబున మాయాపాశబద్ధులం గావించుటయుఁ దక్కిన భూతగణంబుల గ్రసించుటయు నిఖిలసురలను గారాగృహంబున గాఁపెట్టుటయు నీవెఱుం గవే? ఒక్కండ విప్పు డవశిష్టుండవై యున్నవాఁడవు; తాదృశంబు లగు శౌర్య ధైర్యంబులుంగల నన్ను సర్వకుండగు తారకుని విధంబున మనంబునఁ దలంపకు 13
క॥ కొందఱు దురమున హతులై, పొందిరి యమసదన మిపుడు ♦ పోయిరి దెసలం
గొంద ఱసంఖ్యాతంబుగ, నిందుండియు నీ వెఱుంగ ♦ వే నాబలమున్?
క॥ బందీకృతమగు నిర్జర, బృందముఁ గలనైన విడుతు ♦ నే యిఁకమీఁదన్
స్కంద! భవచ్ఛౌర్యము నా, ముందర విడు మింక సమర ♦ మున నిన్నణఁతున్.

—* సింహవక్త్రుఁడు మృతిఁజెందుట కుమారస్వామి వధించుట *—

వ॥ అని యివ్విధంబున గర్వాలాపంబు లాడు నసురాత్మునిం గని భగవంతుం డగు బాహులేయుండు దంతప్రభాచంద్రికలు సాంద్రంబుగా వెలుంగ దరహాస సుందరవదనారవిందుండై యొక్క నిశిత విశిఖంబున నతని వక్షంబును గాఢ సేసిన రుధిరంబుతోడ నారంధ్రంబువలనఁ గొన్నిభూతంబులు వెడలి సత్వ రంబుగా దిగంతంబులకుఁ బఱచె; నప్పుడు. 16
క॥ దనుజుని రుధిరగంధము, దనకిరిమున మూసి యుదర ♦ తలమున వెసఁ ద
క్కిన భూతంబుల సంస్తంభన మొనరింపుచుఁ బ్రచండ ♦ పరాక్రమమునన్.
మ॥ అతిభీమం బగు దండముం గొని సుప ♦ ర్వారాతి శైలేంద్రజా
సుతుపై నేసిన నమ్మహాబలుఁడు వి ♦ స్ఫూర్జత్ప్రతాపంబునన్
జతురస్త్రంబులఁ గ్రూరము ల్పఱచెఁ ద ♦ చ్ఛస్త్రంబు లాదండము
స్థితి ఖండించి తదీయ కాలమున న ♦ త్యంతంబు నాఁటన్ వెసన్. 18
ఆ॥ దాన బల మొకింత ♦ దక్కి దైత్యేంద్రుండు, జఠరబిలముఁ గప్ప ♦ శయము విడచి
వ్యగ్రహృదయుఁ డయ్యె ♦ నఖిలభూతంబులు, వేగ రంధ్ర మపుడు ♦ వెడలిచనియె.

వ॥ తదనంతరం బంతకుమున్ను సింహవక్త్రాది నిశిచరులచేత నిహతంబులైన భూత
సైన్యంబులు గుమారకృపాకటాక్షంబున సంజాతచైతన్యంబులై లేచి యెల్ల
డల వెల్లివిరిసె నంత. 20

ఆ॥ వీరబాహుముఖ్య ♦ వీరుల నందఱ, తోడితేర కరుణ♦తోడ నపుడు
పాశమోచన మగు ♦ బాణంబు బఱపెను, పార్వతీసుతుండు ♦ పటిమ మెఱయ. 21

వ॥ అదియుం జని యుదయాచలంబున మోహితాత్ము లగు యోధుల సముత్పన్న
బోధులం జేసి మాయాపాశంబు నాశంబు నొందించి యాక్షణంబ వారలనెల్ల
పుష్పకంబుఁబోలె వహించుకొని సుఖంబునఁ దోడితెచ్చి గుహుం గానుపించి తదీ
యానుమతిఁ మగుడ నబ్బాణంబు దూణంబుఁ బ్రవేశించె; నంత. 22

తే॥ వీరబాహుండు మొదలైన ♦ వీరవరులు, పార్వతీనందనుని పాద♦పద్మములకు
భక్తిఁ బ్రణమిల్లి సంస్తుతుల్ ♦ పరఁగఁ జేసి, రాస్త్రులనుమమ్ము రక్షించి ♦ తనుచుమిగుల.

క॥ దనుజుఁడు పాపాత్ముఁడు మి, మ్మును మాయాపాశబంధ♦మున గాసిలఁ జే
సె నకట; యని గుహుఁ డెంతయు, ననుపమకృప వీరవరుల ♦ నాదృతిఁ జేసెన్.

వ॥ వెండియు స్కందునకు వార లిట్లనిరి. 25

క॥ ఏ మొక ప్రయాస మెఱుఁగము, స్వామీ! మీకరుణచేత ♦ సర్వాపదలున్
వేమారుఁ గొలఁగె సకల, క్షేమాభ్యుదయంబు మాకు ♦ సిద్ధించెఁ గదున్. 26

వ॥ అని స్కందుం డానందభరితుండై పూర్వీనాదంబుఁ జేసిన భయదం బగు నమ్మ
హాధ్వని విని సకలదానవులు మూర్ఛిల్లి తోడనం దెలిసి కడిమి మెఱయఁ బెడ
బొబ్బలిడుచు గొబ్బున సేనానిపై నుగ్రశరంబులు గురియుచుం జుట్టుముట్టిరి. 27

క॥ శరవణసంభవుఁ డెంతయు, స్ఫురితామర్షమున దైత్య♦పుంజముమీఁదన్
శరవర్షంబులు నించెను, నిరుపమబాహుప్రతాప♦నిపుణత మెరయన్. 28

వ॥ అప్పు డయ్యమోఘశిలీముఖంబు లతితీవ్రదండఖడ్గశక్తిపరశుశూలాద్యా
యుధసముత్పాదకంబులు, నాగమధర్మసంస్థాపకంబులు, నసురసంహారకంబులు,
ననిలమనోవేగంబులు, నబ్ధిశోషకంబులు, నంబుధరవిదారకంబులు, నర్కరథ
విభేదకంబులు, నపాస్తబడబానలంబులు, నజాండమేరుస్ఫోటనకరంబులు, నతి
భయదారావంబులు నగుచు దానవుల శిరంబులుఁ గరంబులు నేత్రం
బులు గాత్రంబులుఁ జెక్కులుఁ బిక్కలుఁ జెక్కాడి, మదావళంబుల మద
మణఁగించి, రథంబులు శిథిలంబులు జేసి, తురంగంబుల భంగంబులొనర్చి,
బ్రహ్మాండాంతరాళంబుల నెఱపుచు, పార్థివంబగు కమలజాండంబు భేదించి రక్త
క్షోదపంకిలం బగు నాశరవణోదకంబులు సొచ్చుచు నిశరాజాండంబులం బ్రవే
శించి, దేవర్షులు దక్క నంవలి రక్కసులనందఱ నొక్కనిముసంబున నుక్క
ణంచె. 29

మ॥ ఇల నాశ్చర్యము కార్తికేయుమహిమం ♦ బెన్నంగ సంగ్రామభూ
స్థలి నాతం డొకబాణముం దొడుగ ద ♦ చ్ఛస్త్రం బహో వేలు ల
క్షలు గోట్లర్బుద పద్మ శంఖము లసం ♦ ఖ్యాతంబులై మార్గమం
దలరన్ బద్మభవాండము ల్నెరసి దై ♦ త్యశ్రేణిఁ గూల్చెం గడున్. 30

వ॥ అప్పుడు హరిబ్రహ్మాదిసకలదేవతలు గంపితశరీరులు, నున్మీలితనయనులు నగుచుఁ గృతాంజలులై దేవా! దురాత్ములగు దానవులం బరిమార్పుము; కృపాకటాక్షంబున భవద్భక్తుల మగు మమ్ము సంరక్షింపు మని పరమమంగళుండు, నచింత్యమహిమాధారుండు, నసలత్త్వభవుండు నగు కార్తికేయుని సంస్తుతించిరి. 31

మ॥ క్షణమాత్రంబున నిట్లు దైత్యులు గుహా ♦ స్త్రవ్రాతభిన్నాంగులై
రణభూమిం బడినం గబంధములు ఘో ♦ రస్ఫూర్తి నర్తించెఁ, దో
షణముం గాంచెను మాంసలాభమున ధ్వాం ♦ క్షశ్యేనకంకాళి, భీ
షణతన్ మ్రోసెఁ బిశాచికాకులకలా ♦ స్వానంబు లెంతేనియున్. 32

క॥ శరవిద్ధాంగుఁడై పూర్వము, పరితాపమునొంది మోహ ♦ పరవశుఁ డగు న
ద్దురితాత్ముఁడు సింహాస్యుఁడు, పరగ గతమోహుఁడగుచుఁ ♦ బ్రాభవము మెఱయన్.

గీ॥ సమరమండలిఁ దెళ్ళిన ♦ స్వభటకోటి, భూరిదోఃప్రౌఢిఁ గూడిన ♦ భూతతతిని
విక్రమాఢ్యతఁ జెలువొంద ♦ సినవరుల, గాంచి మదిఁ గ్రొత్తరోషంబుఁ ♦ గడలుకొనఁగ.

మ॥ దనుజేంద్రుండు సహస్రకార్ముకము లు ♦ ద్యత్ప్రౌఢిమం బూని ద
య్యన నేసెన్ దశలక్షబాణములు దే ♦ వాధ్యక్షుపై నాతఁడున్
ఘనరోషాప్తి సహస్రసాయకములన్ ♦ ఖండించి తచ్ఛస్త్రము
ల్గొని పెన్ దైత్యుని మేను గాడ మఱియు ♦ న్నూనస్వచ్ఛరవ్రాతముల్. 35

వ॥ మఱియును, 36

క॥ పిశితాశియుఁ గోపంబున, దశలక్షలు బఱపె శస్త్ర ♦ తతులుం గుహుఁడున్
భృశరోషతీక్ష్ణతాప, ద్విశిఖంబులు దునిమివైచె ♦ వెసఁ దచ్ఛరముల్. 37

వ॥ అంత సింహాస్యుండు కోపావేశంబున సహస్రసాయకంబులు గుహుసారథియురంబున నాటించిన నతండు పుష్పితపలాశంబుఁబోలె రుధిరధారారుణితాంగుండయ్యె. 38

క॥ అది గని షణ్ముఖుఁ డలుకన్, బ్రిదరశతం బుగ్రముగను ♦ బఱపె రణోర్విన్
విదళితముఁ జేసె దైత్యుని, రథమున్ శౌర్యప్రభాధు ♦ రంధరుఁ డగుచున్. 39

వ॥ అంత సంచలితహృదయుండై సిలింపవైరి కరకుటంపగములు సుష్మకాలపయోధరంబుఁబోలెఁ దారకారిపై వర్షించిన, 40

క॥ గుహుఁ డవ్వానిని నడుమన, బహుశరములఁ దుంచి మఱియుఁ ♦ బ్రదరసహస్రం
బహితునిపైఁ బఱపి ధను,స్సహస్రమును దునిమె నొక్క ♦ సారె నిరూఢిన్. 41

ఆ॥ దళితచాపుఁ డగుచు ♦ దానవనాథుండు, శూల ముగ్రతరముఁ ♦ గేలఁ బూని
కోపమడర రచిత♦కోలాహలుండయి, విడిచె దివిజసైన్య♦విభునిమీఁద. 42

వ॥ అరుదెంచుదానిఁ జూచి. 43

క॥ ఫాలాక్షతనూజుఁడు పదు, నాలుగుబాణములు బఱపి ♦ నడుమన దునిమెన్
శూలముఁ బటుతరకోపా,భీలుండై సకలదిశలు ♦ భీతి జనింపన్. 44

వ॥ మఱియు దేవసేనావిభుండు నసురవిభునిపై శరసహస్రంబులు గురిసిన నద్దను
జాధముండు దండంబున వారించి కృతకోలాహలుం డగుచు హాలాహలకంఠ
తనయునిపైఁ జనుదెంచె. 45

—* కుమారుఁడు సింహవక్త్రుబాహువుల శిరములఁ ద్రుంచుట *—

క॥ చనుదెంచుదనుజుఁ గనుఁగొని, ఘనరౌద్రవినిద్రుఁ డగుచు ♦ గౌరీసుతుఁడున్
సునిశితశరముల నేసిట, దునిమెన్ దత్కరముఁ జటుల ♦ దోర్బల మెసఁగన్. 46

వ॥ మగుడ నుత్పన్నం బగు కరంబున దండంబుఁ గొని దానవుండు కోపంబున
దేవవల్లభునిపైఁ బఱపిన సురేశ్వరుండు దాని సహస్రశరంబుల భేదించె; నంత,

క॥ ప్రేరితమయ్యెన్ మఱియును, ఘోరం బగు పాశ మసుర♦కుంజరుచేతన్
వారక నదియుం దునిమెఁ గు,మారుఁడు పటిమ న్సహస్ర♦మార్గణములచేన్.

క॥ దెసలన్ నిండెను ఘోషము, లసదృశముగఁ జేసికొనుచు ♦ నసురవిభుండున్
ద్విసహస్రకరంబులతో, వెసవచ్చె దివిజసైన్య♦విభుఁ బట్టకొనన్. 49

వ॥ ఇట్లు కరంబుల సాచికొని చనుదెంచు నద్దనుజుం గని గుహుండు కోపంబు
గదురఁ జిచ్చురపిడుగులవోని రెండువేల శరంబులుం దొడిగి సింహవక్త్రు
ద్విసహస్రకరంబులం దునిమి పుడమిం బడవైచిన నవియు మహీరుహంబులు
వోలె మగుడ నతనికి సముద్భూతంబు లయ్యె. 50

క॥ భిన్నము లగు కరముల ను, త్పన్నకరంబులను గొనుచు ♦ దనుజుం డంతన్
మిన్నదర నార్చి పటుగ,ర్వోన్నతి గుహుపై నెదిర్చె ♦ నురురోషమునన్. 51

వ॥ ఇట్లెదిర్చినం గని, 52

మ॥ అసదృక్శౌర్యుఁడు బాహులేయుఁ డపు డు♦ద్యద్బాణసాహస్రము
న్వెస సంధించి తదీయశీర్షముల ను♦ర్విం గూల ఖండించి, ప్రో
ల్లసదుత్సాహధురంధరుం డగుచు లీ♦లం ద్రుంచె ఘోరంబుగా
ద్విసహస్రప్రదరంబులుం బఱపి యొం♦తే తద్భుజామండలిన్. 53

వ॥ అప్పుడు మూర్ధంబులు భుజావ్రజంబులు తోడన పునరుద్భూతంబులై పూర్వం
బట్ల పూర్వగీర్వాణువరుఁ జెలువొందినం గనుంగొని సర్వసుపర్వు లత్యంతా
శ్చర్యనిమగ్నులై భయవ్యాకులమానసు లగుచు దవ్వులం బారి రయ్యవస
రంబున సుబ్రహ్మణ్యుఁ డాత్మగతంబున, 54

క॥ వటభూరుహనికటంబునఁ, గుటిలాత్ములు దనుజవరులు ♦ ఘోరంబుగ మున్
ఘటియించిరి వీరాధ్వర, మటుగావున నతని శిక్ష ♦ దాహవమందున్. 55

వ॥ విదళితంబులైన పాణిశీర్షంబులు పునరుద్భూతంబు లయ్యె నని తలంచుచుండ, 56

క॥ అసురుఁడు పల్కెను గుహుతో, నసదృశ మగు భూరిబలము ♦ నైశ్వర్యం బిం
పెసఁగ జరామరణాది, వ్యసనవిదూరతయు మాకు ♦ నలవడె జగతిన్. 57

వ॥ అది గావున ఛిన్నంబులైన శిరఃపాణులు మగుడ జనియించె; నస్మద్బలంబు నీ
వెఱుంగ నోపుదువే? కారాగృహబద్ధు లగు సుపర్వుల నింక స్వప్నంబుననైన
విడువనేర్తునే? బాలుండ వగుటంజేసి నిన్ను మన్నించెద; నెందేనియు శీఘ్రంబ
యథేచ్ఛం జను మనవుఁడు నతనివచనంబులు విని కోపంబుగదుర దివిజసేనా
విభుం డిట్లనియె. 58

ఆ॥ ఓదురాత్మ! రజ్జ ♦ లాగి పల్కుటుచితంబె, నిలువు మాజి నింక ♦ నిమిషమాత్ర
మప్రయత్నమునను ♦ నణఁగింతు నీక్రొవ్వు, నరయ నిది యథార్థ ♦ మసురవినుము.

వ॥ అని శంభుసూనుండు గంభీరముగాఁ బల్కిన విని దనుజసింహుండు కోపోజ్జృంభి
తుండై సమరసంరంభం బెసంగ సింహనాదంబు సేసి ద్విసహస్రకరంబులఁ
దావత్సంఖ్యంబు లగు పర్వతంబులఁ బెకలించుకొని సుపర్వసేనానిపయిం
బఱపిన, 60

క॥ శరజన్ముఁడు తద్గిరులన్, శరశతమునఁ దుమురు సేసి ♦ చయ్యన మఱియున్
స్ఫురదస్త్రసహస్రంబులు, నురుతరగతిఁ బఱపె దైత్యు ♦ నురమున్ గాఢన్.

క॥ దితిసుతుఁడు రుధిరధారా, ప్లుతవక్షుండయ్యు నగము ♦ లును మఱియు మదో
ద్ధతిఁ బెకలించుటయుం గని, యతనిశిరములెల్లఁ దునిమె ♦ హరసుతుఁ డలుకన్.

వ॥ తచ్ఛిరంబులు పూర్వప్రకారంబున మొలుపుసూపె; నంత నద్దానవేంద్రుండు
బలపరాక్రమాసాధ్యుం డగుచు నాఱ్పులు నిగుడ మగుడి తద్గిరులు గిరిజాకుమా
రుపై వైచిన, 63

క॥ నగజాసుతుఁ డయ్యున్నత, నగములు ద్విసహస్రసంఖ్య ♦ నారాచములం
దెగటార్చి యొగి సహస్ర, యుగముల ఖండించి మించె ♦ సురరిపుభుజముల్. 64

ఆ॥ మగుడ నవియుఁ దొంటి ♦ పగిది జనించిన, నవియుఁ దునిమెఁ గినుక ♦ హరసుతుండు
మాటిమాటి కసురమస్తకబాహువుల్, పొడమె సారెసారెఁ ♦ గెడపె నవియు. 65

వ॥ ఇట్లష్టోత్తరసహస్రవారంబులు దునిమివైచిన నమ్మహాభుజాభుజశీర్షవ్రజంబులు
సకలదిశలును, భూనభోంతరాళంబులును, పాతాళంబును, పర్వతసముద్రంబు
లును నీరంధ్రంబుగా నిండె; నప్పు డఖిలనిలింపులు గుంపులై తత్పతనమహా
ధ్వని విని భయంపడిరి. 66

క॥ వివృతాస్యములై యెల్లెడ, నవిరళముగ వ్రాలినట్టి ♦ యాశిరములు సా
చ్చి వెసన్ గుహుని భయంబున, నవి నోరులుమూయ ఖగమృ ♦ గాదులుమడిసెన్.

—* కుమారస్వామి సింహవక్త్రు హతంబు సేయుట *—

వ॥ అంతఁ బార్వతీసుతుం డిది మాయాకృత్యం బని మనంబునం దలంచి యొక
శిరంబును బాణిద్వయంబును దక్క తక్కిన వన్నియుం జక్కడినఁ దత్కర
శిరోవ్రాతంబులు గ్రమ్మఱ నుద్భూతంబు లగుటం గనుంగొని నాసాగ్రంబున
దర్జనిం జేర్చి భర్జింపుచు శాసించిన నతనిబాహుమస్తకంబులు మఱల మొలుపు
చూపక నిలిచె; నప్పుడు, 68

గీ॥ అహహా గుహునాజ్ఞ జగతి నే♦మనఁగవచ్చు, ముడిచికొనిపోయెఁ దా బెళ్ల♦మోములట్లు
తన్మహాభీతివలనహ♦స్తములుఁ దలలు, మగుడ వెడలక దానవ♦మాళి కెలమి. 69

వ॥ ఆసమయంబునఁ బాణిద్వయోపేతుం డేకవక్త్రుం డగు నద్దనుజపురందరుం
గనుంగొని స్కందుండు కించిత్ప్రహసితవదనారవిందుం డగుచు నిట్లనియె. 70

క॥ ఛిన్నంబులు మఱల సము,త్పన్నంబులు నగు నటంచుఁ ♦ దద్దయు నతిద
ర్పోన్నతి నుంటివి భ్రాంతుఁడ!, కిన్నాఁగఁగ నస్మదాజ్ఞఁ ♦ గన్గొంటె భళా! 71

చ॥ అనుఁడు తదూక్తుల న్విని మ♦హాదురితాత్ముఁడు దానవుండు వ
ల్కెను గడురోష మొప్ప నవ♦లేప మి దేటికి రోరి! నీమనం
బున నిలు మాజి ♦ నేకశిర♦ముం భుజయుగ్మముఁతోడ నేనియుం
జెనకి భవన్మదం బణఁగఁ ♦ జేసెదఁ జూడుము నాప్రతాపముల్. 72

వ॥ అని మహారావముఖరితహరిన్ముఖుం డగుచు సింహముఖుండు షణ్ముఖునిపై నొక
నగంబుఁ బెకలించి వైచిన నతం డొక బెడిదంపుటంపగోలన నది విదారించె. 73

క॥ శరములన సమరనైపుణి, యరయఁగ నీకుం బ్రశస్త♦మన్యాయుధసం
గరముం గర మలవడ దని, నిరసింపుచు దానవుండు ♦ నిష్ఠురభంగిన్. 74

క॥ రోషాగ్నికీల లడరఁగ, నాషణ్ముఖుమీఁద వైచె ♦ నత్యంతంబున్
భీషణ మగు దండముఁ గను, ఘోషం బడరంగ సమర♦కుంభిని యదరన్. 75

వ॥ అప్పు డప్పార్వతీసుతుం డనేకకోటిమార్తాండసదృశతేజోవిరాజితంబును, నతి
భయదంబును నగు శక్త్యాయుధంబుఁ బఱపిన జగంబులు వణఁకం జేయుచు మహా
రవంబడర వెడలి తదీయదండంబు ఖండంబు గావించి యురోమండలంబు భేదించి
నిమిషమాత్రంబున నద్దురాత్మునిప్రాణంబులు గ్రసించి గంగాతోయంబులఁ
గృతావగాహంబై మఱలి పూర్వవిధంబున స్కందుని కరారవిందంబునఁ
బొలుపొందె. 76

క॥ రుధిరములు నోటఁ దొఱఁగన్, గుధరంబు తెఱంగు వ్రాలి ♦ కుంభిని నానా
విధముల నటునిటు బొరలుచు, నిధనంబునుఁ బొందె వేగ ♦ నిశిచరుఁ డంతన్.

వ॥ ఇట్లు విగతప్రాణుం డైన యప్పాపాత్మునిం గని దివిజులు సంతుష్టాంతరంగు
లగుచుఁ బుష్పవృష్టిం గురిసిరి; సమస్తభూతంబులును బ్రభూతకోలాహలసమే
తంబులై చెలంగె. 78

శా॥ రాజద్వైభవుఁ డద్రిజాసుతుఁడు వీరవ్రాతము ల్బ్రాతముల్
చేజేలుం గొలువంగ వాద్యరవముల్ ♦ జెన్నొంద మాణిక్యరే
ఖాజాంబూనదదీప్తిబంధురమహా♦గారావళీనిస్తుల
భ్రాజితస్ఫారము హేమకూటపుర మొ♦ప్పం జేరె నుత్సాహియై. 79

వ॥ ఇట్లు నిజమందిరద్వారంబుఁ జేరి రథంబు డిగ్గి భూతవీరులను యథాస్థానంబుల
కనిచి దివిజులతో నంతఃపురంబుఁ బ్రవేశించి రత్నసింహాసనాసీనుండై యుండె;
వాసమయంబున నఖిలవీరభూతగణంబులును, దివిజులును గుహునిననుమతి వడసి
నిజాస్థానంబులకుం జని సుఖం బుండి; రేతదాఖ్యానం బెవ్వఁ డేనియుఁ బఠించిన
వినిన నతండు సకలాభీష్టంబులం బొంది శత్రువిజయంబుఁ గాంచు; పూర్వకాలం
బున నగస్త్యునివలన నిక్కథ వినియకాదె దశరథాత్మజుం డగు రాముండు సంగ
రాంగణంబున రావణాదుల జయించె; నని చెప్పి సూతుండు మఱియు శౌనకాది
మహామునుల కిట్లనియె. 80

క॥ అంతట శూరుఁడు దూతము, ఖాంతరమున సింహవక్త్రు ♦ నంతిమదశ న
త్యంతము విని బహుశోకా, క్రాంతత ధరఁ బడియె గోపు♦రమునుండి వడిన్. 81

గీ॥ హరిచతుర్ముఖప్రముఖులౌ♦నఖిలసురలు, నిజపదంబులు బొందంగ ♦ నేఁడుగలిగె
మత్కృతవిధానభేదంబు♦మానిరకట, దనుజయాద్యశావస్థ రా♦నగుని నీకు? 82

వ॥ అని యనేకప్రకారంబుల విలపించి కొండొకతడవున కసురేంద్రుండు సంత్యక్త
శోకుండై లేచి శీఘ్రంబ సింహాసనం బధిరోహించి యత్యంతకోపవిస్ఫురితలో
చనుండై, 83

గీ॥ తనయజాండంబులందలి ♦ దనుజవరులు, సింహవక్త్రునికంటె వి♦శేషముగను
బలపరాక్రమధౌరేయు♦లలఘుయశులు, గలరు వారలరావించి♦గరిమమెఱయ.

వ॥ ఏనుసంగరరంగంబున కరిగి యబ్బాలుని జయించి క్రమ్మర మత్పురంబు సేరెద
నని తలంచి సహస్రకోటిదూతల నఖిలబ్రహ్మాండంబులకుఁ జననియోగించిన వార
లాక్షణంబ చని తద్బ్రహ్మాండసంస్థితులైన దానవులకు శూరవచనంబులం దెలిపి
సత్వరంబుగా మఱలి రయ్యజాండంబున కంత, 85

మ॥ సకలాజాండములందు నుండు పలభు♦క్సైన్యంబు లుద్యద్రిపో
త్సుకతన్ నిర్భరభూరిఘోష మడరన్ ♦ దోర్దర్పము స్మేర వా
రక యేతెంచె హరోత్తమాంగతటినీ♦రంగత్తరంగచ్ఛటా
ప్రకరంబు ల్బరతెంచునై ఖరిని శుం♦భత్స్ఫ్రాధి జూపట్టగన్. 86

వ॥ మఱియు బరమేశ్వరేచ్ఛాసంజాయమానచరాచరజంతుసంతానతంతన్యమాన
జగజ్జాలంబునుంబోలె నజాండబిలపథంబున వెడలి వినీలనిజతనుతమఃపటలంబు
లాదిత్యాదిప్రభాపుంజంబు లాక్రమించి లోకంబులు గప్ప జవసముద్భవ

పవనమహారవంబుల భువనంబులు వణంకఁ జరణదంతపరాగపరంపరల సప్తార్ణ
వంబులుశోషిల్ల పాదన్యాసయోగంబున బ్రహ్మాండంబు పరిస్ఫోటితంబుగా సైన్యం
బులతోడం జనుదెంచి మహాబలు లగు దనుజవీరులు భూనభోంతరాళంబు పా
తాళంబు నిండి; రంత, 87

క॥ చరియింపఁగ నచ్చోటను, హరివిధముఖసురలు తమకు ♦ నవకాశము లే
కురుతరభయముం బొందిరి, గిరులుం దుములయ్యె బలము ♦ గ్రిక్కిరియుటచేఁ.

క॥ దానవసేనాముఖ మది, యానెఁ బ్రహ్మాండభిత్తి ♦ నవకాశం బెం
తేని యొసంగక యాగత, దానవకోటులకు నపు డు♦దగ్రిస్ఫూర్తిఁ. 89

వ॥ తదాగమనంబు విని శూరుండు పరమామోదంబున నంతఃపురంబున కిరిగి కృత
స్నానుండై భోజనాదులం బరితుష్టిం జెంది భస్మత్రిపుండ్రరుద్రాక్షమాలికా
లంకృతుండును, దివ్యచందనమాల్యభూషితుండును, దివ్యాంబరాభరణశోభి
తుండును, మహేశ్వరదత్తపాశుపతబ్రాహ్మ్యాద్యనేకదివ్యాస్త్రధరుండును నగుచు
రణోద్యుక్తుం డయ్యె; నయ్యెడ. 90

సీ॥ అధరీకృతాష్టకు♦లాచలాయతచక్ర, నేమికానిర్ఘోష ని♦బిడభయద
మభ్రంకషసముద్య♦దమితసింహధ్వజ, బహుళశస్త్రాస్త్రరవి♦భ్రాజమాన
మరుణప్రభాడంబ♦రాంబుజప్రియబింబ, దురుశాతకుంభకుం♦భోజ్జ్వలంబు
సప్తసాహస్రాశ్వ♦శార్దూలహార్యక్ష, భూతపిశాచసం♦ఘాతగంధ
మనిలమానసతుల్యవే♦గాన్వితంబు, వీరయాగోద్భవము మహా♦ఘోరతరము
నైన రథమును సింహవా♦హనము నొకటిఁ, దెచ్చి రవ్వేళఁ దోడ న♦గ్గలిజవరులు.

చ॥ అపుడు రథాగమంబునకు ♦ నద్రులు చాల చలించె, శీతతం
దపనుఁడు గాంచెఁ, బొందె శమ♦నం బొగి బాడబవహ్ని, యొంతయు
న్విపులతరంగఘోషముల ♦ నిండి కలంగెఁ బయోధు లేఁడు, ది
గ్ద్విపములు గంపమొందెఁ బృథి♦వీతల మల్లలనాడె సారెకుఁ. 92

—* శూరపద్ముండు కుమారస్వామిని జయింప నరిగుట *—

వ॥ అంతఁ దద్రథారూఢుండై దానవేంద్రుండు సకలదనుజకృతాశీర్వాదుండును,
పటహభేరీకాహళాదిమహారావముఖరితహరిన్ముఖుండును, దనుజసువాసినీప్రశస్త
హస్తారవిందవికీర్ణసుమబృందశోభితుండును, వందిమాగధసందోహకృతనిజబిరు
దావళీవిభాసమానుండును నగుచు రథచోదనంబున సారథుల నియోగించి మేరు
సంగతం బగు నీలశైలంబుచెలువునం జెలువొందుచు నిరుగెలంకులఁ గొందఱు
ఛత్రచామరధ్వజపాణులును గొందఱు తాంబూలపేటికాపాణులును గొందఱు
గళాచికాధారులును గొందఱు గనకభృంగారుప్రశస్తహస్తులును నై చనుదేర
నిఖిలసముద్భటభటకోలాహలంబు లడరం బురవీధుల గోపురమంటపంబు లతి

క్రమించి ప్రధానగోపురద్వారంబు సేరె; నయ్యెడ, 93

గీ॥ కూడియున్నట్టి దానవ♦కోటులెల్ల, దనుజకులసార్వభౌముని ♦ గనిరి ప్రేమఁ
గిలకిలార్భటిఁ జేయుచుఁ ♦ గేల నాయు,ధముల ధగధగద్దీప్తులు♦దలుచుమెఱయ.

వ॥ అంత శూరుం డఖిలబలసమేతుండై గంధశుండాలఘటాగండనిష్యందమాన దానధారాపూరితం బగు పురపథంబువలనం జని రణాంగణంబుం డాసె; నప్పుడు,

క॥ జనమునఁ జని కొందఱు దా,నవభటు లాహేమకూట ♦ నగరము నుద్య
ద్రవమెసఁగ నిరోధించిరి, వివిధాయుధపాణు లగుచు ♦ విక్రమ మొప్పన్. 96

వ॥ ఆసమయంబున మహాభయంకరాకారు లగు సురవైరులం గని బ్రహ్మవిష్ణుప్రముఖ నిఖిలదివిజులును మూర్ఛిల్లిరి; వీరులును భూతంబులతోడ భయంపడి; రంత బ్రహ్మాదులు కొండొకసేపునకు దెప్పిరిలి చనుదెంచి మహామహుం డగు గుహుని చరణారవిందంబుల కెరగి యిట్లని విన్నవించిరి. 97

క॥ దుర్వారమహిమ శూరుఁడు, సర్వాంశంబుల నసించు ♦ సకలదివిజులన్
దూర్వహతఁ గూడి యిప్పుడు, గర్వమునన్ వచ్చెఁ గంటె ♦ కదనంబునకున్.

గీ॥ అతని సేనాముఖం బిదె ♦ యడ్డగించె, దేవ! తావకనగరంబు ♦ దృఢతరముగ
నమ్మహాపాపిదానవు ♦ నాజి దునిమి, కరుణఁ బాలింపు మమ్ము వి♦క్రమధురీణ!

వ॥ అని యిట్లు విజ్ఞాపనం బొనర్చిన వారి వచనంబులు విని పరమకారుణికోత్తముండైన కార్తికేయుండు పవనుం బిలిచి రథం బాయితంబు గావించి తెమ్మనవుఁడు నతం డట్లసేసినఁ బార్వతేయుండు సింహాసనంబు డిగ్గి, 100

క॥ బహురత్నచిత్రితంబును, మహితజవోన్నత దురంగ♦మణిబంధంబున్
మహనీయం బగు రథమున్, గుహుఁ డధిరోహించె సమర♦కోవిదుఁ డగుచున్. 101

ఆ॥ చక్రదండముసల♦శరశరాసనశూల,కులిశఖడ్గఖేట♦కుంతపాశ
శక్తితోమరాది ♦ సకలాయుధంబులు, గడు ధరించి శౌర్య♦గరిమ మెఱయ.

సీ॥ నవవీరులును మహా♦న్నతలక్షవీరులు, వినయంబు రంజిల్ల ♦ వేడ్కఁ గొలువ
ద్విసహస్రవాహిను ♦ లెసఁగంగ భూతంబు, లతులవిక్రమలీల ♦ నరుగు దేరఁ
బద్మగర్భాదిసు♦పర్వులు నత్యంత,సంతుష్టిఁ బుష్పవ♦ర్షములు గురియఁ
గల్పాంతఘనఘనా♦ఘనననినాదములను, పటహాభేరీ ధ్వను ♦ ల్బరిఢవిల్ల
చామరచ్ఛత్రకేతన♦సముదయములు, వారితార్కాతపంబులై ♦ వరుసఁ జెలఁగి
వందిగణముకై వారము ♦ సందడిల్లఁ, గదనమండలి కరుదెంచెఁ ♦ గ్రౌంచభేది.

వ॥ అప్పు డఖిలభూతంబులు క్రూరకర్ములగు నమ్మహాదానవులంగని వెఱఁగుపడి పరస్పరంబు భయంబు నొందుచు నిట్లనిరి. 104

క॥ కరములు శిరముల నేకముఁ, లరయగఁ జూపట్టి భీక♦రాకృతి నష్టో
త్తరసాహస్రాండంబులఁ, బఱఁగు మహాదైత్యు లిపుడు ♦ పరతెంచి రొగిన్. 105

సీ॥ లోకంబులన్ని ప్ర♦త్యేకంబు శాసింపఁ, జాలిన, నిరుపమ♦సాహసాఢ్య
లబ్జభాండంబుల ♦ నలఘువిక్రమలీలఁ, గలఁగింప నిపుణులౌ ♦ కర్కశాత్మ
లంభోనిధులువోలె ♦ నలరారు వక్త్రముల్, గల్గిన భీకరా♦కారయుతులు
రవిచంద్రతారకా♦గ్రహమార్గముల మించు, శిరముల రాజిల్లు ♦ పరుషతనులు
చటులతరవహ్నిఘనశిఖా♦చ్ఛటల నెనయు, నేత్రములుగల్గి మెరయుని♦ర్నిద్రశౌర్యు
లహహా వీరల నెదిరించి♦యాహవమున, సాహసముఁ జూప నెవ్వాఁడు♦శక్తుఁడగును?

వ॥ మఱియు భానుకోపతారకసింహముఖాగ్నిముఖయామిముఖులును, సుందోప
సుందులును, మధుకైటభులును, జలంధరమహిషాసురులును నెట్లట్టిన వీరం
దఱు మహాబలపరాక్రమసంపన్నులు మహాశూరులు బ్రహ్మవైష్ణవేంద్రా
గ్నేయాద్యాయుధసమేతులు ననంతకోటిసంఖ్యాకసేనాసహితులు నై యేరికిం
దలసూపరా కుండఁ బ్రకాశింపుచున్నవారలు; తొల్లి మన మిందఱ మొక్క
బ్రహ్మాండంబునం గల దానవులచేఁ గోలుపోయినవార మట్లగుటం జేసి యిప్పు
పాత్మ్రలమోర్చిల మనకుఁ బ్రాణసంరక్షణంబు సందియం బగు; నద్దనుజసైనికుల
లోన నొక్కండొక్కండ మనసేనలం గల బలుమగలనందఱం గెలువనోపు; నట్టి
మహాబలు లెందఱేనియు ననేకబలంబులతోడం గూడికొని సమరంబునకు సమక
ట్టియుండ శిలామహీరుహంబులతోడఁ గయ్యంబుసేయు మనశక్తి వారిపై నెట్లు
గెలువనేర్చు; మహావీరుం డగు వీరబాహుండేనియు నోర్వఁజాలం డని తోచుచు
న్నయది. ఇంక సాక్షాత్పరబ్రహ్మం బగు బాహులేయుండు వీరలనందఱఁ జంప
సమర్థుఁడగుటం జేసి మనకుఁ దొలఁగిసనుట కవకాశంబు లేదు; కావున దావానలం
బుపైఁ బడు మిడుతలవడువునం బడి మడియవలయు నని పరస్పరంబు నుడివి
కొనుచు భూతసైనికు లొకరికొకరు ధైర్యంబులు బురికొల్పుకొనం జేయుచు
నిశాటసైన్యంబులపైఁ దలపడి రాసమయంబున, 107

క॥ సేనాధిపులును వీరులు, దానవులఁ గని యపు డణఁగెఁ ♦ దమభుజబలమెం
తేని యని పరస్పరముం, బూనిరి సంగ్రామమునకు ♦ భుజశౌర్యములన్. 108

వ॥ అప్పు డింద్రాదినిలింపులు గుంపులై మురవైరిం గని యిట్లనిరి. 109

చ॥ అతిదురితాత్ములైన దను♦జాధిపులందఱ సేరి నాజిలో
హతులనొనర్ప కెన్నఁ డిదవ♦సానముఁ బుచ్చె గుహుం డదేలొకో
దితిజవిపంచు శూరుఁ డనిఁ ♦ ద్రెళ్ళు టదెన్నఁడొ? సర్వదేవతా
తతికి విమోచనం బెపుడొ? ♦ తాము సుఖంచుటఁ గల్గు టెన్నఁడో? 110

వ॥ దేవా! నిజపదప్రాప్తి యెన్నఁడొకో? యేమునొడలఁ బ్రాణంబులు గలిగి యే
తత్సర్వంబుఁ జూడఁగలమే యని దైన్యంబునం బలికిన విని హృషీకేశుండు సురల
కిట్లనియె. 111

క॥ సాక్షాత్పరశివుఁడౌ నిట, లాక్షుఁడు మన కెపుడు కర్త ♦ యాధ్యక్షుఁడునై
రక్షించు గుహాకృతిచే, నీక్షణమునఁ జింతసేయ ♦ నేటికి మదిలోన్. 112

మ॥ సకలాజాండఘటల్ జగంబులు వి♦లాసంబొప్పఁగాఁ జూపె బా
లకుఁడై యెవ్వఁడు రోమజాలముల లీ♦లం బంచకృత్యంబులం
బ్రకటించు న్నడు నవ్వఁ డాగుహున కీ♦ప్రత్యర్థినిర్వాపణం
భూకభారంబౌకో? తుంచు నీక్షణమునం ♦ బ్రోద్యద్గతిం దైత్యులన్. 113

క॥ సురలార! మీర లిప్విభు, నిరుపమమహిమ మఱచితిరొ ♦ నీవ్రుల్ దివిజే
శ్వర! చూడకు శిశుబుద్ధిని, శరజన్ము మహానుభావు ♦ జగదీశ్వరునిన్. 114

క॥ ఏతపముఁ జేసినార ము, యీతండు మహానుభావుఁ ♦ డీశ్వరతనయుం
డేతాదృశశుభరూపస,మేతుండై మనలఁ బ్రోవ ♦ నేతెంచెఁ గృపన్. 115

క॥ నగిమైనఁ గినుకనైనన్, మిగులన్ శాపములనైన ♦ మేదినిలోనన్
జగడమునన్నైన శూరా,దిగఁ బోరిఁగొన శక్తుఁ డితఁడు ♦ దితిజుల నెల్లన్. 116

వ॥ ఇమ్మహామహుని యద్భుతంబగు బలం బెవ్వఁ డెఱుంగనోపు; ధృతాయుధంబు లగు భూతంబులును, బలపరాక్రమసంపన్ను లగు వీరులును, వినోదంబునఁ గూడికొని యిపుడు యుద్ధంబునకుఁ జనుదెంచి నిమిషమాత్రంబున నసురులందఱం బరిమార్చి శూరపద్ముని సంహరింపంగలండు; మద్వచనంబులు సత్యంబు; లని ముకుందుండు పలికినఁ బురందరాదిబృందారకులు సందియంబు మాని డెందంబుల సకలశత్రుబృందసంహారకుండు సత్యజ్ఞానానందమయుండు నగు స్కందునిం దలంచుచుండి; రాసమయంబున, 117

క॥ హరివిధులతోడ సత్వర, మరుదెంచి సమస్తదివిజు ♦ లా గుహువెంటం
బరమప్రేమను జని రా, నారసూనుఁడు జూచి మంద♦హాసము మీరన్. 118

వ॥ సర్వగీర్వాణసమేతుండై వీరబాహుప్రముఖులతోడ గుహుం డాయోధనస్థలంబుఁ జేరె; నయ్యెడ, 119

క॥ భూతంబులు రాత్రించర, వ్రాతంబులతో నొనర్చ ♦ రణ మపుడు మహీ
జాతంబులు పర్వతస, ఘాతంబులు గురియుచును బ్రో♦గల్భత మెఱయన్. 120

వ॥ ఇట్లు రణంబొనర్చి నంత, 121

క॥ ఒకచో సేనానాయకు, లొకచో వీరులును దనుజ♦యోధులచే వా
రక పరిభవ మొందుచుఁ గడు, వికలత నాశాంతములకు ♦ వెసఁ బఱచి రొగిన్.

ఆ॥ వీరబాహుఁ డపుడు ♦ వేగంబ యున్నత, ధనువుఁ బూని ప్రచుర♦ధైర్యమెసఁగ
బాణతతులఁ బరపి♦బహుదైత్యతతిఁ ద్రుంచి, మఱియు వారితోడ♦మార్కొనంగ.

వ॥ సమర్థుండుగాక పరాభవంబునొంది గుహునిప్రాపుఁ జేరె నప్పు డద్దురాత్ములగు
నమ్మహాఘోరదైత్యులు నక్కుమారుం జుట్టుముట్టి యబ్బాలుం డాలంబుసేయ

శక్తుండగునేయని పేచింపుచు, దండ, చక్ర, కులిశ, శూల, శక్తి, ప్రాస, తోమరాద్యాయుధంబులు వర్షింపుచుఁ, బెడబొబ్బలిడుచు నొక్క మొగి నురవణించిన, 124

—* కుమారస్వామి విజృంభించి దనుజుల దునుమాడుట *—

మ॥ కని యాదైత్యులఁ గార్తికేయుఁడు మహోగ్రంబైన రోషంబున న్ధనువు న్సజ్యముఁ జేసి చయ్యన యుగాంత స్ఫూర్జదంభోధర స్వనముల్ వోలెను, సింజినీరవము భాస్వత్ప్రౌఢిఁ గావించెఁ ద న్నినదంబుల్విని మూర్ఛనొందె దనుజానీకంబుఁ గంపింపుచున్. 125

వ॥ ఇట్లు మహామహుండైన గుహుండు దుర్వారంబుగ మౌర్వీనినాదంబు జేసి నిశిత శిలీముఖంబుల గురిసి రక్కసుల ముక్కులుఁ జెక్కులును, మూపులు వీపులును, కాళ్ళు, వ్రేళ్ళును, శిరంబులు నురంబులును ఖండించి కొండలం జెండు నాఖండలు పిధంబున ఖండనమండనంబున, నఖండ ప్రతాపంబు చూపుచు, 126

సీ॥ వాలంబు లంఘ్రులు వదనము ల్నురుమాడి, ఘోటకసంఘంబుఁ గూల్చికూల్చి చక్రంబులును ధ్వజ స్తంభము ల్జక్కాడి, స్యందనబృందముల్జదిపి చదిపి గండస్థలంబులు తుండముల్ఖండించి, శుండాలతండము ల్జెండిచెండి ఛత్రచామరములు శస్త్రముల్ బొడిచేసి, రమ్యభూషణ రాజి రాల్చి రాల్చి ఘోరదైత్యుల శిరములు గొట్టికొట్టి, బిట్టుగ రక్షోవ్రగుట్టలు వెట్టివెట్టి గట్టురాపట్టిముద్దుల పట్టి యాజి, విక్రమక్రీడఁ జూపట్టె విస్మయముగ. 127

మ॥ ధర పాతాళము దిక్తటంబులు, వియద్భాగంబు స్వర్లోకము న్హరిలోకంబును బ్రహ్మలోకమును బ్రహ్మాండోర్ధ్వభాగంబు వి స్ఫురణ న్నిండి యుమాకుమారు పటు దోశ్శుంభచ్ఛరాసారము ల్బరిమార్చెన్ గ్రమమొప్ప సంగరకళాపాండిత్యులన్ దైత్యులన్. 128

గీ॥ తాపసామరసంఘంబుఁ దక్క గుహుఁడు, దానవులనిట్లు నెల్లెడ దర్పమణఁప దచ్చిరంబులు రాహుమస్తకము పగిది, నీ చరాచరమగు జగంబెల్ల నిండె. 129

క॥ దితిసుతఖండిత హస్త, స్థితములగు మహాయుధములు శివతనయుశర వితతిం బేరితములునై, హతముం గావించెఁ బోర వసురగణంబున్. 130

వ॥ ఇట్లు నానాప్రకారంబుల దానవగణంబులు హతంబగుట ప్రధనంబు గనుం గొని హరిబ్రహ్మాదిదేవతలు వీరసేనాధిపులు సంతోషభరితాంతరంగులైరి. మఱియు బూర్వంబట్ల వేఖొం డ్జాండంబులనుండి చనుదెంచి నిండిన సకలదనుజాలం గనుంగొని మున్నువచ్చినదానవు లని వారు భ్రమసియున్నంతలోనన దితిజుల గుహుండు విగతప్రాణులం జేసె; నట్టి యమ్మహానుభావునిం బరమామోదంబున సురగణంబులు సంస్తవంబులుఁ జేసిరి. 131

క॥ దివిజారులెల్ల సంగర, భువి నీల్గిన నియ్యాజాండమున నాక్షణమం
ద్రవకాళ మలరి నిండెను, జవమునఁ జనుదెంచి యసుర సైన్యము పెలుచన్.

వ॥ ఇట్లునిండి పాపకర్ముండైన శూరపద్మునిం జేరి కోలాహలంబొనర్చుచు, 133

మ॥ ధరణీమండలి నమ్మహాసురకబంధశ్రేణిపైఁ బాదము
ల్గదిమ న్మోపి తదీయశోణితమహాకల్లోలిను ల్దాటి స
త్వరత న్మార! భవద్విరోధి నతనిన్ దర్పం బణంగింతు మం
చు రహిం బన్ని ప్రతిజ్ఞ విక్రమములన్ జూపట్టె నంతేనియున్. 134

వ॥ సకలవైరిసంహారకుం డగు హారకుమారుం గని యిబ్బాలుండు రథ, గజ తురంగంబు లేమియును లేక యొక్కరుండ బ్రహ్మాండాంతరాగత రక్షోవీర సమూహంబులం బరిమార్చె నని యతని సాహసంబున కాశ్చర్యంబు నొందుచు నమ్మహామహుం జుట్టుకొని దనుజసైనికులు శూరాగమనంబునకు మున్నె యీతని సంహరించెద మని వివిధవిశిఖాయుధంబులు వర్షించి రంత, 135

క॥ భూతగణంబులు వీర, వ్రాతము సేనాధిపతులు వారక చింతా
దూతాశయులై రెంతయు, నాతఱిఁ గరుణాసముద్రుఁ డగు గుహుఁడెలమిన్.

వ॥ సారథియగు గంధహుం గనుంగొని మందస్మితవదనారవిందుం డగుచు గంభీర వచనంబుల నిట్లనియె. 137

క॥ అనిలా! నీ నైపుణ్యం, బనితరసాధారణముగ నరదము నాజిన్
ఘనమతి నడుపుము ముందఱ, వెనుకను బార్శ్వమున నడుమ వెస నల్లెడలన్.

వ॥ అని పల్కిన నమ్మహారథు వచనంబులు విని యనిలుండు భూనభంబుల, నదీ సముద్రంబుల, లోకాలోకంబుల, సకలదిశల, దన సారథ్యకౌశలంబుమెఱయ, నరదంబు సత్వరంబుగా బరపె; నాసమయంబున సకలశాత్రవ జయుం డగు నబ్బాహులేయుండు రక్కసులమూకలపై నిశితవిశిఖశరంపరలుపుంఖానుపుంఖంబులుగాఁ బరపిన, నమ్మహాశరంబుల నురంబులు గాడి పోడిమిసెడి రథంబులఁ దొఱఁగు రథికులును రథికులబాసటమై వచ్చి తద్బాణంబులు తనుత్రాణంబులుచ్చిపోయిన ప్రాణంబులు నిలువరింప నోపక వారణంబులపై నొఱఁగు ధోరణులును, నా ధోరణులకుఁ దోడు సూపుడు పిడుంగులవోనిఁ బెడిదంపు నారసంబుల తాకున నీరసంబులు దక్కి యుక్కడలి కరంబులగళ్లెంబులుసడలియొడలి పాటవంబు సాలక మొల్లంబుసెడి యొల్లంబోవుచు నెత్తురు జొత్తిలఁ బుడమింబడు రాహుత్తులును, సహాయంబుగా మొత్తంబులై చనుదెంచి పరుషతరశిలీముఖంబుల ఘట్టనలకు నెట్టన నిలువలేక సొమ్మసిలి నేలంగూలుకాల్బలంబులును, మఱియు నమ్మహామహుని సాయకంబుల తుండంబులు ఖండితంబులైన జిరజిరం దిరిగి ధరం దొఱఁగు వేదండంబులును, ముందటి పదంబులు దెగిన మెడలుఁ బెడమఱలి మొగ్గ

రిలంబడు నశ్వంబులును, ఘోరనారాచంబుల సారథులతోడ, నుగ్గునూచంబు
లగుశకటంబులు నై దనుజబలంబులు వెఱచఱచి తఱచి యొందుఁబోయిన నెట
సొచ్చినఁ, దద్బలంబుల పెల్లుఁ దప్పించుకొను వెఱవు సాలక యొందెందు నుండు
దనుజయోధులు నా యోధనంబున హతులై రయ్యవసరంబున, విస్రవద్రుధిర
జలంబులును, విదళితధవళాతపత్రఫేనంబులును, విస్రస్తశిరోజాత శైవాలంబు
లును, విలూనపతాకమీనంబులును, విదారితహయకబంధమకరంబులును
విఖండిత శిరఃకమఠంబులును, విచ్ఛిన్నవేదండ గండశైలంబులునుం గలిగి
రణాంగణంబు సముద్రంబుసొంపు సంపాదించె నయ్యెడ, 139

క॥ మృతదైత్య సైన్యభరమున, క్షితితలమెల్లను జలించె ♦ శేషునితోడన్
గుతుకమున సారమేయ, ప్రతతియు ఫేరువులుఁ గుణప ♦ పంక్తులు మెసవెన్. 140

గీ॥ ఉడుపభాస్కరబింబము ♦ ల్గడు గ్రసించు, రాహువులు వోలె నెంతయు ♦ రహిఁ జెలంగె
ఖేటయుక్తంబులై వ్యోమ ♦ వాటిదనుజ, శిరములెంతయు బహుభయం ♦ కరములగుచు.

వ॥ మఱియు దైత్యరథాకర్షణయంత్రంబులై మహాఘోరంబులగు భూతప్రేతపిశా
చంబులు మాంసభక్షణాపేక్షం బ్రవర్తిల్లె. 142

గీ॥ అఖిలజగముల వ్యాపించె ♦ నస్త్రచయము, నస్త్రవేగంబుకంటెను ♦ నతిశయముగ
బటురయంబునఁ బవనుండు ♦ బరపె రథము, దరమె గుహుని విక్రమం బెన్న ♦ ధాత కైన?

వ॥ ఇట్లు తద్రథవేగంబును, శరాసనపాటవంబును, సారథ్యకౌశలంబును, గనుం
గొని యిది మహాముహుం డగు గుహుని సామర్థ్యంబో, సారథి నైపుణ్యంబో
లేక శస్త్రాస్త్రమహిమంబో యని బ్రహ్మవిష్ణుప్రముఖు లగు వియచ్చరు
లచ్చెరువందిరి. 144

క॥ ఈకరణి గుహుఁడు దైత్యా, నీకముఁ బరిమార్పఁ గుణప ♦ నివహము రుధిరా
స్రోతప్రవాహములు భూ, లోకంబును మఱియు నురగ ♦ లోకము నిండెన్. 145

వ॥ ఇట్లనేకకోటిసంఖ్యాకులును, మహాభయంకరాకారులును నగు దనుజవీరులు
హతు లగుచుండ, నవ్వేళ మఱియు వేఱొండు బ్రహ్మాండంబులవల్లనుండి
మఱలఁ బూర్వంబట్ల సర్వాయుధపాణులును, సమరాంగణభయంకరులును నగు,
నసురు లరుదెంచిన వారి నాక్షణంబ గుహుండు రోషభీషణుండై పరిమార్చె.

క॥ ఈరీతి మాటిమాటికి, నారాక్షసు లరుగుదేర ♦ నాజిఁ దునిమి వే
మారు కుమారుఁ డజాండ, ద్వారంబును గప్పె విశిఖ ♦ తతులం గినుకన్. 147

వ॥ అంత మార్గాభావం బగుటఁ జేసి నిశాటవర్గంబు నిర్గమింపక నిలిచె నజాండభిత్తి
పర్యంతంబు గతప్రాణులగు నసురులకుణపంబులు పర్వతంబులట్ల తదీయరక్తంబు
లర్ణవంబులుంబోలెఁ జూపట్టె. 148

—* కుమారస్వామి ఫాలనేత్రంబుచే రాక్షస శవంబుల దహింపంజేయుట *—

గీ॥ కుణప శైలంబులం గాంచి ♦ కొమరుసామి
మందహాసంబు చెలువొంద ♦ మహిమ మెఱయ
ద్వాదశదృశాగ్నికీలల ♦ దాని నెల్ల
భస్మములు జేసె దుర్వార ♦ పటిమ మీఱ. 149

వ॥ అంతఁ బూర్వప్రాకారంబున నవకాశం బెల్లెడలం గల్గె; దానఁ హరిబ్రహ్మాదిసకల దేవతానికరంబులు సర్వసుపర్వాగ్రగణ్యుం డగు సుబ్రహ్మణ్యమహామహిమునకు నానందించి రుధిరార్ణవపరిప్లుతంబుగా నీ దురాత్ముల వధించినేత్రానలంబున భస్మీభూతంబులం జేసె, నింక నమ్మహామహునకు శూరపద్మసంహారం బేమి భారంబని పరస్పరంబు నుడివికొనుచుఁ బ్రణమిల్లి స్తుతిశతంబు లొనర్చి; రంత, 150

గీ॥ శూరపద్ముండు కోపవి ♦ స్ఫురణ మెరయ, శివకుమారు నెదిర్చి భ ♦ ర్జించె మిగుల
నద్దురాత్మునిచటులతరాగ్రహంబుఁ, గడలుకొనఁగా నెదిర్చె శ్రీ ♦ కంఠసుతుఁడు.

వ॥ అంత దైత్యవల్లభుం డగు శూరుండు గుహున కిట్లనియె. 152

క॥ పరమేశ్వరుఁ డగు శంకరు, వరమహిమంబునను నా క ♦ వధ్యత దనరున్
బరులెవ్వరేని నాతో, దుర మొనరించినను బొందు ♦ దురు పరిభవమున్. 153

వ॥ అనిన విని కుమారుండు గంభీరవచనంబుల నిట్లనియె. 154

క॥ పాపివి నీతో నే నే,లా పలుకఁగఁ గరుణ మత్క ♦ లంబమ త్వత్ప్రా
ణాపహతిఁ జేయకుండుట,నూపల్కరు గర్వమహిమ ♦ నూ పెద విటులన్. 155

వ॥ ఇప్పు డస్మద్భులపరాక్రమంబులు నూడుమని పల్కినఁ బాపాత్ముం డగు దానవుండుఁ గోపంబు దీపింప నున్నతం బగు శరాసనంబుఁ గొని గొనయం బెక్కించియు క్కసంగ బిడుగులువోలె బెడిదంపు టంపగములు గుహుసైన్యంబులపైఁ బఱపె. 156

క॥ సేనాపతులును వీరులు, నానాభూతములతోడ ♦ నారాచంబుల్
దానవుపై నొక్కుమ్మడి న, మానవ ప్రౌఢిమను గురిసి ♦ రున్నతపటిమన్. 157

క॥ శూరవిముక్తశరంబులు, నారించి తదీయబాణ ♦ వర్షంబు గడున్
ఘోరతరంబుగ దాఁకెను, వీరవ్రాతంబు భూత ♦ వితతిన్ వరుసన్. 158

వ॥ అప్పుడు కొందఱు విదారితసకలాయుధులై పలాయనంబు నొందిరి. కొందఱు మూర్ఛాగతులై పడిరి. 159

ఆ॥ వీరబాహుముఖ్య ♦ వీరులు గొందఱు, ఘోరబాణతతులు ♦ గురిసి రపుడు
రాక్షసాధినాథు ♦ వక్షస్స్థలంబున, దాఁకి యవి యకుంఠి ♦ తంబులయ్యె. 160

క॥ భూరితర బాహుబలుఁడగు, శూరుఁడు కోపమునఁ బరపె ♦ శుంభచ్ఛరముల్
వీరులు మఱియును బరపిన, దారుణశరములను దునిమెఁ ♦ దద్దయుఁ గడిమిన్.

వ॥ ఇట్లు తునిమి మఱియును ననేకశిలీముఖంబులఁ దద్రథంబులును ధనువులును
విదళితంబులు గావించి బాహువక్షోమూర్ధంబులఁ బరశ్శతశిలీముఖంబులఁ బఱపి
మహాభీలంబుగాఁ గోలాహలం బొనర్చుచు నలుగడలం దిరుగుచు వీరవరుల
భంజించె. 162

గీ॥ రక్తధారాప్లుతాంగులై ♦ రణములోన, విగళితాంబరు లగుచు ♦ నవ్వీరులెల్ల
వెఱచి పఱచిరి దెసలకు ♦ వీరబాహుఁ, డదియుఁ గన్గొని బహుకోప♦ముదిర మదిని.

వ॥ ఎదిరించి రాక్షసుని రథంబును, శరాసనంబును, కరవాలంబును ఖండించె. 163

క॥ పరిసరగతుఁ డగు వీరుని, సురవైరి యమర్షమడర ♦ శుంభత్పటిమన్
గరతాడనమున జదిపిన, ధరణిం బడి మూర్ఛఁ గొందెఁ ♦ దద్ద సతంబున్. 164

వ॥ అంత శూరుండు దూతహననంబు శూరులకు యుక్తంబుగా దని యతని పాదం
బులు కేలం గీలించి గగనతలంబున కెగయ నైచిన నతం డాకాశపథంబుననుండి
నిమేషమాత్రంబున విగతమోహుండై గుహాంతికంబు సేరె; నంత, 165

—* కుమారస్వామి శూరపద్మాసురుల యుద్ధము *—

మ॥ ఉరుశౌర్యాఢ్యు సురారివల్లభుఁ డమ♦ర్షోత్కర్షము న్మీరఁగా
గరిమన్ శ్రీంపఁగికింద్రసన్నిభము ను♦గ్రంబైన కోదండమున్
బరఁగ న్బూని మహాభయంకరముగా ♦ భాస్వద్గుణారావముల్
విరచించె న్గగనావనీతలములు ♦ న్వేమారు గంపింపఁగన్. 166

వ॥ అంత గుహుండు మున్ను హరిబ్రహ్మాదిసంహరణసమయంబున బ్రహ్మాండ
పర్యంతప్రవర్ధమానం బగు కైలాస మకుంటు మహోన్నతం బగు నొక్క బాణా
సనంబుం గొని సజ్యంబు గావించి యనంతకోటివజ్రభీలరవంబులుం బోని
మహారావం బడర గుణాస్ఫాలనంబు సేసె. 167

ఆ॥ అంత శూరపద్ముఁ ♦ డంతకాకారుఁడై, కోపవహ్నిశిఖలు ♦ ఘూర్ణిలంగఁ
బ్రళయకాలమేఘ♦పటలంబు విధమున, భయదరవ మొనర్చెఁ ♦ బటుతరముగ.

వ॥ పవనునిం బోలె నత్యంతజవంబులును, నగ్నికరణి నతిదాహకంబులును, నంతకు
పగిది మహాసంహారకంబులును, మేరుప్రముఖవిదారకంబులును, బ్రహ్మాండభేద
కంబులును, క్ష్వేడజ్వాలాభీలంబులును, సకలజగద్వ్యాపకంబులు నగు శరం
బులు కోటి దశకోటి శతకో టనుట్యర్బుదంబులుగా వర్షించిన, దేవగణంబులు
భయభ్రాంతంబులై సత్వరంబుగాఁ జని కరుణావరిష్ఠుం డగు విష్ణువుం జేరి శూర
శరసారవిత్రస్తుల మగు మాకు నిలువ శరణం బెద్ది యని ప్రార్థించిన హరియు
సురలకు నుత్తరం బిచ్చు నంతలోన, 169

క॥ శరజన్ముని శస్త్రావళు, లురుతరగతిఁ దచ్ఛరమ్ము ♦ లొగి ఖండించెన్
సురలవియును గనుఁగొని భాసురముగ హర్షించి రెలమి ♦ సుముఖతఁ దనరన్.

క॥ శూరుండు మఱియు నంబక,వార బులు గుహునిమీఁద ♦ వర్షించెఁ గడున్
ధీరత నతఁ డవియన్నియు, వారక జూర్ణములు సేసె ♦ నరశౌర్యమునన్. 171
వ॥ మఱియు నేనూరుబాణంబులు దానవుండిట్లు నిగుడించిన నతండు తద్బలంబు
లెల్లను సఫలంబులైనను విఫలంబులు గావించి, ద్విసహస్రవిశిఖంబుల నగ్గు
హునిపైఁ బఱపిన, 172
క॥ ద్విసహస్రశిలీముఖముల, నసదృశగతిఁ దచ్ఛరముల ♦ నణఁచి నిశాత
ద్విసహస్రశరంబుల మఱి, యసురపయిం బఱపె గుహుఁడు ♦ దగ్రస్ఫూర్తిన్.
వ॥ నిశాచరేంద్రుండును తోడన ద్విసహస్రమహావిశిఖంబులఁ దదీయనారా
చంబులు ఖండించి, శేషఫణిసమేతంబుగా నశేషభూమండలంబుఁ గ్రక్కదల
సింహనాదం బొనర్చుచు, ననంతకోటిసంఖ్యాకంబు లగు శరానీకంబులు వర్షిం
చిన షణ్ముఖుం డవియన్నియు నడుమన తునిమివైచె; నిట్లయ్యిరువురు బరస్పర
విదారణంబుల దారుణంబుగాఁ బోరిరి. 174
మ॥ అపు డన్యోన్యసహస్రఘట్టనసము ♦ ద్యద్వహ్నికీలంబు ల
భ్రపదం బంటె వియన్నదీముఖసరి ♦ త్పాథోఘములున్ శోషిలన్
విపులస్త్రీముల వారి బాహుబలము ♦ ల్వీక్షించి యవ్వీరల
క్ష్మ పురస్సును వసించె నెవ్వని నహో ♦ చేపట్టు దంచు న్గుహున్. 175
వ॥ అపుడు వారి గాత్రంబులు శరవిద్ధంబులై నేత్రగోచరంబులుగాకుండె; నంత
శూరపద్ముండు మహాసాహసంబున నమ్మహారథికు రథధ్వజంబులు భగ్నంబులు
గావించి సింహనాదంబు లడర శంఖంబులు పూరించుచు మఱియు, 176
క॥ అతిఘోరము లౌ శరములు, దితిసుతపుంగవుండు గురిసె ♦ ధీరత నగజా
సుతుఁడును దన్నారాచ, వ్రాతతులఁ దునుమాడె భుజ ♦ పరాక్రమ మొప్పన్. 177
వ॥ కొండియు గుహుండు నిశితంబు లగు సప్తవిశిఖంబులు సంధించి యద్దానవేంద్రుని
రథకేతనంబుఁ దునిమి సముద్రంబునం బడవైచె; నంత, 178
గీ॥ భూతగణములలోనుండి ♦ భూరిబలుఁడు, భానుకంపాఖ్యుఁ డరుదెంచి ♦ భవుని మహిమ
వేయిముఖముల శంఖము ♦ ల్వేయునొత్తె, భూరిఘోషంబు నిండార ♦ భూనభముల.
వ॥ అమ్మహారావంబు బ్రహ్మాండభిత్తిఁ బ్రతిధ్వను లీనుచు, సర్వనిర్ఘోషంబుల
నాక్రమించుచు ననేకయుగపర్యంతం బెడతెగక మ్రోసె; నప్పుడు హరియు
సంతోషంబునం బొదలుచుఁ బాంచజన్యంబు పూరించె. 180
క॥ అమరగణప్రీతుఁడై, యసురఁగ దహనుండు కుక్కుటాకృతి యగుచున్
గొమరొప్పఁ గొమరుసామికి, సుమహితరథకేతనమునఁ జూపట్టెఁ గడున్. 181
వ॥ ఇట్లనలుండు తామ్రచూడంబై ప్రళయఘనాఘనంబులో లె మహాధ్వనిం జేసె;
నప్పుడు హరిబ్రహ్మాది సకలదివిజగణంబులు సంతుష్టమనస్కు లగుచుఁ గోలా
హలం బొనర్చి; రాసమయంబున, 182

సీ॥ అమ్మహాధ్వనియాలించి♦యతిదురాత్ముఁ, డసురనాథుండుమత్కృషి♦యందునుండి
నిర్జరాఘంబుదనబ్రమోల♦నిలిచియిట్టుల, చటులకోలాహలంబులు ♦ సలుపనగునె?

వ॥ ఇప్పు డీ వేల్పుమూకల రేకణంచి బాలునాలంబున దూలించెదఁగాక యనిబ్రతినఁ
బన్ని రథస్థుండై నభస్స్థలగతుం డగుచు దేవతల నుద్దేశించి కోపంబున
శరవర్షంబు పుంఖీభూతంబుగా వర్షించె; నట్టియెడ, 184

క॥ విశిఖంబులవియుఁ దోడన, విశకలితంబులుగఁ జేసి ♦ వినువీథికి నా
శశిధరసూనుం డరదము, గుశలతతోఁ బూపె దైత్య♦కుంజరుమీఁదన్. 185

వ॥ ఇట్లు నభంబునకుం జని మహామహుండైన గుహుండు దేవతల కభయం బొసంగి
కొండొకదూరంబున వారి నునిచిన వారుం గుతూహలంబునఁ దదనుజ్ఞ నట్ల
యుండిరి. 186

క॥ మోహిలను శూరుఁడు గని గుహుఁ, డిలింపగణంబు వారె ♦ నాశరములకున్
బాలిశుఁడు నిలిచె నెదుటను, హా లెస్సయ్యె న్మదీయ ♦ మగు బల మిచటన్. 187

—* శూరుఁడు కుమారస్వామితో సంయుద్ధ మొనరించుట *—

వ॥ అని చింతించి నిర్గరారి దారుణంబు లగు నారాచంబులు నిగుడించినఁ గుమారుండు
బ్రత్యస్త్రంబుల నవియుం దుమురుసేసె; నిట్లిర్వురు నిరువురు నరదంబుల పవన
జవంబునకుఁ గులాచలచక్రంబుకరణి రాశిచక్రంబుఁబోల్కి బరిభ్రమింపం
జేయుచు నిమేషమాత్రంబునఁ బాతాళంబును, భూనభంబులును, శైలసాగరం
బులును, స్వర్గంబును, బ్రహ్మలోకంబును, చక్రవాళంబును, తపోలోకంబును,
బ్రహ్మాండకటాహాంతంబును, సకలదిశలును దాసి చలంబు బలంబు వాసిం
జేసి యలపుసొలపు లెఱుంగక పోరుఘోరంబుగా సలిపి; రయ్యెడ, 188

క॥ జలధులుఁ గలఁగె న్మేదిని, చలియించెన్ దుముపలయ్యె ♦ శైలములెల్లన్
జలజభవాండకటాహము, దళితం బయ్యెన్ ధరిత్రి ♦ దారలు దుల్లెన్. 189

ఆ॥ శూరపద్ముఁడపుడు♦శూరత మెఱయఁగ, ఘోరశరచయంబుఁ ♦ గురిసెఁ గడిమి.
ప్రళయకాలదహన ♦ బహు కీలలవిధంబు, నడుమగిను బెగడె ♦ నిఖలదిశలు.

వ॥ మఱియుం బలుమారు నస్త్రపాతమ్ముగాను బరశుకులిశముద్గరముసలశక్తితోమరపరి
ఘులాంగలభిండివాలశూలాద్యాయుధంబులఁ బ్రయోగించె; వానినెల్ల గార్తి
కేయుండు వాయుదేవతాకంబు లగు నస్త్రంబుల దుమురుమాడి వాడిగల పదు
నాలుఁగు బాణంబుల రథాశ్వంబులఁ బడమార్చె; నప్పుడు, 191

క॥ దళితరథాశ్వుండై ఘన, బలుఁ డా దానవుఁ డనేక♦బాణవ్రాతం
బుల నిగుడించె గుహునిపై, విలసత్క్రోధానలమున ♦ విపులస్మితుఁడై. 192

మ॥ హరసూనుండు తదస్త్రసంఘములఁ బో♦ద్యత్త్వాధి ఖండించి ని
ష్ఠుర బాణంబులు దైత్యుపైఁ బఱపినన్ ♦ శూరుండు దత్సాయకో

త్కారము ల్వోడనఁ దుంచె సంతస ముదగ్రస్ఫూర్తి షడ్వక్త్రుఁ డా
శరుబాహుద్వయి భాసురాంబకసహస్రం జేసె నుగ్రంబునన్. 193

వ॥ ఇట్లేసిన మహోపలకర్కశంబు లగు నతని బాహులం బడి యయ్యస్త్రంబులు పర్వతంబులం దయిన గురియు వర్షధారలువోలె నిరర్థకంబు లయ్యె; నయ్యెడ,

క॥ శూరుం డనుపమదర్పాద్రి, కారుండై రెండువేల కాండంబులు దో
స్సారప్రౌఢిమఁ జనఁ గు,మారుభుజము లేసి యార్చె మహి కంపింపన్. 195

వ॥ అమ్మహాసాయకంబులు దేవనాయకుపైఁ బడి భస్మీభూతంబు లయ్యె; నట్లగుటం గనుంగొని దానవేంద్రుండు రౌద్రోద్రేకంబునఁ గనలుచు నతని కిరుగడల నురవణించు భూతసేనాధిపవీరగణంబులపై ననంతంబులయిన నిశాతశిలీముఖంబులు త్వరితగతిం బఱపె. 196

క॥ అమితపరాక్రమధుర్యుం, డమరచమూవల్లభుఁడు దదంబకచయముల్
దుమురుగఁ జేసి సహస్రాస్త్రముల నతనివిల్లుఁ దునిమె దారుణభంగిన్. 197

క॥ దనుజవరేణ్యుం డప్పుడు, ధనువొండు రయంబ పూని తా రథముపయిం
జని యాకసమున నెలకొని, సునిశితబాణముల నేసె సుబ్రహ్మణ్యున్. 198

వ॥ అప్పుడు గుహుం డంబరంబునకుఁ దోడనచని యతనితోఁ దలపడియె; నంత శూరుండుఁ గయ్యంబుసేయువాఁడువోలె నందుండి మగుడ మాయావియై దేవసేనా విభు వంచించి నిమిషమాత్రంబున మహీతలంబున కరుదెంచె. 199

క॥ శరజన్ముండును దోడన, ధరణీతలమునకు వచ్చి దానవుతో భా
సురశౌర్యోన్నతిఁ బోరెను, దురితాత్ముం డసురుఁ డంత దుర్దాంతగతిన్. 200

వ॥ పాతాళంబు, బాహ్యాబ్ధియుఁ, జక్రవాళంబును, మేరునగంబును, దిక్పాలనగరంబును, బ్రహ్మవిష్ణులోకంబులును మాయావియై సొరిదిఁ గ్రుమ్మరిన, 201

క॥ అందందు రయమునం జని, యిందుకళాధరతనూజుఁ డెలమిని జయ మిం
పొందఁగ నిశిచరుతోడ న,మందపరాక్రమము సెలఁగ మార్కొనిపోరెన్.

ఆ॥ అండభిత్తిహత్తి యసురుండు మఱియును, విశిఖవృష్టి గురిసె విక్రమించి
యచటి కాక్షణంబ యరుదెంచి శివసూనుఁ, డతని రథముగూల్చె నంబకముల.

వ॥ అంత వేఱొండు రథం బెక్కి శూరపద్ముం డనంతశిలీముఖంబుల బ్రహ్మాండబిలవిధాయకంబులైన శరజన్ముని శరవిసరంబులఁ దునుమాడి, పూర్వంబట్ల మార్గం బొసంగ నజాండాంతరంబులనుండి దనుజవ్రజంబులు మొత్తంబుగా గంతులేయుచు నరుదేరఁ జూచి బ్రహ్మాదిదేవత లాత్మగతంబున, 204

క॥ హాలాహలపుంజంబో, కోలాహల మడరవచ్చు కులిశవ్రజమో
కాలాగ్నిధూమతతియో, యాలోకింపఁగ నిదేమి యద్భుతమొక్కో? 205

వ॥ వెండియు బ్రహ్మాండకటాహబహిర్జలప్రవాహంబులో యని మనంబున విత

ర్కొంచి భయభ్రాంతులై హరిబ్రహ్మాదినిఖిలసురలు దిగంతంబులకుం బరచు
నంతలోన నద్దైత్యభటులు పరాక్రమోద్భటు లగుచు నత్తారకారిం జుట్టుకొని
కట్టలుకం బెట్టిదంబు లగు శరంబులు గురిసిన, 206

క॥ మందస్మిత మొనయంగ సుర,బృందాధీశుండు గుహుండు ♦ భీషణకటిమన్
బృందారకపరిపంథుల,నందఱం గోపాగ్నిశిఖల ♦ కాహుతి నొసంగెన్. 207

వ॥ ఇట్లు పల్మరు నరుగుదెంచు నిశాచరబలంబులం గోపవీతిహోత్రాగ్నిశిఖల దహించి
యుం, జలం బుడుగక మఱియు గుహుండు చక్రదండముసలపరశుకరవాలంబులం
గొని సకలాజాండంబులం గల మహాబలు లగు దైత్యుల మదాజ్ఞ వధింపు మని
యప్పంచాయుధంబులం బఱపిన నవియు ననంతకోటిమార్తాండవిరాజమానంబు
లు మహోగ్రాపఘోరంబులు నగుచు నజాండంబులు సొచ్చి యచ్చోటనుండు
రాక్షసతతుల హతంబుం గావించె; నట్లగుటం గని శూరుండు మనంబునం గన
లుచు సర్వసంహారకంబును, సకలచక్రాధిదైవతంబు నగు చక్రంబు నిర్వక్ర
పరాక్రమధౌరేయుం డగు నబ్బాహులేయుపైం బఱపిన, 208

క॥ శరసంభవుం డాచక్రముం, బరగం గైసాచి కొనియెం ♦ బ్రత్యస్త్రాగో
చర మగుటం గని దనుజే,శ్వరుడుం బరితాప మంది ♦ వారని కినుకన్. 209

వ॥ మాయావి యగుచు ననేకరూపంబులు ధరించి యస్సురాత్ముండు వహ్నిసంభ
వుతోం బవరంబుసేయ సమకట్టిన, 210

—* కుమారస్వామి శూరుని మాయను హరించుట *—

క॥ నానారూపయుతుం డగు, వానిం గని నగుచు దివిజ♦వర్యుండు వేగన్
జ్ఞానాస్త్రంబు నిగుడ్చినం, దానన్ గతమాయుం డగుచు ♦ దానవుం డలుకన్.

వ॥ ఒక్కరుండ నిలిచె; నంత హరిబ్రహ్మాదిసకలనిలింపులు హర్షోత్కర్షంబునం బుష్ప
వర్షంబులుం గురియుచు గలకలధ్వనులం జెలంగి; రయ్యెడ, 212

క॥ శూరుం డజాండ మవ్వలం, జేరి రణోద్యోగి యగుచుం ♦ జేరెను గుహునిన్
ధీరుండు సేనానియు దో,స్సారత రాక్షసు నెదిర్చి ♦ శౌర్యం బెసంగన్. 213

వ॥ ఇట్లు గుహుండు నజాండాంతరంబునకుం జని దానవేంద్రునితోం బోరు ఘోరం
బుగా సలిపె; మఱియు నందుండి వేఱొండు బ్రహ్మాండంబునందు నమ్మహాభుజ
లిరువురు ననన్యాదృశం బగు జన్యం బన్యోన్యం బొనరించిరి. 214

క॥ ఈరీతి నబ్జజాండము, లారూఢిగం జొచ్చి కడిమి ♦ నయ్యిరువు రొగిన్
బోరంగ నది గని భయమున, వారిజగర్భాదివిబుధ♦వర్గం బెల్లన్. 215

వ॥ హరిం గని యిట్లనిరి. 216

క॥ గరుడధ్వజ! శూరుం డిత, డరయంగ మాయావి దుష్టుం ♦ డతివంచకుండై
సురవిభు సుబ్రహ్మణ్యుం, దురమునకుం బిలిచెం జెలుచ ♦ దోర్గర్వమునన్. 217

వ॥ తద్వచనంబులు విని దేవదేవుం డైన గుహుండు నజాండాంతరంబునకుం జనియె; నందుఁ బాపకర్ముండు నతివంచకుండు నగు నద్దైత్యుని గన్గొనియెనో లేదో కని దురం బొనర్చునెడ జయం బెద్దెసం గల్గునో యెఱుంగము; మనంబున సందియంబు మహాభయంబు నయ్యెడు; నని పల్కిన, 218

క॥ వారివచనములు విని మధు, వైరియుఁ దలపోసి గుహుని ♦ వైభవమహిమన్
భూరి కుతూహలయుతుఁడై, సారసుధాఫణితిఁ బల్కె ♦ సవభు క్తితోన్. 219

క॥ సురలార! వినుఁడు సాక్షా,త్పరశివుఁ డామణ్ముఖుండు ♦ తద్వ్యం బరయన్
శరవిద్యాకౌశలమునఁ, బరగు మహాబలుఁ డతండు ♦ ప్రౌఢిఁ దలిర్పన్. 220

ఆ॥ దేవవిభుని మహిమఁ ♦ దెలిసియుండిన మీకు, సందియం బిదేల ♦ డెందమందు?
నిఖిలపద్మజాండ♦నివహముల్ గ్రుమ్మరి, వచ్చు సత్వరముగ ♦ వగవ నేల? 221

వ॥ అని యి ట్లారడిలం బల్కిన హరివచనంబులు విని సురలు ముదంబునం బొదలి; రంత శూరపద్ముండు సకలాజాండంబుల మహాఘోరంబుగా సంగరం బొనర్చి మగిడి నిజపురంబు సమీపంబునకుం జేరి కార్తికేయుఁ గయ్యంబునకుఁ బిలిచిన,

క॥ వీరమహేంద్రపురంబును, జేరి గుహుం డంత దనుజ♦సింహునితోడన్
బోరికిఁ దలఁపడె నప్పుడు, దారభుజావిస్ఫురత్ప్ర♦తాపప్రౌఢిన్. 223

వ॥ ఇట్లు తలపడినం గనుంగొని దానవసైనికులు రోషావేశంబున బాణవర్షంబులు గురియుచు గుహునిం జుట్టుకొనిన, 224

క॥ మందస్మితముఖుఁడై గుహుఁ, డందఱ దెగటార్చె నాజి ♦ నాక్షణమందున్
నందకధరముఖ్యామర,బృందం బవ్వేళఁ గురిసె ♦ విరుల ముదమునన్. 225

వ॥ అంత శూరుండు హతులైన నిజసైనికులను సైన్యంబులతోడ సమీపగతుం డగు షణ్ముఖుం గని శోకాకులుం డగుచు నేమిసేయం గలవాఁడ నని కొంత తడవుఁ జింతించి, 226

క॥ తన జనయిత్రి న్మాయను, ననవధికతపోగరిష్ఠ ♦ నాక్షణమందున్
మనమునఁ దలంప నదియున్, దనయునికడ కరుగుదెంచెఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 227

వ॥ ఇ ట్లరుదెంచిన తల్లిం గని కూర్మికొమరుం డగు శూరుండు పదంబుల కెఱఁగి హతులగు నిద్దనుజుల మఱల బ్రదికించు మని ప్రార్థించిన నమ్మాయ తనూజాతున కిట్లనియె. 228

గీ॥ కార్తికేయుండు దలఁప సాక్షాన్మహేశుఁ, డతని నిందింపవచ్చునే♦యదియటుండ
నస్మదుక్తులు విన కింత ♦ యతనితోడఁ, గయ్యమునకుఁ దొడంగితి ♦ గర్వనిష్ఠ. 229

వ॥ అది గావున న న్నితండు శక్త్యాయుధంబున సంహరింపఁగలఁ; డది యట్లుండ నిమ్ము; హతులైన దైత్యుల బ్రదికింపవలయునేని సముద్రంబులో సుధామయం బగు మందరాచలంబు గలదు; దానిం గొని తెచ్చినఁ దద్వాయుసంస్పర్శనం

బున నిమేషమాత్రంబున మృతులెల్ల సజీవితు లగుదు; రని చెప్పి యమ్మాయ చనియె. 230

క॥ శూరుఁడు తద్వచనము విని, భూరి కుతూహలము దనరఁ ♦ బ్రోన్నత మగు కం ఠీరవవాహన మెక్కి యు,దారత సురలోకరక్షమునఁ ♦ దాఁ గని పల్కెన్. 231

—* శూరపద్ముఁడు పచ్చిపరామయులకుండల ప్రదిపించుకొనుట *—

వ॥ నీవు సత్వరంబుగా సాగరంబునకుం జని సుధామందరనగంబుం గొని తెమ్మనవుం డదియు నట్ల చని యప్పర్వతంబు శీఘ్రంబుఁ దెచ్చిన నయ్యవసరంబున శూరపద్ము పుత్త్రు లగు భానుకోపప్రముఖులును దత్సోదరులు సింహవక్త్రాదులును మఱి యుం దక్కిన రక్కసులును దత్పవనంబు సోకినమాత్రంబున నిద్రమేల్కొను నట్లు లేచి, యిదేమి యుద్ధస్థలంబునవెలె నున్న దని పల్కుచు, ఘోరంబుగాఁ గోలాహలంబు లొనర్చుచు, 232

క॥ పరిసరపతితాయుధములఁ, గరముల సంధించి వేగ ♦ గయ్యంబునకుం దొలఁకొను నాత్మీయులఁ గని, పరమానందమున శూర ♦ పద్ముం డుండెన్. 233

వ॥ అంత నింద్రలోకరథంబుఁ గనుంగొని బహూకరించి నిఖిలదివిజుల నిందించిన నదియు దూరంబునం గని మహాభయాన్వితులై యింక వీరి బాధ తప్ప దని యిదియె మనకుఁ బదప్రాప్తి యని పల్కి తమతమ యాయుధంబులు విడిచి నిజపదంబులపై నిరాశులై కొందఱు చక్రవాకరూపంబులుఁ, గొందఱు మయూరాకృతులుఁ, గొందఱు హంసపారావతశుకపికాద్యాకృతులు ధరించి దిగంతంబులకుం బఱచి; రాసమయంబున వీరులు భూతసేనలు సేనాధిపతులు నడలుచు; నత్యంతచింతాసాగరంబున బిట్టు మునింగిరి. 234

చ॥ అది యఖిలంబు జూచి దర♦హాసవిభాసురవక్త్రపద్ముఁడై
సదయుఁడు గార్తికేయుఁ డురు♦శౌర్యధురీణుఁడు నిల్చె నచ్చటం
బదపడి శూరు నాజ్ఞ బహు♦పాపులు సింహముఖాది శూరులుం
గదిసిరి మన్మథుని శలభ♦కొండము చిచ్చునుబోలె నుద్ధతిన్. 235

వ॥ ఇట్లు కవిసి యసురాత్ములు నిశాతవిశిఖంబులు గుహుపైఁ గురిసిరి. 236

గీ॥ వారియాటోపములుగాంచి♦వీరులెల్ల, భయమునొందిరిగుహుఁడంతఁ♦బాశుపతము విమతగర్వాపహరమును ♦ వేగఁదొడిగి, పఱపెరణభూమి దానవ♦ప్రతతిమీఁద.

వ॥ అదియు నుదీర్ణసర్పంబు నుత్పాదితకులిశంబు నుద్భూతవిషంబు నుదయదనంత రుద్రవినిద్రితంబు నుజ్జృంభితదివ్యాస్త్రంబు నుచ్చావచజలధికల్లోలజాలంబు నుద్ధూతప్రళయకాలానలకీలంబు నగుచు నరుదెంచి తదస్త్రంబుల నిమిషమా త్రంబునం దునుమాడి యప్పర్వతంబును జూర్ణంబుజేసి దానవుల నెల్ల నొక్క పెట్ట నిర్మూలనంబు గావించి మఱలి నిలింపసేనాధిపతిపాణితలంబునొందె; నా సమయంబున, 238

క॥ శూరుం డొక్కడ నిలిచె మ,హారణమండలమునందు ♦ నది గని దివిజుల్
శారికమలాసనులతో, భూరితమం బగు ముదంబుఁ ♦ బొందిరి మదిలోన్. 239

వ॥ అంత శూరుం డుత్కటకోపాటోపంబునఁ గనలుచు వికటభ్రూకుటికుటిలేక్షణుండై యింద్రలోకరథంబుం గని వీరులను సకలభూతంబులను సేనాధిపతులం గని చని యాడగోళంబున నిలిపి కాచికొని యుండు మని యానతిచ్చిన, నదియు నతిజవంబున వారినందఱ మోహాక్రాంతులం జేసికొని పోయి యచ్చట నుంచి కాచుకొని యుండె; నంత, 240

ఆ॥ శూరపద్ముఁ డపుడు సు♦ప్రీతుఁ డయ్యెను, వేల్పులెల్ల దుఃఖ♦వివశులైరి
సదయహృదయుఁ డద్రి♦జాతనూభవుఁ డాత్మ, సకలమదియు నెఱిఁగి♦సత్వరముగ.

వ॥ అనేకంబు లగు మహాస్త్రంబులఁ బ్రయోగించిన నవి యతిరయంబునఁ జని తదర్థస్థు లగు వారి మేల్కొల్పి యరదంబుతోడ నగ్రుహాంతికంబునకుం గొనితెచ్చె నిమేషమాత్రంబున, 242

ఆ॥ అంత రథము డిగ్గి ♦ యవ్వీరపుంగవుల్, సైన్యవరులు భూత♦సంతతియును
కార్తికేయుచరణ♦కంజంబులకు మ్రొక్కి, ప్రణుతిఁ జేసి రెలమి♦భక్తిఁ దనర.

వ॥ అయ్యవసరంబునఁ బరమాత్ముం డగు నప్పార్వతేయుం డారథంబుం గని నీవు దురాత్మకుం డగు దానవునిచెంత కరుగవలదు; ఇందె వసింపు మని పల్కిన యింద్రలోకరథంబు సంస్తంభించె; నంత, 244

క॥ శూరుం డది కని కనలుచు, నారాచంబులను గురిసె ♦ నగజాసుతుపై
ధిరత గుహుఁ డవ్వాని వి,దారించె శరాళిఁ గురియుఁ ♦ దద్దయుఁ గురిసెన్. 245

క॥ దానవుఁడు గుహుని శస్త్రవి,తానము దళితముగఁ జేసి ♦ తత్సారథి నం
తేని శితాశుగవితతుల, నో నాటఁగ నేసెఁ గడు న♦నూనప్రౌఢిన్. 246

వ॥ తదీయాస్త్రఘాతంబులఁ బవనుండు రక్తసిక్తాంగుం డగుచు రథచోదనంబునందు నశక్తుండై మొల్లంబుఁదక్కి నొల్లంబోయె; నయ్యెడ, 247

క॥ కని యదియుఁ గార్తికేయుఁడు, దనుజుని గార్ముకముఁ దునిమె ♦ దారుణశరశస్త్రనికాయంబుల నంతట, ననుపమశౌర్యుండు శూరుఁ ♦ డతిరోషమునన్. 248

ఆ॥ సింహవాహనంబు ♦ శీఘ్రంబ డిగి శూల, ముఖలరిపువిఘాల ♦ మలరఁ బూని
ఘోరతరముగాఁగ♦గోలాహలముఁ జేసి,కొనుచు నరుగుదెంచె ♦ గుహ[illegible]విరాఁద.

వ॥ అప్పుడు తదీయం బగు సింహవాహనంబు గర్జింపుచు షణ్ముఖరథాశ్వంబుల ఘాతంబు గావించె? దానవుండును శూలంబుఁ గుమారుపైఁ బ్రయోగింప నదియు ఘోరానలజ్వాలమాలికలు నతికరాళహాలాహలజాలంబులు నతిభయదభూతజాలంబులు ననేకాయుధవ్రాతంబులును సృజింపుచు మహావేగంబునఁ జను దెంచు సమయంబున, 250

ఆ॥ గుహుండు దానిమీఁద ♦ ఘోరసాయకకోటిఁ, గురిసె నదియు వాని ♦ సరకుఁగొనక
వచ్చుచుండ మఱియు ♦ వారక కులిశంబుఁ, బఱపె శివసుతుండు ♦ బాహుపటిమ.

వ॥ అక్కులిశంబు తదీయశూలంబును గరాళంబగు నిజముఖంబునం గీలించి గుహుపాదతలంబుఁ జేరె; నప్పుడు సుపర్వులు సంతుష్టాంతరంగు లగుచు, 252

క॥ శరజన్మ! కృపాంభోనిధి!, దురితాత్ముని దైత్యు నతని ♦ దునుమాడి రణో
ర్వర! మము రక్షింపవె సత్వరముగ నని పొగడిరి ధీర♦తనయుఁ భర్గున్. 253

వ॥ అయ్యవసరంబునఁ గుహుండు ద్విసహస్రంబు లగు ఘోరనారాచంబులు దానవుని వాహనంబులపైఁ బ్రయోగించిన నవియును గతప్రాణంబులై నేలంగూలె; నసురుండు సాహాయ్యవిహీనుం డయ్యును బొలివోని ధైర్యంబునఁ జలంబు నూలొక్కల్పుచు భూతలంబున నిలిచి యత్యద్భుతంబును, ఘోరతరంబును, నత్యున్నతంబును నగు రథాంగనామకవిహంగరూపంబుఁ గైకొని నభంబున నెగసి,

క॥ ఆతతపక్షతరవశతఁ, బాతంబుల సకలభూత♦గిరివనముల నీర
వారితముల నెల్ల మోహా,వృతులఁ గావించెఁ జటుల♦విభ్రమమునఁగన్. 255

వ॥ మఱియు దండప్రహారంబులఁ గొందఱఁ జరణాఘాతంబులఁ గొందఱ విగతజీవులం గావించుచు నవనితలంబునం భ్రమించుచు నబ్బాహులేయుసారథిరథరథ్యంబులం జంచుఘాతంబులఁ గొట్టి చిదిమిఁ బరిమార్చి శరాయుధంబుల భంజించి విహరింపుచుండె. 256

క॥ ఇది దైత్యుని చేష్టిత మని, మది నెంచి గుహుండు ఘనవే♦గాక్రాంతోగ్రల్
గదియించిన తూపుల ద,ద్రూపదరవాజితముల నణఁచెఁ ♦ బహుహేతుల్. 257

—* కుమారస్వామి శూరపద్మాసురుని సంహరించుట *—

వ॥ వెండియుఁ దుండంబున ఖండించియు పాదంబుల విదారించియు మహాజవంబున సరిత్సాగరశైలంబులను జక్రవాళాచలంబులను భూనభంబులను బాతాళంబును దాయుచుఁ జెలంగుచు మెలంగుచు నిఖిలభూతగణంబుల వీరులఁ గబళించి మగుడఁ బక్షవిక్షేపణంబుల దిగంతంబులు చలింప నిలింపసేనానిరథపరిభాగంబున మహారవంబున నెంతయు బరిభ్రమించు, 258

క॥ విహగేంద్రంబును గని, గుహుఁ డద్భుత మంది యుఁక శ♦త్రునితో రణమున్
విహితముఁ గాదని యమ్మెయి, మహిపై దేరు డిగి నిలిచె ♦ మానుగ నెరటన్.

వ॥ ఇంద్రు నవలోకించిన నతండు నయ్యీశ్వరేశ్వరుననుజ్ఞ వడసి యత్యద్భుతరూపంబుగా మయూరరూపంబు ధరించి నిజస్వామికిఁ బ్రణమిల్లి వినయంబున నిట్లనియె. 260

క॥ వేగమ దేవా! మదుపరి,భాగంబున నిల్చి దైత్య♦పరివృఢుతోడన్
బ్రాగల్భ్య మడరఁ బోరుము, నా గుహుఁ డంగీకరించె ♦ నగుచు న్వేడ్కన్. 261

వ॥ అమ్మయూరం బధిరోహించి కోపంబునఁ గడుర నవక్రియరాక్రమోద్రేకంబగు చక్రవాళంబుపైఁ బఱపిన, 262

మ॥ పటురోషోద్ధతిఁ జక్రవాళము మహా♦పర్వతాళి ద్రవ్వ త్తి ద
క్కటము ల్గపము నొంద సిష్ఠురసము♦ద్యచ్చంచుఘాతంబులన్
జటులప్రౌఢిమఁ బాదఘట్టనల భా♦స్వల్లీలఁ బక్కాడ ను
ద్భటత న్మాని మయూరము న్వెఱచి సం♦తాపంబుఁ బొందె న్మదిన్. 263

వ॥ అదియుం గని గాంగేయుండు క్రోధాంతరంగుండై యారధాంగంబు శిరోవక్షోంఘ్రిప్రదేశంబుల బహునిశితశిలీముఖంబులఁ బఱపినఁ దద్బాణఘాతంబులం బడలి యొడల రుధిరపూరంబుఁ దొఱఁగఁ బక్షంబుల విదర్చుచు నెగసి సకలలోకంబులు భయంపడ సంచరించె. 264

ఉ॥ తారకవైరి యత్తరి ను♦దగ్రత నచ్చట నున్న సచ్ఛటన్
సారెకుఁ బక్షిపై నిశిత♦సాయకము ల్గురిసెన్ యుగాంతవి
స్ఫారఘనాఘనంబుక్రియఁ ♦ జయ్యన నంత ఖగంబు షణ్ముఖుం
జేరి ధనుర్విభంజనము ♦ సేయఁ గడంగి మహాజవంబునన్. 265

వ॥ ఇట్లు సవిధగతంబైన దానిం గని మహామహుండైన గుహుండు మండలాగ్రంబున రెండుఖండంబులు గావించి మహీతలంబునం గెడపిన, 266

ఆ॥ మగుడి యద్దురాత్ముఁ ♦ డాగి లేచి బ్రహ్మాండ,భిత్తి నంటఁ బెరిగె ♦ భీషణముగ
నరుణచంద్రపథము ♦ లనిలపథంబును, నత్తిగించె రోష ♦ మతిశయిల్ల. 267

వ॥ అప్పు డబ్బయంకరాకారంబు గనుంగొని శరజన్ముండు భర్త్సింపుచు నతనిపై నిశిత విశిఖంబు లేసు బఱపిన నవియు మహాసముద్రరూపంబు లగుచు భూమండలంబు నిండి తద్భీషణాకారంబు నణంచె. 268

ఆ॥ అంత నసురుఁ డలిగి ♦ యంబుధిరూపమై,ఘనతరంగములను ♦ గదిసె గుహుని
దానిమీఁద నతఁడు ♦ దావానలాంబక,శతముఁ బఱపఁ బీల్చె ♦ జలధిఁ బెలుచ.

వ॥ అప్పు డన్నిశాచరుండు వహ్నిరూపంబై వహ్నిసంభవు నెదిర్చిన నమ్మహానుభావుండు సహస్రవిశిఖంబులుం బ్రయోగించె; నవియుఁ బ్రచండవాయురూపంబై తద్వహ్నిం జల్లార్చె; నంత, 270

క॥ తారక దైత్యుఁడు ఘోరస,మీరాకృతిఁ బూని రా ♦ మీఁదికి గుహుఁడున్
నారాచంబుల లక్షను, దారప్రౌఢిమను బఱచెఁ ♦ దత్క్షణ మవియున్. 271

వ॥ మహాఘోరసర్పరూపంబులై వానిం గ్రసించె; నిట్లు తద్బాణంబులన్నియు దానవుతత్తద్రూపంబులన్నియు హరించి మఱలం గార్తికేయునిం జెందె; నివ్విధంబున నద్దేవదానవులకు నాల్గుదినంబులు పోరు ఘోరంబుగాఁ జెల్లె; నంత శూరుండు మాయారూపంబున, 272

సీ॥ మూర్తిత్రయాకృతి ♦ వర్తించు నొక్కెడ, నొక్కెడ దనుజుండై ♦ యుక్కుమీఱు
నిందాది రూపంబు ♦ లింపొందు నొకచోట, నొకచోట భూతమై ♦ యుండుమిగుల
పైశాచరూపమై ♦ భాసిల్లు నొకచాయ, నొకచాయ ఘోరసా ♦ వకుఁడు నగుచు
నంతకాకారమై ♦ యలరారు నొకకేల, నొకకేలఁ బవనమై ♦ యుద్భవిల్లు
నుదధిరూపంబు గనుపట్టు ♦ నొక్కపట్టు, మేఘరూపంబునగుచును ♦ మెఱయుఁజాల
నొక్కకడభూధరంబగు ♦ నొప్పమీఱు, శూరుఁడావహమునమహా ♦ శూరుఁడగుచు.

వ॥ వెండి దిగంతదంతావళరూపంబులును శరభసింహశార్దూలమృగవిహంగరూపం
ములును సింహాస్యతారకభానుకోపాగ్నిముఖాదిరూపంబులును మంత్రిసేనాపతి
రూపంబులును ధరించియు నొక్కొక్కచోట నిజరూపంబులు దాల్చియు నొక
ప్రదేశంబున నుండి వేఱొక్కదిక్కునం గనుపడుచు నద్భుతప్రాయ మహారావం
బున లోకంబుల శోకంబు నొందఁజేయుచున్న యెడ నఖిలబృందారకులు గాంది
శీకులైరి. 274

క॥ సకలం బదియుఁ గనుంగొని, సకలేశుం డైన గుహుఁడు ♦ సంస్మితుఁడై సా
యకములు సహస్రకోటులు, బ్రకటితముగ దైత్యుమీఁద ♦ బఱపె నడిమిగా.

వ॥ తచ్ఛరంబులన్నియు నసురాత్ము నొక్కొకరూపంబునకు సప్తగుణితంబులై
వేర్వేరం బొరిగొని మగుడి గుహునిఁజేరె; నంత శూరుం డొక్కరుం డవశిష్టుండై
యుండవుచోట నిలిచె. 276

—* కుమారస్వామి విశ్వరూప సందర్శనము *—

క॥ పరమదయాంబుధి గుహుఁడా, దురితాత్ముని దైత్యుఁ జూచి ♦ దోషాచర! భా
సురముగ నీరూపంబుల్, బరికించితిఁ జూడు మిఁక ♦ నారూపంబున్. 277

వ॥ అని పలికి విబుధాగ్రగణ్యుం డగు సుబ్రహ్మణ్యుం డవాఙ్మనసగోచరంబైన
విశ్వరూపంబు సూపె. 278

సీ॥ అంఘ్రితలంబున ♦ నవనీధరంబులు, పాదాగ్రములేఖను ♦ ప్రపదములును
చరణాంగుళుల నుమ ♦ లవరుణాదైత్యార్కచంద్రులు ననంతర్బహి ♦ ర్గుల్ఫములను
జంఘల మౌనులు ♦ జానుల సురముని, యూరుద్విజయాతులు ♦ నెలమిఁదొడలఁ
గటిబంధములయందుఁ ♦ గాలంబు యముఁడును, కటిసీమవసువులు ♦ గరిమఁదనరఁ
బార్శ్వములను సురలు ♦ ఘనులుగుహ్యంబున, శేషమునను సుధయుఁ ♦ జెలువెసంగ
జగదుదయము నాభి ♦ శాస్త్రంబులుర మునుం, బ్రహ్మమాధవులును ♦ బాహువులను.

వ॥ మఱియు యజ్ఞోపవీతంబున జ్ఞానంబు, కరంబున భోగంబు, రోమకూపంబున
నజాండంబులు, నంగుళుల నప్సరలు, కంఠదేశంబున శబ్దంబులు, వక్త్రంబున
దేవతలు, దంతంబుల నక్షత్రంబులు, జిహ్వయందు శివాగమంబులు, నోష్ఠదేశం
బున సప్తకోటిమహామంత్రంబులు, నాశికను వాయువు, నేత్రంబుల నిందు

భాస్కరులు, శ్రోత్రంబుల దిశలు, లలాటంబునఁ బ్రణవంబు, శిరంబునఁ బరమాత్మ యగు సాంబశివుండు గలిగి యనేకాదిత్యసంకాశతేజోవిరాజమానంబై యెవ్వరికిం జూడ నలవిగాని యత్యద్భుతం బగు విశ్వరూపంబు చూపిన, 280

క॥ శరజన్ముఁ డావిశ్వరూపము, బరికించి సుపర్వులెల్ల ♦ భయపడి యెంతే
శిరముల నంజలిపుటములు, విరచింపుచుఁ జేసి రెలమి ♦ వినుతులు భక్తిన్. 281

వ॥ అప్పుడు పరమపావనుండగు కృపాళుండు నగు షడాననుండును వారలం గని భయంబు వలదని యాదరించె; నంత ఘోరపద్ముండు తద్విశ్వరూపంబు విలోకించి తనభాగ్యవశంబున లబ్ధజ్ఞానుం డగుచు నాత్మగతంబున, 282

క॥ ఘోర మగు దురిత మొనర్చియు, దారపౌత్రిఘ్నుఁ సమస్త ♦ దనుజులఁ గూల్చెన్
ధారుణి నీతని మహిమం, బారూఢిగ సంస్తుతింప ♦ నాశ్చర్య మగున్. 283

వ॥ అదియునుం గాక మున్ను బ్రహ్మాదిలోకరథం బితనికి వశ్యం బయ్యె; నామాయ యీతనిమోహిల వ్యక్తిం జనియె; మఱియు ననంతకోటిబ్రహ్మాండకృతనివాసంబు నఖిలసురాసురమానవసహితంబు ననన్యసామాన్యంబు నగు రూపంబు చూపె; నింతకుమున్న కాదె మాతయు సింహాముఖుండును బహువిధంబుల నితని మహామహిమంబు సెప్పిన వినక మూఢబుద్ధిం జేసి యజ్ఞుండనై యిమ్మహామహుని బాలిశుం డని తలంచితి; నితని పాదరోమంబుల సకలబ్రహ్మాండంబులు గనుపడుచున్నయవి; ఇతండు పరమాత్మ యగు సాంబపరశివుండు; సకలచరాచరాత్మకంబైన యితనివిశ్వరూపం బాపాదమస్తకంబును నేత్రోత్సవంబుగా నవలోకించితి; మఱియు నిమ్మహాత్ముని ననవధికసౌందర్యంబు గనుంగొనుటకు బుద్ధియొకటి యుఱుకుచున్నయది; పురాకృతం బగు మత్తపఃఫలంబునం జేసి నాయందుఁ గృపాళుండై యిమ్మహానుభావుండు యుద్ధంబున కరుదెంచె; సర్వాంతర్యామి యగు నిప్పరమాత్మునకుఁ బ్రదక్షిణనమస్కారస్తోత్రంబు లర్పించుటకు నామనంబు రంజిల్లుచున్నయది; మఱియు నమేయశ్రేయఃప్రాప్తిసూచకంబు లగుచు మదీయంబు లగు దక్షిణనేత్రభుజంబులు స్ఫురించుచున్నవి; సకలసంసారార్థంబుగా నితండు చనుదెంచి నన్నుఁ గృతార్థుం జేసె. 284

క॥ అరుదెంచె నన్నుఁ బురమున, హరియింపఁగ నిమ్మహాత్ముఁ ♦ డదిభార మొకో
ధరణిని లీలామాత్రం, బరయఁగ నీదేవవిభున ♦ కఖిలాత్మునకున్. 285

క॥ దేవప్రతతికి బహుమునుఁ, గావించుటవలనఁ గాదె ♦ కలిగెను నాకీ
దేవవరేణ్యుని పదరాజీవద్వయదర్శనంబు ♦ శ్రేయం బలరన్. 286

ఆ॥ కొండ అల్లుఁ డగుచుఁ ♦ గూడ దనరి మున్ను, దివిజబంధనంబు ♦ దీన కాదె
యిప్పు డితనితోడ ♦ నే యుద్ధ మొనరించి, పొందఁగంటి జగతి ♦ భూరికీర్తి. 287

వ॥ అని యివ్విధంబున దానవేంద్రుండు వితర్కింపుచుండ నాసమయంబున సుబ్ర
హ్మణ్యుండు వాని జ్ఞానంబుతోడఁ గూడ విశ్వరూప ముపసంహరించి ప్రాచీనం
బగు నిజరూపంబుఁ గ్రహించెఁ; నంత, 288

క॥ జ్ఞానవిహీనుం డగుచున్, దానవుఁ డతికోప మడర • దారుణగతి నెం
తేని హసింపుచుఁ గరములు, మానుగఁ దట్టుచును శౌర్య•మహిమ సెలంగన్.

వ॥ నాతోఁ గయ్యంబునకుఁ దొడంగ నెవ్వండు సమర్థుం డగు నని పరుషంబులుఁ
బలుకుచు ననన్యాదృశం బగు మాయారూపంబు గ్రహించి నిమిషమాత్రంబు
లోననఁ జేరకు లగు సుపర్వులం గబళించి బాలకు వధించెద నని మనంబునం
దలఁచి దురాత్ముం డగు నయ్యసురుండు విధిచోదితుండై, 290

మ॥ జగమెల్లన్ దిమిరంబు నిండఁగ సమ•గ్రస్ఫూర్తి నత్యద్భుతం
బుగ నేకాంఘ్రు లనేకపాణివదనం•బు ల్భాసిలన్ మాయికం
బగు రూపంబు ధరించి యంబరమునం • దా దైత్యవర్యుండు దే
వగణంబున్ వెస మ్రింగ హస్తములు శ•శ్వత్ప్రౌఢి సాచె న్గడున్. 291

వ॥ ఆసమయంబున సకలదేవతలు భీతచేతస్కులై భక్తశరణ్యుం డగు సుబ్రహ్మ
ణ్యుని శరణుం బొందుచు దేవా! దయాసముద్రుండవు భక్తాభయప్రదుండవు
నీవు దనుజభయాకులచిత్తుల మగు మమ్ము రక్షించి మహాఘోరుం డగు నిద్దు
రాత్ముఁ దెగటార్పు మని ప్రలాపించుచు నెల్లెడలం బరచిరి; మయూరాకృతి
యగు నింద్రుండును శౌర్యధైర్యధౌరేయుం డగు నబ్బాహులేయు నట్లనం
బ్రార్థించెఁ; నయ్యవసరంబున, 292

క॥ సురగణములవచనంబులు, శరజన్ముం డాలకించి • సంపూర్ణకృపా
భరితాత్ముఁ డగుచు శాత్రవ,హరణోగ్రంబైన శక్తి • నాక్షణమందున్. 293

వ॥ అద్దానవుని రెండుతునియలు గావించి రమ్మని పంపిన నదియు నాదిత్యకోటిసమ
ప్రభాభాసమానంబై యగ్నికణంబులు గురియుచు మాయారూపం బగు
తిమిరం బణంచి శూరపద్మపై మందమందగతి నేతెంచు నప్పు డతండు, 294

గీ॥ నాశరహితుండ నైన నట్టి • నన్ను శక్తి, యేమి చేయంగఁ గల దని • యే పెనంగ
నట్టహాసం బొనర్చుచు • నలిగిమిగుల,నుగ్రుఁడగుచు దురాగ్రహ•ముదవనలేఁడు.

వ॥ సకలోకంబులు సంహరించి నిమిషమాత్రంబున నర్భకుం దెగటార్చెద నని
తలంచి సత్వరంబుగాఁ జని సముద్రమధ్యంబు నొంది, 296

సీ॥ చటులానలజ్వాల•జ్వాలాప్రవాళంబు, బహుళధూమచ్ఛటా•భాసురంబు
కమనీయకాంచన•ఘనపుష్పభరితంబు, శ్యామరక్తశలాటు•సంయుతంబు
పద్మరాగోపల•భవ్యపలాశంబు, మేఘశాఖావళీ•మేదురంబు
పద్మజాండకటాహ•పర్యంతగతమూల, మురుతరచ్ఛాయ మ•భ్యున్నతంబు

లక్షయోజనదూరసం♦లక్ష్యమాన, మగుచు దిక్పాలపురముల ♦ నాక్రమించి
బ్రహ్మవిష్ణ్వాదిలోకము ♦ ల్బయపడంగఁ, జాతభూజాకృతి ధరించె ♦ సురవిరోధి.

వ॥ అప్పుడు తదీయస్కంధంబుల ఘర్షితంబు లగుచు మాతృకన్యాలోకనంబులు భయాకులంబు లయ్యె; సకలజగంబులు గంపించె; భూతలం బదరె; నధోభువన జాలంబులు వణంకె; నాదికూర్మవరాహానంతహరిదంతదంతావళంబులు సంత్రాసంబు నొందె; తారకలెల్ల నెల్లెడలం దుల్లె; చంద్రసూర్యాది గ్రహంబులు గతులు దప్పె; నప్పుడు, 298

ఆ॥ కాందిశీకు లగుచుఁ ♦ గొందఱు దివిజులు, మేరుభూధరంబు ♦ సేరి రెలమి
కొందఱ మరవరులుఁ ♦ గొబ్బునఁ, గైలాసపర్వతంబునకును ♦ బర్వులిడిరి.

—* కుమారస్వామి శూరపద్ముని శక్తిచే రెండుతునియలుగాఁ జేయుట *—

వ॥ ఇట్లు సురాత్మునిమాయం గనిగుహప్రేరితంబైనయాశక్తి కోపంబునఁ బ్రళయ కాలాగ్నిసదృశయు మహారావభీషణయు నగుచు సముద్రంబులు ఘూర్ణిల్లం జనుదెంచి చూతాగ్రంబు రెండువ్రయ్యలుం జేసిన, 300

ఆ॥ అంత దానవేంద్రుఁ ♦ డాభూరుహాకృతిఁ, దొలఁగి స్వస్వరూప ♦ మలరఁ దాల్చి
కడిమి మెఱయఁ గేలఁ ♦ గరవాలము ధరించి, యరుగుదేర మ్రోల ♦ నతని గదిసి.

వ॥ ఆక్షణంబ యాశక్తి తద్వక్షంబు విదారించి నిజప్రభాజాలంబుల జగంబులు వెలుఁగఁ జేయుచు మఱల సురగణంబులు నుతింప గంగాతరంగిణియందుఁ గృతావగాహయై కృతార్థ యగుచు దేవదేవుం డగు గాంగేయుని పాణితలంబున నిలిచె.

ఆ॥ అంత రెండుతునియ ♦ లగుచు దానవుఁ డుర్విఁ, బడిన నందు నొకటి ♦ బర్హి యగుచు
మఱియుఁ దామ్రచూడ ♦ మగుచు వేఱొక్కటి, వెడలి గుహునికడకు ♦ వేగ వచ్చె.

వ॥ అప్పు డవియు లబ్ధజ్ఞానోదయంబులై పరమభక్తిఁ గార్తికేయునకుఁ బ్రణమిల్లి సంస్తవంబు లొనర్ప సంతసిల్లిన సుబ్రహ్మణ్యుం డిందాగ్నిరూపంబు లగు బర్హివాహనకుక్కుటకేతనంబుల వీడ్కొని యమ్మయూరవాహనం బధిరోహించి యత్తామ్రచూడంబును నిజరథధ్వజంబున నుండ నియోగించిన నదియు నట్లు నిలిచి ప్రళయాంబుదంబుభంగి మహాభయంకరంబుగా నినదం బొనరింపుచు,

—* శూరపద్ముండు కుమారస్వామికి వాహనకేతనములై సేవించుట *—

మ॥ గుహునిం బైనిడి భూనభంబులు దిశల్ ♦ గోత్రంబు లంభోనిధుల్
మహితప్రౌఢిమఁ జుట్టి సత్వరగతిం ♦ బక్షంబు లల్లార్చుచున్
విహరించె న్నను నాశిఖావళము త♦ద్వేగంబున న్మేరువున్
మ్మహి వ్రాలెన్ జలధు ల్గలంగె ధర కం♦పంబొందె నంతేనియున్. 305

వ॥ మఱియు దిగంతంబులు నిండఁ గైవారంబు లొనర్చుచు శేషరాహుప్రముఖోరగంబులకు భయం బాపాదింపుచు మయూరంబు మేఘరూపం బగు హరి పరమేశ్వరు నట్లు వహించె నట్లు దేవసేనావల్లభుం డగు సుబ్రహ్మణ్యు వహించె.

క॥ సకలదిగంతములందును, బ్రకటితజవమొప్పఁ ద్రిప్పి ♦ బర్హిరవంబుల్
సకలేశుఁడు గుహుఁడు జయోత్సుకుఁడై రణభూమి జేర ♦ సురలు నుతింపన్.

వ॥ అప్పు డాసమరభూమిని వహ్నివాసవులు గుహాజ్ఞ గుక్కుటబర్హిరూపంబులు విడిచి నిజరూపంబుల శరవణోద్భవునకు భక్తిపూర్వకంబుగాఁ బ్రణమిల్లి సంస్తుతించిరి; భూతంబులు వీరులు సేనాధిపతులు బ్రహ్మవిష్ణుప్రముఖనిఖిలదేవతలు సంతుష్టహృదయులై దేవదేవుఁ బరివేష్టించి కోలాహలంబుల సెలంగిరి. 308

క॥ కరుణాపూరితదృష్టిన్, హరసూనుఁడు వారినెల్ల ♦ నవలోకించెన్
శరవణసంభవు నాశ్రిత,భరణంబును బొగడఁ దరమె ♦ ఫణిపతికైనన్? 309

గీ॥ అంత శూరుండు హతుఁడౌట ♦ యాలకించి, పద్మకోమలముదలై న♦పత్ను లెల్ల
పతివియోగంబునన్ దుఃఖ♦భరము నొంది, పావకజ్వాలలందును ♦ బడిరి వేగ.

వ॥ అంత శూరపద్మతనయుండగు హిరణ్యుం డపుడు జనకుమరణంబు విని శోకాక్రాంతుండై, 311

క॥ హా! తాత! సనితె లలి విన,వైతివి నాపలు కోకింత ♦ హాతబుద్ధి ద్విష
త్కేతనమునఁ కుక్కుటమై, యీతెరఁగున నుండవలసె♦నే నీకుఁ గటా! 312

వ॥ మఱియు మయూరంబవై శాత్రవుని వహించితి వక్కటకటా యని వగచి యతం డంత సైనికులం గనిన బాధింతు రని మనంబునఁ జింతించి నిజగురుం డగు శుక్రునికటంబుఁ జేరి పితృకృత్యంబులు నిర్వర్తించి యైశ్వర్యము క్షణభంగుర మని నిందించి మోక్షార్థి యగుచుఁ బరమేశ్వరుంగూర్చి తపంబుఁ జేయుచుండె; నీకథాశ్రవణంబు సేయువారలకు సుబ్రహ్మణ్యకృపాలంబనంబున శత్రుబలంబుఁ దొలంగు; ఋషిముఖంబున నేతదాఖ్యానంబు విని విష్ణువు మురాసురకాలనేముల నాజిం గెలిచె; పితామహుం డగు శుక్రునివలన విని మునిశ్రేష్ఠుం డగు దధీచి శత్రుం డగు క్షుపుని జయించె; నని సూతుండు శౌనకాది మహామునులకుఁ జెప్పె. 313

శా॥ ప్రాలేయాద్రిసుతాపరో ధరతటీ♦బాహ్యపగూఢక్రియా
లోలాభీకనికామభాసురకృపా♦లోకైకసంతర్పితా
త్రైలోక్యాఖిలభక్తలోకనిటలో♦ద్యద్వహ్నికీలచ్ఛటా
తూలీసీనవతారకజంతుపటలీ ♦ దుఃఖాబ్ధిసంతారకా! 314

క॥ వ్యాళాభరణ! కరాళ, క్ష్వేళాభ్యవహార నిపుణ! ♦ శీతాంశుకళా
మాళి! సముజ్జ్వల! నిరుపమ, కేళీధృతహరిణ! విబుధ♦కీర్తితచరణా! 315

—* ఖడ్గబంధము *—

ప్రశాంతవృత్తము॥ హారహీరతారకాంబు♦జారి హారి భూరిభూ
భారతేవకేంద్రి దేశ♦భావితాంఘ్రిసారసా !
సారమేరుశైలచాప ♦ సర్వలోకవల్లభా !
భారతప్రవీణ భృంగి♦భవ్యనాట్యలాలసా ! 316

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్ర సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపసగోత్ర కోడూరి
యెల్లనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మాంబికాతనయ
వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచల
కవిప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత
శంకరసంహితయందలి శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీశివాయ గురవే నమః.

శ్రీ స్కాందమహాపురాణాంతర్గత

# శివరహస్యఖండము.

## దేవకాండము.

### ప్రథమాశ్వాసము.



రమణీయగుణాకర;
శ్రీకరకురిలింగతనయ ♦ పన్నగగోత్రా
ధార! ముఖవాగమధర
తీర్థరమణ దయాంతరంగ ♦ శ్రీశివలింగా! 1

వ॥ అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుం డిట్లనియె. 2

—* కుమారస్వామి బందితు లగు జయంతాదుల విడుదలసేయుట *—

క॥ అంత నుమానందనుఁడు జయంతప్రముఖామరాళి ♦ ననుపమకరుణా
స్వాంతతఁ దోడ్కొని రమ్మను, చెంతయువిని వీరబాహుఁ ♦ డెలమిఁ దదాజ్ఞన్. 3

వ॥ అతిరయంబునఁ జని కారాగృహబద్ధు లగు జయంతప్రముఖనిఖిలనిలింపులం గని తద్వృత్తాంతంబంతయు నెఱింగించి వారిచే వందితుండై వీరబాహుండు వారి నెల్ల గుహుసన్నిధికిఁ దోడ్కొనివచ్చిన, 4

క॥ ఆ దివిజవ్రాతము గుహు, పాదాంభోజాతములకుఁ ♦ బ్రణమిల్లి మదిన్
మోదంబు దనర నుతు లొ, పాదించిరి శ్రుతిమనోజ్ఞ ♦ ఫణుతులు సెలఁగన్. 5

వ॥ అంత దయాళుం డగు కుమారుండు వారల కిట్లనియె. 6

క॥ సురలార! యింక మీరలు, సురలోకమునకుఁ దొంటి ♦ చొప్పున సుఖులై
స్థిరభోగభాగ్యసంపద, లురుతరముగ ననుభవింపు ♦ చుండుఁడు వేడ్కన్. 7

వ॥ అనిన జయంతాదు లత్యంతసంతోషాంతరంగు లగుచు, నంత గుహాంతికంబున నివసించు యింద్రునిం గని యతని చరణంబుల కెఱఁగిన నతండు వారలనుం బుత్త్రునిం గౌఁగిలించి పరమామోదంబునఁ దేలె; నప్పుడు, 8

క॥ హితులైన వీరగణములు, క్షితిఁ దొలఁగిన భూతవరులు ♦ శీతాద్రిభవా
సుతు నాజ్ఞను పునరుజ్జీ, వితులై పూర్వంబుపగిది ♦ వెసఁ గూడి రొగిన్. 9

చ॥ అలఘుదయాసముద్రుఁ డగు ♦ న గ్గిరిజాతనుజుం డనుగ్రహం
బలరఁగఁ జూచె నాక్షణము ♦ యాజి దురాత్మునిచేత ఖండితం
బులయిన యంగముల్ మగుడఁ ♦ బుట్టెను మిక్కిలి కోమలంబులై
యల నిఖిలామరావళి ♦ సన్నుతి మొప్పఁగఁ గొంటి రొప్పునన్. 10

వ॥ తదనంతరంబ సకలశత్రుసంహారకుం డగు బాహులేయుండు సముద్రునిం బిలిచి యవ్వీరమహేంద్రపురంబుఁ గబళింపు మనిన నప్పయోనిధి తదనుజ్ఞ నప్పురంబును దరంగసంఘంబుల ముంచివేసె. 11

ఉ॥ అంత షడాననుండు సక♦లామరవర్గము వీరబృందముల్
చెంతను భూతసంఘతులు ♦ జేరి భజింప మనోజ్ఞవాద్యముల్
వింతగ మ్రోయఁగా నుఱలి ♦ వేగమ చారువిలాసమూర్తియై
శాంతిపురంబుఁ జేర బుధ♦సంఘము లెల్లెడ సన్నుతింపఁగన్. 12

ఉ॥ అంత సరోజబంధుఁ డుద♦యాచలమందును బొల్చెఁ బూర్వది
గ్గంతకరోద్ధృతప్రకట♦కాంచనకుంభ మనంగ దుస్తము
ధ్వాంతనిశాటఘోరసుద♦వారణకారణచండకాండుఁడై
త్వాంతకచక్రమో యన ధరా♦మరవర్గకృతార్ఘ్యపాత్రుఁడై. 13

వ॥ ఆసమయంబున గుహుండు జగద్గురుం డగు మహాదేవున షోడశోపచారంబులం బూజించి, యప్పురంబున నుండి, 14

సీ॥ స్యందనారూఢులై ♦ సకలసేనాతతుల్, సనుదేర వెంబడి ♦ సరభసమున,
బలనొప్ప దమతమ ♦ వాహనంబులమీఁద, నజముఖుండాదులు ♦ నరుగుదేర,
నిర్జరతాపస♦నివహంబు లిరువెస, శ్రుతిమనోహరముగా ♦ నుతు లొనర్ప,
ఛత్రధ్వజంబులు ♦ చామరంబు లెసంగ, వివిధవాద్యధ్వను ♦ లివ్వ స్ఫురిలఁగ,
నశని ముక్కున గీలించి ♦ యరుణ మూఢ, మరుగుదెంచుచు ఘూత కే♦కారవప్ర
కంపితావనియగు కేకి ♦ గరిమనెక్కి, వరనగంబున కరుదెంచె ♦ భర్గసుతుఁడు.

వ॥ అప్పుడు, 16

క॥ మృగవక్త్రభూతముల రొద, మిగుల బెదరి గుహల దూరి ♦ మృగవితతులు వె
ల్లుగ బన్నికుక్కుటధ్వని, బెగడి భుజంగములగములు ♦ బిలములు సొచ్చెన్. 17

వ॥ అంత మన్మహర్షులు బ్రహ్మాదిదేవతలును గుహునిం గనుంగొని దేవా! యీపర్వతరాజంబున వసింపవలయు నని ప్రార్థించిన విని సుబ్రహ్మణ్యుండు పూర్వంబ యేనిందుండవలయు నని యూహించిన యది మీరుం బలికితిరి మేలయ్యె నని యంగీకరించి యప్పర్వతం బెక్కి విశ్వకర్మను రావించి యిం దొక్క రమ్యంబగు పురంబు నిర్మింపు మనవుడు, 18

క॥ శరవణసంభవుననుమతి, సురశిల్పి సృజించె మిగుల సొంపు ♦ దలిర్పన్
పురవర మొకనిమిషంబున, సురుచిరమణిహేమధామ♦సుందరత దగన్. 19

వ॥ అంతఁ గుమారుండు పురవీధుల నెల్లెడల సేనాధిపుల నఖిలభూతంబుల నుండ నియోగించి మయూరంబు డిగ్గి దివ్యంబైన నిజమందిరంబుఁ బ్రవేశించి సింహాసనారూఢుండై కమలాసనప్రముఖు లిరుగడల బలిసికొలువ ననవీరులు సకలోపచారంబు లొనర్పఁ గుతూహలంబున నుండి యంత మణ్యాహ్నలచేఁ బూజితుండై వారి కాత్మవిజ్ఞానం బుపదేశింపఁ దలంచి బ్రహ్మాదులం దమ తమగృహంబుల కరుగ నియోగించి తదనంతరంబ, 20

క॥ మునులకు నాత్మజ్ఞానం,బును దెల్పుచు నట్లయుండెఁ ♦ బురహరసుతుఁ డం
త నిలింపాధీశుండు హరి, వనజభవాదులకు ననియె ♦ వరమృదుఫణితిన్. 21

క॥ కర మర్థి నామనోరథ, సరణిన్ వినుపింతు వినుఁడు ♦ సకలేశ్వరుఁ డీ
శరవణభవుండు మనల, న్బరమకృపాపీక్షణములఁ ♦ బాలించెఁగదా! 22

వ॥ అదిగావున, 23

మ॥ కరికుంభస్తనిఁ గాంబునన్నిభగళ♦న్కంజాతపత్రేక్షణన్
గరభోరున్ గనకోపమాంగలతికన్ ♦ గాంతామణిన్ మత్సుతన్
గరుణావార్ధికిఁ గార్తికేయునకు లో♦కత్రాత కే నిచ్చి వి
స్ఫురణం బెల్లఁ దొలంగ మాకులము♦బున్ ధన్యతం జెందఁగన్. 24

వ॥ అనుడు శ్రుతిమధురంబు లగు నప్పలుకుల కభినందింపుచు నంగీకరించి ముకుందాదులు నిజమందిరంబుల కరిగి; రంతఁ బురందరుండు నిజమందిరంబుఁ జేరి శీఘ్రంబ గృహనివాసు లగు హస్తితనూజులం దోడ్కొనివచ్చుటకు భటులనియోగించిన వా రతిరయంబునఁ గనకాచలంబునకుం జని పులోమజం గని నమస్కరించి శూరపద్మాదిదానవసంహారంబును దేవవిమోచనంబును దెల్పుటయు విని యద్దేవి పుత్త్రికతోడ నైరావతారూఢయై యమరాద్రికరుదెంచి నానాలంకారయుక్తం బగు నింద్రభవనంబుఁ బ్రవేశించె; నాసమయంబున, 25

క॥ బందీకృతిమోచనులగు, బృందారకతరుణు లెల్లఁ ♦ బ్రేమ న్వలభి
త్సుందరిఁ గని ప్రణమిల్లిరి, నందనుఁడు జయంతుఁ డప్ప్రణామమునర్చెన్.

వ॥ అట్లు ప్రణమిల్లిన శచీపురంధ్రి పుత్త్రుం గని కౌఁగిలించుకొని సకలదివిజాంగనల నాదరించె; నంత, 27

క॥ శరజన్ముని కళ్యాణము, పరమప్రేమన్ సుపర్వ♦పతి నిజసతికిన్
సురసతులకుఁ జెప్పిన భా,సురతన్ హర్షించి రఖిల♦సుందరు లపుడున్. 28

వ॥ అంత నంతఃపురంబు వెడలి శచీకాంతుండు దివిజగణసమేతుండై షణ్ముఖుం జేరి తత్పాదారవిందంబుల కభినందనంబుఁ జేసి వినయంబున నిట్లనియె. 29

గీ॥ శూరపద్మాది దనుజులఁ♦బోరనణంచి, సకలసురలను బ్రోచితి ♦ సౌఖ్యమెసఁగ
తమ రొసంగితి రస్మత్ప♦దంబు నిపుడు, నీదయారసమహిమ వ♦ర్ణింపఁదరమె?

—* ఇంద్రుఁడు కుమారస్వామికి కుమార్తె నిచ్చి పెండ్లిసేయ యత్నించుట *—

వ॥ దేవా! నీవు దివ్యమంగళవిగ్రహుండవు దేవదేవుండవు భీష్టభీష్టప్రదుండవు. నీకే ము ప్రత్యుపకారంబు సేయ నెంతవార ; మస్మదాదిసకలదేవతలం గటాక్షించి యిప్పుడు మత్పుత్త్రిం బాణిగ్రహణంబు సేయవలయు నని పునః పునః ప్రణా మంబులం జేయుచుఁ బ్రార్థించిన విని యిందుకళాధరనందనుండు పురందరు నను గ్రహించి భవన్మనోరథానుకూలంబుగా నెల్లియ తనకుం గల్యాణం బగుం గాక యని యంగీకరించి శీఘ్రంబ లెమ్ము పొమ్ము తత్ప్రయత్నంబున నుండు మని పలికి యింద్రుని సంతోషభరితునిం జేసిన, 31

క॥ అంత సురేంద్రుఁడు సని స్వస్వాంతత నిజధామమునకు ♦ చారుల సకలా శాంతములకు వెసఁ బనిచెను, సంతసమున నిఖలబంధు♦జనములఁ బిలువన్. 32

వ॥ మఱియు సురతక్షకునిం బిలిచి కల్యాణమంటపంబును వాపీకూపతటాకాదులను నిర్మింపు మని నియోగించిన, 33

సీ॥ మహనీయతరచిత్ర♦మాణిక్య భిత్తికా, చకచకదీధితి♦శ్లాఘితంబు,
బహురత్నకీలిత♦భాసమానోత్తుంగ, శాతకుంభ స్తంభ♦సంభృతంబు,
పద్మరాగచ్ఛటా♦పటలవజ్రకవాట, హారినీలజాలశో♦భాస్పదంబు,
చంద్రకాంతోత్పల♦సాంద్రప్రభారమ్య, వేదికాసోపాన♦విలసితంబు,
భవ్యమరకతకుట్టిమ♦దివ్యతరము, శిఖరగతహేమకుంభవి♦జృంభితంబు,
నిమిషమాత్రంబు సృజియించె ♦ నమరశిల్పి, మంగళతరంబుకల్యాణ ♦ మంటపంబు.

వ॥ మఱియు ననేకంబు లగు వాపీకూపతటాకంబులు నిర్మించె; నిట్లింద్రుండు కల్యాణ సంబారంబు లొనఁగూర్చుచుండె; నట జని భటజనంబులు ముచికుం దాది భూపాలకబృందంబును దిక్పాలకాదిబృందారకసందోహంబును స్కందోత్సవం బుం జూడ రమ్మనవుడు, 35

మ॥ ముచికుందుండు మహోత్సవంబు విని స♦మ్మోదాంబుధిం దేలుచున్
సిచయాలంకృతు లిచ్చి తబ్భటులకున్ ♦ శీఘ్రంబ దంతావళ
ప్రచయంబుల్ రథఘోటకప్రతతులున్ ♦ పాదాతగుల్ వెంటరాఁ
బ్రచురైశ్వర్యము మీఱ బంధుజనముల్ ♦ బౌరావళుల్ గ్రాల్వఁగన్. 36

వ॥ నిజపురంధ్రీజనసమేతంబుగా నానాలంకారయుక్తుం డగుచు ననవద్యవాద్య ఘోషంబులతోడ మణ్ముఖనివాససంశోభితం బగు నప్పురంబున కరుదెంచె; నట్లన శిబికాందోళికారూఢులై సకలభూపాలకు లఖలదిగంతంబులనుండి వచ్చి; రప్పుడు,

క॥ అనలుండు దండి దనుజా, గ్రణియున్ బాశ్వవిభుండు ♦ గంధవహుండున్
ధనదుం డీశానుండున్, జనుదెంచిరి పెండ్లిఁజూడ ♦ సంతోషమునన్. 38

సీ॥ పత్నీసమేతులై ♦ పరతెంచి రప్పుడు స_ప్తర్షిపుంగవుల్ ♦ సరభసముగ,
సంభోజబాంధవుం ♦ డమృతకరుండును, జనుదెంచి రతులితో♦త్సాహమొప్ప

సకలబృందారక♦సందోహ మరుదెంచె, నీప్సితఫలసిద్ధి ♦ యొసఁగ మొనఁగ
సప్తమరుత్తులు ♦ సాధ్యులు సిద్ధులు, బితరులు వచ్చిరి ♦ ప్రేమదనర
గరుడగంధర్వకిన్నర♦గణము లురగ,యక్షవిద్యాధరశ్రేణి ♦ యఖిలబంధు
సముదయంబును నేతెంచె ♦ సత్వరముగ,విబుధసేనాని కల్యాణ♦విభవ మలర.

వ॥ ఇట్లు సనుదెంచి సకలజనంబులు నగరాచలబహిఃప్రదేశంబుల సరిదుద్యానప్రపా మంటపంబులఁ గ్రిక్కిరిసి; రంత, 40

మ॥ అసురాధ్యక్షుఁడు ప్రేమమీఱ ముచికుం♦దాది క్షమాధీశులన్
గ్రమ మొప్పన్ సురమానిపంక్తి నుపచా♦రప్రక్రియం దేల్చి యో
గ్యమణీమందిరసీమల న్విడుదులన్ ♦ గావింప వారెల్లరున్
బ్రమదం బంది తగ న్వసించి రచట ♦ న్సభ్యప్రభావంబులన్. 41

క॥ సురభూతతతుల యువతులు, సురరాజపురంధ్రిఁ జేరి ♦ సొంపలరంగం ద
ద్వరసుతను దేవసేనను, పరికించి ప్రణమ్రలైరి ♦ భక్తి దలిర్పన్. 42

వ॥ ఇట్లు ప్రణమిల్లి యక్కామినీజనంబులు గజగామినీమతల్లి యగు న య్యమృతవల్లినిం బెండ్లికూతుం జేసి రప్పుడు. 43

క॥ పాటలు పాడిరి ముగ్ధగ, పాటలగంధులు నినాద♦పాటవ మొప్పన్
బాటవహాకాహళరవములు, పాటిల్లెను శ్రుతిపుటైక♦బంధురలీలన్. 44

ఆ॥ గరిమ ముగ్గుపెట్టి ♦ కల్యాణవేదికఁ, బద్మనయన లపుడు ♦ భద్రపీఠి
ప్రాఙ్ముఖంబుగాగ ♦ ఘనతిని గూర్చుండఁ, బెట్టి వేడ్క నలుగు♦బెట్టి రెలమి. 45

చ॥ కరముల కంకణధ్వనులు ♦ ఘల్లు రనంగ నటింప వేణి ని
బ్బరపు మెరుంగు చన్నుగవ♦భారమునన్ నడుమున్ వణంక వి
స్ఫురితవిలాస మొప్ప నొక♦సుందరి సంపెఁగనూనె నమ్మనో
హరశుభగాత్రి కప్పు తల♦యంటె పికధ్వని పాటఁ బాడుచున్. 46

క॥ గందపుటటుకలిచే నొక, యిందునిభాననప్రమోద ♦ మెసఁగగ సముదిం
దిందిరవేణికిఁ జలకము, పొందుగఁ గావించి విమల♦పుణ్యాంబువులన్. 47

క॥ తడి యొత్తె నొర్తు కోమలి, పడతికి మృదుపటముచేత ♦ బాగుగ చిక్కున్
సడలించి దువ్వి కురులన్, జడవేసెను చానయొర్తు ♦ చంద్రాననకున్. 48

సీ॥ దివ్యాంబరంబును ♦ తెరవయొక్కతె దెచ్చి, కమలాయతాక్షికిఁ ♦ గట్ట నిచ్చె
నెలనాగయొర్తు కం♦గులపైఁడిసరవి, కేఁ దొడుగ నిచ్చెను ♦ సుదతి కెలమి
కలికియొక్కతె వేడ్క ♦ తిలకంబు దిద్దె క్రొ, న్నెలడాలు తిలకించు ♦ నెలతనుఁ గట
మంజువాణియొకర్తు ♦ నంజనంబును దీర్చె, గంజాస్యలోచన♦కంజములకు
కంబుకంఠికి చెలువొంద ♦ కర్ణయుగళి, రత్నతాటంకములు బెట్టె ♦ రమణియొకతె
నవఘనాఘనవేణికి♦నాసనిడియె, నాణిముత్యంబుముక్కెర ♦ నతివయొర్తు.

కం॥ హారంబు లునిచె గళమున, సారసనేత్రికు నొకర్తు ♦ సతియొక్కతె సిం
గారించెను గరముల చెలు, వారఁగ మణికంకణంబు ♦ లంబుజముఖికిన్. 50

కం॥ చంచలనేత్రికు నొకతె స,మంచితనవరత్నకాంచి, మధ్యంబునఁ గీ
లించెను మగువయొకతె రా,ణించఁగ నూపురము లునిచె ♦ నెలతపదములన్. 51

కం॥ యౌవనపంకం బొకయిం,దీవరదళనయన యలఁదె ♦ దివ్యప్రౌఢిన్
లావణ్యవతీమణికి శు,భావహముగ పాదయుగళి ♦ నంచితలీలన్. 52

వ॥ ఇట్లలంకరించిన యనంతరంబ, 53

ఆ॥ పద్మసంభవుండు ♦ ప్రొద్దును జనుదెంచి, త్రిదశవల్లభునకుఁ ♦ దెలియఁ బలికె
గరిమ నిశ్చయించి ♦ కళ్యాణలగ్నంబు, సమయ మిది యటంచు ♦ సంతసమున.

వ॥ ఆసమయంబున తద్వచనంబులు విని యింద్రుండు హరిప్రముఖనిఖిలసురగణం
బులతోడ సురాగ్రగణ్యుండగు సుబ్రహ్మణ్యభవనంబున కరుదెంచి తత్పాదార
విందంబుల కెఱఁగి కృతాంజలి యగుచు నిట్లనియె. 55

—* కుమారస్వామి యింద్రసుతను పెండ్లియాడ దరలి వెడలుట *—

కం॥ దేవా! మద్గృహమునకున్, రావలయు విలాసవతిని ♦ రమణీయాంగిన్
బావని నాతనయను బ్రే,మావహమున బెండ్లియాడ ♦ ననుపమలీలన్. 56

వ॥ అని పలికిన పురందరుం గని యిందుధరనందనుండు మందస్మితవదనారవిందుం
డగుచు నానందంబు నొంది యుబ్బున గందళింపం బాణిగ్రహణోత్సుకుండై సింహా
సనంబునుండి లేచి యత్తరయంబున, 57

సీ॥ అంజలిపుటులై ♦ యమరులు సేవింప, నజముకుందులు ప్రసూ♦నాళిఁ జల్ల,
గంధర్వకిన్నరల్ ♦ గానంబు లొనరింప, పటు వాద్యరవములు ♦ బరిఢవిల్ల
విప్రసందోహంబు♦ వేదఘోషము సేయ, మునిపంక్తిసంస్తోత్ర♦ములు ఘటింప,
వృషదశ్వవహ్నులు♦ వింజామరలు వీవ, రవిచంద్రు లాతప♦త్రములు దాల్ప,
దండధరుఁడు ఖడ్గముఁ బట్టి ♦ దండనిలువ, లలి నవాసికలక్షవీ♦రులును గొల్వ
రమ్యతరమగు ఘనమయూ♦రంబు నెక్కి, వెడలె నిర్జరసేనాని ♦ వేడుకలర. 58

వ॥ ఇట్లు వెడలి వెండియు నిజధ్వజవిరాజమానచరణాయుధభీషణనిర్ఘోషముఖరిత
హరిన్ముఖుండును, విద్యాధరవీణాగానవినోదమోదితాంతరంగుండును, రంభో
ర్వశీమేనకాద్యప్సరోజనలాస్యకేళీవిలాసవిలోకనోత్సుకుండును, పూర్ణకుంభ
సముజ్జృంభమాణ కరాంభోరుహ కలిత మునిగణసేవితుండును, లక్ష్మీవాణీ
ప్రముఖ బృందారక సుమంగళ నీరాజన దీపికావిరాజితుండును, విబుధజనసమ
ర్పితసకలోపచారుండును నై షణ్ముఖుండు రాజవీధులు గడచి యింద్రమందిర
ద్వారంబుఁ జేరి మయూరంబు డిగ్గి శుద్ధాంతంబుఁ బ్రవేశించె; నాసమయంబున,

సీ॥ తన విలోచనలస♦త్ప్రాళధళ్యద్యుతుల్, నలుదెస పండువె♦న్నెలలు నింప,
తన సమున్నతపయో♦ధరకుంభయుగళంబు, గరిమ కొండంతవై♦ఖరిని మెరయ,

తన పాదమంజీర♦ఘనకింకిణీధ్వను, ల్గిలుకుమెట్టియలతో ♦ గలిసి మ్రోయ,
తన కబరీమిళ♦త్కల్పసూనావళుల్, ఘుమఘుమవాసనల్ ♦ గుప్పుమ్మనంగ,
శతమఖునిరాణి యప్సర♦శతముఁగొలువ,గా నెదుర్కొని తద్వార♦కమలయుగము
క్షీరధారలఁ గడిగి యర్చించి వినుల, నొసఁగె నీరాజనంబు సొం♦పెసఁగ మిగుల.

వ॥ అంత నబ్భగవంతుం డగు నాంబికేయుండు నవరత్నఖచితంబు లగు సువర్ణపాదుకలు మెట్టి మందగతులం గల్యాణమండపంబుఁ జేరి యందు దివ్యసింహాసనాసీనుం డయ్యె నయ్యెడ; హరిబ్రహ్మాదిసకలదేవతలు తదనుమతి యథాస్థానాసనంబుల వసించిరి; ముచికుందాదులు కృతప్రణాము లై యంజలిబంధంబులు జేసిరి; వీరబాహుప్రముఖులగు వీరులు నుపచారంబు లొనర్చుచుఁ బరివేష్టించి; రంత.

మ॥ సుతుకల్యాణమహోత్సవంబు నరయన్ ♦ శుభ్రాంశురేఖాధరుం
డతులప్రౌఢిమ శైలజాసహితుఁడై ♦ హర్షోన్నతిన్ రత్నచి
త్రితమైనట్టి మహావిమానము నెయిం ♦ దేరంబులో వచ్చె న
ప్రతిమానం బగువాద్యఘోషములు ది♦గ్భాగంబునన్ మ్రోయఁగన్ 62

వ॥ అప్పు డమ్మహాదేవునిం జూచి సకలగీర్వాణులు లేచి కృతప్రణాములగుచు నత్యంతభక్తిబద్ధాంజలు లై నిలిచి రంత, 63

క॥ గిరితనయతోడఁ బరమే, శ్వరుఁడు విమానంబు డిగ్గఁ ♦ జయ్యన నపుడున్
శరజన్ముఁడు తలిదండ్రుల, చరణాంభోజముల కెఱఁగి ♦ సంతోషమునన్. 64

వ॥ సవినయంబుగా సంస్తుతించిన నక్కుమారుని గంగాధరుం డాలింగనంబుఁ జేసి మాటిమాటికి శిరంబు మూర్కొని తృప్తిఁ బొందఁ డయ్యె. 65

క॥ హరిసరసిజగర్భాదులు, పరమేశుపదాబ్జములకుఁ ♦ బ్రణమిల్లి నిరం
తరభక్తితోడ సంస్తుతు, లురుతరముగఁ జేసి రసదృ♦శోత్సాహమునన్. 66

వ॥ ఈశ్వరుండును వారలఁ గరుణావిలోకనంబునం గనుంగొనుచు వారితోడం గల్యాణమండపంబున కరుదెంచి నిజాగ్రాసమాగతదివ్యసింహాసనాసీనుం డై తనూజు నంకంబున నిడుకొని సంతోషంబునం జెలంగుచున్నప్పుడు సకలనిలింపులుం గుమారసమేతుం డగు నుమానాథునిం గని ప్రణమిల్లి రంత పద్మభవుం డిట్లనియె;

గీ॥ స్వామి! పరమేశ! భవదాజ్ఞ ♦ షణ్ముఖుండు దేవతాద్రోహు లైనట్టి ♦ దితిజవరులఁ
బ్రధనమునఁ గూల్చి విక్రమ♦పటిమ మమ్ము, బాధముక్తులఁ గావించె ♦ బరమకృపను.

వ॥ అప్పు డమ్మహానుభావుండు హరాచలంబున కరుదెంచిన నతని సంప్రీతుం జేయువాఁ డై యింద్రుండు నిజతనూజ నిచ్చి పాణిగ్రహణంబు సేయం బూనె నని తద్వృత్తాంతం బంతయు శశాంకశేఖరున కెఱింగించిన 69

మ॥ శశిఖండాభరణుండు శంకరుఁడు శ♦శ్వత్ప్రీతి నాలించి చా
ల శిరఃకంపము చేయు చిట్లనియెఁ గ♦ల్యాణోత్సవం బీ త్రిలో

కశరణ్యుం డగు మత్కుమారునకు వేడ్క న్మీరు సేయంగ నీ
దృశసంతోషము జూడ వచ్చితిమిగా ♦ దే యిప్డు వాణీశ్వరా! 70

వ॥ అని పలికె; నంత ముకుందుండు పురందరుదిక్కుం జూచి సుందరీరత్నం బగు భవ
న్నందనిం గళ్యాణవేషంబుతోడం దోడ్కొనిర మ్మనవుడు, 71

క॥ బృందారకపతి నందని, నందం బలరార మిగుల ♦ నట దోడ్కొని తె
చ్చెం దనప్రియసుందరితో, నిందిర వాణియును గొలువ ♦ నిరుదెసలందున్. 72

వ॥ అప్పుడు, 73

శా॥ బంగారందెలు మ్రోయ పాదయుగళిం, ♦ బల్ గబ్బిపాలిండ్లపై
రంగుల్ గుల్కెడు కంచుకంబు సెలఁగన్ ♦ రాణించు వాల్గొప్పులం
సింగారం బెసఁగంగ మందగతితో ♦ శీతాంశుబింబాస్య వ
చ్చెం గల్యాణవితర్దికిం బయిపయిన్ ♦ సిగ్గున్ మనం బారఁగన్. 74

సీ॥ కలికికాడదమ్మాల ♦ కలువరేకులలీల, బురణించు చెలికన్ను ♦ లరసి యరసి
కనకకుంభంబుల గంతు ♦ కంబులమించు, కామినిపాలిండ్లు ♦ గాంచి కాంచి
మొలదేటిపించును ♦ జలదమండలిగేరు, సుందరీమణివేణి ♦ జూచి చూచి
తొలుకారుమించును ♦ తళుకుబంగరుమించు, నెనయుగోమలిమేను ♦ నెంచి యెంచి
యుత్సహించునుమదిలోన ♦ నుబ్బుచెలగు, మూర్ధపట్టంబుగంపించు ♦ మోహమంటి
భవుతనూభవుఁ డాకర ♦ పంచశరుని, బాహుపటిమకు లోనయ్యెఁ ♦ బలుక నేమి? 75

క॥ శ్వశురు లగు శైలకన్యా, శశిమౌళులకుం బ్రఫుల్ల ♦ జలజాక్షి సతిం
గుశలత ఘటించి లజ్జా, వశతం దలవంచుకొనియె ♦ వల్లభు నెదుటన్. 76

వ॥ అప్పుడు నిఖలగీర్వాణులు లేచి యద్దేవికి నమస్కరించి; రంత గిరికోదండపాణి
యక్కరవాణిం గృపావీక్షణంబునం గనుంగొనియె; గౌరియు సక్కోడలిని నిజ
కరంబున స్పృశించి యమ్ముద్దియనిద్దంపుచెక్కుటద్దము ముద్దిడియె. 77

క॥ మానుగ నాజగదంబిక, యానెయ్యపుఁగోడలి న్మహాదర మెసఁగన్
సూనుమణిపీఠమున నెం, తేనియుఁ గూర్చుండఁబెట్టె ♦ దివ్యప్రౌఢిన్. 78

ఉ॥ ఎన్నదరంబె యింతిసాబ ♦ గెంతయు సిగ్గున మోము వంచి యా
కన్నులకల్కి కంబునిభ ♦ కంధరచారువిలాసమొప్పఁ గ్రే
గన్నుల దాయి నించి నిజ ♦ కాంతు షడాననుదివ్యమూర్తిపై
చెన్నుగ నల్లగల్వవిరి ♦ సేసలు జల్లఁగఁ జల్లె నయ్యెడన్. 79

క॥ ఆబాహులేయు వదనం, బేబదినాల్గయ్యె నూట ♦ యెనిమిది యయ్యెం
బో, బాహువులం జిత్రిం, బావెడ నవరత్నహార ♦ మపు డేసివచోన్ 80

వ॥ ఇట్లు దేవసేనాసేనాను లేకసింహాసనాసీనులై వెలంగుటం గని సురలు ప్రమోద
సంతోషభరితాంతరంగులైరి. 81

ఉ॥ అంత సురేంద్రుఁ డిందుమకు♦టాత్మజుదివ్యపదారవిందముల్
స్వాంతము రంజిలంగ విల♦సన్మణిపాత్రికఁ జేర్చి చెంగటం
గాంత పసిండిగిండి గొని ♦ కౌతుకమొప్ప జలంబు నింప న
త్యంతము భక్తితోఁ గడిగి ♦ యాచరణాంబుజతోయ మొంతయున్. 82

—* ఇంద్రుఁడు కుమారస్వామికి కన్యాదానము సేయుట *—

వ॥ అనంతరంబ గ్రహించుటకు నొక్కచో నునిచి; మఱియు గంధపుష్పధూపదీపాది సకలోపచారంబులం బూజించి, 83

సీ॥ నవరత్నఖచితక♦నకకిరీటంబుల, నారుశిరంబుల ♦నలరఁ బెట్టి
మాణిక్యమయముతౌ ♦ మకరకుండలాల్, కర్ణభాగంబుల ♦ గరిమ నిడియె
పచ్చరానిగ్గుల♦పతకముల్ ముత్యంపు, సరులును గంఠదే♦శముల నునిచె
నతులితవజ్రకీ♦లితకంకణంబులు, ద్వాదశకరముల ♦ వరుసఁ జేర్చి
పద్మరాగాంగుళీయక♦పంక్తి వ్రేళ్ల, నిండ సంధించె భూషణ♦నివహ మిట్లు
వేడుకనలంకరించె న♦వ్వేల్పుఱేఁడు, ప్రీతిమీఱఁగఁ గూర్మి జా♦మాత కెలమి. 84

క॥ దివ్యాంబరము లొసంగెను, భవ్యంబుగఁ ద్రిదివవిభుఁడు ♦ బ్రహ్మాదిసుర
స్తవ్యపదాంబుజయుగళున, కవ్యయునకు సకలదేవ♦తాధ్యక్షునకున్. 85

క॥ మధుపర్క మిచ్చి కన్యను, విధిపూర్వకమొప్ప దివిజ♦విభుఁ డురుకరుణాం
బుధికిఁ గుమారునకున్ జగ,దధికర్తకు నిదియ భార్య ♦ యనియెడి ధారన్. 86

వ॥ అంత నిచ్ఛామాత్రంబునఁ బద్మగర్భుండు మంగళసూత్రంబు సృజించి గుహుని కరంబునం దిడిన, 87

క॥ అంగనగళమునఁ గట్టెను, మంగళసూత్రంబు భువన♦మండలికెల్లన్
మంగళము దనరఁగ న,య్యంగజహరసుతుఁడు హర్ష♦మాత్మఁ జెలంగన్. 88

వ॥ మఱియు సుగంధికుసుమమాలికల నద్దేవికంఠంబు నలంకరించె. 89

సీ॥ తెరలఁ బట్టిరి వేగ ♦ దివ్యదుకూలముల్, క్షీరవారాశివీ♦చికలకరణి
దీపాలపళ్ళెరాల్ ♦ దెచ్చిరి చెన్నొంద, సుందరీజనములు ♦ సొంపుగులుక
మంగళాష్టకములు ♦ మానుగ నుడివిరి, మానివరేణ్యులు ♦ మంజుఫణితి
గీతము ల్పాడిరి ♦ కిన్నరకామిను, ల్పమదకోకిలకల♦స్వనము లొప్ప
నమితతూర్యమృదంగవా♦ద్యములు మ్రోసె, నిందిరాభారతీప్రము♦ఖేందుముఖులు
ఘుమఘుమామోదమందార♦కుసుమములును, సేసలునుజల్లిరెంతయుఁ♦జెలువెసంగ.

మ॥ నెలఁతా! దోయిట నింపు ముత్తియఁపుఁ బ్రో ♦ ల్నీదేవుమూర్ధంబులన్
బలుసి గ్గేటి కటంచుఁ బ్రాణసఖులున్ ♦ బల్మారు భాషింపఁగా
లలి మందస్మిత మొప్ప నీమదుదయ♦ల్లజ్జోన్నతాస్యాబ్జమై
తలఁబ్రా ల్నించెను కాంత కంకణఝణ♦త్కారంబు తోరంబుగన్. 91

వ॥ మఱియు సుగంధికుసుమమాలికలు నష్టవృకంఠంబునందు నలంకరించె. 92

క॥ ధవళంబులు స్వచ్ఛాననులు, ధవళాక్షులు పాడి రపుడు ♦ దైవతగణముల్
దివినుండి పుష్పవర్షము, నవిరళముగ గురిసి రపుల ♦ హర్షం బెసఁగన్. 93

క॥ కమలభవుఁ డపుడు వహ్నిని, సమిధాద్యాహుతుల వేల్చె ♦ చతురత విధ్యు
క్తముగా దంపతు లగ్నికిఁ, గ్రమమొప్పఁ బ్రదక్షిణంబుఁ ♦ గావించి రోగిన్.94

క॥ లలనాలలామ మృదుపద, జలజముఁ దన కేలఁ గొనుచు ♦ శంభుతనూజుం
డలస వ్రాలయఁగఁ జెంగట, శిలయుం దాకించె వేడ్క ♦ చిగురొత్తఁగన్.

క॥ ఆనంద మలర మది నం, తేనియు దంపతు లరుంధతీదర్శనమున్
మానుగఁ గావించిరి స, న్మానితవిభవాఢ్యు లగుచు ♦ మహిమ నెలంగన్. 96

క॥ సురలోకాధ్యక్షుఁడు భా, సురముగ నైవేద్య మొసఁగె ♦ సుధయు ఫలంబుల్
వరహేమపాత్రి నునిచెను, బరగ వధూవరుల కపుడు ♦ పరమప్రేమన్. 97

వ॥ అంత జగజ్జననీజనకులైన యప్పార్వతీపరమేశ్వరులకుఁ బ్రదక్షిణత్రయపూర్వ
కంబుగ నమస్కరించిన వారు గోడలిం గుమారునిం గారవమున గౌఁగిలించి
కృపావలోకనంబుల నాదరించి; రంత, 98

గీ॥ పార్వతీశంకరులతోడ ♦ భద్రపీఠిఁ, బరగ వసియించి రవ్వధూ♦వరులు ప్రేమ
నేత్రపర్వంబుగా నంత ♦ నిఖిలసురలు, వారలను జూచి మ్రొక్కిరి♦వాంఛలూర.

సీ॥ ఈజగద్బాంధవు ♦ రాజశేఖరస్పర్శ, మొనసి యీపద్మిని ♦ యింపెసంగె
యిమ్మహాఘనుతోడ ♦ నింపొందగాఁ గూడి, యీతటిన్నిభగాత్రి♦ఖ్యాతిగాంచె
ఈకళానిధితోడ ♦ నేకీభవించుచు, నీచంద్రికాహాస ♦ యొంచఁదనరె
నీసుధామందారు ♦ నీప్సితం బరయఁగఁ, బొంది యీ యాననఁబోడి ♦ పొలుపెసంగె
నీకుమారుని వరియించి ♦ యీకుమారి, సౌకుమార్యంబు రహిమీర♦చారులీల
ననుచుఁగొనియాడి రెల్లరు♦నతిశయముగ, దంపతులఁజూచిలోచనో♦త్సవముగాగ.

వ॥ అంత సకలదేవత లాశ్చర్యంబు నొంద నుమాశంకరు లంతర్ధానంబు నొందిరి.101

ఉ॥ అంత వధూయుతంబుగ మ♦డాస్యుఁడు మంగళవాద్యఘోషముల్
స్వాంతము రంజిల న్వినుచు ♦ సర్వసుపర్వులఁ బంచి యింపెస
ర్యంతము ద్వారపాలకుల ♦ ద్వారముల న్నియమించి నెమ్మదిన్
సంతస మొప్ప కేళిసద♦నంబును జేరె విలాసధుర్యుఁడై. 102

—* కుమారస్వామి దేవసేనతో కేళీగృహమునఁ సుఖించుట *—

చ॥ చికిలిపసిండికాంతిగల ♦ చిల్కలకొల్కను డీర్చినట్టి మే
ల్పకినెలపట్టుమంచమున ♦ జాజులపానుపుపై గుహుండు కో
రిక కుచచంచరీకచికు♦రన్ రమణీమణి దేవసేనఁ గో
రికచిగురొత్తఁ గూడి చెల♦రేగ మనోహరకేళిఁ దేలుచున్. 103

సీ॥ అతివకు నొకకేల ♦ హారంబు లునిచెను, కలికికై నొకకేల ♦ గంధ మలఁదె
కొమరొప్ప నొకకేల ♦ కొప్పును సవరించె, పొందుగ నొకకేల ♦ పూలుముడిచె
నొకకేల తాంబూల ♦ మొసఁగెను పణఁతికి, చెక్కిలి నొకచేత ♦ నొక్కి మిగుల
మకరికాపత్త్రము ♦ లొకచేత లిఖియించె, కళ లంటి యొకచేత ♦ గడుఁ జెలంగి
రవికముడియును నొకకేల ♦ రక్తి విడిచి, నీవి సడలించె నొకచేత ♦ నెలఁత కలిమి
యొక్కచేతను, గిలిగింత ♦ లొనర సలిపి, కాంత నంతయు నొకకేలఁ ♦ గౌఁగిలించె.

వ॥ ఇట్లంతఃపురంబున దేవసేనావిభుండు ప్రియాంగనతోడ కేళీవినోదంబున నుండె; నంత పురందరుండు ముచికుందాది భూపాలకులను, బృందారకులను, ఋషివర్యులను యథాయోగ్యంబుగా కల్పవృక్షసముద్భవంబు లగు ననర్ఘ్యమణిభూషణాంబరాదుల సంభావించి వారలనందఱ యథాస్థానంబుల కనిచి తానును శచీసుందరితోడ గృహంబున సంతోషంబున వసించె; నంత, 105

క॥ కతిపయకాలం బచ్చట, సతితోఁ గ్రీడింపుచుండి ♦ శరసంభవుఁ డా
శతమన్యునకుం గరుణా, మతితోఁ [illegible] మదిఁ దలఁచె వెసన్. 106

క॥ భూతగణంబులు వీర, వ్రాతంబులు గొలువ వివిధ ♦ వాద్యంబులతో
ఖ్యాతిగ గృహంబు వెడలెను, గౌతుకమున నింద్రనగర ♦ గమనోత్సుకుఁడై. 107

వ॥ అప్పు డవ్వాద్యధ్వనులు విని హరి బ్రహ్మాదిదేవతలతోడ దేవసేనానిదండకుం జనుదెంచె; నంత మనోజవం బగు రథం బారోహించి షణ్ముఖుండు కృతస్తోత్రప్రణాము లగు నిఖిలదివిజులఁ దమతమవాహనంబు లధిరోహింప నియోగించిన,

క॥ వారందరు వాహనముల, నారోహణముం ఘటించి ♦ యరిగిరి వెంటన్
వారాశిఘోషమట్లను, వారక మ్రోసెన్ సమస్త ♦ వాద్యస్వనముల్. 109

క॥ అరుదెంచి రపుడు కొందఱు, వరధవళచ్ఛత్త్రశతులు ♦ ధ్వజచామరముల్
కర మర్థిఁ గొనుచు వెంబడి, సరసీరుహబంధుబింబ ♦ సంరోధముగన్. 110

వ॥ ఇవ్విధంబున విబుధసేనావిభుం డమరావతీపురంబున కరిగి యగ్నిదగ్ధంబును శూన్యంబును నగు దానిం గనుంగొని సురతక్షకునిం బిలిచి యిది పూర్వప్రకారంబుగా రచియింపు మనవుడు నతండు నిమిషమాత్రంబున నట్లన నిర్మించె; నయ్యవసరంబున, 111

క॥ మురవైరిముఖ్యదివిజులు, సురవర్ధకి శిల్పమహిమఁ ♦ జూచి ప్రియోక్తిన్
గర మాదరించి యతనిని, నరుదెంచిరి వానితోడ ♦ హరసుతుకడకున్. 112

వ॥ ఇట్లరుదెంచి యదియు విన్నవించిన, 113

గీ॥ వారివచనంబు లాలించి ♦ తారకారి, వాహనము డిగ్గి భాసురో ♦ త్సాహ మొప్ప
నతిమనోహరమైనట్టి ♦ యాత్మగృహముఁ, జేరి యందు సింహాసనా ♦ సీనుఁ డయ్యె.

క॥ సురుచిరమణినిర్మితమై, నిరుపమ మగునట్టి యాత్మ ♦ నిలయం బపుడున్
సురరాజవధూమణి శచి, పరమామోదమునఁ జేరె ♦ పణఁతులతోడన్ 115

వ॥ అప్పుడు షణ్ముఖుండు పార్శ్వవర్తి యగు చతుర్ముఖుం గని శతముఖునకుఁ బట్టాభిషేకంబుఁ జేసి శీఘ్రంబ రమ్మని యానతిచ్చినం గమలాసనుండు తదాజ్ఞ శిరంబున నిడికొని యపేక్షితంబులైన ద్రవ్యంబుల సంపాదించి యింద్రసదనంబున కరిగె; పుణ్యతరంబు లగు స్వచ్ఛోదకంబుల జంభభేది నభిషిక్తుం జేసి పట్టంబుఁగట్టి వానిచేతఁ బూజితుండై మగుడ గుహుసవిధంబున కరుదెంచె; నంత,

మ॥ చెలువొందన్ సకలర్షిబృంద మొగి యా♦శీర్వాదముల్ సేయ, రం
భ లసత్ప్రౌఢి నటింపఁ, గిన్నరవరు♦ ల్పాడంగ గీర్వాణులుం
గొలువంగా నిఖిలోపచారములతో ♦ గోత్రారి కొల్వుండ సొం
పలరం గొండొకకాల మంత మదిలో ♦ హర్షంబు రంజిల్లఁగన్. 117

వ॥ దేవదేవుం డగు గుహుం జేరి తత్పాదారవిందంబుల కెఱఁగిన సంక్రందనుం గరుణించి యప్పార్వతీనందనుం డి ట్లనియె. 118

క॥ పూర్వప్రకారమునను న,ఖర్వశ్రేయంబుఁ దనరఁ ♦ గాంచుము మిగులన్
స్వర్వైభవ మని పలికి సు,పర్వాధిపు ననిచె నపుడు ♦ భవనంబునకున్. 119

వ॥ మఱియు హరిబ్రహ్మాదులను యథాస్థానముల కరుగ నియోగించి, నిజభవనద్వారంబుల వీరుల నిలిపి, కాంతాసమేతుం డగుచు, తారకాంతకుండును శుద్ధాంతంబును జేరి, యత్యంతసంతోషంబున నుండె; నిట్లు చిరకాలంబు స్వర్లోకంబున వసియించి, యంత స్కంధాచలంబున కరుగ నిశ్చయించి, 120

క॥ వైకుంఠాదులఁ దమతమ, లోకంబుల కనిచె సకల♦లోకేశ్వరుఁ డా
శ్రీకంఠసుతుఁడు కరుణా,లోకనమున వారల న్వి♦లోకించి యొగిన్. 121

వ॥ ఇట్లు పనిచి షణ్ముఖుండు దేవీసమేతంబుగా నతిసుందరం బగు రథం బధిరోహించి మహాబలుం డగు వీరబాహుండు సారథ్యం బొనరింప వీరసేనాధిపులతోడఁ గైలాసంబున కరిగి యందు రథంబు డిగ్గి యాత్మజననీజనకు లగు పార్వతీపరమేశ్వరుల పాదపద్మంబులకుఁ బరమభక్తితోఁ బ్రణమిల్లి వారలచేత నుపలాలితుండై తదనుజ్ఞ నిజపరివారంబుతోడ స్కంధాచలంబుఁ జేరి యందు దివ్యసింహాసనాసీనుం డయ్యె. పరమశ్రావ్యంబును, పుణ్యతరంబును నైన యగ్గిరిజాకుమారువివాహం బెవ్వఁడేనియు శ్రద్ధాసమన్వితుండై వినిన, పఠించిన నతండు దీర్ఘాయుష్మంతుండును, పశుపుత్త్రకళత్రాదిసకలభోగధురీణుండును నగుచు వర్ధిల్లు; నిది సత్యం బీయర్థంబునకు గుహుండు సాక్షి యగుచుండు; సందియంబు లే దని చెప్పి సూతుండు వెండియు నిట్లనియె. 122

ఆ॥ హరకుమారు నాజ్ఞ ♦ నబ్జజహరిముఖ్య,సురవరేణ్యు లరిగి ♦ సుఖము దనర
నిజపదంబులందు ♦ నివసించి రెంతయు, గుహుని మదిఁ దలంచు♦కొనుచు నెలమి.

క॥ శూరుఁడు పెట్టిన బాధలు, సారెకు మదిఁ దలఁచి తలఁచి ♦ శక్రుండు మహా
వైరాగ్య మొంది నిందిత,నారీసంభోగుఁ డగుచు ♦ నతవదనుండై. 124

వ॥ మౌనంబున షణ్ముఖచరణకమలధ్యాననిష్ఠాగరిష్ఠుం డగుచు నుండె. 125
మ॥ అపు డాభావ మెఱింగి గీష్పతి సుప♦ర్వాధ్యక్షునిం జేరి తా
నుపదేశించె రహస్యమందు రమణీ♦ప్రోత్తుంగవక్షోజకుం
భపరీరంభసుఖైకకారణము వి♦భ్రాజత్ప్రసూనాస్త్రశా
స్త్రపరిజ్ఞానము సర్వము న్బటువచః♦ప్రాగల్భ్య మింపారఁగన్. 126
వ॥ ఇట్లుపదేశించిన విని పంచశరకళావిజ్ఞానధురంధరుండై పురందరుం డాత్మలోన,
చ॥ కలికిమెరుంగుచన్నుఁగవఁ ♦ గౌఁగిటఁ జేర్చుచు వాంఛ లూరఁగాఁ
బలుచనిమోవికెంజిగురు♦పానక మాని విలాసినీమణిన్
గలయుట సౌఖ్యమెన్న మఱి ♦ కామినిఁ బాసిన సౌఖ్య మున్న దే
యిల నది గాన జన్మఫల ♦ మిందునిధానపొందుఁ జూడఁగన్. 128
క॥ జ్ఞానైశ్వర్యబలంబుల,లో నెన్నఁగ పరమసుఖము ♦ లోకంబందున్
మానినిభోగమె సత్యము, మానిని నెడబాయ న్యాయ♦మా ధన్యులకున్?
క॥ కొందఱు ధనలోభంబును, బొందుచు కామినులపొందు ♦ పొసఁగ దని వృథా
నిందింతురు నీరసులై. సుందరిభోగంబుకన్న ♦ సుఖముం గలదే? 130
వ॥ అని యివ్విధంబున వితర్కింపుచు, నిజగురుం డగు గురుని గృహంబున కనిచి
స్వారాజ్యంబునకు జయంతుని బట్టాభిషిక్తుం గావించి యహోరాత్రంబుల సురేం
ద్రుండు సుందరీసురతక్రీడాపరాయణుండై యుండె; నప్పుడు, 131
క॥ స్వారాజ్యభరణమందు ను,దారనయప్రౌఢి మెఱయఁ ♦ దనరుచు సౌనా
సీరియు నశేషవిద్యా,పారగు సురగురుని జూచి ♦ పలికె నొకతఱిన్. 132
మ॥ హరిపద్మాసనముఖ్యులౌ సురల ను♦ద్యచ్ఛౌర్యధౌరేయుఁడై
దురితాత్ముం డగు శూరుఁ డాత్మకృషియం♦దుం బంచి బాధించుటల్
ధర నేకర్మఫలంబుఁ జెప్పు మఖిలా♦ర్థజ్ఞానపారీణ ! కాం
తుఁ డీ యామత్ఫలమేమియుం బురుషు లెం♦దున్ గర్మముం జేయకే. 133
వ॥ అని యిట్లు జయంతుండు వినయనమ్రుం డగుచుఁ బ్రణమిల్లి యడిగిన సురగురుం
డి ట్లనియె. 134

—* దేవతలకష్టములకుఁ గారణము సురగురుఁడు సెప్పుట *—

మ॥ మును దక్షాధ్వరమందు యజ్ఞవిభు శం♦భున్ సర్వలోకైకనా
థుని వర్జించి ముకుందుతోడ మనముం ♦ దుర్బుద్ధి హవ్యంబులన్
గొని భక్షించిన తత్ఫలంబు నమరో♦గ్రుండైన యవ్వీరభ
ద్రునిచే గంటిమిగాదె నాఁడె యది వా♦క్రువ్వంగ ఘోరంబుగన్. 135
వ॥ తత్కర్మశేషంబు శూరపద్మవ్యాజంబున నిట్టిబాధం గావించెఁ; గర్మగతి నెవ్వా
రికిం గడవ నశక్యం బగు ననిన విని జయంతుండు మగుడ సురాచార్యున
కి ట్లనియె. 136

క॥ నలువకుఁ బ్రథమతనూజుం, డల దక్షుఁడు హరుని బిలువ ♦ కధ్వరదీక్షన్
జెలఁగి నతఁడ పొందక త,త్ఫల మమరులు వొంద నేల ♦ తత్త్వజ్ఞనిధీ! 137

వ॥ ఈయర్థంబునందు నాకు సంశయం బయ్యె. దీనిం బరిహరింపు మని యడిగి నిలింపరాజసుతుండు తద్వృత్తాంతంబు క్రమంబున గురుముఖారవిందంబున నెఱింగి సంతుష్టాంతరంగుండై హృదయకమలంబున మహాదేవుం దలంచి శివనిం దకుల నిరసించుచు నానందంబున రాజ్యపరిపాలనంబుఁ జేయుచుండె నని సూతుండు సెప్పిన విని శౌనకాదు లిట్లనిరి. 138

క॥ స్కందగిరిఁ జేరి గిరిజా,నందనుఁ డట నేమి చేసె ♦ నవ్యసుధాని
ష్యందం బిటు గులుక వచిం,పం దగు నోసూత! యదియు ♦ మాకు వినంగన్.

వ॥ అనుఁడు రోమహర్షణి యిట్లనియె 140

గీ॥ వినుఁడు ఋషులార! శ్రీస్థాని, విష్ణు లగుచు, వరగుణమతల్లి సౌందర్య♦వల్లి లవలి
కన్యకను గార్తికేయుండు ♦ కౌతుకమునఁ,బరిణయించినకథఁ దేట♦పరతు మీకు.

వ॥ అనిన శౌనకాదు లిట్లనిరి. 142

క॥ అచ్చెలువజనకుఁ డెవ్వం, డెచ్చట దానిన్ వరించె ♦ నీశతనూజుం
డచ్చపలాక్షికి నెందున, వచ్చెన్ లవలీసమాఖ్య ♦ పల్కుము సూతా! 143

వ॥ అనిన మునిపుంగవులకు సూతుం డి ట్లనియె. 144

మ॥ పరగు న్వారిధి గాంచి కాంచి నగర♦ప్రాంతంబున న్వింతఁగాఁ
బరిపూర్ణాఖ్యపురంబు కాంచనమణి♦ప్రాకారసౌధావళీ
స్ఫురదుద్యానవనీసరోవరమహా♦భూభృన్మనోహారియై
యురుపుణ్యాస్పదమై శుభప్రదమునై ♦ ప్రోద్యద్ద్రమావాసమై. 145

మ॥ ఒనరన్ త్వష్ట యనంతరత్న మగు ఖ♦ద్యోతున్ బ్రియత్నంబుతో
ఘనకాంతిన్ దగ సానదీర్చ గిరమం ♦ గల్పించుచక్రభ్రమం
బన సాలంబు దనర్చు నప్పురమునం ♦ దభ్యున్నతస్ఫూర్తిన
ట్లను గాకుండిన దానితో నొరయ నేలా ♦ భానుఁ డశ్రాంతమున్. 146

చ॥ అనుగతపుష్పసత్వసము♦దంచితమై ఘనపత్రిధామరం
జనమునఁ బూని ఖేటవిల♦సద్విటపాలికి నాటపట్టునై
యనిశము చూడ్కికిన్ సఫల♦మై కనుపట్టుచు భూరిశాఖలన్
జననుతిఁ గాంచు నప్పురము ♦ సాలము సాల మనంగఁ జెల్లదే? 147

చ॥ పరగఁగఁ దత్పురీపరిఖఁ ♦ బద్మముఖుల్ జలకేళి సల్పు త
ద్గురుకుచకుంభసంకుమద♦కుంకుమపంకఘుమంఘుమాతివి
స్ఫురమురుసౌరభోన్నతులఁ ♦ బొందుచు సారె రసాతలంబునం
దురగలు భోగు లంచుఁ జెలు♦వొందఁగఁ బేరు వహింతు రంతయున్. 148

సీ॥ బహుమనోహరములౌ ♦ పద్మాకరంబుల, పద్మాకరంబులౌ ♦ భవనములును
భవనగప్రతిమాన♦భవ్యసౌధంబుల, సౌధాశనద్రుమా♦సారవళుల
సారవనిఖలవా♦ద్యోరుమార్గంబుల, మార్గణగణముల ♦ మనుచు ధనుల
ధనురుదారప్రౌఢిఁ ♦ దనరు ధార్మికులను, ధార్మికగోష్ఠికిఁ ♦ దగినఘనుల
ఘనసమీరసదృశ♦కరిహరిరాజుల, రాజులకును మనసు ♦ రంజిలంగఁ
జేయు నప్సరంబు ♦ శేషాహికైనను, బొగడ నలవియగునె ♦ భూతలమున. 149

సీ॥ అరయ జడాత్మత ♦ నంబుదావళులందె, దోషాకరాసక్తి♦తొవలయందె
ఖలసంప్రయోగంబు ♦ కలమురాశులయందె, యప్రతిష్ఠయుఁ బంక,జాళులందె
బహుతరభంగాప్తి ♦ పాథోనిధులయందె, పరగ ద్విజిహ్వత ♦ ఫణులయందె,
పాటింప వక్రత ♦ బాలచంద్రునియందె, స్నేహక్షయము దీప♦శిఖలయందె,
యురుతమోయోగ మద్రికం♦దరములందె, కార్శ్యమింతయుఁ దిలకింప♦గగనమందె
కానఁబడుఁగాని యొక్కింత♦గానరాదు, గనఁబడదు సువ్వె తత్పురీ♦జనములందు.

వ॥ ఆనగరంబున కనతిదూరంబున, 151

క॥ నానాతరుశోభితమై, మానిత రేణ్యులకు నాశ్ర♦యపదం బగుచున్
భానుపద మంటి ప్రోన్నతి, మానుగ లవలీనగంబు ♦ మహిమఁ జెలంగెన్. 152

క॥ ఆనగము సమీపంబున, మానితధనధాన్యపూర్ణ♦మందిరుఁ డలరున్
భానునిభభుజవిరాజిత, నానారిపుతముఁడు శబర♦నాయకుఁ డొకఁడున్. 153

క॥ నిరపత్యుండై యాతఁడు, నిరపాయవిషాదమునను ♦ నిరతము సుగుణా
కరమైన వధూమణితోఁ, జిరకాలము పుత్త్రవాంఛ ♦ జేయుచు నుండెన్. 154

మ॥ అతిరమ్యం బగు నమ్మహానగవన♦ప్రాంతంబునందున్ జగ
న్నుతచారిత్రుఁడు బ్రహ్మబోధపరిపూ♦ర్ణుండున్ మహాసత్వసం
యుతుఁ డీశార్చనసక్తచిత్తుఁడు శివా♦ఖ్యుం డొక్కమౌనీంద్రుఁ డం
చితనిష్ఠన్ బరమాద్భుతంబుగఁ దప♦శ్శ్రీధుర్యుఁడై యుండఁగన్. 155

క॥ అత్తరి మునిచెంగటికిం, జిత్తము రంజిల్ల వింత♦చెలువు దలిర్పం
గ్రొత్తపసిండినగల్ దను,కొప్పడు మేన నొకహరిణి ♦ గొబ్బున వచ్చెన్. 156

వ॥ ఇట్లు వచ్చిన యక్కురంగిని మునిపుంగవుం డంగజానలపరిప్లుతాంగుండై కనుం
గొనియె; తదవలోకనమాత్రంబున నద్యోణి గర్భంబు ధరించి యాశ్చర్యంబుగా
లవలీకుండమధ్యంబున బాలికామణిం గనియె. 157

గీ॥ కని విజాతీయమైనట్టి♦తనయ నపుడుఁ గాంచి భయవిహ్వలత నొంది ♦ గానఁ బఱచె
నంత నబ్బాల లవలీకుం♦డాంతరమున, రోదనం బిడఁ గలకంఠ♦నాద మొప్ప. 158

—* లవలీకన్య యానిషాదునింటఁ బెరుగుట *—

వ॥ ఆసమయంబున నిషాదపుంగవుండు ప్రియంగుకేదారంబుఁ గనుంగొన నచ్చటికి

వచ్చి రోదనధ్వనిం జేయు హేమరుచిరాంగి యగు నబ్బాలికం గనుంగొని కుతూహలాశ్చర్యభరితుండై. 159

గీ॥ దానిఁ గొనిపోయి వేగంబ♦దయదలిర్ప, నిజవధూమణికై నిడి♦ నెయ్యమునను
పుత్త్రికోత్సవమొనరించెఁ♦బాలతితోడ, పుత్త్రికనుభామపోషించెఁ♦బొల్పెసంగ.

క॥ బాలామణి నానాఁటికి, లీలాగతి వృద్ధిఁబొందె ♦ లేఁదీవ వలెన్
బాలేందురేఖ చందము, లాలితలావణ్యసుగుణ♦లక్షణనిధియై. 161

మ॥ చెలులం గూడును, బంతులాడు, పదమం♦జీరధ్వనుల్ మ్రోయఁగా
జెలగుం బాటలు పాడు, ముగ్ధగులుకన్♦సింగారము ల్సేయు, బొ
మ్మలకున్ గుజ్జనగూళ్ళవండు, లతలం ♦ బల్మారు పోషించు నా
కలకంఠీమణి తల్లిదండ్రు లలరం♦గా బాల్యలీలారతిన్. 162

వ॥ ఇట్లు బాలక్రీడల ద్వాదశవత్సరంబులు జరిగె. 163

ఉ॥ అంతఁ బుళిందమాళితన♦య న్నయనద్వయనిర్జితాంబుజన్
జెంతకుఁ జేరఁబిల్చి కృపఁ ♦ జేసి మృదూక్తుల బుజ్జగింపుచున్
సంతస మొప్పఁ గొట్టమడి♦చక్కికిఁ గావలిబంచె, బంపినం
గాంత వయస్యతోడ నట ♦ గ్రక్కునఁ బోయి విలాస మొప్పఁగన్. 164

శా॥ మంచం బెక్కి ఝణంఝణారవరణ♦న్మంజీరియై కంకణో
దంచన్నిక్వణము ల్సెలంగ విలస♦ద్ధమ్మిల్లముల్ వీడఁగాఁ
జంచల్లోచనచంద్రికల్ వెలయ నా♦ చంద్రాస్య చాతుర్యముల్
మించం జారువిపంచికాధ్వనుల నెం♦తే దోలె నప్పక్షులన్. 165

క॥ మునులార! వినుఁడు సెప్పెద, ననుపమలవలీనగంబు♦నందు జనింపన్
వనితకు లవలీనామము, దనరెన్ వినుతింప మాని♦దైవగణంబుల్. 166

క॥ నవవికచపద్మనయనను, లవలీకన్యాలలామ ♦ లావణ్యవతిన్
భువిఁ బరిణయించు శరవణ,భవుఁ డాస్కందాద్రినుండి ♦ పరమప్రేమన్. 167

క॥ పరిపూర్ణపురనగంబున, కరుదెంచెన్ జెలువెసంగ ♦ నాసమయమునన్
సురమౌని యథేచ్ఛాసం,చరుఁ డగుచు న్వచ్చె లవలి♦శైలంబునకున్. 168

వ॥ లావణ్యవతి యగు లవలిం గనుఁగొని గుహుపత్ని యని మనంబునఁ దలంచి పరమభక్తి నద్దేవికి నమస్కరించి యప్పర్వతంబుననుండి పూర్ణాఖ్యనగరమహీధరంబున కరుదెంచి యందు దేవదేవుండైన స్కందునిం గని కృతవందనుం డగుచు బృందారకమునిపురందరుండు తారకాంతకునకు నత్యంతసంతోషంబుగా లవలీకాంతవృత్తాంతంబునంతయుఁ దెలిపి యంతరిక్షపథంబునఁ గ్రమ్మఱి యథేచ్ఛం జనియె; నంత, 169

—* కుమారస్వామి లవలీకన్యను వివాహమాడ యత్నించుట *—

క॥ సుకుమారమూర్తి గుహుఁ డా,సుకుమారతనూవిలాస•సుదతీమణినిన్
వికచాబ్జముఖిని లవలీ,శుకవాణి వరింపఁ దలఁచి • సురుచిరలీలన్. 170

సీ॥ బాలేందుసంకాశ•ఫాలభాగంబుతో, కర్ణాంత నేత్రయు•గ్మంబుతోడ,
కంబురేఖను గేరు • గళవిలాసంబుతో, చంద్రికాచారుహా•సంబుతోడ,
శ్రవణకుండలిమణి•చ్ఛవిసముత్కరముతో, సురుచిరకాంచనాం•బరముతోడ,
ధృతబాణకార్ముక•తతభుజలతలతో, నతులవిస్ఫురదలం•కృతులతోడ,
మదనశతకోటిసౌందర్య•మహిమతోడ,కొనురు ప్రాయంపురాజ•రూపమునుబూని,
లవలిగిరికిని జనుదెంచి • లవలిఁ గాంచి, శరభవుఁడు వల్కె వరసుధా•సరసఫణితి.

ఉ॥ ఎవ్వతె వీవు చంద్రముఖి • యెవ్వనిపుత్త్రివి నామ మెద్ది ని
న్నివ్వని కొల్లపైరుకడ • నీగతి కావలియుండఁ బంచువాఁ
డెవ్వఁడు తేనెలూర వచి•యింపుము లజ్జఁ దొలంగి నీదు తే
నవ్వు ముఖాబ్జ మెత్తి లల•నా! ననుఁ జూడుము సుప్రసన్నతన్. 172

వ॥ నీవు విజనం బగు కాననంబున నుచితం బెఱుంగుదువు గాన, 173

క॥ మృగయాయాసముచేతను, మగువా! శ్రమపడితి నీదు•మధురాధరబిం
బగతం బగు నమృతం బా,నఁగ నిమ్ము రహస్య మగు వ•నస్థలి నిచటన్. 174

వ॥ అని యిట్లు కుహనారాజకుమారుం డగు కుమారుండు నర్మాలాపంబులు పలుకు
సమయంబున, 175

మ॥ ప్రమదం బొప్పఁగ వాద్యముల్ మొఱయ ద•ర్పస్ఫూర్తిమై సారమే
యములున్ వెంబడి రా ధనుర్ధరులు క్రూ•రాకారులౌ భిల్లులె
ల్ల మహా•భీకరలీలఁ గొల్వ మృగఖే•లన్ వ్యాధనాథుండు వ
చ్చె మదిం గూర్మి దలిర్ప • నాత్మజను వీక్షింపంగ నచ్చోటికిన్. 176

ఉ॥ అత్తఱిఁ గార్తికేయుఁ డఖి•లామరనందనుఁడు దానిఁ జూచి యు
ద్యత్తరలీలఁ జింత శమి•తాతపమై తగ నీడఁ జేయుచున్
గ్రొత్తగ వేగివృక్షమయి • గొబ్బున నిల్చె మహాద్భుతంబుగన్
నత్తరుశాఖలెల్ల నఖి•లాగమజాలము లయ్యెఁ జయ్యనన్. 177

క॥ వచ్చిన యాశబరాగ్రణి, మచ్చిక దనరంగ తనకు•మారీమణికిం
దెచ్చిన మధుఫలపిష్టము, లిచ్చి సుధాఫణితి ననున•యించెన్ గూర్మిన్. 178

కం॥ వానిభటబలము చెంగట, మానుం గని చోద్య మంది • మన మెన్నఁడు మున్
గానము గద యీతరు వని, దానిన్ ఖండింప మదిని•దలఁచిన యంతన్. 179

వ॥ వారల వారించి యప్పుళిందవరుండు పుత్త్రినిం గనుంగొని యిట్లనియె. 180

క॥ ఈతరువర మిచ్చటి కే,రీతిం జనుదెంచె నమ్మ! • ప్రీతిసెలంగన్
శీతలతఁ జేయు నే యిది, శీతాంశునిభాస్య! నీడ•చే నీ కెపుడున్? 181

ఆ॥ అనుడు తండ్రిఁ జూచి ♦ యా చంద్రముఖి పల్కె, నీమహీజ మున్న ♦ డటుఁగ నిచట
నేనిమూయు మొక్క ♦ యిప్పుడు సూపట్టె, భానుకిరణపంక్తి ♦ బారకుండ. 182

వ॥ అనిన తనయపలుకులు విని నిషాదవర్యుం డిట్లనియె. 183

మ॥ వనమధ్యంబున నిష్ప్రత్యూహము భ♦వ్యప్రోన్నతిన్ మించి నీ
కనపాయంబుగ నీడఁజేయుచు స♦హాయంబై యభీష్టార్థముల్
దనరం జేయుట పల్లవాస్యా! సదగన్ ♦ తన్వంగి! చిత్తంబునం
దు నొకింతేని భయంబు దీనివలనం ♦ దోషంగ నీకేటికిన్? 184

వ॥ అనపాయంబగు నీడఁజేయుచు, సహాయంబై యుండ నిమ్మని యిట్లు భిల్లవల్ల
భుండు వల్లీదేవియుల్లంబు రంజిల్లం బలికి యంత వనాంతరంబునకుం జనియె;
నట్లతండు సపరివారంబుగాఁ జనిన యనంతరంబ, 185

ఉ॥ ఆనగజాత్మజుండు గుహుఁ ♦ డాతరురూపము మాని తోడనే
మానవనాథరూపమయి ♦ మంజులలాస మెసంగఁ బూర్వమ
ట్లానలినాయతాక్షిఁ గని ♦ యత్యద్భుతచాటువచోధురీణతన్
మానిని గౌఁగిలింపననుచు ♦ మాటికిఁ బ్రార్థనఁ జేసె నర్మిలిన్. 186

వ॥ ఇట్లు ప్రార్థించిన యిందీవరనయన నయవినయభరితాంతరంగయై నదనారవిం
దంబు వాంచి మరందంబులు గ్రక్క నిట్లనియె. 187

మ॥ జగతీమండలి నేను హీనకులజన్ ♦ సంప్రీతి నాతండ్రి పెం
పఁగ నిచ్చోట ప్రియాంగనస్యదయమున్ ♦ బాలింతుఁ బ్రీతాతిమిం
చఁగ నీవుత్తమరాజనందనుఁడ వ♦స్మత్తారతమ్యం బొకిం
త గణింపన్వలదే వచింప నిపుడున్ ♦ ధర్మంబె నీకీమెడన్? 188

క॥ బలగర్వోన్నతి మీఱఁగ, వెలయుదు రిచ్చట పుళింద♦వీరులు నిను వా
రలు గాంచిరేని నోర్వరుఁ, బలువడి దండింతు రవల ♦ బరువిడుము వడిన్. 189

వ॥ ఇవ్విధంబున నక్కులకన్యక కపటరాజకుమారుం డగు నక్కుమారునితోఁ బలుకు
నంతలోన, 190

క॥ నానామృగములఁ బోరిగొని,మానితవాద్యములు మొఱయ ♦ మగుడి యచటికిన్
సేనాన్వితుఁడై వచ్చెను, భూనుతవిక్రముఁడు శబర♦పుంగవుఁడు వడిన్ 191

వ॥ తదాగమనం బెఱింగి, 192

శా॥ కేలం దండముఁ బూని తొట్రిలఁగ నం♦ఘ్రిద్వంద్వముల్ ప్రాపుసుల్
వేలాడన్ పలితోత్తమాంగము సము♦ద్వేలంబు కంపింపఁగా
మ్రోలన్ వృద్ధమహీసురాకృతిని సొం♦పుల్ మీఱఁగాఁ దాల్చి వ
ల్లీలావణ్యవతీమనోహరుఁడు ని♦ల్చెన్ విస్మయం బొప్పఁగన్. 193

వ॥ ఇట్లు వృద్ధధరామరవేషంబున నావల్లీవల్లభుండు మెల్లమెల్లనం జనుదెంచి భిల్లవల్ల
భునకు విభూతి యాశీర్వదించి యిచ్చిన నతం డావృద్ధునిం గని బ్రాహ్మణా!

నీ వెందుఁ బోవలయు నపేక్షితం బెయ్యది యని యడిగిన, 194

—* కుమారుఁడు వృద్ధభూసురుఁడై లవలిని మోసగించుట *—

ఆ॥ అనియె వృద్ధవిప్రుఁ ♦ డా నిషాదునితోడ, నాంధ్ర పుట్టి పెట్టి♦ వస్తువాఁడు
కూర్మిఁ దీర్ఘమునకుఁ ♦ గ్రుంకఁగ వచ్చితి, నిన్ను గే ద్రిమునకు ♦ నన్ను తగునె! 195

క॥ అనవుఁడు విని శబరాగ్రణి, యనియెన్ ద్విజవర్య! కుగ్రుకు ♦ ముఖ్యగ త్రా
వన మగు నీతీర్థంబున, ననుదినము సహాయ మగుచు ♦ నస్మత్సుతకున్. 196

క॥ అని పలికి కూర్మితనయకు, మునువలెను ఫలాను లొసఁగి ♦ మోదం బెసఁగన్
దనభటసముదాయమునుతోఁ, జనియెఁ బుళిందాధ్యుఁ డాత్మ♦సదనంబునకున్. 197

ఉ॥ అంతట వృద్ధభూమిసురుఁ ♦ డంగజతాపయుతాంతరంగుఁ డై
కాంతను జూచి, యోవికచ♦కంజదళాక్షి! బహుక్షుధార్తతన్
శాంతి జనింప నన్నిపుడు ♦ సత్కరుణాగుణి బ్రోవు మన్న న
త్యంతకృపామతిన్ మధుఫ♦లాదులు నగ్గి యొసంగ వేడుకన్ 198

వ॥ తాను భుజియించి పానీయం బడిగిన, 199

ఆ॥ వనిత యనియె విప్ర♦వర్యునితోడ నీ, యడవిన త్రకంబు ♦ నవలఁ బోవ
వికచపద్మయుక్త♦ మొకసరోవర మొప్పు, నందు మధురజలము ♦ లాని రమ్ము.

వ॥ అనిన వృద్ధుం డిట్లనియె. 201

ఆ॥ మార్గ మెఱుఁగ నేను, మధుకరనిభవేణి, ముసలివాఁడ నాకు ♦ మోదమెసఁగ
త్రోవఁ జూపు మిపుడు ♦ తోడను జనుదెంచి, తరుణి! నీకు చాల♦ ధర్మమగును.

చ॥ అన విని కీరవాణి కరు♦ణార్ద్రమనస్కత వృద్ధవిప్రుఁ దో
డ్కొని చని చూపెఁ జెంగటను ♦ గోమలఫుల్లసరోరుహోల్లస
ద్ఘనమకరందబిందునవ♦గంధధురంధరతుందతుందిల
ధ్వనదళిపుంజమంజురవ♦ధామము నగ్గ సరోలలామమున్. 203

క॥ జరఠద్విజుఁ డాకమలా, కరమున నాకంఠపూర్తి♦గా సలిలంబుల్
గర మర్థిఁ గ్రోలి క్రమ్మఱ, నరుదెంచి సరోజనేత్రి ♦ కనియెన్ బ్రేమన్. 204

మ॥ కమలాక్షీ! జలతృష్ణ దీరె నిపు డిం♦క న్నీదు సంభోగరూ
పమహాతృష్ణ జనించె మాన్పఁగదవే ♦ బాగైన నీయోష్ఠబిం
బమరందంబులు గ్రోల నిమ్ము కరుణన్ ♦ బర్వేందుబింబాననా!
ప్రమదారత్నమ! నీపదాబ్జమునకుం ♦ బల్మారు నే మ్రొక్కెదన్. 205

గీ॥ మారుఁ డలరుతూపులు బలు♦మారు మీఁద
నేయఁ దొడఁగె నుపేక్షింప ♦ న్యాయమగునె?
కాంత! కౌఁగిటఁ జేర్పు మే♦కాంతమందుఁ
గొమ్మ! విడనాడ కిపుడు ప్రే♦ గొమ్ము నన్ను. 206

శా॥ ఏలే సిగ్గు కురంగలోచన! పరా ♦ కేలే సరోజాననా!
యేలే నిర్దయబుద్ధి నాపయి చ♦లం బేలే కటాక్షింపవే
యేలాతాలరసాలసాలవనిలో ♦ నె ట్లోర్తు నీమన్మథ
జ్వాలాపాలికి సన్నగాలికిని కూ♦జన్మత్తభృంగాళికిన్. 207

వ॥ అని యివ్విధంబున ననంగశరసంభూతజర్ఝరితాంగుండై జరద్ధరామరుండు పలికిన విని యక్కలికి యి ట్లనియె. 208

క॥ భూసురుఁడ వీవు వృద్ధువు, భాసురవిజ్ఞాననిధివి ♦ పలుమరు ప్రణుతిన్
జేసెద నని పల్కెదు నా,తో సరసములాడ నీకుఁ ♦ దోసము చనుమా. 209

క॥ అదిగాక యస్మదీయులు, కదపడి నినుఁ జూచిరేని ♦ ఖడ్గింతురు నే
నిదె ముందరిత్రోవను బో,యెద నీవును వెనుక రమ్ము ♦ స్వేచ్ఛ జెలంగన్. 210

వ॥ అని యిట్లు పలికి యలరువిలుకానిములికి యగు నక్కలికి రాయంచనడ లడర ప్రియంగుకేదారంబు సేరె నని సూతుండు పలికిన శౌనకాదులు విని యవ్వలి వృత్తాంతం బడుగుటయు. 211

మ॥ మరుదారాధ్యపదాబ్జభక్తజనతా♦మందార! కారుణ్యసా
గర! కాల్యాణనిధానమూర్తి! భుజగ♦గ్రైవేయభూషోజ్జ్వలా!
మురభిత్పూజిత! దానశౌర్యవిలస♦న్మృత్యాగలక్ష్మీంద్ర భూ
సురచిత్తాంబుజపద్మబాంధవ! భవా! ♦ స్ఫూర్జత్ప్రభావాన్వితా! 212

క॥ చంద్రాహ్వకుందశారద, చంద్రార్కమణిప్రకాశ ♦ చారుశుభాంగా!
చంద్రార్కవహ్నిలోచన!, చంద్రికలాభరణ! మోక్ష♦సంపత్కరుణా॥ 213

మాలిని॥ ద్రుహిణముఖసురాపా♦స్తోకదివ్యస్వరూపా
బహుళజనితకోపా♦పాస్తదైత్యావలేపా
తుహినఘృణికలాపా♦దూరితాశేషపాపా 214
మహితకుధరచాపా ♦ మానిచిత్తప్రదీపా!

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్ర సకలసుకవిజనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపసగోత్ర కోడూరి మెల్లనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మాంబికాతనయ వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచలకవి ప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత శ్రీశంకరసంహితయందలి శివరహస్యఖండంబున దేవకాండంబునందుఁ బ్రథమాశ్వాసము

శ్రీశివాయ గురవే నమః.

శ్రీ స్కాం ద మ హా పు రా ణాం త ర్గ త

# శివరహస్యఖండము

## దేవకాండము.

### ద్వితీయాశ్వాసము



దేవాంబానందన
మోదప్రద భక్తలోక♦ముక్తిసంధానా!
వేదాంతవేద్య కలుష
చ్ఛేద శశాంకామలాంగ ♦ శ్రీశివలింగా! 1

వ॥ అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుం డి ట్లనియె. 2

శా॥ ఆలీలన్ లవలీలతాంగి జన నె♦య్యం బొప్పఁగా వెంటనే
యాలోకైకశరణ్యుఁ డీశతనయుం ♦ డంచద్గతిం బోయి ప్రో
న్మీలత్కామశరాగ్నికీలములకున్ ♦ మే నోర్చకే జ్యేష్ఠు నా
ర్తాళిత్రాణకృపాగరిష్ఠుని గజేం♦ద్రాస్యుం దలంచె న్మదిన్. 3

వ॥ ఇట్లు తలంచినమాత్రంబున, 4

సీ॥ మధుసారభభ్రమన్ ♦ మధుకరఝంకార, కమనీయగండభా♦గములతోడ
కులమహీధరకూట♦కుట్టాకపటుతర, ధవళాంశుదంతకుం♦తములతోడ
గగనకల్లోలినీ♦కమలనాళోచ్ఛేద, చటులప్రశస్తహ♦స్తంబుతోడ
భుజగలోకాధీశ♦భూరిస్ఫుటాకార, కరపాదవిన్యాస♦గరిమతోడ
ప్రళయకాలాంబుదనినాద♦భాసమాన, భీషణోదారఘీంకార♦ఘోష మొప్ప
మత్తవేదండరూపమై ♦ మహిమ నిలిచె, నెదుట గజముఖుఁ డద్భుతం♦బొదవనపుడు.

మ॥ కరిరాజాననుఁ డవ్విధంబున మహా♦గంధద్విపాకారమై
యురువేగంబున రాగ పద్మముఖి యా♦యుద్దండవేదండవి
స్ఫురణం గాంచి భయంబునన్ గుహుఁ గృపాం♦భోరాశినిం జేరి సిం
ధురభీతిం దొలఁగింపు దేవ! యిదె నే♦తున్ దావకాగ్రజుం గడున్. 6

—* కుమారుఁడు నిజరూపమున లవలితో సుఖించుట *—

వ॥ అని శరణాగతమై దరిఁ జేరినం గటాక్షించి యక్కాంత కభయప్రదాతయై వృద్ధ

భూసురుం డైన యాషణ్ముఖుండు గణనాథునకు నమస్కరించి వేడిన నగ్గజవదనుం డు
తద్రూపం బుపసంహరించి యంతర్ధానంబు నొందె; నంత నిజరూపంబుం దాల్చి,

మ॥ తరుణీయం బగు నవ్వనాంతరమునన్ ♦ రాజీవపత్రేక్షణన్
గొఱురొప్ప న్నెరిగొప్పు దువ్వి నగుచెక్కుల్ ముద్దిడి సీత్కారనా
దములం గుల్కఁగ పల్లవాధరమునం ♦ దంతక్షతల్ జేసి నె
య్యము మీఱంగను గౌఁగిలించె గుహుఁ డాహ్లాదంబునం దేలుచున్. 8

వ॥ ఇట్లుండు షణ్ముఖుం డగు నప్పద్మదేవుని గని భయంబున లేచి పరమామోదంబు
నం బ్రణమిల్లి యంజలిహస్త యగుచు నమ్మృగాంకవాణి యి ట్లనియె. 9

క॥ కందావవిందుగ నీదృశ,సుందరరూపంబు మున్ను ♦ చూపక నీ వి
ట్లుందుకు వంచించితి నను, నిందుకళాధరకుమార! ♦ యిష్టార్థకరా! 10

వ॥ అనుమానింపకు; భవద్విలాసంబు గనుంగొన నాశ్చర్యకరం బైనయది యని
సుధారసంబులొలుకఁ బలికి లవలీదేవి శరవణోద్భవుని సంస్తుతించిన స్కందుండు
మందస్మితవదనారవిందుం డగుచు ని ట్లనియె. 11

గీ॥ తరుణి! వినుము విష్ణు♦తనయవు మును నీవు! నన్నుగూర్చి తప మొ♦నర్ప భక్తి
యేను మెచ్చి నీయ♦భీష్ట మీడేర్పఁగఁ, గూర్మితోడ నిన్నుఁ♦గూడి తిపుడు. 12

క॥ రమణీ! ప్రియంగు కేదా,రమునకుఁ బో మ్మిపుడు నీవు ♦ రయమున నేనున్
గ్రమమున వచ్చెద ననవుడు, కమలానన యాలకించి ♦ కడురాగమునన్. 13

వ॥ ప్రియవల్లభునకు నమస్కరించి యతనికిము న్నా కేదారంబుఁ జేర నచట, 14

ఉ॥ కాంతను దద్వయస్య కని ♦ కంజవిలోచన! యెందు బోయితే?
యింత విలంబ మేల? మది♦ రేక్షణ! సెప్పఁగదే యటన్న నా
యింతి వచించె నోసకియ! ♦ యేను వినోదముగా తటాకమం
దెంతయుఁ గ్రుంకు వాంఛ జని♦యింపఁగఁ బోయితినమ్మ నావుడున్. 15

సీ॥ చక్కని లూనుని♦చక్కెరనమ్మోవి, పరిశుద్ధి బా గయ్యెఁ ♦ బద్మగంధి
నిండుచందురుఁబోలు ♦ నీమోమునందున, స్వేదబిందువులొప్పెఁ ♦ జిగురుబోణి
వెన్నెల వెదజల్లు ♦ వెడదకన్నులగవ, కెంపుసొంపు వహించు ♦ కీరవాణి
ఘననీలరుచు లొప్పు ♦ కప్పుపెన్నెరిగొప్పు, వదలవింతగ యయ్యె ♦ వారిజాక్షి

గీ॥ యెంతఁ బడలితివో బాల! ♦ యేకతంబ, యరిగి యక్కేళికాసార♦వరమునకును,
అధికసాహసమును బూని ♦ తబ్జనయన! యనుచు నర్మోక్తు లాడెవ♦యస్య యంత.

వ॥ ఇట్లాడిన చెలికత్తెపల్కులు విని వల్లీపల్లవాధరి నిజకృత్యంబు శంకించుచు నత్త
రుణి కి ట్లనియె. 17

క॥ ఇందునిభానన! నాపై, నిందారోపణము సేయ ♦ నీతి యగునె? నీ
కందోయికి నకటా! నా,యందము వెగటయ్యెనే న♦వాంబుజనయనా! 18

వ॥ ఇవ్విధంబున నన్యోన్యంబు నాసుందరులు వివాదించు నవసరంబున, 19

క॥ మృగయావ్యాజం బలరఁగ, జగదీశుఁడు మన్మథుఁడు ♦ శరచాపధరుం
డగుచుఁ జనుదెంచి యట నమ్మగువల గని యిట్టు లనియె ♦ మంజులఫణితిన్.

ఉ॥ బాలికలార! యిచ్చటికి ♦ భద్రగజంబు బరుదెంచె మద్భుజా
భీలశరా సముక్తశర♦బృందవిరాజితసర్వగాత్రమై
చాల పరాభవంబునను, ♦ జాడ నెఱింగితిరేని మీర లి
ప్వేళ వచింపుఁ డన్న నలి♦వేణి వయస్య వచించె నంతయున్. 21

క॥ నీసరిశూరునితోడను, భాసురముగఁ బల్కు పొమ్ము ♦ భవదీయభుజో
ద్భాసితశౌర్యం బెట్టిది, మాసన్నిధియందు నుడువ ♦ మాటికి నీకున్. 22

వ॥ అని పల్కు సఖ తనమనంబున, 23

మ॥ ఇతఁ డేంతే యిభరాజమార్గణమిషం ♦ బెంపొంద నేతెంచి యీ
యతివం జూచుచు నున్నవాఁడు మదిమో♦హం బొప్ప యిక్కాంతయున్
గుతుకం బొప్పఁగఁ జూచుచున్న దితనిం ♦ గోర్కెం దగ న్వీరియుం
దతిసందేహము దోఁచుచున్న దని రో♦షావేశము న్మీఱఁగన్. 24

వ॥ అంత యాసఖ నిజకేదారంబునకుం జనియె; మయూరధ్వజుండు దానివెంటం
జని మృదూక్తుల ని ట్లనియె. 25

క॥ వలవదు కోపము సుదతీ, చెలువా! మీయిరువురకును ♦ జిత్తం బలరన్
వలయు నభీష్టము లొసఁగెద, నళినాక్షి కటాక్షదృష్టి ♦ ననుఁ జూడఁగదే! 26

వ॥ అనిన నద్దేవదేవునివచనంబులు విని వనజలోచన యి ట్లనియె. 27

క॥ లోలుఁడవో లె మృగాక్షిని, చాలం జూచెద వ దేల ♦ జనపాలక! యీ
బాలిక సపాదకన్యక, నేలాగున దీని నిశ్చ♦యించెదు మదిలోన్? 28

క॥ బహుతపము సేసి వ్యాధుం, డహిశయనునిసత్కృపాక♦టాక్షము చేతన్
రహిమీఱఁ గనియె దీనిన్, మహిపుత్రికగాగ నృపకు♦మారకతిలకా! 29

వ॥ అనిన పార్వతీనందనుం డి ట్లనియె. 30

క॥ భిల్లకులోద్భవ యనుచున్, వల్లిం జులకంగ నాడ♦వచ్చునె మగువా?
ముల్లోకంబులకామిను, లెల్లం జెలికాలిగోరి కె♦నయే? వినుమా. 31

ఉ॥ ఆనయనాంబుజాతయుగ ♦ మామధురాధరబింబవిభ్రమం
బానగుమోముచక్కదన ♦ మాకుచకుంభవిలాసవైభవం
బానడు మూకటీవిభవ ♦ మానడ యాజడ యామొయార మా
హా నుతియింపఁగాఁ దరమె ♦ యాచతురాస్యుకైన ధారుణిన్. 32

చ॥ పలికెడి దేమి యింక విను ♦ పంకజలోచన, తాళఁజాలఁ బూ
విలుతుశరాళి కేను, వలి♦వేణిని శీఘ్రము దెచ్చి కూర్చు మా

జలరుహగంధి, నిర్దయత ♦ జవ్వని నాకును గూర్పవేని సొం
కలరఁగఁ జూపు చిత్రపట♦మందున నైన లిఖించి యిచ్చెలిన్. 33

వ॥ అనిన యతనిపలుకులు విని సఖిలలామంబు నీవంటి యభిమానశాలి కిది యుచి
తంబుగా దని యిట్లనియె. 34

—* కుమారుఁడు రాకుమారరూపమున లవలిం గలియుట *—

చ॥ వదరఁగనేల నీ విటుల ♦ భామినిఁ దోడ్కొని తెత్తు నిప్పుం
బొదవఁగవేగ నీకడకు ♦ నుండుము వేడుకమీఱ నివ్వనిన్
సుదతిని నన్ను జూచినను ♦ శూరులు భిల్లులు బాధసేతు రీ
వదియు నెఱింగి సారసద♦ళాక్షిని బ్రోవుము సావధానతన్. 35

వ॥ అని యిట్లు కర్ణరసాయనంబు లైన వచనంబులు బలికి నిమిషమాత్రంబున
నాసఖిలలామంబు లవలీసవిధంబున కరిగి ప్రణమిల్లి యిట్లనియె. 36

క॥ నీరూపురేఖఁ గనుఁగొని, యారాజవతంసతనయుఁ ♦ డారామమునన్
మారునిబారికిఁ జిక్కెను, గూరిమి విభు నతని నేలు♦కొమ్మా కొమ్మా! 37

వ॥ అని యిట్లు తదభిలాషంబుల విశేషించి యక్కామినికిం దెల్పి యాసుందరిం
దోడ్కొని తెచ్చి యారామంబున నొక్కచో నిలిపి వయస్య పుష్పాపహారవ్యా
జంబున నవ్వలకుం జనియె; నంత, 38

మ॥ చెలువు న్మీఱ గుహుండు వచ్చి లవలిం ♦ జెంతన్ విలోకించె, నా
జలజాతాక్షియు, దేవదేవుఁ గని ల♦జ్జానమ్రయై లేచి యం
జలిఁ గావింపుచు మ్రొక్కి మ్రోల నిలిచెన్ ♦ సౌందర్య మింపొంద చం
చలతన్ మాని ధరావతీర్ణ యగు నా♦సౌదామినీవల్లి నాన్. 39

మ॥ అపు డాయిందుకళావతంససుతుఁ డ♦య్యారామమం దొక్కచో
క్కుఱు లేమావికురంగటన్ సమదభృంగ♦స్వానము న్గుల్క నం
దపుఁబూజప్పరమందు సొంపుదనరన్ ♦ దన్వీమణిం గూడె న
య్యపుఁ బల్కుం జెలిపీనుగోయిని మరం♦దాసారముల్ గుప్పచున్. 40

సీ॥ పసిడికుంభములతోఁ♦బ్రతిఘటించు నురోజ,యుగళిని నెలవంక♦లునిచియు నిచి
చక్కనినిద్దంపు ♦ చెక్కుటద్దంబులఁ, బ్రేమమీఱగ ముద్దు♦బెట్టిపెట్టి
తమి జిగుర్పఁగఁ జాల ♦ తలియుడా లెసఁగు తి,య్యనిమోవి తేనియ♦లానియాని
నంపెంగ లేదీవ♦సొం పెసంగెడుమేను, చెలువందఁ గౌఁగిటఁ♦ జేర్చిచేర్చి
జడను నిండార క్రొవ్విరి♦సరులు జుట్టి, మట్టుమీఱిన మోహంబు ♦ చిట్టకములఁ
గలిసి రతికేళిఁ దేలించె♦కాంత నెలమి, కుసుమశయ్యను సేనాని♦కోర్కెలెసఁగ. 41

చ॥ ముదిత వయస్య యంత మది ♦ మోద మెసంగ వనాంతసీమ శా
రదవనసాంద్రకల్పతరు♦రాజిని సారెకు నిల్చినిల్చి పూఁ

శివరహస్య ఖండము.



కుమారస్వామి రాకుమారరూపంబున
లవలిం గలియుట.

బూదలను దూరిదూరి తెలిపుప్పొడితిన్నియు లెక్కలెక్క సొం
పొదవంగ వచ్చె నవ్వేలందియొద్దకుం బుప్పులు గొంచుం గ్రిమ్మలున్. 42

క॥ కొనితెచ్చినయూరివిరులన్, వనజేక్షణజడను ముడిచి వైఖరిమీఱన్
కనకాంగి నంతం దోడ్కొని, జనియెన్ గేదారమునకు సఖ వేగమునన్. 43

వ॥ ఇట్లు నక్కేదార బుం జేరి వల్లీదేవి గుహునిపొందు డెందంబునం గోరుచు విరహాకుల యగుచు నుండెం; దదనంతరము ప్రియంగులపంట యుడుగుటయు నంత భిల్లులు వల్లీదేవిని మందిరంబునకుం దోడ్కొనిపోయిరి; తత్సఖియు నిజగృహంబు సేరె. 44

మ॥ లవలీకాంత గుహుం దలంచి సుమభల్లజ్వాలసంతప్తయై
యువతీసంగతిం గూడ దొంతయును, బాయు గ్గందుకక్రీడ, మా
ను విహారాసనభోజనక్రియలయందు న్వాంఛ, నంతేవి భ్రాం
తివదింపన్ మృగపక్షిశైలతరుపంక్తిన్ జూచి యశ్రాంతమున్. 45

గీ॥ మఱియు నిట్టూర్పులు జనింప మహిని వ్రాలు
కన్నుఁగవ బాష్పము ల్నించు గమ్ము భ్రమించు
నాల్క చేఁ గుందు కళవళంబందు సారె,
చింతఁ గాంచును మూర్ఛను జెందు మిగుల.

వ॥ ఇట్లు విరహాకుల యగు తనయం గని జననీప్రభృతిజనంబు లావేశం బని శంకించి తన్నివృత్తికొఱకు కులదైవతగణంబుల ధూపదీపనైవేద్యాద్యుపచారంబులం బూజించిరి. 47

క॥ ఆవేళ వల్లిజననికి, నావేశము వచ్చి గుహునియందలి యనురా
గావిర్భావము కోమలి, కీవగం గావించె ననుచు నంతయుం బలికెన్. 48

వ॥ ఇట్లు నిజవల్లభునిం బేర్కొనిన విని యావల్లీదేవి మఱియు బహువిధంబుల విరహావిహ్వల యగుచు నుండె; నంత వల్లీవల్లభుండు పంట యుడిగిన యక్కేదారంబుచెంతకుం జనుదెంచి, 49

క॥ అం దెల్లెడలన్ వల్లీ, సుందరినిం గాన లేక సుక్కుచు గుహుండున్
డెందమున చింత నొందుచు, కందర్పశరౌఘదళితగాత్రుం డగుచున్. 50

సీ॥ తిలకంబ కానవే తిలకభాసురఫాలం, గాంచన కానవే కాంచనాంగి
నబ్జంబ కానవే యబ్జసన్నిభనేత్రం, గుందంబ కానవే కుందరదనఁ
బున్నాగ కానవే పున్నాగనిభయానం, గనకంబ కానవే కనకనాసం
బాటలి కానవే పాటలిగంధిని, లికుచంబ కానవే లికుచకుచను
సిద్ధవరులార ! లోకప్రసిద్ధులార !, నగములార ! విహంగపన్నగములార !
సరసనదులార ! కేళికాసరసులార !, మెఱుగుంబోణిని గానరే మీర లిపుడు. 51

చ॥ తళుకుమెఱుంగుచెక్కులును ♦ ధాళధళుల్ దులకించు తమ్మిరే
కులసరిబోలు కన్నులును ♦ కుందనపుంబనటుల్ హసించు బల్
కులుకుచనుంగవం దనరు ♦ కోమలి మీఁయెడ డాగియుండినన్
జెలువుగఁ జూపరే మఱుఁగు ♦ జేయక పూఁబొదలార! యిత్తఱిన్. 52

వ॥ ఇట్లనేకవిధంబుల నమ్మాకుమారుండు రమణిం గానక విరహంబునం బొగులు నాసమయంబున, 53

చ॥ కువలయపాలనక్రియకు ♦ గొబ్బున పట్టముఁ గట్ట యామినీ
ధవునకు సాంధ్యకింకరుఁడు ♦ తత్క్షణ మగ్నిజలంబు దేర ముం
చు విపులహేమకుంభ మన ♦ సూర్యుఁడు గ్రుంకె పరాంబుధిన్ దదు
త్సవమునఁ గట్టు మాౘ్తికవి♦తానమునా నుడుపంక్తి భాసిలన్. 54

క॥ పరగె నుదయాచలంబునఁ, బరిపూర్ణకళావిలాస♦భాసురుఁ డగుచున్
సరసిరుహవైరి ప్రాచీ,తరుణీమణిచేతి వజ్ర♦దర్పణ మనఁగన్. 55

మ॥ అపు డుర్వీస్థలి కందువెన్నెలలు ప్రో♦ద్యజ్జ్వాలలై మించ గాం
చి పురారిప్రియసూనుఁ డిట్లనియె రా♦జీవారి! పాంథావళిన్
విపులక్లేశము బొందఁజేయఁ దగునే? ♦ వేమారు నుద్వృత్తి మిం
చి పయిం రావల దెంతయు న్నటకటా! ♦ జీవారి పీ వెన్నఁగన్. 56

ఉ॥ నీరజవైరి! నీనడఁత ♦ నే నిఁక నే మని చెప్పఁ? దండ్రికిన్
సారెకు భంగముల్ సలుప ♦ సాగితి వెప్పుడు సత్సమూహముల్
వారక తేజమొందెనో భ♦వద్గతి చంచలవృత్తి జొప్పడన్
శూరులఁ గొట్టి యెంతయును ♦ సోదరిమందిరము న్ప్రసిద్ధిఁగన్. 57

ఉ॥ దూరవియోగినుల్ మధువు ♦ దూర విశేషముఁ జెందఁ బూపొదల్
దూరుచు నేపుమీ రిపుకు♦దూరుచులన్ మయి దూసరంబుగా
నీరజకైరవప్రజవ♦నీరజముల్ నెఱయంగ నించుచున్
మారుతబంభరప్రియత♦మారుతసంగతి వీరి కెంతయున్. 58

క॥ మదనాదర మెద యేటికి, మదనాదరకరుఁడ వగుచు ♦ మార్గణతతులన్
గదనాస్థ నీకుఁ జెల్లం,గద నానాభువనములను ♦ ఘనశౌర్యనిధీ! 59

వ॥ ఇట్లు విరహాభరంబున నిందు మందపవమానుల నిందించి, కందర్పుని భుజాపరాక్రమంబు భంగించి, యగ్గిరిజానందనుండు సని మందగమనంబున లవలీసుందరీ మందిరంబు వెనుకం జేరి, 60

ఉ॥ ఇందునిభాస్య యిల్వెడలి ♦ యెప్పుడు వచ్చునో, వచ్చి ప్రేమ నా
ముందర తేనియల్ గులుక ♦ ముద్దుగ నెప్పుడు బల్కుఁ, బల్కి సొం
పొందఁగఁ గూడు నెప్పు డని ♦ యువ్విళులూరుచు బొంచియున్నచో
నం దరుదెంచె సుందరిప♦యస్య ప్రియంబు జనింప నెంతయున్. 61

గీ॥ పెన్నిధానంబుఁ గాంచిన ♦ పేదవోలె
దానిఁ గనుఁగొని గుహుఁడు మో ♦ దమునఁ జెలఁగి
యనియె నోకొమ్మ! నీ నేర్పు ♦ దనర నిపుడు
వాంఛితంబును జేకూర్చ ♦ వలయు నాకు. 62

వ॥ అనిన యతనిముఖంబు గని సఖ యి ట్లనియె. 63

చ॥ సురుచిరలీల నాలవలి ♦ సుందరి నీసముఖంబు సేర్తు నే
వెరవున నైన, నీవు విను ♦ విన్నప మొక్కటి, భిల్లవర్యులున్
బరగఁ జరింతు రెల్లెడల, ♦ భావజకేళికి నిందుఁ గూడ దో
పురుషవరేణ్య! దవ్వుఁ గొని ♦ పోయి విలాసినిఁ బొందు మెంతయున్. 64

వ॥ అని యి ట్లుపాయంబుఁ దెలిపి శీఘ్రంబ లవలీగృహంబున కరిగి కవాటంబుఁ దెఱచి జననీజనకాదులు నిద్రాసక్తులై యుండ మెల్లన వల్లీలతాంగినిం దోడ్కొని యాసఖిని షణ్ముఖుసన్నిధికిం దెచ్చి మొచ్చులుగుల్క ని ట్లనియె. 65

శా॥ బోయల్ జూచిన బాధ సేతురు సుమీ ♦ పూఁబోఁడి నివ్వేళ నం
తేయత్నంబునఁ గాచియుండవలె నా ♦ నీనెయ్యముం దియ్యమున్
మాయ ప్రేక్షణ యందు నుంచవలెను ♦ మ్మా యంచుఁ దత్పాణియుం
దా యేణాక్షికరంబు లుంచె సఖ య ♦ త్యంతప్రియం బొప్పఁగన్. 66

వ॥ ఇ ట్లొనిచి సకలోపచారంబులుఁ జేసి శరజన్మునకుం బ్రణమిల్లి వల్లిం గౌఁగి లించుకొని తదనుమతి వడసి వయస్య నిజగృహంబున కరిగె నంత. 67

క॥ వల్లీదేవియు గుహునకు, నుల్లము రంజిల్ల మ్రొక్కి ♦ యొప్పఁగఁ బలికెన్
వల్లభ! నిశీథమున రా, జెల్లునె? నామీఁది కరుణ ♦ చేతను గాదే? 68

—✱ కుమారస్వామి లవలీదేవితోఁ గేళికారామంబుల సుఖించుట ✱—

వ॥ అనుప్రియురాలిపలుకులు విని మోమున చిఱునవ్వుఁ జెలంగఁ గ్రామపాలకులు గానకుండ నాసుందరిం దోడ్కొని చని, దూరంబున నొక్క కేళికారామంబుఁ జేరి యందు యమ్మందయానతోడ నిందుధరనందనుండు కందర్పకేళీవినోదంబుల నుండె; నంత, 69

ఆ॥ సకలభువనజయము ♦ సాధించి రహి కెక్క, కాముఁ డిక్షుధనువు ♦ కడకుఁ జెక్క
గగనరమకు నొక్క ♦ ఘనకాంతి పెంపెక్క, వేగఁబోడమి చక్క ♦ వేగుఁ జుక్క.

మ॥ రమణుం బాసి మహాపదం బొగులు నా ♦ రాజీవనీకాంతకుం
బ్రమదం బొప్పఁ బ్రభాకరాగమము శుం ♦ భద్భల్లి లాలక్షసం
ఘములున్ గాన శ్రీవాచకు లలరఁగా ♦ చాటించుచున్నన్ దిశం
గి మహిన్ గూసెను తామ్రచూడవితతుల్ ♦ గేహాగ్రభాగంబులన్. 71

మ॥ కమలాప్తుండు విపద్దశావశత వే ♦ గం బోవుచో యామినీ
దమయుం దెంతయు దాచియున్న వసువుల్ ♦ దా గ్రమ్మఱం బొంద రా

గముఖంబుల్ గడువెల్లనైన యట్టులన్ ♦ గన్పట్టె దీపంబులన్
విమలచ్ఛాయపరస్వముల్ నిలుచునే ♦ వేమాఱు గాంక్షించినన్? 72

సీ॥ దోషాకరస్ఫూర్తి ♦ దొడరు రాజును వేగ, పశ్చిమముఖముగాఁ ♦ బాఱదోలి
యపరిశిష్టను గాంచు ♦ యలకైరవావలి, మునుమున్న మోముఁలు ♦ ముడువఁజేసి
జగదజ్ఞతాపాది ♦ చటులతమోదైత్యు, నెందేని గిరిగుహా ♦ లందుఁ దఱిమి
దివిజాశనంబైన ♦ ధవళాంశురుచులను, దివిజారికెల్లను ♦ దిగులుపఱచి
చక్రిముల నేలి యిందిరా ♦ సదనములను, బ్రోచి దిశలను బోధంబుఁ ♦ బొందఁజేసి
యవనిసురలను సత్క్రియ ♦ లందుఁ జేర్చి, ధర్మపథము ప్రబద్ధబాం ♦ ధవుఁడు వొడిచె.

సీ॥ కస్యపమునిగర్భ ♦ కలశాబ్ధిరత్నంబు, నిగమభూరుహశిఖా ♦ నియతి ఫలము
ప్రాక్పురంధ్రీమణీ ♦ ఫాలకాశ్మీరంబు, మూర్తిత్రియవిలాస ♦ ముకురతలము
గగనకాంతాహస్త ♦ కాంచనవలయంబు, పద్మినీకామినీ ♦ భాగ్యరేఖ
ఛాయావిలాసినీ ♦ చారుమాంగళ్యంబు, ధ్వాంతమహాటవీ ♦ దావవహ్ని
కాలపురుషుని పద్మరా ♦ గంబు తాళి, సకలపుణ్యపరంపర ♦ జన్మభూమి
కలువజనరాలితలఁగూరు ♦ కర్మసాక్షి, యుదయనగమునఁ బటులన ♦ భ్యుదయమగుట.

వ॥ అంత గృహాభ్యంతరంబున వనితామతల్లి యగు వల్లీజనని లేచి, పార్శ్వంబున
తనూజం గానక భయంపడి తత్సఖిం జూచి లవలి యెందు సనియె నని యడిగిన
నదియుఁ బ్రభాతంబుననుండి నే నెఱుంగ ననియె; నంత శబరాలయంబున
హాహాకారంబుల విని విషాదపుంగవుండు రోషభీషణుం డగుచు, మదీయతనూ
భవను జోరత్వంబునఁ గొంపోయి యొక్కండు జీవింపనేర్చునే యని శీఘ్రంబ
ఘోరాకారు లగు నాత్మీయభటుల ననేకుల నఖిలమార్గంబుల నన్వేషింపం
బంచి తానుం జనియె, నప్పుడు, 75

మ॥ చని భిల్లుల్ వెస ఘోరకాననసరి ♦ చ్ఛైలప్రదేశంబులన్
గనుఁగొంచున్ గ్రమమొప్పనచ్చటొకచోఁ ♦ గాదంబజంబూలస
త్పనసాశోకమధూకకాంచనసము ♦ ద్యద్భూజవిభ్రాజితా
వనమందున్ గని రావభూవరుల ఘా ♦ స్వద్రూపలావణ్యులన్. 76

ఉ॥ అత్తఱి పూర్ణచంద్రసదృ ♦ శాసన వల్లి మనస్సరోరుహం
బుత్తలమొంద లేచి కరు ♦ ణోదధి! దేవ! శరాసపాణులై
యుత్తముగాఁ బుళిందులిదె ♦ మోరలను వచ్చిరి ప్రోవు మంచు బల్
తత్తరపాటుతో విభుప ♦ దంబుల వ్రాలినఁ జూచి నవ్వుచున్. 77

క॥ వల్లభుఁ డనె నే నుండఁగ, ఫుల్లసరోజాక్షి! యేల ♦ పొందెదు భీతిన్
భిల్లులగర్వం బణఁచెద, నుల్లం బలరంగఁ జూచు ♦ చుండుము వెనుకన్. 78

వ॥ అని యివ్విధంబున వల్లీదేవి కభయంబుఁ దెలిపి శివకుమారుండు పడంతిని
వేడుక వెనుక నిడికొనియె; నాసమయంబున, 79

శా॥ పుత్త్రీచోరుఁడు వీఁడె యంచు శబరుల్ ♦ భూరిధ్వనుల్ సేయుచున్
పత్రివ్రాతము నింప, వల్లి మదిఁ గంపం బొంది వే లేచి, యీ
శత్రుశ్రేణులఁ జక్కడంచి భుజభాస్వత్ప్రౌఢిఁ జూపట్టు నా
ర్తత్రాణైకధురీణ! ప్రోవఁగదవే ♦ తన్నుం గటాక్షింపుచున్.　　　80

వ॥ అని యిట్లు లవలీదేవి వేఁడిన శంభుసూనుం డప్పు డాత్మ ప్రమథుం దలంచెఁ; దలంచినంతన నదియు నతిరయంబున నరుదెంచి ప్రళయాంబుదనినదంబులం బోలె నతిభయదంబు లగు మహాధ్వనులు సేసె; తదాకర్ణనంబున నిర్గతప్రాణులై సకలశబరులు ధరణిం ద్రెళ్ళిరి.　　　81

ఆ॥ ఇట్లు శబరవరుల ♦ నిలఁ గూల్చి హరిసూనుఁ, డాత్మహర్షమునఁ గ ♦ నరిగె నపుడు
జనకఖేదమునను ♦ సంతాప మడరంగ, వెలఁది చనియెఁ బ్రాణ ♦ విభుని వెంట.　　　82

వ॥ అప్పుడు మార్గంబున బ్రహ్మాత్మసంభవుం డగు నారదుం డరుదెంచి గుహునకుఁ బ్రణమిల్లి దేవా! నిఖిలశబరవరుల మగుడ సంజాతచేతస్కులం జేసి యీ మంజువాణిని విధ్యుక్తంబుగాఁ బరిణయింపవలయు నని ప్రార్థించిన దద్వచనంబు లంగీకరించి సురసేనావల్లభుండు సురమునిఁ వీడ్కొని వల్లీసుందరిం గనుంగొని యిట్లనియె.　　　83

క॥ ఓదేవి! విను భవజ్జనకాదులఁ బ్రదికింతు మగుడి ♦ యస్మదనుజ్ఞన్
ఖేదంబు మాను మనవుఁడు, మోదము జిగురొత్త చిత్త ♦ మున సతి యపుడున్.

వ॥ జనకాదులఁ గృపావీక్షణంబునం గనుంగొనిన వారలు నిద్రమేల్కొనిన తెఱంగున లేచి; రపుడు లీలామానుషవిగ్రహుం డగు గుహుండును ద్వాదశలోచనవిభాసమానంబును, మందారకుసుమమాలికాలంకృతమహోరస్కంబును, మహాగ్రీవంబును, ద్వాదశబాహుపరిశోభితంబును, మణిమయభూషాలంకృతంబును నగు నిజస్వరూపంబు సూపిన నప్పులిందులు పరమానందంబుం బొంది భయభక్తులు దనర తత్పాదారవిందంబుల కెఱఁగి కృతాంజలులై సంస్తుతింపుచు నిట్లనిరి.

—* భిల్లుఁడు లవలిని కుమారుని కిచ్చి వివాహము చేయుట *—

శా॥ దేవా! విన్నప మాలకింపుము ధరిత్రిన్ మాకులాచారమున్
బోవం జేసి బలాత్కృతిం దనర నంభోజాక్షి మాకన్నియన్
నీ విట్లుం గొనిపోవ యుక్త మగునే? ♦ నిందింప రే బాంధవుల్?
మావంశమ్మున నిట్టి లేనినడతల్ ♦ ప్రాపించె మున్నాటికిన్.　　　86

వ॥ అదిగావున నీవు విధావక్రమంబున నీకన్యను వివాహంబు గమ్మని నమస్కారపూర్వకంబుగాఁ బ్రార్థించిన జగత్ప్రభుం డగు శివకుమారుండు తద్వచనంబులకు వల్లె యని నారదసహితుండై వల్లీదేవితోడ శబరపురంబుఁ జేరె; నంత,

శా॥ అంచద్భక్తిఁ బులిందనాథుఁ డపుడున్ ♦ వ్యాఘ్రాజినం బొప్ప న
క్క్రౌంచారాతికి నాసనం బిడి సపర్యల్ సేసె నుతేసియున్

గాంచెఁ సర్వజనంబు లప్పుడు నరా♦కారంబు సూపట్టఁగన్
గాంచె న్వల్లి విముక్తకంచుకభుజం♦గం బట్ల దివ్యాకృతిన్. 88

వ॥ అప్పు డవ్వల్లీదేవిని భిల్లీపల్లవాధరులు పెండ్లికూతుం జేసిరి. 89

సీ॥ తాళగతు ల్గుల్క ♦ తలయంటె నొకకొమ్మ, కలికికి కంకణ♦క్వణములొప్ప
పసుపునిగ్గులు దేర ♦ పూసగంగ నొకజాణ, చెలువకు నలుగిడె ♦ చెలువమీఱ
బాగుగా పన్నీట ♦ పద్మలోచన యోర్తు, మగువకు జలకం బ♦మర్చెఁ క్షౌమ
మృదుదుకూలంబుచే ♦ ముదితయొక్కతె వేగ, వెలఁదికి తడియొత్తె ♦ వేడుకలర
కాంత కొకకోమలి మడుంగు♦గట్టనిచ్చె, కురులుజడవేసియొకలేమ♦విరులుదురిమె
హారములువేసె నొకతన్వి♦యతివకెలమి, తిలకమునుదిద్దె నొకభామ♦జలజముఖికి.

క॥ క్రొమ్మించుకులు దులకింపఁగ, సొమ్ములు మేనెల్ల నిండ ♦ సుదతి కలంకా
రమ్ములు జేసిరి వింతగ, కొమ్మలు హృదయాంబుజములఁ ♦ గుతుకం బలరన్.

క॥ మానవతీమణి యిప్పుడు, మానుషమణి దివ్యరూప♦మహిమ జెలఁగుచున్
సానన్ దిద్దిన నిద్దా, మానికపుబొమ్మకరణి ♦ మహిఁ జూపట్టెన్. 92

సీ॥ రంగుగా ముంగిళ్ళ ♦ రంగవల్లుల దీర్చి, రంగనాజనములు ♦ హర్షమెసఁగ
మెచ్చులు గులుకంగ ♦ పచ్చతోరణములు, గట్టిరి వాకిళ్ళ ♦ గరిమమెఱయ
చప్పరంబుల వింత ♦ చొప్పడ మేల్కట్లు, సవరించి రెంతయు ♦ సంభ్రమమున
కదళికాస్తంభముల్ ♦ ఘనలీల నాటిరి, విశదము ల్జేసిరి ♦ వీథులెల్ల
పరగఁగూర్చిరి పెండ్లిసం♦భారములను, తూర్యవాద్యంబులును మ్రోసె♦దోరముగను
బంధుజనములు వచ్చిరి ♦ భవ్యలీల, పద్మగంధులు పాటలు ♦ బాడి రెలమి. 93

తే॥గీ॥ వేడుకలరంగ కల్యాణ♦వేదియందు, భిల్లవర్యుండు త్రిభువన♦వల్లభునకు
తనకులంబెల్ల ధన్యత♦దనర సుతను, ధారఁబోసెను శాస్త్రవి♦ధానమొప్ప. 94

క॥ నారదముని యపు డగ్నిను, దారత లాజలును వేల్చె ♦ ధరణీసురలున్
భూరితరాశీర్వాదము, లారూఢిగఁ జేసి రమిత♦హర్షం బెసఁగన్. 95

వ॥ ఇవ్విధంబున మహోత్సవంబు చెలంగ సకలకల్యాణగుణాకరుం డగు దివిజసేనా
వల్లభునకు భిల్లపుంగవుండు వల్లీదేవిని విధ్యుక్తంబుగా వివాహంబు సేసి యంత, 96

మ॥ ఫలబృందంబులు పానకంబులు నపూ♦పంబుల్ దగన్ బాయసం
బులు క్షీరాజ్యదధిప్రవాహములు సొం♦పు న్మించు శాల్యోదనం
బులు శాకంబులు సూపముల్ మదికి మో♦ప్పుల్గుల్కగా బాంధవా
వళితో విందు లొనర్చె నల్లునకు భా♦స్వత్ప్రీతి భిల్లుం డొగిన్. 97

వ॥ మఱియుఁ గర్పూరతాంబూలగంధమాల్యాది దివ్యాభరణంబు లొసంగెఁ బర
మాదరంబున. 98

ఉ॥ ఆ సమయంబునన్ హరియు ♦ నబ్జజుఁడాదిగ వేల్పులందఱున్
భాసురలీలఁ గొల్వ దివి ♦ పార్వతితోడను జంద్రశేఖరుం

డాసుకుమారమూర్తులగు • నట్టి నథూవరులఁ మనోంబు జో
ల్లాసమెసంగఁ జూచె శుభ • లక్షణముల్ గనువిందుఁ జేయఁగన్. 99

క॥ దంపతులు లేచి యాదిమ, దంపతులకు మ్రొక్కి రపు డు • దంచితభక్తిన్
సొంపుగ సుమవర్షంబు ని,లింపులు గురిసిరి ప్రమోద • లీల లెసంగన్. 100

క॥ హరిపద్మాసనముఖు లగు, సురలుం బ్రణమిల్లి రోలి • శుభ వేషములం
బరగెడి లవలీగుహులకుఁ, బరమదయాళుల కభీష్ట • ఫలదాతలకున్. 101

వ॥ అంత మహాదేవుండు దేవగణంబుతోడ నంతర్హితుండయ్యె; నిషాదవర్యుండు వసంతోత్సవంబుఁ జేసె; త్రిభువనచింతామణి యగు లవలీకాంతునకుఁ బ్రణామపూర్వకంబుగా మనోహరవస్తుజాలంబులు నరణంబు లొసంగి తనూజకుం దివ్యాంబరాభరణపేటికలను, గంధకస్తూరికాపరిమళద్రవ్యంబులను, దాసదాసీజనంబులను నిచ్చి, ప్రియం బలర నవ్వధూవరుల ననిచె; నాసమయంబున. 102

—* ఖిల్లుఁడు లవలిని కుమారునివెంట యత్తవారింటి కంపుట *—

సీ॥ గట్టురాకూతురు • కంజాక్షి! నీయత్త, చిత్తమెట్టు గఱంగఁ • జేసె దమ్మ
యంగిట విష మున్న • దతివ! నీమానుకు, ప్రియ మొప్ప నెల్లు వ • ర్తించె దమ్మ
మారుమోమును బెట్టు • మానిని! నీబావ, మెచ్చంగ నేరీతి • మెలఁగ దమ్మ
కలహంబునకు వచ్చు • కాంత! నీసవతియు, దానికి నెబ్బంగి • తాళె దమ్మ
పుట్టినింటికి నీవును • మెట్టినింటి, కెటుల కీర్తిని దెచ్చెదో • యింతి! యనుచు
బుద్ధిఁ దెల్పెను మధురోక్తి • బుజ్జగించి, తనయ కెంతయు వనితామ • తల్లితల్లి.

వ॥ అంత వల్లీమనోవల్లభుండు నత్తమామ లగు నిషాదదంపతులయనుజ్ఞ వడసి యచటి బంధుజనంబుల కందఱికిం జెప్పి వారల వీడ్కొని క్రమ్మఱ దేవీసహితుండై శబరాంగనలు గొలువ శోభనం బగు పరిపూర్ణపురస్థనగంబుం జేరి యందు నానారత్నవిచిత్రితంబును, విశ్వకర్మనిర్మితంబును నగు దివ్యసింహాసనం బధిరోహించి కాంతతోడ వినోదగోష్ఠి నుండె; నప్పుడు, 104

గీ॥ వల్లి గుహునకుఁ బ్రణమిల్లి • పలికె నున్న, తముగఁ గనుపట్టు నిప్పర్వ • తంబు నామ
మద్ది మహిమ యెట్టిది నాకు • నెఱుఁగఁ దెల్పు, మనుడు సేనానియిట్లను • నతివతోడ.

వ॥ దేవీ యిమ్మహీధరేంద్రమ్ము లక్ష్మీనివాసం బగుటను బరిపూర్ణాఖ్యం జెలంగుచుండు; నాతో సమరంబునకుం దొడంగి సకలశత్రుపుళిందులు హతులగుటం జేసి యుద్ధాద్రియనం బేరువడసె; మఱియు నిది కాంచీపురసమీపంబగుటం జేసి యత్యుత్తమం బై తనరు; కాంచీసమీపంబులైన పుణ్యస్థలంబులలోన పర్వతంబులలోన కైలాసపర్వతంబునుం బోలె నిప్పర్వతంబు బ్రకాశిల్లుచుండు; వీణావేణుమృదంగాదివాద్యంబులు మొఱయ నిం దేను నిరంతరంబు విహరింపుచుండు. 106

మ॥ అమలాంభఃపరిపూరితంబయిన కల్హారాఖ్య కాసార మిం
దము రేందు్రిండు సృజించి పూర్వము త్రిసంధ్యంబుల్ ననుం బూజసే
సి మనోభీష్టము బొందె నీసరసిలోఁ జెంగల్వలున్ మూఁడుకా
లములందుల్ వికసించుఁ బ్రత్యహము గుల్కం దివ్యసౌరభ్యముల్. 107

క॥ ధారుణి నీగిరిఁ జూచిన, వారలకు నఘంబులెల్లఁ బాయును నీ కా
సారజలస్నాతలకును మ,దారాధనపరుల కిత్తు నస్మత్పదముల్. 108

క॥ విజితేంద్రియుఁడై యెవ్వఁడు, భజియించెడు నన్ను నిచటఁ బంచదినంబుల్
నిజముగ నాతఁ డభీష్ట,వ్రజములు భువిఁ బొందు ముక్తి వడయును బిదపన్.

క॥ గిరివర మిది కనుఁగొని యే, నరులేనియు భక్తి దనర నతిఁ జేయురు త
ద్గురుధనసంచితపుణ్యో,త్కరములు దురితైకఫలవిధాయకము లగున్.

గీ॥ ఎట్టిపాతకులేనియు నీనగంబుఁ, జూచి మ్రొక్కిన పాతకస్తోమ వడఁగు
వారు బ్రహ్మాదిదివిజులు వాంఛసేయు,తత్పదంబును గాంతురు తథ్యముగను.

గీ॥ ఇచటఁ జేసిన పుణ్య మొక్కింతయైన, నది యనంతఫలప్రద మగుచు దనరు
నఘములెట్టిఘోరములైన నవియు నెల్ల,నణఁచివైచును నీయద్రి యబ్జనయన!

వ॥ అని యిట్లుపలికిన విని వల్లీదేవి మందస్మితవదనారవింద యగుచు నానందాం
బుధిం దేలె; శివకుమారుండు నందు శివలింగప్రతిష్ఠం జేసి శివుని బూజించి శివ
ప్రసాదంబు శీఘ్రంబ వడసె; నట్టి మహానగంబున నానగజాతనూజుండు కతి
పయకాలంబు నివసించి తదనంతరంబ కాంతాసహితంబుగా దివ్యవిమానా
రూఢుండై యతిసుందరం బగు స్కందాచలంబుఁ గ్రమ్మఱం జేరి యందు విమా
నంబు డిగ్గి యంతఃపురంబుఁ బ్రవేశించె; నప్పుడు, 113

ఆ॥ దేవసేన దేవదేవు నెదుర్కొని, పాణియుగము మోడ్చి ప్రణుతిఁ జేయ
సురచమూవిభుండు సుదతిని వీక్షించి, కరుణఁ జేసి చాలఁ గారవించె. 114

వ॥ అప్పుడు లవలియుం గుతూహలభరిత యగుచు, దేవసేనపదంబుల కెఱగిన
నయ్యింద్రతనయ లవలీదేవిం బరమాదరంబునఁ గౌఁగిటం జేర్చి మత్సహాయార్థంబు
వచ్చితి వని స్మితపూర్వకంబుగా మృదుమధురభాషణంబుల గారవించె. 115

మ॥ గిరిజానందనుఁ డంత భూరిమహిమం గేళివినోదంబుగా
సిరులన్ గుల్కు విలాసినీయుగముతో సింహాసనాసీనుఁ డ
య్యె రహిన్ మీఱఁగ నప్పు డాత్మవిభునిన్ వీక్షించి యద్దేవసే
న రసోదారచమత్కృతిం బలికె నానందం బమందంబుగన్. 116

—* కుమారస్వామి లవలీదేవసేనలు విష్ణుపుత్రికలగుట తెల్పుట *—

ఉ॥ ఈలలనాలలామ వసియించెడు నెచ్చోటఁ? నామ మెద్ది? యీ
బాలకు తండ్రి యెవ్వఁ డగు? పద్మదళాక్షి వరించులావు నే

లీల? వచింపు కర్ణయుగ♦శ్రీమకరందముగాఁగ నావుఁడున్
బాలశశాంకఫాలుఁ గని ♦ పల్కె షడాస్యుఁడు పేర్కమీఱఁగన్. 117

క॥ మీ రిరువు రుపేంద్రునకుం, గారాబుతనూజ లెన్నఁ♦గాఁ బూర్వమునన్
సారమతి నను వరింపఁగ, ధారుణి సలిపితిరి భూరి♦తపముల్ నిష్ఠన్. 118

వ॥ అమ్మహాతపంబునకు మెచ్చి మీయభీష్టంబులు ఘటింప నమృతవల్లియైన నిన్ను నింద్రునందు జనింప నియోగించిన నీ వతనికి పుత్రివై మత్పాణిగ్రహణంబు చేసితి; సౌందర్యవల్లి యగు నిదియును నగ్నియందు శరీరంబు విడిచి కాంచీపుర సమీపంబున రమ్యం బగు లవల్యాఖ్యనగంబున జనించి నన్ను వరియించె; నది యె ట్లనిన, 119

క॥ ధరకణ్వశాపవశమున, హరి యాపర్వతవనిన్ శి♦వాభిదమునియై
పరమతపంబును సలుపఁగ, హరిణీరూపమున ♦ లక్ష్మి యటు జనుదెంచెన్. 120

వ॥ ఇట్లు చనుదెంచిన యమ్మృగిని మునీంద్రుఁడు మదనాతురుండై చూడ నప్పడదియుఁ దద్విలోకనమాత్రంబున గర్భంబు ధరించి లవలీకుంజమధ్యంబున నిక్కాంతను గని చనియె; నది గావున నీ సుందరికి లవలీసమాఖ్య జగత్ప్రసిద్ధంబయ్యె.

ఆ॥ కణ్వశాపమునను ♦ గరుడధ్వజుం డల, శబరకులమునందు ♦ జననమొందె
వ్యాధవర్యుఁ డాతఁ ♦ డాలవలిని గాంచి, కూర్మిమీఱ నెత్తి♦కొనుచుఁబోయి. 122

వ॥ అనపత్యయగు నిజాంగనకొసంగ నదియు వాత్సల్యంబునం బెంచె; యక్కోమలిని దీని విధ్యుక్తంబుగా భిల్లుండు నాకు వివాహంబు జేసిన నిక్కాంతతోడ పరిపూర్ణపు రస్థనగంబునం గొన్నిదినంబులు సుఖగోష్ఠిఁ గ్రీడింపుచుండి మగుడి భవత్సవిధంబు సేరితి ననిన విని దేవసేన ప్రహృష్టాంతరంగ యయ్యె; నంత లవలి దేవసేనం గని భవదనుజను నన్ను రక్షింపు మని చరణంబుల కెఱఁగిన, 123

క॥ ఆదేవసేన లవలిన్, మోదంబునఁ గౌఁగిలించి ♦ ముద్దియ నాకున్
నీదగు స్నేహమ్మునఁ బతి,యాదరణం బినుమడించె ♦ నైతిఁ గృతార్థన్. 124

వ॥ అని పలికి యివ్విధంబున, 125

గీ॥ మగువ లాయిరువు రన్యోన్య♦మైత్రిసెలఁగ, హరతనూభవు సత్కృప♦కర్హలగుచు
విభునియిరుపార్శ్వములయందు♦వెలసి రపుడు, పూవువిల్తునిజత్రిపు♦బొమ్మలనఁగ.

వ॥ మఱియు నవిధంబున మయూరతామ్రచూడంబులు మనోవేగం బగు రథంబును నిజశక్తివిమానంబులును వెలయ సకలవీరులును సేనాధిపులును భూతగణంబులును నిఖిలోపచారంబులఁ గొలువ, గుహుం డవ్విధంబున పత్నీద్వయంబుతోడ సింహాసనంబు నధివసించె. 127

క॥ మీ రడిగిన గుహుచరితం, బారూఢి వచింపఁబడియె ♦ నఖిలము మీకున్
సారమతి మఱియు నడుగుడు, వారక నేమైన నడుగ♦వాంఛిత మున్నన్. 128

వ॥ అనుడు, మును లిట్లనిరి. 129

క॥ పరమాత్ముఁడైన షణ్ముఖు, పరిణయముం జూడవచ్చు ♦ బాంధవతతిలో
గరిమ ముచికుందధరణీ,వరుఁ డెవ్వం డతని దెల్పు ♦ వసుమతి సూతా ! 130

వ॥ అనిన సూతుండు మునుల కిట్లనియె. 131

చ॥ వినుఁ డొగి సావధానమున ♦ విప్రకులోత్తము లార ! చెప్పెదన్
మును రజతాద్రిశృంగమున ♦ మోదముతో గిరిజామహేశ్వరుల్
ఘన మగు కేళికావనము ♦ గాంచి విలాస మెసంగ పల్లవిం
చిన యొకబిల్వభూరుహము♦చెంగట సొంపుదలిర్ప నున్నచోన్. 132

వ॥ ఆసమయంబున శ్యామవక్త్రం బగు నొక్క-వానరంబు వృక్షం బధిరోహించి ఫలపత్రంబులు దునిచి, పరమభక్తి నగ్గిరిజామహేశ్వరులపై రాల్చినఁ బార్వతి శాఖామృగంబును గని కోపంబునఁ దచ్చేష్టలు మహాదేవునకు విన్నవించిన,

క॥ హరుఁడు కనుంగొని దేవిం, బరమం బగు భక్తసేయు ♦ మన కిది దీనిన్
బరిపాలింపఁగఁ దగు నని, కరుణానిధి కపినిఁ బిలిచెఁ ♦ గౌతుక మొసఁగన్. 134

వ॥ ఇట్లు పిలిచిన కపిశ్రేష్ఠం బరుదెంచి మహేశ్వరుని చరణకమలంబుల కెఱఁగినఁ బార్వతీనాథుండు దానిం గటాక్షించి యిట్లనియె. 135

చ॥ ప్రియ మొనరించి తీ విపుడు ♦ బిల్వదళార్చనచేత నాకు ని
శ్చయముగ నిందువల్ల మహి ♦ సర్వనృపాలకిరీటరత్నసం
చయఘృణిరాజితాంఘ్రి వయి ♦ సన్నుతి కెక్కఁగ సార్వభౌమతన్
నయముగఁ గాంచు మెల్లభువ♦నంబుల కీర్తి సెలంగ నంతయున్. 136

వ॥ మఱియు దేహాంతంబున కైలాసంబు నొంది మహాదుర్లభం బగు గాణాపత్యంబు గాంచి పరమామోదంబున నుండు మని పలికిన విని శాఖామృగం బీశ్వరుం బ్రార్థించె నివ్విధంబున, 137

క॥ జననంబు గలిగెనేనియు, తన కజ్ఞానము జనించు ♦ ధర నది లేకుం
డను నీదృశవదనముతోఁ, గనఁబడు నాకార మిమ్మ ♦ కరుణానిధివై. 138

వ॥ అని యిట్లు ప్రార్థించిన శీఘ్రంబుగా వలీముఖంబు మహాదేవు ప్రసాదంబు వడసి హరిశ్చంద్రాన్వయంబున ముచికుందుండై జనించె; నారాజన్యవర్యుండు గుహు కల్యాణంబుఁ గనుంగొని, గుహుచరణారవిందంబుల భక్తి బాడెమి, సర్వలోకంబులఁ బ్రసిద్ధుం డగుచు, తపోధనుం డగు వసిష్ఠువలన దివ్యంబులైన గుహువ్రతంబులు విని క్రమంబున నన్నియు నాచరించె భూపలయంబున, 139

క॥ అనవుడు మౌనులు సూతున కనిరి, గుహువ్రతము లెవ్వి ♦ యవి యెవ్వరిచే
త ననుష్ఠితంబు లుర్వర, వినుపింపఁగదయ్య మాకు ♦ విశదముగాగన్. 140

వ॥ అనిన సూతుం డిట్లనియె. 141

—* కుమారవ్రతముల సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పుట *—

చ॥ క్షితి మును ధర్మశీలుఁడు భగీరథనాముఁడు రాజవర్యుఁ డ
ప్రతిమబలుండు ఘోరుఁ డను ♦ రాక్షసుతో సమరంబులోఁ పరా
జితుఁడయి దేశముఁ విడిచి ♦ చేర కుటుంబముతో వనస్థలిఁ
దితిజుఁ డొకండు గైకొనియె ♦ తేజ మొసంగఁగ వానిరాజ్యముఁ. 142

వ॥ అంత భగీరథుండు వనగతుం డగుచు మునివర్యుం డగు భృగువువలన దివ్యంబు లగు స్కందవ్రతంబులు పరమభక్తి విని భృగువారంబున విధానోక్తంబుగా సంకల్పించి సంవత్సరవ్రతయంబు తద్వ్రతం బాచరించెఁ; దదనంతరంబ కాలవశం బున ఘోరరాక్షసుండు గుహశక్తిచే నిహతుఁ డగుటయు, 143

గీ॥ అల భగీరథుఁ డత్యంతహర్షమునను, పూర్వమట్లను రాజ్యంబు ♦ బొందె గాన
గుహునిన కిష్టతమం బగు ♦ కువలయమున, రమ్యతరమైన శుక్రవారవ్రతంబు.

వ॥ మఱియు నారదుండు కృత్తికయందు నేతద్వ్రతం బాచరించి ఋషిశ్రేష్ఠుం డయ్యెఁ; భూసురుం డొకం డేతద్వ్రతంబున సత్రంబు సలిపి మను వగుచు రాజ్యభారంబు దాల్చెఁ; వేరొకవిప్రుం డివ్రతంబుఁ జేసి త్రిశంఖుం డను రాజై పృథ్విం బాలించె; వెండియు ద్విజులిరువురు యథాశాస్త్రంబుగా కృత్తిక యందు వ్రతోత్తమం బిది గావించి రాజ్యసుఖం బనుభవించి గుహుప్రసాదం బున దేహాంతంబున ముక్తిం బడసిరి. 145

క॥ మునులార! వినుడు మఱియును, జనులుఁ సలుపంగవలయు ♦ షష్ఠీవ్రతముఁ
మును నిదియుఁ జేసి దివిజులు, మునులును సకలేప్సితార్థములు గాంచి రిలఁ.

వ॥ ఇవ్విధంబున గుహువ్రతమాహాత్మ్యంబు వినుపించిన విని రాజవర్యుం డగు ముచికుందుండు స్కందచరణారవిందంబులయందు మనంబు నిలిపి తదేకనిష్ఠ నుండె. 147

క॥ అంత గుహుం డురుకరుణా,స్వాంతత ప్రత్యక్ష మగుచు ♦ వర మడుగు మహీ
కాంత! యొసంగెద ననవుఁడు, సంతుష్టమనస్కుఁ డగుచు ♦ జనపతి యపుడుఁ.

వ॥ పరమదయాళుం డగు నగ్నిహునకు సాష్టాంగదండప్రణామం బాచరించి వివిధ స్తోత్రంబుల ని ట్లని ప్రార్థించె. 149

మ॥ నవసంఖ్యాధికలక్షవీరవరులఁ ♦ నాభ్రాతృవర్గంబు దా
భువి జన్మించు వరం బొసంగవలయుఁ ♦ భూరిప్రసాదంబునఁ
వివిధారివ్రజదర్పహారి నగుచుఁ ♦ విఖ్యాతిగా వారిచే
భువనంబుందును, దేవదేవ! కరుణాంభోనిధీ! సుపర్వాగ్రణీ! 150

వ॥ అనిన విని కరుణాంభోనిధియైన కార్తికేయుం డట్లన యంగీకరించి వీరబాహుప్ర ముఖవీరులం గని యి ట్లనియె. 151

ఆ॥ మామకాజ్ఞఁ బూని ♦ మహిమీఁద నితనికి, ననుజులై జనించు ♦ డనుచు గుహుని
వచన మాలకించి ♦ వారలు భయకంపితాంగు లగుచు ♦ పలికి రతనితోడ. 152
చ॥ దనుజమదాపహారులము ♦ ధారుణి మేము మహాపరాక్రమం
బున జరియింతు మిట్టి తమ ♦ భూరిభుజాబలమెల్ల మానుచున్
మనుజశరీర మెత్తి యొకమానవనాథుని భ్రాతృవర్గమై
మను టది యొప్పు? నీచ మది ♦ మాకు దరంబె వహింప నీదశన్? 153
వ॥ అనిన నవ్వచనంబులు విని గుహుండు కోపోద్దీపితచిత్తుండై వారల కిట్లనియె.
క॥ పాయనిగర్వోన్నతిచే, నాయాజ్ఞ నతిక్రమించి ♦ నడువం దగునే?
యీయపరాధమ్మున మీ, రాయవనీపతికి ధరణి ♦ ననుజులు గండీ. 155
వ॥ మగుడి కొంతకాలంబునకుం దపోమహిమంబున విగతకల్మషులై నా సవిధంబు
సేరుదు రని పలికి తద్వచనమాత్రంబున వారును మనుజరూపంబులొంది దేవా,
మదపరాధంబు సైరింపు మని పాదంబుల కెఱగి యతనియనుజ్ఞ నింద్రునకు
నుపేంద్రుడునుం బోలె నమ్మహీపతి కనుజులై రవ్విధంబున గుహుండు ముచి
కుందు ననుగ్రహించి యంతర్హితుం డయ్యె; నంత, 156
క॥ అనుజన్ముల కానరపతి, తనసైన్యముఁ బంచిపెట్టి ♦ తగ వేర్వేరన్
ఘనమతి రాజ్యం బేలెను, మనమున గుహుఁదలచుకొనుచు ♦ మహిమదలిర్పన్.
వ॥ అంత నమ్ముచికుందుండు స్వర్గవిరోధు లగు రాక్షసయోధుల సమరంబునం
జయించి యింద్రునకు మిత్రుండయ్యె. 157
క॥ అనుజులకు నెల్ల నచ్చర, వనబోణుల బెండ్లిజేసి ♦ నరవరుఁ డంతన్
ఘనబలుఁడు వీరబాహుఁడు, ప్రణయంబునఁ బుష్పగంధి ♦ పరిణయమగుచున్.
వ॥ దానియందు కనక గానకసంజ్ఞల నిద్దఱపుత్త్రులను చిత్రవల్లియను నొకపుత్త్రినిం
గనియె; తక్కనవీరులును తమతమభార్యలందు సంతానంబు వడసిరి. 160
గీ॥ చిత్తరువుబొమ్మకైవడి ♦ చెలువెసంగు, చిత్రవల్లివివాహంబుఁ ♦ జేసె వేడ్క
వీరబాహుండు ముచికుంద♦విభున కెలమి, నగ్రజత్వంబు కల్పిత ♦ మంచు నెంచి.
వ॥ అంత నొక్క నాఁడు, 162
క॥ అల దండధరుని కోమలి, చెలువలరెడి చిత్రవల్లి♦చేతిశుకంబున్
దిలకించి తనకుఁగోరిన, చెలువ యభీష్టంబుఁ దీర్ప ♦ శీఘ్రిం బపుడున్. 163
వ॥ యముండు భటుల ననిచిన వారలు జనుదెంచి యక్కీరంబును బలాత్కారం
బునం గొనిపోయి యముపత్ని కొసంగిన యవ్వృత్తాంతంబు వీరులు విని కోప
విహ్వలు లగుచు సమవర్తితోడ సమరంబు సేసి మగుడి యాశుకంబునుం దెచ్చి
చిత్రవల్లి కిచ్చిన నదియు దాన సంప్రీతమనస్క యయ్యె. 164
క॥ ఆనృపకామిని క్రమమున, దా నంతర్వత్ని యగుచుఁ♦దలఁచెను మది నెం
తేనియు కేరళదేశక,మైన వనీఫలము నొకటి ♦ నాత్సుక్యమునన్. 165

వ॥ తదపేక్ష నెఱింగి వీరవరు లక్కేరళవిభునికడకు దూత ననుగం బంచిన యతం
డవియు వారల కొసంగక నుపేక్షించిన, తదనంతరంబ క్రోధవివ్హాలురై య
వ్వీరులంద అప్పు డతిరయంబునం జని కేరళపతిని రణాంగణంబునం జయించి
తత్ఫలంబుఁ దెచ్చి చిత్రవల్లి కొసంగి రంత, 166

క॥ నానాదేశస్థితరిపు, భూనాథుల దర్ప మణఁచి ♦ భువి నేలిరి స్వా
ధీనము గాగను వీరులు, మానితవిభవమున నీతి♦మార్గము దనరన్. 167

ఆ॥ మోదమెసఁగ మదిని ♦ ముచికుందనృపకాంత, చిత్రరూపిసదృశ♦చిత్రవల్లి
యగ్నివర్ణసంజ్ఞ ♦ నాత్మజుఁ గనియెను, వివిధవిమతవంశ ♦ విపినదహను. 168

వ॥ ఆసమయంబున మహాబలుం డగు బలాసురుండు గర్వోద్యుక్తుం డగుచు స్వర్గ
పురందరు నిరోధించి దుర్బలుం డగు నింద్రునిం జయింప నద్దివిజవరుండు దాన
వునితో సమరంబున గోడి ముచికుందుని సహాయంబుగాఁ బిలువ దూతలం బని
చిన నమ్మహావిభుండు సనుదెంచి, 169

క॥ దురమున బలసైన్యంబును, బరిమార్చి భుజప్రతాప♦పటిమ చెలంగన్
ధరపతి కిట్లోడి బలుం, డురుతరగర్వంబు మాని ♦ యొక్కెడ నిలిచెన్. 170

వ॥ సురేంద్రుం డప్పుడు వజ్రాయుధంబున వానిం బొరిగొనియె; నదిమొదలు
పురందరుండు బలారి యనఁ బ్రసిద్ధి వడసె. 171

క॥ సురపతి ముచికుందమహీ,వరుని సహాయమున నిట్లు ♦ బలదనుజు సమి
ద్ధరణిం గూలిచి శీఘ్రము, పరమానందముగ నాత్మ♦భవనము సేరెన్. 172

—* శ్రీమహావిష్ణ్వింద్రాదిదేవతలు శివపూజ యొనర్చిన విధము *—

క॥ సురపతి నరపతు లంతట, సురుచిరశుద్ధోదకముల ♦ శుచితము లగుచుం
బురహరుపూజాగేహము, బరగఁ బ్రవేశించి రాత్మ♦భక్తి దలిర్పన్. 173

మ॥ అవనీపాలుఁ డొగిన్ సుఖాసనమునం ♦ దాసీనుఁడై చెంత వా
సవుఁడున్ బూజయొనర్చుచో నగసుతా♦సద్వక్త్రయుక్తున్ శివున్
భవు మందస్మితచారువక్త్రు నభవున్ ♦ భర్గున్ మహేశున్ మహో
త్సవమొప్పం గని సంస్తుతించె పరమ♦ధ్యానైకపారీణుఁడై. 174

వ॥ అంత భగవంతుం డగు పరమేశ్వరుండు పురందరుం డెఱుంగకుండ ముచికుందు
నకుఁ బ్రసన్నుండై పూర్వం బేను హరిచేత నారాధింపఁ బడితి; నిపు డింద్రుని
చేతఁ బూజితుండ నగుదు మద్భక్తులలో నీవుఁ గృతార్థుండ వగుటం జేసి నన్నుఁ
బూజింపు మని రహస్యంబు సెప్పిన విని భూపాలుండు సంతోషంబున నితరవ్యా
పారరహితుండై యీశ్వరపూజనంబు విలోకింపుచుండె; నయ్యెడ, 175

గీ॥ అమరనాథుఁడు పూజాస♦మాప్తిఁ జేసి, జనవిభునితోడ భోజన♦శాల కరిగి
కామధేనువుఁ జింతింప ♦ గరిమనదియు, నభిమతార్థంబులొసఁగూర్చె ♦ నవనిపతికి.

వ॥ అప్పు డాభూవిభుని కామధేనుసముద్భవంబులైన భక్ష్యభోజ్యాదుల సంతుష్టిం జేసి దివ్యమాల్యాంబరాభరణంబు లొసంగి పురందరుండు మఱియు నభీష్టంబు లడుగు మనిన మహీపాలుండు సంతోషంబున సురేంద్రున కిట్లనియె. 177

క॥ సురనాయక! నీచేతను, నిరతముఁ బూజింపఁ బడిన ♦ నిరుపమవరు నీ శ్వరు సాంబుకృప నొసఁగుము, బరగఁగ పూజింతు నేను ♦ భక్తిదలిర్పన్. 178

వ॥ అనిన ముచికుందుని వచనంబులు విని పురందరుండు మహావిచారమనస్కుండై యిట్లనియె. 179

క॥ ఈ యిందుధరుఁడు భూప మ,దీయుఁడు గాఁ డబ్ధిశాయి ♦ ధీరత నితనిన్ బాయక నారాధించు త,దీయార్చనకారణంబు ♦ దెలిపెద వినుమా. 180

క॥ నిరపత్యుఁ డగుచు బూర్వము, హరిశంకరు సంస్మరించి ♦ యంచితభక్తిం బరగ తపం బొనరించిన, పరమేశుఁడు మొ్రల నిలిచెఁ ♦ బ్రత్యక్షముగాన్. 181

వ॥ అప్పుడు మాధవుండు మహాదేవునకుం బ్రణమిల్లి, దేవా! నీచేత యుక్తసుపదంబుఁ బొందితి; ననంతసంఖ్యాకం బగు నాయువుం బడసితి; భవత్కటాక్షంబునఁ గొఱంత యిసుమంతయు లేదు; నా కిప్పుడు పుత్త్రుండు గావలయు; నిరపత్యత్వంబు మనస్సంతాపకరంబైనది యని యత్యంతంబు హరి పరమేశ్వరుం బ్రార్థించె; నప్పుడు, 182

క॥ పురహరుఁడు గృపాదృష్టిని, మురవైరికిఁ బుత్త్ర నొసఁగె ♦ మోదం బలరన్ గిరితనయ సర్వ మదియును, బరికించి నితాంతకోప♦భావముతోడన్. 183

ఆ॥ నను భజింపఁ డాత్మ♦నారాయణుఁ డితండు, నిన్నుఁ బూజ సేసె ♦ నిష్ఠమీఱఁ దత్ఫలంబు నతఁడు ♦ తగ బొందకుండునె, యధిప! జూడు మ♦స్మదాజ్ఞ నిపుడు.

క॥ తనయుండు గలిగి చను నీ,తనికిన్ నీసేత్రవహ్ని♦దగ్ధుం డగుచున్ విను వంచకుండు హరి యను,దినము రు మాయావియగుచు♦ దిరుగును జగతిన్.

వ॥ పరబ్రహ్మం బగు నీయుండఁ దాను పరబ్రహ్మ నటంచు నఖిలాత్మలను మోహింపఁ జేయుచు దుర్మార్గంబునఁ ద్రోయునది గావున, నితనిముఖంబు వీక్షింప యుక్తంబు గా దని పలికి పార్వతి జగత్పతి యగు శంభునితోడ నంతర్థానంబు నొందె; తదనంతరంబ, 186

క॥ హరి బహుదుఃఖాకులుఁడై, గిరిజామద్వక్త్రిసహితు ♦ గిరిశు మహేశున్ గర మర్థిఁ బ్రతిష్ఠంపుచు, చిరకాలము బూజసేసె: ♦ జెన్నొనఁగంగన్. 187

వ॥ ఇట్లు భక్తిం బూజించిన యంబికామణ్ముఖులతోడఁ బరమేశ్వరుండు హరికి బ్రత్యక్షమయ్యె; నయ్యెడ, 188

క॥ సాంబున్ గుమారసహితుఁగృ,పాంబునిధిన్ శంభుఁ బొగడె♦ హరి మదినిబ్రమోదంబున నపుడు మహేశుం, డంబుజదళనయనముఖము ♦ నవలోకించెన్. 189

వ॥ అప్పు డయ్యోగితం బెఱింగి, హరి పార్వతికిఁ బ్రణమిల్లి, యంబా! యజ్ఞానంబున
నిను నర్చింపక, కేవలం బామహేశ్వరు నర్చించితి; నీ యపరాధంబు సహింప
వలయు; బహుకాలంబు పుత్రార్థినై తపం బొనరించితి; పుత్రదహనంబు
గాకుండ రక్షింపు మని యిట్లధోక్షజుండు మహేశ్వరిం బ్రార్థించె; నంత, 190

ఆ॥ శంభురాణి సుప్ర♦సన్నత దనరంగ, హరికి ననియె చక్రి! ♦ యార్తి యేల
దగ్ధుఁడైన నీదు ♦ తనయుండు జీవించు, మగుడి యీశువలన ♦ మామకాజ్ఞ. 191

వ॥ అని పలికి యీశ్వరి యీశ్వరుతోడ నంతర్ధానం బయ్యె; నంత, 192

క॥ సంతోషంబున లక్ష్మీకాంతుఁడు హృదయమున సుతుని ♦ కాముని గనియెన్
గంతుఁడు నంతట హరిచే, సంతతముఁ బ్రవృద్ధుఁ డగుచు ♦ జగతీస్థలిలోన్. 193

క॥ సురకార్యార్థముగా జని, పురహరుచే దగ్ధుఁడయ్యె ♦ బునరుద్భూతిం
బరగెను శీఘ్రం బాతఁడు, కరుణానిధియైన మేరు♦కార్ముకువలనన్. 194

వ॥ అదిగావున నయ్యుమామహేశ్వరుం బూజించి వరంబు వడసి యురంబున నిమ్మ
హాదేవు నిడుకొని యిందిరారమణుండు క్షీరార్ణవంబున శేషశాయియై యోగ
నిద్రనుం బొందిన 195

క॥ ఆమాధవువక్షస్స్థలి, సోమాస్కందుండు శంభుఁ ♦ డురునిశ్వాస
స్తోమాందోళితుఁ డయ్యెన్, వేమరు పవనాహతద్రు♦విధమున మిగులన్. 196

వ॥ ఇట్లు వైకుంఠుండు వక్షంబున గిరిజావల్లభు నిడుకొని నిద్రాగతుం డగు; నయ్య
వసరంబున. 197

క॥ బాలాకాఖ్యుఁడు దైత్యుం, డాలంబున కరుగుదెంచె ♦ నాతనివలనన్
చాలభయంబడి యేనుం, బాలకడలి పవ్వళించు ♦ పద్మదళాక్షున్. 198

గీ॥ చేరి దానవవృత్తంబు ♦ చెప్ప నపుడు, మురహరుఁడు లేచి ననుగని ♦ పరమకరుణ
భయమువలదని మధురోక్తి♦బలికి యొసఁగె, వక్షముననుండు పార్వతీ♦వరుని నాకు.

వ॥ ఇట్లొసంగి యంత మాధవుండు దాను భూలోకంబునఁ బుండరీకపురంబునుం జేరి
యందు చిన్మయుండగు సదాశివుం గని యానందాశ్రుకణపూరిత నయనార
విందుండగుచు తదేకనిష్ఠ మానసచతుష్టయంబు యోగంబుననుండి, సముద్ధితుండై
యద్భుతంబగు నీశ్వరానుగ్రహంబు వడసి యచ్చోట వెడలి సమరంబున ఘోరుం
డగు నబ్బాలకాఖ్యమహాసురునిం బరిమార్చి, క్షీరార్ణవంబునకు మరల చను
దెంచి, నన్ను మదీయపురంబున కనిచి, పూర్వంబట్ల శేషతల్పంబున శయనించి
సుఖంబున నుండె నంత; 200

ఉ॥ ఏను పురంబుఁ జేరి పర♦మేశు త్రిలోచను నంబికామహా
సేనులతో తదాది దృఢ♦చిత్తుఁడ పూజయొనర్తు భక్తినో
మానవనాథ! నే నిపుడు ♦ మాధవు నాజ్ఞను గాక నిమ్మహే
శాను కపర్ది శంకరు నొ♦సంగఁగ శక్తుఁడగా నొకింతయున్. 201

—* ముచికుందుఁ డనురాజు శివలింగప్రతిష్ఠ యొనర్చినవిధము *—

గీ॥ అమితతేజస్కునావిష్ణు నాజ్ఞవడసి, యావు గొనిపొమ్ము యొసఁగెద నీశుననుడు
నమరవల్లభువచనంబు నాలకించి, చనియె ముచికుందుఁడుముకుందు సన్నిధికిని.

వ॥ అట్లుచని పురందరోదితంబులగు వచనంబులు వచించి గోవిందుచేత ననుజ్ఞవడసి మగుడి నరేంద్రుండు సంక్రందనుం జేరి, 203

క॥ హరి యాజ్ఞనడసి వచ్చితి, సురనాయక యొసఁగుమింక సోమునిశంభున్
గరుణామతి నా కనవుఁడు, సురరాజు విచారమానసుండై మిగులన్. 204

వ॥ విశ్వకర్మ నిర్మితంబులైన సోమాస్కంద విగ్రహంబు లారుకొమ్మని ఇంద్రుండు క్రమంబున నరేంద్రునకొసంగిన యవియు భూపాలుండు చూచి నవీనకల్పితంబులవి యింద్రకపటం బెఱింగి పూర్వవిగ్రహంబు నాకొసంగవలయు నని మగుడి సురేంద్రు నడిగిన. 205

ఉ॥ అంత సురేంద్రుఁ డిచ్చె శివు నాన్నృపమౌళి కతండు దాన న
త్యంతము మోదమంది కమలాలయమున్ వెస జేరి పార్వతీ
కాంతుఁ బ్రతిష్ఠఁ జేసె కుతుకంబున శాస్త్రవిధాన మొప్పఁగా
సంతతము న్మహోత్సవ మొసంగ సపర్య లొనర్చె భక్తితోన్. 206

వ॥ మఱియు నితరవిగ్రహంబుల తత్స్వరూపపురంబులం బ్రతిష్ఠించి ధరణీంద్రుండు పూజించె నంత; 207

మ॥ సురలోకేంద్రుఁడు స్వాత్మపూజితు మహేశున్ బాయుదోషంబునన్
ధరచండాలతఁ బొంది యంత నతఁడున్ తజ్జన్మమున్ మాని, భా
సురలీలన్ గమలాలయంబున నుమేశుం గాంచి తద్దివ్యవా
ద్యరవంబున్ విని స్వర్గముం బడసె వీతాఘవ్రజుండై కడున్. 208

వ॥ అంత ముచికుందమహీవల్లభుండు మహేశ్వరునకుఁ బ్రాకారమంటపాట్టాలక గోపురాదు లనేకంబులు నిర్మించి, నిరంతరపూజోత్సవంబు సల్పుచు నిష్కంటకంబుగ రాజ్యభారధౌరేయుండై యంత యానృపాలుం డాత్మజుం డగు నగ్నివర్ణునకు పట్టంబు గట్టి దేహాంతంబునఁ గైలాసంబుఁ జేరె; వీరబాహుప్రముఖులును స్వాత్మజుల నగ్నివర్ణునికటంబున నిలిపి మహాతపంబుఁ జేసి మానుష దేహంబులు విడిచి నిజరూపంబులతోడ స్కందశైలంబున కరిగి స్కందునకుఁ బ్రణమిల్లి తదనుగ్రహంబున సంతోషభరితులై యుండి రని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పిన, 209

మ॥ విలసచ్ఛారద చంద్రికాధవళ దోర్విభ్రాజభూభృచ్చరా
సలలాటాంబక కుండలీశ్వర విభూషా భాసమానాంగ ని
ర్గళితోద్యత్పర గర్వసర్వజగదాధారా, చిదాత్మా, శివా
బలభిన్నీల విసీలకంధర దయాపాథోనిధీ, శంకరా! 210

క॥ ధీరకురళీలింగధర, శ్రీరమణతనూజసేవ్య దివ్యాంఘ్రియుగా !
పారావారనిషంగ ! యుదారదయాపాంగ ! మదనదర్పవిభంగా !

పుష్పమాలికాబంధము.

మహాస్రగ్ధర॥ సారాచారాసురాఢ్యా స్మరహరగరళా స్వాదమోదప్రదశ్రీ
ప్రోరుస్తారుదద్రిరుచ్యభ్యుదయదవదనా యోగభోగప్రగల్భా
ఘోరాకారాసురారీట్కులనిలయులసత్తోక్షవాహాపప్రసన్నా !
ధారాస్వైరస్ఫురత్స్వర్దరవిరతరసంత్రాతభూతప్రశస్తా !

గద్య:

ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందార్పితహృచ్ఛతపత్త్రి సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణాస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపసగోత్ర కోడూరి
వెంకనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మ్యంబికాతనయ వినయ
ధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచలకవి
ప్రణీతంబైన శ్రీస్కాందమహాపురాణాంతర్గత శ్రీశంకర
సంహితయందలి శివరహస్యఖండంబున దేవ
కాండంబునందుఁ ద్వితీయాశ్వాసము
సర్వంబును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



# శివరహస్యఖండము.



ఆంధ్రమహాశయులారా !

ఈ శివరహస్యఖండము తాళపత్రములయందు దొరకకొంత జీర్ణమగుచున్న సద్గ్రంథము. శ్రీవ్యాసోక్తమగు స్కాందమహాపురాణాంతర్గతమును, సంభవ అసుర వీరమహేంద్ర యుద్ధ దేవ దక్ష ఉపదేశ కాండములను గలిగినదియు నై విరాజిల్లెడు సద్గ్రంథము. కొన్నియుగములక్రింద నీ ప్రపంచ మెట్టిభోగముల ననుభవించెనో యట్టివృత్తాంతములఁ దెలియఁ జేయుచరిత్రాత్మకము.

చరిత్ర యేది యన—శ్రీ శివకుమారజననము, బాల్యక్రీడలు, ప్రతాపము, రాయబారము, విజయము, వివాహము, పరబ్రహ్మతత్త్వనిర్ణయము, శ్రీ వీరభద్రవిజయము, శ్రౌతధర్మములు, శ్రీ మహావిష్ణ్వాది మహాపాశుపతుల చరిత్రలు, స్థలపురాణములు తెలియఁజేయు సద్గ్రంథము. అత్యుత్తమము, నవరసభరితము, నీతిదాయకము, విజయదాయకము, భోగదాయకము నై విరాజిల్లు సద్గ్రంథము.

ఈగ్రంథము గీర్వాణభాషయందుండి పలువురకుఁ దెలియుట కసాధ్యమగుటచేఁ గొన్నివందలవత్సరములక్రిందట బ్రహ్మశ్రీ బాలసరస్వతీ కోడూరి వేంకటాచల మహాకవిరేణ్యులచే పద్యగద్యములతో మృదుమధురశైలిని లోకోపకారార్థముగ నాంధ్రీకరింపఁబడినట్టి గ్రంథము. ఈ సద్గ్రంథము పుణ్యాత్ము లగు కొందఱిచే నుద్ధరింపఁబడియు జలగోశములచేఁ గప్పఁబడు చంద్రునివలెఁ గొన్ని కారణములచేఁ బ్రకాశింపదయ్యె.

కాన నో యాంధ్రమహాశయులారా !

ఆంధ్రభాషాభివృద్ధికై యాంధ్రమహాకవులచే నాంధ్రీకరింపఁబడిన యాంధ్రగ్రంథముల నుద్ధరింప సహాయపడి యాంధ్రమాతను సేవించి యాంధ్రభారతీ ప్రసాదమున నైహికాముష్మికసుఖముల ననుభవించెదరుగాక !

తాళపత్రములయం దెన్నియో యట్టిసద్గ్రంథములు నిమిషమున కెన్నియో యక్షరములచొప్పున జీర్ణించుచుండ, పూర్వమహాకవుల కష్టము లడుగంటుచుండ మనము చూచుచుండుట పాడిగా దని యింతగాఁ బ్రార్థించుచున్నాఁడ.

| | | |
|---|---|---|
| ద్వితీయ సంపుటము (చిత్రపటములతో) | రు | 2-0-0 |
| క్యాలికో బైండు | | 2-8-0 |
| ,, గిల్టు | | 3-0-0 |

తక్కిన మూఁడుసంపుటములు, సంస్కృతమూలము అచ్చగుచున్నవి.

వలయువారు:—

నిగమాగమవిశారద, ముదిగొండ వీరమల్లికార్జునారాధ్యులు అయ్యవారు,
తాలూకా నందిగామ - కృష్ణాజిల్లా. అని వ్రాయవలెను.

